ఓం

# జ్ఞానామృతసారము

( మానవుని పరమసుఖ సాధనము )




కౌతా మోహనరామశాస్త్రి

ముముక్షణా విరచితము

శ్రీ ర స్తు

తర్కాచార్య, వేదాన్తశిరోమణి, వేదాన్త విశారద, మోదేకుర్రు రాజేశ్వరీ సంస్కృత కళాశాలా ప్రిన్సిపాల్, రాణీ నరసింహశాస్త్రిగారి

# అభిప్రాయము

బ్రః శ్రీ కొత్తా మోహన రామశాస్త్రిగారిచే రచింపబడిన "జ్ఞానామృత సారము" అను గ్రంథము నామూలాగ్రము సవిమర్శముగ చదివితిని. "ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా । మహాభయ కృతత్రాణాద్విత్రాణామేవ జాయతే" అను నార్యోక్తిననుసరించి వీరికి యద్వైతవాసన యీశ్వరానుగ్రహ లబ్ధము ఈ గ్రంథము చూచిన పండితులకు వీరికింత యద్వైతసిద్ధాన్తరహస్య మెట్లు తెలిసినది! వీరీ శాస్త్రము నెప్పుడు అభ్యసించినారు! అను నచ్చెరువు గలుగును. కాని వీరి వంశమర్యాద నెరిగిన నాకచ్చెరువు గలుగదు. ఏలయన వీరి తండ్రిగారు, వీరి మాతామహులుగూడ "ఆసుప్తేరామృతేఃకాలం నయేద్వేదాన్త చిన్తయా" అను నార్యోక్తికి లక్ష్యభూతులు. అట్టివారి వంశీయులగు వీరికి "నాస్యాబ్రహ్మవిత్కులేభవతి" అను ప్రమాణము ననుసరించి వీరి యద్వైత శాస్త్రానుభూతి నాకచ్చెరువును గలిగింపదు. వీరి తండ్రిగారగు సూర్యనారాయణరావు పంతులుగారు కొన్ని సందర్భములలో కుమారునిజూచి "మీరందరూ ఒక బ్రహ్మవేత్త యింటబుట్టి మఱియొక బ్రహ్మవేత్త యింటపెరుగుచున్నారు" అనెడివారు. మహర్షి తుల్యులగువారిమాట వ్యర్థము కాదుగదా!

ఇక నీ గ్రంథము ప్రమాణబద్ధముగ శ్రుతియుక్త్యనుభవానుసారముగా విద్వాంసులకుగూడ యాదరణీయముగ, అందరకును సుబోధముగా నుండునటుల నాంధ్రభాషలో రచింపఁబడినది. వీరిట్టి గ్రంథమును శ్రమనోర్చి రచించుట యాత్మ తృప్తి కొరకు, అద్వైతశాస్త్ర విశ్వాసముగల వారి తృప్తి కొరకునుగాని, మరియొక లౌకిక ప్రయోజనము కొరకుగాదు. "మయినాస్త్యేవ కర్తృత్వ మనన్యానుభవాత్మని" అను అద్వైతసిద్ధికారుని వచనమును వీరి గ్రంథము జ్ఞప్తికి తెచ్చుచున్నది. వీరీ గ్రంథములో అనేకశ్రుతులు, స్మృతులు, పంచదశి, యోగవాసిష్ఠము

మొదలగు నద్వైతబోధ గ్రంథములను, భగవద్గీతను ప్రమాణమునిచ్చి "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ" అను గీతోక్తమును స్మరింపఁజేయుచున్నారు.

వీరికి అద్వైతశాస్త్రము కులవిద్య. వీరు పలుమారు శాంకరభాష్యాదులను శ్రవణమును చేయుటచే తత్సంస్కారఫలితముగా ప్రత్యగ్బ్రహ్మైక్య బోధకములగు పలు శ్రుతిస్మృతులను ఒక దారములో గుచ్చిన పుష్పములనువలె, నొకచోట నప్రయత్నముగ చేర్చియుండిరి. ఇది నిరంతర శ్రవణమననాదిఫలము. మరియును కొన్ని స్థలములలో వివేకానంద మొదలగువారు సులభముగ బోధించిన బోధలనుగూడ జేర్చి గ్రంథమునకు వన్నె తెచ్చినారు. ఆంధ్రభాషలో నెన్నియో వేదాన్త గ్రంథములున్నను, సప్రమాణముగ అనుభవమునకు దగ్గరగా అద్వైతానుభూతిని కలుగజేయు నిట్టి యద్వైతగ్రంథ మాంధ్రభాషలో లేదనియే చెప్పవచ్చును. కాన నిది జిజ్ఞాసువులగు ముముక్షువులకు నత్యంతోపకారము గావున, వారు దీనిని పలుమారు పఠించి సారాంశములను మాత్రము గ్రహించి వారివారి యనుసంధాన పాటవముచే నిత్యనిరతిశయ సుఖమును పడయుదురుగాక యని యాస్తికులకు విన్నవించుకొనుచున్నాను ఈ గ్రంథము వేదాన్తశాస్త్ర పరమతాత్పర్యమగు జీవబ్రహ్మైక్యమును పలువిధములుగ బోధించుచున్నదిగాన యాచంద్రతారార్కము, ముముక్షువులగు జిజ్ఞాసువులకు అద్వైతానుభూతిని కలుగజేయుచు వర్ధిల్లుగాక యని సర్వాత్ముడగు పరమాత్ముని ప్రార్థించుచున్నాను.

సికింద్రాబాదు. ఇట్లు,

30-5-70 రాణీ నరసింహశాస్త్రి.

మంగళం మహత్.

శ్రీ

విద్వాన్, పండితప్రవర, ఉభయమీమాంసాభాస్కర,
వీరేశ్వరకృష్ణడోంగరేశాస్త్రిగారి

# అభిప్రాయము

ప్రారబ్ధ కర్మానుసారముగ ప్రాప్తమైన వ్యవహారమును తమ తత్త్వాను సంధానమున కనుకూలముగావించుకొని లోకమునకు ఆదర్శభూతులైన సాధక వర్యులు, వేదమూర్తి బ్రహ్మశ్రీవిరాజితులగు శ్రీ కౌతా మోహనరామశాస్త్రి గారు. వారు వ్రాసిన 'జ్ఞానామృతసారము' జిజ్ఞాసువులకు అమృతసారమే.

అతిప్రౌఢములగు భాష్యాదిగ్రంథముల నభ్యసించి పాండిత్యమును సంపాదించిన విద్వాంసులుగూడ గ్రహించని తత్త్వాంశమిందు సుగమపద్ధతిలో నిరూపింపబడినది. పసిబాలులకుగూడ అర్థమగునట్లు శ్రుతి–స్మృతి–అనుభవములను చూపించి, అద్వితీయ వేదాన్త సిద్ధాన్తమును బోధించుటయే యీ గ్రంథముయొక్క ఉద్దేశ్యము.

తాము సప్రమాణముగ గ్రహించి తమ అనుభవముకు తెచ్చుకున్న సిద్ధాన్తము లిందులో సర్వజన సాధారణములగు దృష్టాంతములను చూపించి నిరూపింపబడినవి. అద్వైత ప్రక్రియానుసారముగ తెలిసికొనుటకు అతికష్టమైన జీవ–జగత్–బ్రహ్మవస్తువుల స్వరూపము ఇందులో స్పష్టముగ నిరూపింపబడియున్నది.

తాము నిరూపించదలచిన విషయమునకు తగిన ప్రమాణభూత శ్రుతి స్మృత్యాది వచనములను ఉదహరించి వాని అర్థములనుగూడ సంప్రదాయానుగుణముగ నిరూపించియుండుట – యీ గ్రంథమందలి గుర్తించదగిన విషయము. వేదాన్తపంచదశి, ఉపదేశసాహస్రి, యోగవాసిష్ఠము, ఇతర వేదాన్తప్రకరణ గ్రంథములలోనున్న అనేకవచనములు ఆ యా సందర్భమునకు తగినట్లు ఉదహరింపబడి, జిజ్ఞాసువులు చేయవలసిన అనుసంధాన పద్ధతి ఇందులో చక్కగ నిరూపింప

బడినది. భాషాసరణి సామాన్యమైయుండి తత్వనిరూపణములో పునరుక్త్యాదులు అక్కడక్కడ కనిపించినను, తత్త్వానుసంధాన దృష్టితో ఈ గ్రంథమును చదువు జిజ్ఞాసువులకు ఇది సాధకమేగాని బాధకము కాజాలదు. చివరభాగములో చేర్చిన దహరాకాశస్తోత్రము, ఇతర అనుసంధాన శ్లోకములు ఈ గ్రంథమునకు మిక్కిలి అందమును తెచ్చినవి.

ఇన్ని కారణములచే జిజ్ఞాసువులకు అల్పాయాసముచే అధిక ప్రయోజనమును ఈ గ్రంథము కలిగించుననుటలో సందేహము లేదు. జిజ్ఞాసువులు ఆదర్శపూర్వకముగ ఈ గ్రంథమును గౌరవించెదరని నా నమ్మకము. ఇట్టి మహత్తరమగు గ్రంథమును వ్రాసి లోకోపకారమును చేసిన గ్రంథకర్తగారికి మా అనేక ధన్యవాదములు. దీనికి తగిన పరమేశ్వరానుగ్రహము వారికి సిద్ధించుగాక !

ఇట్లు,

సికిందరాబాద్,
28—5—1970.

పి. కృ. డోంగరేశాస్త్రి.

శ్రీః

మోడేకుర్రు సంస్కృత కళాశాలా పూర్వ ప్రధానాచార్యులు (ప్రిన్సిపాల్)
"దర్శనభూషణ", "కులపతి", రాష్ట్రపతి సమ్మానిత, చతుస్తంత్రి"
కొల్లూరి సోమశేఖరశాస్త్రిగారి

# అభిప్రాయము

శ్రీయుత కొతా మోహనరామశాస్త్రిగారిచే రచింపబడిన "జ్ఞానామృత సారము" అను నీ గ్రంథమును చివరవరకు వారివలననే వినియుంటిని. వారు జన్మాంతరమునందున నీ జన్మమునందున గుర్వీశ్వరానుగ్రహమువలన శాస్త్రీయ మగు నద్వైతవాసన కలవారు. వీరు పవిత్రమైన కొతా వంశమున శ్రీమంతులగు సూర్యనారాయణరావుగారి ఏకైక సుపుత్రులు. వీరు చిన్ననాటి నుండియు అద్వైత నిష్ణాతులగు తండ్రిగారిచే శిక్షితులై వీరి పురాకృతపుణ్యఫలంబున, నద్వైతంబున నాసక్తికలవారైరి. బ్రహ్మనిష్ఠులగు తండ్రిగారు, సుచరిత్రయగు నర్ధాంగియు, వినీతుడగు సుపుత్రుడును దీనికి సహకారకులు.

వీరు సద్గురువులచే నుపదిష్టమగు బ్రహ్మవిద్యను చిరకాలము మననముచేసి, తమకు గలిగిన యనుభవమును యితరుల కందింపదలచి, యీ పుస్తకమును చాల శ్రమపడి చిరకాలమునకు రచించిరి. ఈ పుస్తకము ముముక్షువులకు మిక్కిలి యుపయోగించును. దీనిని సంగ్రహించిన ముముక్షువునకు ప్రీతిశ్రద్ధలతోడ పునః పునః దీని పఠించినంత మాత్రముననే సర్వసంశయములువీడి సుఖముగ నాత్మనిష్ఠుడగుటకు సందియము లేదు.

ఇందు జగన్మిథ్యాత్వము, జీవపరైక్యము, యనుసంధాన పద్ధతియు, శాస్త్రీయముగను, సిద్ధాన్తావిరుద్ధముగను. సప్రమాణముగను, సుబోధకముగ, మననదార్ఢ్యమునకు ననేకపర్యాయములు రకరకములుగ వేరువేరు శంకలకు సమాధానములుగ నిరూపింపబడినవి.

కాన ముముక్షువు యగు ప్రతి మానవుడును విసువును జెందక నీ గ్రంథమును గురువుల యపేక్షలేక, బాహ్యప్రపంచమునందు సత్యత్వాభిమానమును వదలి మిథ్యాత్వ నిశ్చయముతో, స్వాత్మాభిముఖమగు మనసుతో పఠించినవారికి యప రోక్ష బ్రహ్మానుభూతియు, దానివలన కైవల్యరూపమగు మోక్షసామ్రాజ్యమును సిద్ధించునని నా నిశ్చితాభిప్రాయము.

సుజన విధేయః,

కొల్లూరి సోమశేఖరశాస్త్రి.

# ప్రాస్తావికము

జ్ఞానామృతసారంబను యీ బ్రహ్మవిద్యా మనన గ్రంథమును, నేను పాండిత్య పటిమ కలిగిగాని లేక కేవల గ్రంధరచనా కుతూహలంబుతోడగాని వ్రాసినదిగాదు. మరియేమనిన, నా పురాకృత పుణ్యఫలంబున గుర్వీశ్వరానుగ్రహముచే నాకీ విద్యయందు కలిగిన ప్రీతితోడను, సంప్రదాయాను సరణమున మద్గురూపదేశంబునుబట్టియూ, నా బ్రహ్మవిద్యా సాంప్రదాయమునుబట్టియూ, యీ విద్యామననంబు నాకావశ్యక మాయను "పలికెడిది భాగవతమట, పలికించెడివాడు రామభద్రుండట నే పలికిన భవభయహారమగునట, బలికెద వేరొండు గాధ పలుకగనేలా"యని భాగవతమునందు శ్రీ పోతన్నగారు తెలిపిన యటుల, నీగ్రంథ రచనయంతయూ నా గుర్వీశ్వరానుగ్రహ ప్రసాదమేగాని మరివేరుగాదు. నేను నిమిత్తమాత్రుడనైతిని.

మా మాతామహులు బ్రహ్మవిద్వర్యులు, జీవన్ముక్తులు. వారి భుజముల మీద నాశైశవము గడచినది, "తద్దృష్టిగోచరాస్సర్వే ముచ్యన్తేసర్వకిల్బిషైః"అను వచనము బ్రహ్మవేత్తదృష్టి గోచరమైన వారెల్లరును, సర్వ పాపములనుండి విముక్తు లగుదురని తెలుపుచున్నది. అట్టితరి నాసుకృతఫల మెట్టిదై యున్న. నిట్టి జీవన్ముక్త పరంపరలోని, యిట్టి మహనీయుల హస్తములలో నాశైశవము గడపిన వాడినైయుంటిని? మా తండ్రిగారు, బ్రాహ్మణులై ప్రారబ్ధానుసారమున, వ్యాపారములను నిర్వహించుచు ఆంధ్రదేశ వ్యాపారప్రముఖులని పేరుగాంచినను, వాస్తవమున వీరు బ్రహ్మవిద్యాసిద్ధులును వేదవేదాన్త విద్యావృద్ధ్యభిలాషులునూ, తత్ప్రివర్తకులునై యుండుటచే, అనేక వ్యాపారసంస్థలను శాఖోపశాఖలుగ స్థాపించి, వృద్ధినిగావించి, బహులక్షలాది ద్రవ్యమునార్జించియున్ననూ, అందు చాలాభాగము అనగా తొంబదిపాళ్లకధికమైన వారి కుటుంబద్రవ్యముతోడనే, వారి జీవితాశయమైన వేద, వేదాంతాభివృద్ధి, తత్సంబంధమైన దేవతాకార్య నిర్వహణములు, బ్రహ్మవిద్యాసంప్రదాయ నిర్వహణములు, మొదలుగాగల ధర్మోద్దేశ్యములతో "స్వధర్మస్వారాజ్యసంఘమను"పేర నొక సంస్థను స్థాపించి వృద్ధినిగావించి యుండిరి. నేను వారి కేకైక పుత్రుడను. వారికి సదా అర్థ, పరమార్ధములలో

కేవల అర్థముచే కలుగు సుఖము దుఃఖమిశ్రితము తాత్కాలికము నైనదనియు పరమార్థసుఖమే నిత్యనిరతిశయమైనదను దృఢనిశ్చయముండుటచేతనూ, యింకనూ మానవునకు ఐహికధనరూపమైన స్థిరచరాస్థులు రెండునూ చరములేగాని స్థిరములు గావను దృఢ విశ్వాసముతోడను, పరమార్థమే స్థిరమను గట్టి నమ్మకముతోడనూ, అర్థభారమును, అనగా వారు స్థాపించిన బహువ్యాపార, ధర్మ సంస్థలయొక్క నిర్వాహణ, పరిపాలనములను వారియొక్క పౌత్రదౌహిత్రు లిద్దరికినీ తదితరులకునూ వప్పగించి వారి యాశయమైన బ్రహ్మవిద్యాభ్యాసానుకూలత ననుసరించి, వసతులేర్పరచి, కుటుంబ నిర్వాహణావశ్యకధనమును మాత్రము వయఃపరిణామియైన నా కప్పగించి, విదేహముక్తులైరి.

ఎట్టి తండ్రియైనను తనకు ప్రియమైన ద్రవ్యసంపత్తిని, తన కుమారులకప్పగించునుగదా! తక్కిన దానిని తోచినట్లు చేయును. వారు బాగున్న కాలములోగూడ యనేకమారులు యీ వ్యవహార, వ్యాపార, పరిపాలనాదికములు అందరకునూ, వారి, వారి ప్రారబ్ధఫలాను సారమేవచ్చుచున్నను, యిట్టివన్నియూ విద్వాంసుడైన బ్రహ్మవిదునకే. కేవల సుఖకరములుగ నుండుననియు, తదితరులైన సామాన్యులకిట్టివి కేవల సుఖకరములుగాక దుఃఖక్లేశాది మిశ్రితములై యుండుననియూ, అందువలననే శ్రుతి "తతోమే శ్రియమావహ" అని చెప్పుచున్నదనియూ యనుచుండెడివారు. ఈ యుద్దేశ్యముతోడనే కించిద్విద్వాంసుడను, వారి కేకైక పుత్రుడనగు నన్ననుగ్రహింపదలచి "సబ్రహ్మ విద్యాం సర్వవిద్యా ప్రతిష్ఠాం, అథర్వాయజ్యేష్ఠపుత్రాయప్రాహ" యను వచనము ననుసరించి, వారు విదేహముక్తిని పొందుటకు సుమారొక మాసమురోజులకు, ముందొకనాడు సికింద్రాబాదు పట్టణ గృహమందు నన్ను వారికడకు బిలచి కొన్నియుపదేశవచనముల జెప్పి వ్రాసికొన నాదేసించిరి. వాని సారాంశ మేమనిన — వ్యవహార సాధ్యమైన అర్థము దుఃఖమిశ్రితము తాత్కాలికమేగాని, మానవునకు శాశ్వత సుఖము నివ్వగల సామర్థ్యము కలదిగాదనియూ, మానవ జన్మనొందిన వానికి పురుషార్థములు నాలుగైననూ, వానిలో మోక్ష పురుషార్థమే పరమ పురుషార్థమనియూ, దానిని యీ జన్మలోగాని, మరి యెన్నిజన్మలకైననుగాని, సాధించవలెననియూ, యిది మన సాంప్రదాయమనియూ చెప్పియుండిరి. "తండ్రి హరిజేరుమనియెడి తండ్రి తండ్రి" యని భాగవత వచనముగదా!

ఒక బ్రహ్మవిదునకు దౌహిత్రుడనై, మరియొక బ్రహ్మవిదుని గర్భవాసమున జన్మించిన ఫలమూరకపోవునా! "ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా" అను వచనము చొప్పున తదాదిబ్రహ్మాను సంధానాభిలాషకలిగి గురునీశ్వరానుగ్రహముచేతనూ, నిత్యాభ్యాసపటిమవల్లనూ, దినదినాభివృద్ధినిగాంచుచుంటిని. ఇట్లు కొంతకాలము గడచుచుండ "తచ్చింతనం, తత్కథనం, అన్యోన్యం తత్ప్రబోధనమ్। ఏతదేకపరత్వంచ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః" అను విద్వద్వరేణ్యుల వచనము ననుసరించి ప్రతిదినమునను కొంతకాలము, యీ బ్రహ్మాభ్యాసము జేయుచు తద్ధారుఢ్యము నపేక్షించినవాడనై ఆ విషయముల నప్పుడప్పుడు వ్రాయుచుంటిని. ఇట్లు కొంతకాలము గడువగ నేను గ్రహించిన విషయ సిద్ధాంతములు, సంప్రదాయానుకూలముగ నున్నవోలేవో నను సంశయముతోడను, నా యొక్క సిద్ధాంతదార్ఢ్య సంపాదనేచ్ఛతోడను నేనప్పుడప్పుడు వ్రాసికొన్న విషయ సంపుటిని మా సంఘీయ సంస్థాన పండితవరేణ్యులైన, పూర్వోత్తర మీమాంసాచార్యులు బ్రహ్మశ్రీ డోంగ్రేవీరేశ్వరశాస్త్రు గారికిని, ఇతర పండితవర్యులకు గూడ జూపినవాడనైతిని. వారీవిషయసంపుటిని బాగుగ పరిశీలించి, యీ విషయము నామననాను రూపంబుగ వ్రాయబడినదంతయు నొక గ్రంథరూపమున నుంచినచో అన్యులగు బ్రహ్మజ్ఞానాభ్యాసకులకుగూడ నుపకరించునని చెప్పియుండిరి. ఇంకనూ యిందు విద్యాసంప్రదాయ నిరూపణలు, దృఢతరముగను, సుబోధకముగను నున్నవనిగూడ తెలిపిరి. కాని దీనిని, గ్రంథరూపమున నుంచుటకు, నిది కేవల నిర్గుణబ్రహ్మవిద్య యగుటయు, నద్దానిని నేను నామననాను సారంబున తేట తెలుగున వ్రాయుటచే నిది శాస్త్రజ్ఞులకాదరణీయము కాజాలదేమోననియు ఈ విషయమునుబట్టి అజ్ఞులకు దీనియందభిరుచి కలుగునాయనియూ ప్రథమమున సంశయచిత్తుడనైతిని. తదుపరి అట్లుకానిచో, నా స్వలాభమేయగుండునను నిశ్చయముతోడ, దీనిని గ్రంథరూపమున నుంచ నిశ్చయించితిని. నా ఈ గ్రంథ పరిశీలనము గావించి తోడ్పడిన మా పండితవరేణ్యులకు నాకృతజ్ఞతాంజలులు.

పాఠకులకొక మనవి. ఈ కాలమున బ్రహ్మవిద్యాసంప్రదాయమును, యీ పరమోత్కృష్ట విద్యకు ప్రధానావశ్యకములగు శాస్త్రీయప్రక్రియనున్న సాధనాభ్యాసములను, క్లేశకరములు శ్రమసాధ్యమని వదలి అతిసులభముగను, మనస్సునకు రంజకముగను, తాత్కాలిక చిత్తశాంతి, ఆహ్లాదకరముగను, నుండునటుల, కేవల శుద్ధజీవుని స్వరూపమగు సచ్చిదానందాది లక్షణములనే ప్రధానముగ జేసి ఫల

రూపమగు సుఖస్వరూపమును మాత్రము బోధించుచునట్టి కొన్ని ఆధునిక గ్రంథములు, ఆవేశ ఉపన్యాసము లవలెగాక, ఈ నాగ్రంథము ముముక్షువులగు జిజ్ఞాసువుల ఫలప్రాప్తికావశ్యకమగు ప్రధానసాధనములైన, శ్రవణాదులను శ్రుతి, యుక్తి, అనుభవనిరూపణలతోడ బాగుగ వివేచనగావించి, సముచిత పెక్కువాక్య ఉదాహరణలతోడ సులభ భాషాశైలిలో సశాస్త్రీయముగ రచింపబడిన తత్త్వ నిరూపణ. ఈ గ్రంథము జీవుని మోక్ష ప్రాప్తికావశ్యకమగు శాస్త్రీయసాధన ప్రక్రియలనే ప్రధానముగ బోధించుచున్నది. ఏలనన యెట్టివారికైనను సాధనము లేనిది సిద్ధి యనునది కలుగుట యసంభవముగదా! కాని సాధారణముగ ప్రతి వారికిని కార్యసిద్ధియగు ఫలమందుండునట్టి ప్రీతి, ఆసక్తులు, దానికి కావలసిన శాస్త్రీయప్రయత్న సాధనములయందుండవు. ఇది సహజము. అందరకునూ ప్రత్యక్ష ఫలసిద్ధియందు కలుగుప్రీతి, క్లేశకరమగు సాధనమందుండుట దుర్లభము. ఇది లోకస్వభావమైనను ఫలాకాంక్షులు సాధనమందు ప్రవృత్తిని, ప్రయత్న పూర్వకముగ సంపాదించుకొనుట యావశ్యకము. ఇచట ముముక్షువు పొంద వలసిన ఫలము, మోక్షస్వరూపమగు తన నిత్యనిరతిశయ సుఖస్వరూపమేగదా! దాని కావశ్యకమగు శాస్త్రీయసాధనములను బోధించునదియే యీ గ్రంథము. సంగ్రహముగ నీసాధన మేదయనిన జీవునకు తన పరమార్థ స్వరూపమగు ఆత్మ జ్ఞానమే ఈ ఆత్మజ్ఞాన సంపాదనమే జీవునకు పరమశ్రేయస్సగునట్టి పథ్యము. కావున "పథ్యంశతవిధంకృత్వా" అనున్యాయము ననుసరించి నా అనుసంధానాను సరణమున, దీనిని వ్రాసితిని జీవునకు ఆత్మలాభము కలుగుటకు శాస్త్రము శ్రవణ, మనన, నిదిధ్యాసనములను, ప్రధానసాధనములుగ విధించుచున్నది. సాధనరహిత ముగ సాధ్యము (ఫలము) పొందబడదనుమాట ప్రాజ్ఞులందరకునూ విశదమేకదా! అందులకుగాను ముముక్షు బ్రహ్మవిద్యాప్రాప్తికి ఆవశ్యకమగు శాస్త్రీయసాధన ప్రక్రియలను ప్రధానముగ గ్రహించి ముముక్షు జిజ్ఞాసువులకు సంశయ విపర్యయ రహితముగ అద్వైత సిద్ధాంత దార్ఢ్యము కలుగుటకుగాను ననేక పర్యాయములు వివిధముగ యీ గ్రంథము తెలుపుచున్నది. నిష్ప్రపంచమగు, అద్వైత సిద్ధాంత దార్ఢ్యమునకు ఆవృత్తి యావశ్యకమగుచున్నది. కావున పాఠకులు చిత్తశుద్ధిని సంపాదించి నిత్యానిత్యజ్ఞాన యుక్తమగు పఠనమును శ్రద్ధావంతులై పునః పునః గావించినయెడల, యీ గ్రంథ విషయనిరూపణ లాభమగు నిత్యనిరతిశయ సుఖ స్వరూప ఆత్మజ్ఞానము కలుగుననుటకు సందియములేదు. ఇట్టి పరమలాభమే యీ గ్రంథ విశేషప్రయోజనమని జిజ్ఞాసువులు గ్రహింతురుగాక.

ఇందు చాలాభాగము నామనసానుసంధానములకుగాను అప్పుడప్పుడు వ్రాసినదేగాని కేవలపాండిత్యసమర్థతతోడ వ్రాసినదికాదు. కావున పండితవర్యులు ఇందున్న వివేచనలయొక్కయూ, సిద్ధాంతములయొక్కయూ గుణములను మాత్రముగ్రహించి దోషములను మన్నింప వేడుచున్నాడ.

— కొత్తా మోహనరామశాస్త్రి.

# సమర్పణ

మా తండ్రిగారి బ్రహ్మవిద్యా గురువులును,
నాకు పరమ గురువులు, మాతామహులునునగు
శ్రీ లక్ష్మీనృసింహ జ్ఞానభాస్కరులకునూ,
శ్రీ లలితా మాతృదేవతకునూ,
మజ్జనకులును బ్రహ్మవిద్యా గురువులునగు
శ్రీ కౌతా సూర్యనారాయణవర్య చిద్రూపులకునూ,
నాచే రచింపబడిన జ్ఞానామృతసారంబను నీ గ్రంథ కుసుమమును
భక్తి ప్రణామ పురస్సరముగ సమర్పణము గావించుచున్నాడను.

గ్రంథకర్త.



శ్లో॥ కౌత్సాన్వయసుధాబింబం సూర్యనారాయణంగురుమ్ ।
వందేఽహం జ్ఞానదాతారం పితరం జ్ఞానభాస్కరమ్ ॥

# మంగళాచరణము

శ్లో॥ బ్రహ్మాదిస్థావరాన్తస్య ప్రపంచస్యావభాసకమ్ ।
తద్బ్రహ్మ సచ్చిదానన్దం సాక్షాదద్వయమాశ్రయే ॥

శ్లో॥ నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తించ తత్పుత్రపరాశరంచ ।
వ్యాసం శుకం గౌడపదం మహాన్తం గోవిన్దయోగీన్ద్రమథాస్య శిష్యమ్
శ్రీశంకరాచార్య మథాస్యపద్మపాదం చహస్తామలకంచ శిష్యమ్ ।
తం త్రోటకం వార్త్తికకారమన్యానస్మద్గురూన్ సంతతమానతోఽస్మి ॥

శ్లో॥ శ్రుతిస్మృతిపురాణానామాలయం కరుణాలయమ్ ।
నమామి భగవత్పాదం శంకరం లోకశంకరమ్ ॥

శ్లో॥ శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణమ్ ।
సూత్రభాష్యకృతౌ వందే భగవన్తౌ పునఃపునః ॥

శ్లో॥ సదాశివసమారంభాం శంకరాచార్యమధ్యమామ్ ।
అస్మదాచార్య పర్యన్తాం వందే గురుపరంపరామ్ ॥

శ్లో॥ యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాగ్ంశ్చ ప్రహిణోతి తస్మై ।
తగ్ంహ దేవ మాత్మబుద్ధిప్రకాశం ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే ।

ఓం-నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయకర్తృభ్యో
వంశఋషిభ్యః పరమఋషిభ్యో నమోమహద్భ్యో నమోగురుభ్యః
సర్వోపప్లవరహితః ప్రజ్ఞానఘనః ప్రత్యగర్థో బ్రహ్మైవాఽహమస్మి.

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః

# అస్మద్గురు ప్రార్థనా

శ్లో॥ కౌతాస్వయసుధాబింబం సూర్యనారాయణంగురుమ్ ।
వందేఽహం జ్ఞానదాతారం పితరం జ్ఞానభాస్కరమ్ ॥

శ్లో॥ విశ్వేశం సతతం వందే భాస్కరం పరమం గురుమ్ ।
గురుంచ జ్ఞానదాతారం సూర్యనారాయణం బుధమ్ ॥

శ్లో॥ నిత్యం తే ప్రణమామి పాదయుగళం ధ్యాత్వా ముదా భాస్కరం
స్మారంస్మార మహోత్వదీయమధురాం వాచం సదా జ్ఞానదామ్ ।
తృప్తోఽహం మమజన్మధన్య మహహోలబ్ధ్వాగురుం త్వాదృశమ్
తాతాఽధేహి మమాపరోక్ష మధునా జ్ఞానం హి చిద్భాస్కర ॥

# ఉపోద్ఘాతము

పరమేశ్వర సృష్టిలోని సమస్తప్రాణులును, సర్వదా కోరునది సుఖము. ఈ సుఖము ఐహికము, ఆముష్మికము, కైవల్యమని మూడు విధములు. ఐహికసుఖ మనగా ప్రాపంచిక విషయసుఖము. ఆముష్మిక సుఖ మనగా స్వర్గాదిలోకములలో కలుగు సుఖములు. కైవల్య మనగా మోక్షస్వరూపసుఖము. ఇందు ఐహిక, ఆముష్మిక సుఖములు రెండునూ కర్మఫలములగుటంజేసి, నిత్యములు కాజాలక కాలాంతరమందు నశించుచు జీవునకు పర్యవసానమున దుఃఖమునే కలుగజేయుచుండును. కావున నివి మానవుడు తన శాశ్వతసుఖమునకు కోరదగినవికావు. కాని జ్ఞానరూపమగు కైవల్యము మాత్రము దుఃఖలేశరహితమై జీవునకు నిరతిశయ సుఖమును శాశ్వతముగ నిచ్చును. జీవుడు దీనిని ఒక్క జ్ఞానము వలననే పొంద వలయునుగాని, మరి వేరుదారి లేదని "జ్ఞానాదేవతు కైవల్యమ్" అని శాస్త్ర వచనము తెలుపుచున్నది. కావున జీవునకు యీ ముక్తిప్రాప్తికి జ్ఞాన మావశ్యకము. కాని సంసారదశయందు జీవుడు తన అజ్ఞానముచే ఆవరింప బడి స్వస్వరూపజ్ఞానమును మరచియుండును. ఇదియే జీవునికి అనాది అజ్ఞానము జీవునకు యీ అజ్ఞానమే సంసారము. ఈ అజ్ఞానము అనాది. కాని సాంతము. ఇట్టి అనాది అజ్ఞానము నశించుటయే జీవునకు మోక్షమని చెప్ప బడును. ఈ కైవల్యము అనగా మోక్షప్రాప్తి నొందువరకును జీవుడు మాయావివశుడై సంసార భ్రాంతిచే జన్మ పరంపరల నొందుచు, సంసార దుఃఖము ననుభవించుచునే యుండును. ఈ సంసారమునుండి విముక్తుడగు టకు జీవునకు మానవజన్మ యొక్కటియే సాధనముగాని తదితరములు గావు. కాని యీ జనన మరణ సంసార ప్రవాహమందు జీవునకు మానవజన్మ కలుగుట కడుదుర్లభము. ఈ విషయమును శ్రీ శంకరభగవత్పాదులు "జన్తూ నాంనరజన్మదుర్లభం" అను శ్లోకమువలన అనేక కోటిజన్మ సుకృతఫలమున్న

గాని మానవజన్మ ప్రాప్తిపూర్వకముగ మోక్షము లభింపదని తెలుపుచున్నారు. ఇప్పుడు మానవజన్మ నొందినవారు గూడ తమకు అనగా జీవునకు యెల్లప్పుడునూ, మానవజన్మములే కలుగుచుండునను భ్రమనొందగూడదు. ఏలనన జీవునకు అవిద్యాకామకర్మలు అనాది కావున యిట్టి అనాది కర్మఫలానుసారమున జీవుడు, తన అజ్ఞానముచే సంసారచక్రమందు క్రిందుమీదులుగ, ఉచ్చనీచ యుపాధులతో క్రిమికీటకజన్మ మొదలు మానవజన్మ వరకు పొందుచు పర్యాలపర్యాణముగ భ్రమణము జేయుచుండును. జీవునకిట్టి జనన మరణ సంసారప్రవాహమందు మానవజన్మ కలుగుటయు, అందు వివేకముగలిగి తగిన ఆరోగ్యస్థితిగతులతో నుండుటయునూ, కడు దుర్లభము, పుణ్యవిశేషము. కావున మానవజన్మ కలిగినప్పుడు దానిని వృథాచేసికొనుట పరమ అవివేకము, ఆత్మ హానియగును. కావున యేమానవుడైనను తనకు మానవజన్మయున్నప్పుడే సకాలమున జాగరూకుడై తనకు అనాదిగ సంసారదుఃఖపరంపరను కలుగజేయుచు, సంసారార్ణవమున ముంచుచున్న యీ జననమరణ భ్రమణము నుండి, విముక్తుడగుటకు, తన పరమచరణోపాయమును సంపాదించుకొనుటయే వివేకము. ఈ మానవజన్మను వృథాగావించుకొనిన తిరిగి యిట్టి జన్మయే వచ్చునను నిశ్చయములేదు. పశుపక్ష్యాది యితర జన్మములందు యిట్టి, వివేకప్రయత్నసాధనములేదు. కనుక పరమేశ్వరుడు మానవశరీరము ననుగ్రహించినప్పుడే సర్వవిధములచేతను, వారి వారి శక్తి సామర్థ్యలోపములజేయక, మోక్షప్రాప్తికై ప్రయత్నించుచుండుటయే, వివేకము, పరమ శ్రేయము. కావున జీవునకు తనయొక్క మానవజన్మయందు యిట్టి యావశ్యకత కనబడుచున్నది. జీవుడు మరిచిన, తన నిత్యనిరతిశయ సుఖమును బడయుటకు వేరుదారి లేదు. మానవునకు తన మోక్షప్రాప్తిని కలుగజేయు, పరమచరణోపాయమైన సాక్షాత్సాధనమును తెలుపునదియే, యీజ్ఞానామృతము.

ప్రస్తావనానముగ యీ గ్రంథమునకు అనుబంధ చతుష్టయమును నీక్రింది విధముగ గ్రహించవలయును.

1. విషయము : బ్రహ్మసత్యం జగన్మిథ్యానిరూపణ పూర్వకమగు, జీవ బ్రహ్మైక్యము.

2. ప్రయోజనము : జీవునకు జననమరణ సంసారదుఃఖరూప బంధవిముక్తి పూర్వకముగ, పరమపురుషార్థమైన తన నిత్య, నిరతిశయ సుఖ స్వరూపప్రాప్తి.

3. సంబంధము : ఈ గ్రంథమందు జీవబ్రహ్మైక్యరూపమగు విషయము ప్రతిపాదింపబడుటచే ప్రతిపాద్య ప్రతిపాదకరూపమగు సంబంధము యిచట స్పష్టము.

4. అధికారి : చిత్తశుద్ధిని సంపాదించి ముముక్షువైనట్టి బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు.

కావున యీ గ్రంథమునకు, విషయ, ప్రయోజన, సంబంధ, అధికారి, యను అనుబంధచతుష్టయము కలదు.

"జ్ఞానామృతము" అనగా మానవుడు యేజ్ఞానమువలన తనకు సంసార దుఃఖరూపముననున్న యీ జననమరణ ప్రవాహమునుదాటి, తన పరమార్థ వాస్తవస్వరూపమగు నిత్య, నిరతిశయ, సుఖస్వరూపుడగుచు, అమృతుడగునో అనగా ఎన్నటికినీ మరణమునొందడో, అట్టి జ్ఞానసారము. ఇట్టి జ్ఞానము, జీవునకు తన సత్యస్వరూపమును తెలుపునట్టి తత్త్వశాస్త్రమను బ్రహ్మవిద్యయే గాని మరియొకటికాదు. మానవునకు బ్రహ్మవిద్య పరమోత్కృష్టమైనది. శాస్త్రము దీనినే సంగ్రహించి, మానవుడు తెలిసికొనవలసిన విద్యలను ప్రధానమున, రెండుగ విభజించి "ద్వేవిద్యేవేదితవ్యే, పరాచైవాపరాచ" అని, వేద పరమతాత్పర్యమగు ఉపనిషద్బోధను పరవిద్యయనియూ, తక్కిన అన్ని శాస్త్రాదులను కలిపి అపరవిద్య యనియు తెలుపుచున్నది. పరవిద్య యనగా పరమార్థవాస్తవమున జీవునిస్వరూపమగు, నిత్యనిరతిశయ సుఖమును తనకు సాక్షాత్కరింపజేయునట్టి విద్య. ఇదియే బ్రహ్మవిద్య. తక్కిన శాస్త్రవిద్యలనన్నిటినీ మానవునకు వ్యవహారసాధనములుగ గ్రహించి

అపరవిద్య యని శాస్త్రమే తెలుపుచున్నది. కావున వివేకియైన మానవుడు తాను యెంత విద్యా ప్రజ్ఞావంతుడైనను, తన సమస్తవిద్యలను యీ పరవిద్యను సంపాదించుటకు సాధనములుగ గ్రహించవలయునేగాని, యీ అపరవిద్యల వలననే జీవునకు అనగా తనకు శాశ్వతపరమసుఖస్వరూపమగు మోక్షప్రాప్తి కలుగదు, అను నిశ్చయము నొందవలయును. కాని మానవులకు వారి వారి వ్యవహారలాభ భోగానుభవములన్నియూ శాస్త్రము తెలుపుచున్న అపరవిద్యా శాఖలకు సంబంధించినట్టి శాస్త్ర విజ్ఞానములవలననే కలుగుచుండుటను బట్టి మానవునకు మోక్షప్రాప్తికరమైన యీ పరవిద్యయగు బ్రహ్మజ్ఞానమందు సాధారణముగ ప్రవృత్తికలుగదు – ఐనను యీ ప్రపంచమున మానవులలో పాపము క్షీణించిన యొకానొక జీవునకు, తన యనేక జన్మలయొక్క సుకృత పరిపాకము వలన మోక్షేచ్ఛ గలుగును.

ఇట్లు మోక్షేచ్ఛకలిగి ప్రయత్నించువారిలో ఒకానొకడు మాత్రమే యథార్థముగా నన్ను అనగా నా పరమాత్మస్వరూపమును తెలిసికొనును, యని శ్రీకృష్ణపరమాత్మయే గీతలలో నిట్లు తెలుపుచున్నారు.

శ్లో॥ మనుష్యాణాంసహస్రేషు కశ్చిద్యతతిసిద్ధయే ।
యతతామపిసిద్ధానాం కశ్చిన్మాంవేత్తితత్త్వతః ॥

అని తెలుపుచున్నారు. కావున యీ మోక్షార్థులు యెపుడును అరుదుగనే యుందురు—ఇంకనూ యీ సంసారబంధము జీవునకు స్వాత్మవిచారము చేయనందువలన గలుగుచున్నదని :

శ్లో॥ అవిచారకృతోబంధో విచారేణ నివర్తతే ।
తస్మాజ్జీవపరాత్మానౌ సర్వదైవ విచారయేత్ ॥

అనగా బ్రహ్మవిచారము చేయనందున జీవునకు సంసారబంధము ఘటించుచున్నది. ఆబంధము ఆత్మవిచారముచేత నివర్తించును—కావున జీవాత్మ పరమాత్మలయొక్క విచారమును సర్వదా ముముక్షువులు చేయుచుండ

వలయును, అని శ్రీవిద్యారణ్యస్వామి తెలుపుచున్నారు— కావున యీ జ్ఞానామృతమగు ఆత్మవిచారమును జేయుదము.

ఇట్లు మోక్షార్థియైన జీవునకు సాక్షాన్ముక్తిమార్గమును దెల్పునట్టి జ్ఞానమే జ్ఞానామృతము. అమృతత్త్వ మనగా జీవుడు ఈ అనాది జననమరణ సంసార సాగరమునుండి విముక్తుడగుచు పునర్జన్మరహితుడై తన వాస్తవ స్వరూపమగు నిత్యనిరతిశయ సుఖమునొందుట—అనగా తత్స్వరూపుడగుట. ఇదియే జీవునకు పరమముక్తి, మోక్షము అని చెప్పబడును. ఈ ముక్తి ఒక్క-బ్రహ్మజ్ఞానమువలనగాని వేరుసాధనములవలన గలుగుటకు వీలులేదని "జ్ఞానా దేవహి కైవల్య మితి వేదాన్తడిణ్డిమః" అని శ్రుతి స్పష్టముగ దెలుపుచున్నది. ఈ జ్ఞానము ఒక బ్రహ్మజ్ఞానముగ తప్ప మఱియొకటిగ నుండుటకు వీలులేదు. ఏలయన శ్రుతివచనములు—

"సర్వం ఖల్విదం బ్రహ్మ నేహ నానాస్తి కించన"

అనగా స్వశరీర, సర్వదృశ్యమును బ్రహ్మస్వరూపముగనే తెలిసికొనుమనియు తదితరమగు ఈ దృశ్యనానాత్వము వాస్తవము కాదనియు పరమార్థమున లేనిదే యనికూడ అన్వయవ్యతిరేకములచే విశదముగ తెలుపుచున్నది. కావున ఏ జీవునికైనను తనముక్తిని పొందుటకు బ్రహ్మజ్ఞానమునే సంపాదించి అనగా తెలిసికొని స్వానుభవము నొందవలయునుగాని మరి వేరుమార్గము లేదు. జీవుని పరమార్థస్వరూపమగు ఈ బ్రహ్మవిద్యను, తత్సాధనములను, తెలుపునది ఒక్క ఉపనిషత్తు మాత్రమేగాని అన్యము కాజాలదు. ఈఉపనిషత్తు ప్రధానముగ అద్వితీయ నిర్గుణబ్రహ్మమునందే తాత్పర్యము గలదియగుచు, జీవునకు జీవబ్రహ్మైక్యమును బోధించుచున్నది. శ్రుతిమాత జీవబ్రహ్మైక్యమే పరమతాత్పర్యముగలదిగనున్నది. ఇదియే వేదాంతశాస్త్రము. ఈ శాస్త్రమును రెండు విధములుగ విభాగింపవచ్చును. ఇందు పూర్వపక్ష సిద్ధాంతముల రూపమున వాద ప్రతివాదములతో అన్యమతసిద్ధాంతఖండనల నొనరించుచు స్వమతమగు అద్వితీయబ్రహ్మ తాత్పర్యమందే సిద్ధాంతస్థాపన గావించు

శాస్త్రము మొదటిది. ఇట్టి వేదాంతభాష్య వ్యాఖ్యానాది శాస్త్రసద్గ్రంథములు. అనేకములు విరాజిల్లుచున్నవి. వీనిని పండితవరేణ్యులు తర్క మీమాంసా వ్యాకరణాది శాస్త్రసమన్వయములతో ప్రౌఢపాండిత్యములను సంపాదించి, అన్యమత సిద్ధాంతముల ఖండించుచు, వాక్యార్థములను గావించుచు నిరుపమాన సామర్థ్యములతో సిద్ధాంతములను బోధించుచు, స్వమతోద్ధరణము గావించు చుందురు. ఇట్టివారు శాస్త్రసిద్ధాంతప్రామాణ్య నిరూపణలకును, అన్యమత ఖండనలగావించుటకును, స్వసిద్ధాంతస్థాపనకును మహోపకారము గావించు మహనీయులు. వీరు-ఈ విద్యాశాస్త్రరక్షణ ధురంధరులు, వందనీయులు. ఇట్టి మహనీయులకు ముక్తిద్వార మతిసమీపమై వారియిచ్ఛను మాత్రమపేక్షించు చుండును. వీరి విద్యాప్రతిభ పెట్టెలోనుంచిన ధనమువంటిదగుచు, వారు కోరిన మాత్రమున వారి జ్ఞానార్జనకు మిక్కిలి సహకరించును.

రెండవది యేది యనిన, ముముక్షువులకు ముక్తిమార్గము తెలుపునట్టిది యును, స్వానుభవమునుకలుగజేయ సమర్థతకలదియును నగు తత్త్వశాస్త్రము. తత్త్వశాస్త్రమనగా యథార్థమును తెలుపునట్టి శాస్త్రము. మన ప్రకరణమును బట్టి జీవునకు తనపరమార్థస్వరూపమును తెలియజేయునట్టి బ్రహ్మవిద్య యను జీవపరిశోధన శాస్త్రము. ఇట్లు జీవపరిశోధనముగావించి తన సత్యస్వరూపాను భవమును ఇచ్ఛయించి ప్రయత్నించువాడే ముముక్షువు. ఇట్టి తత్త్వజ్ఞానాభ్యాసకు లైన ముముక్షువులలో ప్రౌఢశాస్త్ర పాండిత్యములుగల మహనీయులనేకు లుందురు అట్టివారు అధికజ్ఞానసాధనసామగ్రి సంపన్నులుగా నుందురు. కాని మరికొందరు వారివారి పురాకృత పుణ్యఫలమువలన కించిత్సంస్కృత బుద్ధిమంతులై స్వల్పపాండిత్యముతో నున్నను తమ కృతకృత్యతను అనగా ముక్తిలాభము నిచ్ఛయించు జ్ఞానాభ్యాసకులై యుందురు. ఈ యుభయుల కును ఆత్మసాక్షాత్కార లాభమునకు వారి పరమార్థ సత్యస్వరూప మనన నిది ధ్యాసనాదికములు ఆవశ్యకములును అమృతతుల్యములు. ఇట్టి మననానుసంధా నములలో, నిర్గుణ బ్రహ్మానుసంధానము పరమముక్తిని గావించుటకు శీఘ్ర ఫలప్రదము—ముఖ్యము సాక్షాత్సాధనము. ఈ అనుసంధానాదులు ముముక్షువు

లకు వారివారి ఫలప్రాప్తి పర్యంతము నిరంతరానుష్ఠేయములగుచు విధియై యున్నవి. ఇట్టి మననానుసంధాన వచనములు శ్రుతిస్మృతులయందును, అవతార పురుషులగు శ్రీశంకరభగవత్పాదాది పూర్వాచార్యులవలనను ప్రౌఢముగ చెప్ప బడియున్నను అట్టివి యన్నియు అతిగంభీరముగా నుండుటను బట్టియును, పెక్కు గ్రంథములలో అచటనచట నుండుటచేతను సామాన్యులకు వాని గ్రహణము సుసాధ్యముగ నుండదను నుద్దేశముతోడ, ససిద్ధాంతముగను దేశభాషలో సులభముగ నుండునటులను సామాన్యానుభవ ఉదాహరణలతోడను జ్ఞానాభ్యాసకులకు స్వస్వరూపానుసంధానములు, గ్రహణ సౌలభ్యముగ నుండు నటుల, శ్రుతియుక్తియుక్తముగానుండు అనుభవనిరూపణలను మాత్రము ముఖ్యముగ గ్రహించి, అభ్యాసకులకు సులభముగా తెలియుటకుగాను శాస్త్ర చర్చలనువదలి, పారిభాషిక పదములను సాధ్యమగునంతవరకు తగ్గించి, సామాన్య తెలుగుభాషతో "జ్ఞానామృతసారము" అను నీచిన్నగ్రంథమును దైవప్రేరితుడనై రచించినాడను. ఇందు శాస్త్రచర్చ యితర సిద్ధాంత నిరూపణలను ప్రధానముగ తీసికొనక, ముముక్షుజిజ్ఞాసువుల నుద్దేశించి, కించిత్సంస్కృత బుద్ధిమంతులగు వారికిగూడ సుబోధకముగ నుండునటుల, ప్రధానముగ శ్రుతియుక్త్యనుభవములను గ్రహించి మననాదుల విమర్శ క్రమములను వ్రాసినాడను. ఇది ముఖ్యముగ ముముక్షువుల నుద్దేశించి జిజ్ఞాసువులకు మనన గ్రంథముగ వ్రాయబడినది.

ఇచట పాఠకులకొక విజ్ఞప్తి. ఏమనిన మనన మనగా ఒకే విషయ మును, ఆ విషయనిరూఢికొరకు పలువిధములచే తిరిగి తిరిగి యనుకొనుట. ఇచట మనకు విషయము నిర్గుణపరబ్రహ్మము. ఇది ఒకేవిషయము, ఏక తత్త్వము, అద్వితీయము, అఖండము, నిరుపమానమైనది. ఇట్టి అఖండ సత్పదార్థమునే "బ్రహ్మసత్యం జగన్మిథ్యా" "సర్వంఖల్విదంబ్రహ్మ" యని శ్రుతివాక్యములు బోధించుచున్నవి. కావున శాస్త్రము తెలుపుచున్న విధమున, జిజ్ఞాసువులు పలువిధములుగా అనుసంధించి పరమార్థమును గ్రహించి స్వాను భవము నొందవలసియున్నది — వ్యవహార పదార్థములలాగున బ్రహ్మ

పదార్థము ఒక్కసారి చెప్పగనే తెలియునదికాదు. ఏలనన మానవానుభవము లన్నియూ ఈ ప్రపంచ సంబంధములు. ప్రపంచానుభవములన్నియూ ద్వైతము—నానాత్వము. కాని ముముక్షువు సాధించవలసినది అద్వితీయము, అఖండము, ఇదియే బ్రహ్మ. ఈ బ్రహ్మను, ముముక్షువు స్వార్థాభిన్న, అద్వితీయ, అఖండ పరిపూర్ణ చైతన్యముగ తెలిసికొని, తత్స్వరూపము నొంద వలయును. అప్రయత్నముగ సర్వజనానుభవములో నున్నది వ్యవహారము. బ్రహ్మజ్ఞానాభ్యాసికి, వ్యవహారమనగా దేహధారణయే—ముముక్షువు దేహధారణ, అనుభవములను తన శాస్త్రీయజ్ఞానముచే త్యజించి, నిరసించి, అనగా యివి వాస్తవముకాదని తెలిసికొని తన అఖండ స్వరూపమును పొందవలయును. జీవునకిదియే మోక్షము. పరముక్తి. కాని బ్రహ్మపదార్థము యిప్పుడు జీవుని అనుభవమందులేదు. ఐనను శాస్త్రము "జీవోబ్రహ్మైవనాపరః" జీవుడు బ్రహ్మకంటె వేరుకాదని తెలుపుచున్నది. కావున యిట్టి జ్ఞానమును ముముక్షువు తన శాస్త్రీయ ప్రయత్నాభ్యాసములచే, విశేషప్రయత్నముతోడ సాధించవలసియున్నది. జీవునకిట్టి తన పరమార్థ జ్ఞానమును సంపాదించుటకు సర్వ సాధనములు వ్యవహారమునందే యున్నవిగాని, వ్యవహారమును విడచి లేవు. పరమార్థము అవ్యవహార—స్వరూపస్థితి మాత్రము. ఇది సిద్ధముగాని సాధనకోటిలోనిదిగాదు. కావున ముముక్షువులగు జిజ్ఞాసువులు తమ వ్యవహారానుభవములనే సశాస్త్రీయముగ గ్రహించి, వివేచనచేసి, తమయొక్క—శ్రవణ, మనన, నిదిధ్యసనాభ్యాసపాటవములచే ఈ బ్రహ్మజ్ఞానమును నొంద వలయునుగాని మరివేరు దారిలేదు. అందుకుగాను శ్రుతిబోధమార్గము ననుసరించియునూ "పద్యంశతవిధంకృత్వా" "ఆవృత్తిరసకృదుపదేశాత్" అను మొదలుగాగల వాక్యములననుసరించియునూ, నాకీ విద్యాభ్యాసమందుండు ప్రీతితోడనూ, ఈ అద్వితీయమైన బ్రహ్మతత్త్వమునే అనేక అనుభవ నిరూపణలతోడ, వివిధమార్గముల పునరావృత్తిని దోషముగ నెంచక యీ విద్యకు భూషణముగనే గ్రహించి, ముముక్షు జిజ్ఞాసువులకు సిద్ధాంత దార్ఢ్య, మనన లాభములనే ప్రధానముగగైకొని యీ గ్రంథమును రచించి

నాడను. జిజ్ఞాసువులగు వారికి ససిద్ధాంతముగ బ్రహ్మవిద్యాగ్రహణ సామర్థ్యమునకు, నిట్టి యావశ్యకతయునూ కనబడుచున్నది. కావున పాఠకులు యీ గ్రంథపఠన, విషయగ్రహణములందు పునరుక్తి దోషమునే యెంచక, అందు వివిధమార్గ, వివేచనా విధానలాభమును గ్రహించి విసువుచెందక: జీవునకు యీ పరమోత్కృష్టమైన ఆత్మవిద్యా లాభమందు ప్రీతిని సంపాదించి సావధాన చిత్తులై యీ గ్రంథాంశములను పునః పునః, వృత్తి గోచరమగునటుల పఠించి, వారి ఆత్మలాభ సుఖమును పొందుదురుగాక యని నభిలషించు చున్నాడను.

# జ్ఞానామృతసారము

శ్లో॥ జ్ఞానానన్దఘనం నిత్యం నిర్మలాకాశసన్నిభమ్।
ఆధారం సర్వభూతానాం చిదాకాశ ముపాస్మహే॥

జ్ఞానామృతమనగా అమృతసిద్ధికి సాధనమైన స్వరూపజ్ఞానము. దీనినే స్వరూప సుఖమనికూడ చెప్పవచ్చును బ్రహ్మవిద్య యనగా నిర్గుణ బ్రహ్మవిద్య యనియే గ్రహింపవలయును. ఇతరవిద్యలు అమృతత్వమును ఇయ్యజాలవు. ఇదియే జీవునకు పరమముక్తినిచ్చు జ్ఞానామృతము. తక్కినవిద్యలు జీవునకు ఉత్తమగతిప్రాప్తిని గలుగజేయగలవుగాని పరమముక్తియైన, నిత్యనిరతిశయ సుఖము నియ్యజాలవు కావున ఈ నిర్గుణ బ్రహ్మజ్ఞానము, జీవునకు స్వాత్మాభిన్న పరబ్రహ్మ విషయక పరమోత్కృష్టవిద్య అగుచున్నది. ఇట్టి విద్య వ్యవహారులకును గృహస్థులకును శ్రేయోదాయకము గాదనియు, అసాధ్యమనియుగూడ, సాధారణలోకాభిప్రాయముగ కనబడుచున్నది. కానియిది సరిగాదు పురాణేతిహాసములను బట్టిచూచిన ఈ విద్య ఋషిపుంగవులగు గృహస్థులచేతను, గృహస్థులగు చక్రవర్తులచేతను, ఇతర సామాన్యమానవుల చేతనుగూడ సాధింపబడినదిగ తెలియబడుచున్నది. ఈ కాలమునగూడ వారి వారి వ్యవహారములను నిర్వర్తించుచు ఈ విద్యను సంపాదించిన మహనీయులు అచటనచట నున్నారనుట సంశయింపదగినదికాదు. కాని మణులలో వజ్రమణులు అరుదుగనుండునట్లు బ్రహ్మవిద్యాపరులు ఈ ప్రపంచమున క్వచిత్తుగా నుందురు. మానవకోటికి వారిజీవిత జీవితానంతరములందుగూడ, శాశ్వతపరమ సుఖమునిచ్చునట్టి విద్య ఇదియొక్కటియే. కావున అద్వైత సిద్ధాంతమును, సయుక్తికానుభవ నిరూపణలతోడ సామాన్యులకుగూడ దీనియందభిరుచి

గలుగుటకుగాను దైవప్రేరితుడనై బ్రహ్మవిద్యా సంప్రదాయమున, గుర్వీశ్వ రానుగ్రహములతోడ దీనిని వ్రాయుచున్నాడను.

సర్వజీవులును సర్వదాగోరునది సుఖము. ఈ సుఖముకొరకే ప్రపంచ మున పిపీలికాది బ్రహ్మపర్యంతము సర్వదాప్రయత్నించుచుందురు కాని జీవులు అనాద్యజ్ఞానవశులై కేవలసుఖమునే పొందజాలక వారివారి ప్రారబ్ధ కర్మఫలానుసారమున సుఖాభాసములను, దుఃఖానుభవములను, పొందు చున్నారుగాని నిత్యమగు కేవల స్వస్వరూప సుఖానుభవము నొందలేకున్నారు, దీనికి కారణము జీవుల అనాద్యవిద్యయేగాని మరేమియుగాదు. ఈ అనాద్య విద్యను తన శాస్త్రీయప్రయత్నములతో నిర్మూలించినయెడలగాని జీవునకు తన పరమార్థస్వరూపమగు నిత్యనిరతిశయ సుఖప్రాప్తి గలుగదు. ఈ సర్వ ప్రపంచము సత్యానృత మిశ్రమమైయున్నది. ఇందుల జీవుడు తన సుఖము కొఱకు అనృతపదార్థమును త్యజించి సత్యపదార్థమును గ్రహింపవలసి యున్నది. కాని దీనికి మారుగ ఈ దృశ్యరూపముగనున్న రెంటినీ సత్యమని గ్రహించి, యందు సత్యాసత్యములను వేరు వేరుగ గ్రహింపజాలక జీవుడు సంసారసాగరమునందు చర్వితచర్వణముగ భ్రమణము చేయుచుండును. జీవుని యీ యనాది సంసారసాగర దుఃఖమునుండి విముక్తుని గావించు పరమతాత్పర్యముతోడనే శ్రుతిమాత పలువిధముల బోధించుచున్నది. ఇందు తన పరమార్థవాస్తవ స్వరూపమగు, నిత్యనిరతిశయానందము నిచ్చు నిర్విషయపరిపూర్ణజ్ఞానమే, జీవునకు జ్ఞానామృతమగును గాని ఇతర జ్ఞానములు గాజాలవు. ఇట్టి జ్ఞానమును యుత్పన్నయించుచు ప్రయత్నము చేయువాడే ముముక్షువు. ఇట్టి ముముక్షువునకు తన మోక్షసిద్ధికి గావలసిన సామగ్రులలో భక్తిని మించినది మరియొక్కటిలేదనియు అట్టి భక్తి ఏదియనిన, జీవుని యొక్క సత్యస్వరూపానుసంధానమే పరమోత్కృష్టభక్తిగా జెప్పబడునని శ్రీశంకర భగవత్పాదులు

శ్లో॥ మోక్షసాధనసామగ్ర్యాం భక్తిరేవగరీయసీ।
స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే ॥

అని తెలుపుచున్నారు. కావున ముముక్షువునకు తన పరమార్థ సత్యస్వరూపమును సంశయవిపర్యయ రహితముగా తెలిసికొనుట యావశ్యకము. ఇట్లు తన సత్యస్వరూపమును బాగుగ తెలిసికొనినగదా జ్ఞానాభ్యాసకుడు తన సత్య స్వరూపానుసంధానాభ్యాసాదుల జేయ సమర్థుడగును! లేనిచోకాదు అందులకు గాను ముముక్షువు ఇప్పుడు తాను "అహం" నేను, "మమేదం" నాది అని అనుభవించుచున్న ప్రతీతి ఎట్టిది? వాస్తవమా అవాస్తవమా? అవాస్తవమైన ఎట్లు? ఈ దృశ్యానుభవములన్నియు నెట్లుగలుగుచున్నవని, ఈ అహమిదమ్మల పరిశోధన, బాగుగ గురుశాస్త్రబోధననుసరించి చేసినగాని జ్ఞానాభ్యాసకునకు తన పరమార్థస్వరూపమిట్టిది యనియునూ, యీ స్వశరీర సర్వ జగత్తులు రెండునూ మిథ్యా మాత్రములే యనియూ, స్పష్టముగ తెలిసికొనుటకు వీలుగాదు. ముముక్షువు జగన్మిథ్యాత్వమును బాగుగ గ్రహించి, నిశ్చయమును సంపాదించినయెడలగాని, వాస్తవముగ తన పరమార్థ స్వరూప గ్రహణమందు ఇచ్ఛాప్రీతి నిశ్చయములు గలుగవు. కావున ఈ విచార మావశ్యకము. ఈ విచారమేదియనిన, పంచపాదులు లిట్లు తెలుపుచున్నారు.

శ్లో॥ అవిచారకృతోబంధో విచారేణనివర్తతే।
తస్మాజ్జీవపరాత్మానౌ సర్వదైవ విచారయేత్॥

అనగా బ్రహ్మవిచారము చేయనందువలన జీవునకు బంధము కలుగుచున్నది. ఆ బంధము ఆత్మవిచారముచేత నివర్తించును. కావున జీవాత్మ, పరమాత్మ విచారము సర్వదా ముముక్షువుల కావశ్యకమని గ్రహించవలయును.

ఈ సర్వప్రపంచము సర్వజీవులచేతను "అహం = నేను" "మమేదం = ఇదినాది" అను జ్ఞానముచేతనే అనుభవింపబడుచున్నది గాని మరియొక విధమున కానేరదు. ఇందు నేను అనునది లేనిదే, నాది యనునది ఉండుటకు వీలులేదు. కావున జీవునకు "అహం = నేను" అనునదియే తన అనుభవమునకు ముఖ్యాధారమగుచున్నది. పరమార్థమున ఈ "అహం పదార్థము" జీవుని యొక్క స్వరూపసుఖము, కాలత్రయ, అవస్థాత్రయాబాధితము, నిర్వికారము, అద్వితీయము, అసంగపరిపూర్ణము, అపరిచ్ఛిన్నము, అఖండజ్ఞాన స్వరూపము

అయివున్నది. ఒక్కటియైన ఇట్టి అఖండపరిపూర్ణ సత్యపదార్థమే, జీవుని యందు మాయాప్రభావముచే రెండువిధముల నున్నది. ఎట్లనిన "అహం" అనియు "అహంకార" మనియు రెండు విధములు. కాని జీవుడు తన అవిద్యచే యీ రెంటిని ఏకముగనే గ్రహించుచున్నాడు. ఇందు కేవల 'అహం' సత్యస్వరూపము. 'అహంకారము' జడచైతన్యమిశ్రితమైన అసత్యము అయి నను ప్రతిజీవియు తన పరమార్ధ సత్యస్వరూపమును గ్రహింపజాలక సర్వవ్యవ హారములను అవిద్యా కల్పితమును రెండవదియున్న యగు ఈ యహంకారము తోడనే చేయుచుండును. 'అహంకార' మనగా పరిచ్ఛిన్నమై స కర్తృతాభిమాన ములతోగూడిన యీ దేహశరీరోపాధియే "నేను"అని నమ్మచు, అనుకొనుట. ఇది కేవలము భ్రాంతికాని వాస్తవముకాజాలదు. ఇదియే జీవునకు అనాది అవిద్య. ఇట్టి అవిద్యకు లోనై సర్వమానవులును వారివారి సర్వవ్యవహారము లను భ్రాంతిచేకలుగుచున్న ఈ నేను అను అహంకారముతోడనే నిర్వహించుచు ఆభాససుఖమును క్లేశదుఃఖముల ననుభవించుచున్నారు. జీవునకిదియే అనాది అజ్ఞానము. ఈ విషయ సంసారసుఖములు ఆభాసములగుటవలన జీవునకిట్టి సుఖము అనిత్యమై సర్వదా మారుచుండుటచేత సుఖమునకు బదులు జీవులు దుఃఖక్లేశములనే అధికముగ బొందుచు సంసారచక్రమందు భ్రమణము చేయుచుందురు. ఈ విషయమును జీవునకు స్పష్టము చేయుటకే

శ్లో॥ అహం సర్వమిదం విశ్వం పరమాత్మాహ మచ్యుతః ।
అహంకారాభిధా యా సా కల్ప్యతే న తు వాస్తవీ ॥

అని శాస్త్రవచనము తెలుపుచున్నది. కావున జీవుడు తన ముక్తినిగాంచుటకు, కల్పితమైన యీ తన అహంకారమును విడిచి తన పరమార్థ స్వరూపమగు కేవల సత్య, నిత్యబుద్ధ, ముక్త, స్వరూపమైన, "అహం" పదార్థమునే తానుగ తెలిసికొనవలయును. అప్పుడుకాని జీవునికి సంసారరాహిత్యము కలుగదు. ఇట్టి సంసారమంతయు జీవునికి తన అనాది అవిద్యవలన సంప్రాప్తమై సుఖమునకు బదులు దుఃఖము నిచ్చుచున్నది. జీవునకు దుఃఖము ఆగంతుకము. సుఖము తన పరమార్ధ వాస్తవస్వరూపము. కావున

జీవునికి తన నిత్యానిత్య వివేకమువలన ఈ ఆగంతుక సంసారదుఃఖమును పోగొట్టుకొన సాధ్యమని తెలిసికొని, ముముక్షువు గుర్వీశ్వరానుగ్రహముల తోడను, శాస్త్రీయ స్వప్రయత్నముతోడను, తన అనాది అజ్ఞానమును శ్రుత్యనుసార బ్రహ్మజ్ఞానమువలన నిర్మూలించ గలిగినయెడల తిరిగి యీ అజ్ఞానము ఎన్నటికిని అట్టి మహనీయుని సమీపమునకుగూడ రాజాలదు. జీవునికిదియే మోక్షమని శ్రుతి :— "అవిద్యాస్తమయో మోక్షః" అని తెలుపుచున్నది. ఈ అజ్ఞాననివృత్తి జీవునకు నొక్క ఉపనిషద్బోధవలననే కలుగవలయును గాని వేరుమార్గములేదు. కావున శ్రుతిమాతయే, జీవుని జననమరణ ప్రవాహము నుంచి విముక్తుని గావించుటకుగాను "జగన్మిథ్యా, బ్రహ్మసత్యమ్" "జీవో బ్రహ్మైవ నాపరః" అనగా బ్రహ్మయే సత్యమనియు జగత్తు మిథ్యామాత్ర మనియు, జీవుడు బ్రహ్మకంటె అన్యుడుగాడనియు స్పష్టముగ తెలుపుచున్నది. శ్రుతి నూరు తల్లుల సమానము గనుక, వివేకియైన మానవునకు ఈ ఆప్త వచనమును ఉపేక్షించుట అవివేకము, అనర్థముగూడ నగుచున్నది. కావున వివేకియైన జీవుడు ఈ వచనముల వాస్తవార్థమేమి? నాస్వరూప మెట్టిదియై యున్నయెడల పరిచ్ఛిన్న జీవుడనైన నేనునూ, ఆ అద్వితీయ అఖండ పరిపూర్ణ బ్రహ్మయూ, నొక్కటేయగుటకు సాధ్యము? శ్రుతిమాత నేనునూ ఆయనయూ ఒక్కటియేకాని కించిద్భేదముగూడ లేదని స్పష్టముగ తెల్పుచున్నదే? కాని నాకు ఈ దృశ్య పరిచ్ఛిన్న, నానాత్వములు తప్ప అద్వితీయ అపరిచ్ఛిన్న అఖండపరిపూర్ణ స్వరూపము ఎంత మాత్రము అనుభవములో కనుబడుటలేదే? పరమార్థ వాస్తవమున నేనెవ్వడను? నాకీ దృశ్యానుభవములన్నియు వాస్తవమా? లేనిచో నాకెందులకిట్లనుభవము కలుగుచున్నది? నాకును ఈ దృశ్యమునకునుగల సంబంధమెట్టిది? నాకీ జననమరణము లెందులకు కలుగుచున్నవి? వీని వాస్తవమేమి? నాకీ సంసార దుఃఖమెందులకు కలుగుచున్నది? నాకు ఈ జననమరణ సంసారప్రవాహము నుండి శాశ్వత విముక్తిని గాంచుటకు సాధనమేదియైన కలదా? ఉన్నచో అది మెట్టిది? దానిని తెలిసికొనుటయెట్లు? దాని స్వరూపమెట్టిది? ఎట్లు

దానిని నేను తెలిసికొనగలను? అను మొదలుగాగల సంశయాంశముల నన్నిటిని, గురుశాస్త్రబోధవలన ముముక్షువులగు, జిజ్ఞాసువులు తెలిసికొనవలయునేగాని వేరుమార్గములేదు. ఇట్టి జిజ్ఞాసనుపొంది తన ముక్తికి ప్రయత్నముచేయువాడే ముముక్షువు. ఈ ముముక్షువు తన యిచ్ఛాప్రయత్నములను దృఢపరచుకొని సద్గురువు నాశ్రయించి శాస్త్ర సిద్ధాంతమందు ప్రీతి నిశ్చయములను పొందుచు స్వప్రయత్నముతో తన సత్యస్వరూప, మననానుసంధానాభ్యాసములను, అనగా శ్రవణ మననాద్యభ్యాసముల నిరంతరము నభ్యసించుచుండవలయును. ఇట్టి అభ్యాసమువలన కాలక్రమమున వైరాగ్యాది సంపత్తి వృద్ధియై తన నిత్యానిత్య వివేకముతో "అహం" "ఇదం"ల పరిశోధనను బాగుగచేయుటకు సమర్థుడగును. తదుపరి కాలక్రమమున, భాగత్యాగలక్షణచే మహావాక్యబోధను బాగుగ గ్రహించ సమర్థుడగును. ఈ వాక్యబోధను బాగుగ గ్రహించి ఆత్మసాక్షాత్కారమునకు దృఢముగ ప్రయత్నించువాడే బ్రహ్మజ్ఞానాభ్యాసకుడనియు తీవ్ర ముముక్షు వనియూగూడ చెప్పబడును.

బహుకాల సత్కర్మానుష్ఠానమువలన గుర్వీశ్వరానుగ్రహములతో నిత్యానిత్య వివేకమును, చిత్తశుద్ధిని సంపాదించిన జ్ఞానాభ్యాసకునకు అనగా ముముక్షువునకు 'అహంబ్రహ్మాస్మి' "నేను బ్రహ్మ" అని తెలిసికొని స్వానుభవము నొందుటయే తన ముక్తికి పరమకర్తవ్యము. శ్రుతిమాత "మాయామాత్రమిదం ద్వైతం। అద్వైతం పరమార్థతః" అనగా ద్వైతమంతయు మాయామాత్రము, వాస్తవముగలేనిది. పరమార్థముగనున్నది అద్వైతము, అనగా అద్వితీయ అఖండపరిపూర్ణ బ్రహ్మ యొక్కడేయనియు, "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" "నేహ నానాస్తికించన" అనియూ అనగా వాస్తవముననున్నది బ్రహ్మయొక్కటియేయనియు, తదితరమంతయు నెంతమాత్రము వాస్తవముగలేదనియు జీవునకు అన్వయవ్యతిరేకములతో స్పష్టముగా తెలుపుచు; మరియును జీవుడు తన అనాది అవిద్యవలన భ్రమప్రమాదముల నొందునేమోయనితలచి, శ్రుతిమాత "తత్త్వమసి" "అహంబ్రహ్మాస్మి" అను మహావాక్యములతో "ఆ బ్రహ్మ, నీవే" యనియు! "ఆ బ్రహ్మ నేనే"

యనియు, ప్రథమ ఉత్తమవాచకములతో జీవునకు విస్పష్టముచేయుచున్నది. కాని దీనినెట్లు తెలిసికొనుటయనిన, ఈశ్వరానుగ్రహ, గురు, శాస్త్రబోధవలన యీ జీవుడు, ఆ పరమాత్మను నేనెయని తెలిసికొని స్వానుభవమునొందవలయునేగాని వేఱమార్గములేదు. ఇట్లు తెలిసికొనుటకుగాను ముముక్షువుశాస్త్రీయమైన జీవభోగానుభవములనే సప్రమాణసయుక్తికముగ విచారణ వివేచనలను చేయుట యావశ్యకము. ముముక్షువు తన స్వస్వరూపానుసంధానాభ్యాసములకు శాస్త్రసిద్ధాంతమందు ప్రీతినిశ్చయములను, చిత్తదారుఢ్యమును, సంపాదించి, శాస్త్రీయముగ శ్రుతిప్రామాణ్యముతోడ ఈ క్రింది జీవానుభవ వివేచనలను, చేసికొనినయెడల, యీ వివేచన, మననాభ్యాసములు తన బ్రహ్మజ్ఞానమునకు కరతలామలకమువలె సహకరించి ముముక్షువు తన అభ్యాసపటిమచే కాలక్రమమున స్వానుభవమునొందగలుగును.

సర్వప్రపంచమునకును దేవత లనేకులున్నారు. కాని పరమార్థవాస్తవమున నున్నది దేవుడు ఒక్కడే. తదితర దేవతాదు లందరును జీవకల్పితములుగ సృష్టింపబడి యుండిరి. కావున ఈ దేవతలు, జీవునకు ఐహికాముష్మికఫలభోగములను వారివారి నియతిచొప్పున కొంతకాలముమాత్రమే ఇయ్యగలరు. కాని అట్టివి జీవునికి నిత్యము కాజాలవు. కాలాంతరమందు ఈ ఫలభోగము లన్నియు జీవునకు నశించునట్టి వగును ఇంకనూ యీ కర్మఫలములన్నియు ఆ యా జీవులకర్మ ఫలభోగములకుగాను నీచోన్నతములైన జన్మపరంపరల కలుగజేయుచు జీవులను సంసారార్ణవమున త్రిప్పుచుండును. జీవుడు ఈ సంసారదుఃఖ పరంపరనుండి శాశ్వతముక్తిని అనగా తన సత్యస్వరూపమగు నిత్యనిరతిశయ సుఖము నొందవలెననిన, ఆ దేవదేవుడగు బ్రహ్మను, తానే అనగా నేనేయనియు, యిదియే నా వాస్తవ "అహం" స్వరూపమనియు తెలిసికొని స్వానుభవము నొందవలయునే కాని మరి వేరుమార్గములేదని శ్రుతియే "నాన్యఃపన్థా విద్యతేఽయనాయ" అని తెలుపుచున్నది. దీని సంశయును విమర్శించి చూడగా జీవునకు పరమార్థవాస్తవముగ నున్నది తానొక్కడే యనియు తదితరమంతయును తన అనాది అవిద్యాభ్రాంతి మాత్రమే

ననియూ, ఈఆత్మ ఒక్కటియే అద్వితీయము, అఖండము, నిరుపమానమునగు పరమార్థవాస్తవమని స్పష్టపడుచున్నది జీవుడు తన పరమార్థస్వరూపమును తన వృత్తిచేత గ్రహించు వ్యవహారానుభవములవలననే తెలిసికొనవలయును గాని వేరుమార్గములేదు. ప్రతి జీవునకున్నూ జాగ్రత్స్వప్నసుషుప్తి, తురీయములను నాలుగవస్థలు గలవు. ఇందు జీవునకు తురీయము పరమార్థవాస్తవము. తక్కినమూడును అపరమార్థములై, వ్యవహార కల్పితములుగ నున్నవి. ఈ నాలుగవస్థలలోను తురీయస్థితి ఒకటిమాత్రము వాస్తవముగను, తక్కిన మూడును అవాస్తవములుగను, బ్రహ్మస్వరూపుడైన పరమార్థ జీవునియందే యున్నవి. జ్ఞానాభ్యాసకుడు తన సత్యస్వరూపమును, స్వవివేచనమననా భ్యాసాదులతో నిట్లు తెలిసికొనుచుండవలయును. ఎట్లన, ప్రతిజీవుడును పరమార్థవాస్తవమున తాను పరిపూర్ణజ్ఞానస్వరూపుడగు బ్రహ్మయే. కాని ఈ యొక్కటియగు అఖండపరిపూర్ణజ్ఞానమే అనగా బ్రహ్మయే మాయా ప్రభావముచే అనాది అవిద్యావృతుడై, నానాపరిచ్ఛిన్నోపాధులు గ్రహించిన వానివలె నిగుపడుచు, జీవత్వమునొందినవానివలె, నీ సంసారదుఃఖము ననుభవించుచున్నట్లు లోకానుభవమునకు తోచుచున్నాడు. ఇచటనొక విషయ మును బాగుగా గ్రహింపవలయును. ప్రతి జీవుడును పరమార్థవాస్తవమున బ్రహ్మస్వరూపుడే. కాని అనాది అవిద్యాప్రభావముచే, యీ జీవుడే జీవత్వము నొందినవానివలె పరిచ్ఛిన్నభ్రాంతుడుగ, లోకానుభవమున తెలియబడు చున్నాడు. ఇది పరమార్థమున వాస్తవముకాదు. ఇది అంతయు మాయా కల్పితము. ఇదియే జీవునకు అనాదిభ్రాంతి. ఈ భ్రాంతిని పోగొట్టుకొనుటయే జీవునకు మోక్షమగుచున్నది. జీవుడు తాను పరమార్థవాస్తవమున నిర్వికార, అద్వితీయ అఖండ పరిపూర్ణ సంవిత్స్వరూపుడనని తెలిసికొని స్వాను భవమునొందుటయే జీవునకు తన పరమార్థవాస్తవ స్వరూపము. కాని యిప్పుడు భ్రాంతుడు. కావున యిట్లు జీవత్వభ్రాంతినొందిన ప్రతిజీవునకును, తన అద్వితీయ అఖండపరిపూర్ణస్వరూపమగు తురీయమందే స్థూల సూక్ష్మ కారణ శరీరములు మూడును, జాగ్రత్స్వప్న సుషుప్తి అవస్థలు మూడును,

కల్పితములైనవి. ప్రతిజీవునకును మొదటిదియగు తురీయము తన పరమార్థ వాస్తవస్వరూపమగుచు, తక్కినమూడును వ్యవహారకల్పితములగుచున్నవి. ఈ నాలుగు స్థితులును, ఒకటి వాస్తవముగను తక్కిన మూడును అవాస్తవముగను బ్రహ్మస్వరూపుడైన జీవునియందే యున్నవి. జీవుడు తనకు ఈ కల్పితమగు, మూడు దేహములతోడను, కల్పితమైన యీ మూడవస్థలను వరుసగ ననుభవించుచుండును. జీవునకు ఈ దేహత్రయము అవస్థాత్రయములు గూడ అవిద్యాకల్పితములే గనుక తనకు వానితో కలుగుచున్న సుఖదుఃఖ భోగానుభవములు గూడ కల్పితములగుచు, అనిత్యములై అనాది సంసారదుఃఖమునిచ్చుచుండును. ఈ దేహత్రయ అవస్థాత్రయములన్నియు తనకు కల్పితమైనవనియు నిత్యము కావనియు శాస్త్రోక్తజ్ఞానముతో తన అనుభవవివేచనలను బట్టియే జీవుడు తన జీవానుభవములన్నియూ అనిత్యములని గ్రహించవచ్చును. కాని యిట్లు గావించుటకు అన్ని జీవోపాధులకు సాధ్యముకాదు. ఏలనన యీ జ్ఞానము శాస్త్రీయవివేకవిచారాదులచే కలుగవలయును. ఈ శాస్త్రోక్త అనుభవ నిత్యానిత్యవివేచన చేయగలుగు సామర్థ్యము యొక్క మానవ ఉపాధికియే తప్ప తదితరపశ్వాది యుపాధులకు లేదు. తదితరోపాధులన్నిటికిని ప్రారబ్ధఫలము ననుభవించుటయేతప్ప శాస్త్రము విచారించి తన మోక్షోపాయ వివేచన చేయగలుగునట్టి సామర్థ్యములేదు. ఇట్టి సామర్థ్యము ఒక్క మానవునకే యున్నది. కావున మానవజన్మ మొందిన జీవునకు తన జీవితమును వృథా చేసికొనక తన తరణోపాయజ్ఞానమును శాస్త్రీయముగ సంపాదించుటయే వివేకము. మానవుడు తన అనాదిఅవిద్యచే మరచిన తన పరమార్థస్థితిని తిరిగి పొందుటకుగాను, తన ప్రారబ్ధభోగానుభవములకు కల్పితమైన ఈ స్థూల సూక్ష్మకారణశరీరములు తనకు వాస్తవముకావను నిశ్చయమును సశాస్త్రీయముగ గ్రహించి తనకు కలుగుచున్న యీ జాగ్రత్స్వప్న సుషుప్తులవస్థలు కూడ నిట్టివే యను నిశ్చయమునొంది స్వానుభవరూపమున వాస్తవముగ తన పరమార్థస్వరూపమైన తురీయస్థితిని పొందవలయును దీనికిగాను జాగ్రత్స్వప్న సుషుప్తులను తన సత్యస్వరూపమునందే లయముగావించి, తన పరమార్థ

స్వరూపమైన తురీయమును, మానవుడుపొందవలయును. అద్వైతసిద్ధాంతము జీవునకు ఈ దేహత్రయ అవస్థాత్రయములు సర్వమునుగూడ మందాంధకార మున రజ్జువునందు కలుగుచున్నట్టి సర్పభ్రాంతివంటిదేనని తెలుపుచున్నది. కావున జ్ఞానాభ్యాసకుడు ఈ దేహత్రయ అవస్థాత్రయములు తనకు ఎంత మాత్రము వాస్తవములుకావను నిశ్చయమునొంది, యివి యన్నియు తన వాస్తవస్వరూపమైన తురీయమందే కల్పితము లను నిశ్చయజ్ఞానానుభవముల నొందుటయే యిచట లయశబ్దమునకర్థము — భ్రాంతికల్పితపదార్థములన్నియు ఆ భ్రాంతి నివృత్తితోడనే అసత్యములగును. కావున జ్ఞానాభ్యాసకునకు యిచట లయమనగా తన వాస్తవస్వరూపమగు తురీయజ్ఞానమునొందుట. ఇట్లు తెలిసికొని ముముక్షువు తన సత్యస్వరూపమైన తురీయమును ప్రణవముతో అనుసంధించుచుండవలయును. ఈ 'ఓం' కారమునకు లక్ష్యార్థము తురీయము. బ్రహ్మము. కావున జ్ఞానాభ్యాసకుడు 'ఓం' కారము నుచ్చరించుచు, తన హృదయపుండరీకమునందు చిదాకాశరూపమునున్న తన తురీయస్థితిని ధ్యానించుచుండుటయే ముముక్షువునకు శీఘ్రముక్తి ఫలదాయకమని గ్రహించ వలయును. మానవునకు తన పరమార్థ వాస్తవస్వరూపము అద్వితీయము, నిరుపమానమైనది, గనుక అట్టి పదార్థగ్రహణానుభవమును ముముక్షువు శాస్త్ర ప్రమాణమువలనను, తన వ్యవహారానుభవములలో ఉన్న శాస్త్రీయదృష్టాంత ముల పరిశీలనవలనను వివేచనాదులనుబట్టియే తెలిసికొనవలయునుగాని వేరుమార్గములేదు అందులకుగాను జ్ఞానాభ్యాసకుడు ఈ క్రింద వివరించిన జీవానుభవములను ప్రపంచ ఉదాహరణలను శాస్త్రానుసారముగ, బాగుగ తెలిసి కొనినయెడల ఈ జ్ఞానమే సాక్షాత్సాధనమై తన సత్యస్వరూపానుసంధానము లకు అత్యంతముగ సహకరించి, ముముక్షువుల తీవ్రాభ్యాసపాటవముల ననుస రించి కాలక్రమమున ముక్తినొంద జేయును.

బ్రహ్మజ్ఞానాభ్యాసకునకు స్వశరీర సర్వదృశ్యమంతయును అనగా సర్వప్రపంచమును ఎంత పరిశీలించి చూచినను తెలివి, తెలిసికొనువాడు, తెలియ బడునది—అనగా జ్ఞాన, జ్ఞాతృ, జ్ఞేయములు అను ఈ మూడు విభాగముల

కంటె నితరమగునదేదియును కనబడుటలేదు. ప్రపంచమునందు దేనిని పరిశీలించినను ఈ త్రిపుటిలోనే చేరియే యుండును గాని అన్యముగా నుండుటకు వీలులేదు. ఈ త్రిపుటియందు జ్ఞానము మాత్రమే పరమార్థసత్యమైన అద్వితీయ చైతన్య అఖండపదార్థమై యున్నది జ్ఞాతృజ్ఞేయములు అధ్యస్తములైన పరిచ్ఛిన్న, అనిత్య, జడపదార్థములు. కావున ఈ స్వశరీర సర్వదృశ్యమునకును జ్ఞానము అధిష్ఠానముగ అనగా నిత్యమగు సత్యపదార్థముగ తెలిసికొనవలయును. జీవునకు జ్ఞానములేనిదే ప్రపంచానుభవముండుటకు సంభవము కాదు. ఈ జ్ఞానమునందే జ్ఞాతృజ్ఞేయములు అధ్యస్తములై అనగా కల్పితములుగ నున్నవి. అధ్యస్తము లెప్పుడునూ వాస్తవములగుటకు వీలులేదు. జీవుడు జ్ఞానస్వరూపుడు అధిష్ఠానము. ఈ జీవునకు తన పరమార్థ స్వరూపము అద్వితీయ అఖండపరిపూర్ణ చైతన్యమని శ్రుతివచనములు తెలుపుచున్నవి. కావున శ్రుతి ప్రామాణ్యమందు ప్రీతి నిశ్చయములను సంపాదించి, ముముక్షువు దృశ్య స్వరూపమైన యీ కల్పిత అనిత్య పదార్థములగు జ్ఞాతృజ్ఞేయములను తన శాస్త్రీయ జ్ఞాన పూర్వకముగ త్యజించి, తన పరమార్థ స్వరూపమును అధిష్ఠానముగ తెలిసికొనవలయును. ఇట్లు తెలిసికొనుట సాధ్యమా యని శంకించ తగదు. ఏలయన శాస్త్రప్రమాణముగల ముముక్షువు తన వ్యవహారానుభవములనే బాగుగ పరిశీలించి తాను చేయునట్టి, శాస్త్రీయ వివేచనలను బట్టియే యీ స్వశరీర సర్వదృశ్యము అవాస్తవమని స్పష్టముగ బోధపడి తన పరమార్థ స్వరూపము గోచరించుచుండును. ఎట్లన జీవుడు తన అనుభవములో నున్న జ్ఞానమును మాత్రము నేను "అహం" అనియు, జ్ఞాతృజ్ఞేయములను, "ఇదం" "మమేదం" అనగా "ఇది, ఇదినాది", అనియూ యీ ప్రపంచమును రెండు విధముల తెలిసికొనుచున్నాడు. ఇందు "అహం" నేను అనునది యున్నప్పుడే ఇది, అది, నాది అను ప్రపంచానుభవముండుటకు సాధ్యముగాని, నేను "అహం" అనునది లేనిదే నాది యనిగాని, ఇది, యది యనిగాని యనుభవముండుటకు వీలులేదు. కావున ఈ "అహం" నేను అనునదే, జీవుడు తన అనుభవము నొందుటకు జ్ఞాన స్వరూపముగను, నిత్యముగ నున్నది.

"ఇదం", "మమేదం"లు, రెండునూ కల్పితములై అనిత్య, అవాస్తవములుగ నున్నవి. తెలిసికొనువాడు, తెలిసికొనబడునది, యైన యీ సర్వప్రపంచము కల్పితమాత్రమై, తాత్కాలిక వ్యవహారానుభవముల నిచ్చుచు అనిత్యముగ నున్నది. ఈ విషయమును స్పష్టపరచుటకు మరియొక యనుభవమును, పరిశీలించుదము పై నిరూపణమువలన జ్ఞానరూపముగ అధిష్ఠానమైన "అహం" సత్యమనియు, జ్ఞాతృ, జ్ఞేయరూపములుగనున్న ఈ సర్వదృశ్యము అధ్యస్తము, కల్పితము అనియు నిశ్చయమగుచున్నది.

ఇది జీవునకు తన పరమముక్తిని తెలుపు పరమార్థశాస్త్రము, బ్రహ్మ ప్రకరణము, గనుక ఇచట పరమార్థప్రమాణమును, శాస్త్రమువలన వస్తు నిత్యానిత్యపరిశీలనమును, పరమార్థ సత్యస్వరూపలక్షణములనే తీసికొని, పరి శోధనచేయవలసి యున్నదిగాని అనిత్యమగు వ్యవహార సత్యప్రమాణములు గ్రాహ్యములుకావు. పరమార్థసత్యమైన పదార్థలక్షణములను బట్టి పరిశీలించిన యెడల అట్టి పరమార్థవస్తువు, అవస్థాత్రయాబాధితమైన, నిత్యనిర్వికార అఖండ పరిపూర్ణచైతన్యమే అయి యుండవలయును గాని మరియొకటిగా నుండుటకు వీలులేదు—మన యనుభవములో నిట్టి పదార్థమేదియనిన "అహం" "ఇదం" "మమేదం"ల యనుభవమును బాగుగ విమర్శించి చూచినయెడల ఇట్లు అవస్థాత్రయాబాధితమై కాలత్రయాబాధితముగ కనబడుచున్న పదార్థము ఒక్క "అహం" నేను అనునది తప్ప తదితరమేదియును స్వశరీరసర్వదృశ్య మందునను ఈ పరీక్షకు నిలుచునదిలేదు అనగా ప్రతి జీవునకును గలుగు చున్న జాగ్రత్స్వప్నసుషుప్తులను తన అవస్థాత్రయమందునను, భూత భవిష్యద్వర్తమానకాలముల జన్మములందును, గూడ తననితాను "అహం"నేను అను జ్ఞానముతో అనుస్యూతముగా స్మరించుకొనుచున్నాడుగాని, తక్కిన రెండును అగు"ఇదం" "మమేదం"లు తన అవస్థాత్రయమందు అనుస్యూతముగనుండక కొన్ని అవస్థలయందు మాత్రముండి, అవస్థాంతరమున లేనివేయగుచు సర్వదా మారుచునేయుండును. కాని ఈ "అహం" అను ప్రతీతి అట్లు మారక సర్వదాయుండును. ఇంకను ఈ "ఇదం"–"మమేద"ములు అను నీ రెండును

యేజన్మ కాజన్మయందే నశించుచున్నవి. కాని యీ "నేను" అను జ్ఞానము మాత్రము జీవుని భూతభవిష్యద్వర్తమానకాల అన్నిజన్మములందునను, తనమోక్షప్రాప్తి పర్యంతము, వచ్చుచునేయుండును. "నేను" లేనని యెప్పుడును, యే జీవుడును జెప్పజాలడు కనుక దీనినిబట్టి, నేను, "అహం" అను పదార్థము యొక్కటియే జీవునకు తన పరమార్థ సత్యస్వరూపమని ముముక్షువులు గ్రహింపవచ్చును. ఏ జీవుడునూ, తానులేని కాలమును తెలిసికొనలేకున్నాడు. కాన యీ నేను అను తాను నిత్యుడు. ఎట్లనిన ఈ జీవునకు "అహం" నేను అను ప్రతీతి లేనికాలము కాని అవస్థగాని కనబడుటలేదు. ఇట్టి "అహం" నేనే "బ్రహ్మ" అద్వితీయ, నిత్య, నిర్వికార, అసంగ, పరిపూర్ణ పదార్థమనియు, ఇదియే నిత్య సత్యస్వరూపమనియు శ్రుతివచనములు తెలుపుచున్నవి. ఇట్టిదే తన సత్యస్వరూపమని, ముముక్షువు గ్రహించి స్వానుభవము నొందుటకు మానవునియొక్క ఈ క్రింది ప్రపంచానుభవ వివేచనల వలన విశదమగును.

జీవుడు తన నిత్యపరిపూర్ణతను గ్రహించలేక అనాది అజ్ఞానముచే తాను పరిచ్ఛిన్నుడుగ భ్రాంతినొందుచున్నాడు. కాని వాస్తవమున జీవుడు సర్వదా అపరిచ్ఛిన్న, అఖండ, పరిపూర్ణుడు. ఇదియెట్లు తెలిసికొనవలయుననిన భూమండలముతో నెట్టిసంబంధమునులేక సర్వప్రపంచమునకునూ నొక్కడేయగు సూర్యుడు ప్రతిజీవునకును తానొక్కొక్కడుగ ఆ యా ప్రదేశములయందు పరిమిత మండలాకారముగ ప్రాగ్దిశనుదయించుచు ఏ ప్రదేశమున కాప్రదేశమందు తానొక్కొక్కడుగ నెట్లగుపడుచు పశ్చిమమున అస్తమించుచున్ననూ, సర్వజీవులచేతను ప్రపంచమునంతకును సూర్యుడొక్కడేయని, ఎట్లు గ్రహింపబడుచున్నాడో అట్లే యీ అద్వితీయ అఖండ పరిపూర్ణచైతన్యమే జీవునకు తన పరమార్థస్వరూపముగ నున్న ఒక్క పరమాత్మయే సర్వజీవుల హృదయ పుండరీకములయందునను ప్రకాశరూపుడై ప్రత్యగాత్మస్వరూపమున తెలిసికొనబడుచున్నాడని గ్రహింపవలెను. ఈయనయే బ్రహ్మ. ఈయనయే నేను, "అహం" అను జీవునియొక్క ప్రతీతితో పరమార్థ వాస్తవస్వరూపమైన పరమాత్మగనున్నవాడు. ఈయనయే అద్వితీయఅఖండ పరిపూర్ణుడగు బ్రహ్మ

ఈయనయే "నేను" అను ప్రతీతికి వాస్తవస్వరూపుడు. కావున ముముక్షువు తన వాస్తవస్వరూపమును, నా స్వరూపము యిట్టి అఖండ పరిపూర్ణబ్రహ్మమని గ్రహించవలసియున్నది. ఇందు సందేహమేమున్నది? సూర్యబింబము లెన్నియైనను, అంటటను పరిమితాకార బింబములుగను, అసంఖ్యాకములుగను, కనుబడుచున్నను, ప్రపంచమునంతకునూ సూర్యుడొక్కడే కదా! ఇట్టి జ్ఞానమే యీ నేను "అహం" అను ప్రతి జీవప్రతీతినందున, నిశ్చయించవచ్చును

ఇంకను ఈ లోకభాస్కరుడు అచలుడై తన ప్రకాశమహిమ చేతనే లోకముననుండు సమస్తజీవులకు ఉపకారాపకారములు చేయుచున్నవానివలె నెట్లు తలంపబడుచున్నాడో, యట్లే యీ అద్వితీయఅఖండ నిత్యనిర్వికారమైన బ్రహ్మపదార్థమునందే సర్వజీవులచేతను వారి వారి అనాది అజ్ఞానమువలన యీ నానాపరిచ్ఛిన్నతలు, కర్తృత్వభోక్తృత్వాదులు వివర్తకల్పితములుగ తోపింపబడుచు, గ్రహింపబడుచున్నవేగాని, యీ నానా పరిచ్ఛిన్నత్వకర్తృత్వ భోక్తృత్వాదులు పరమార్థవాస్తవములుగావని ముముక్షువు నిశ్చయముగ గ్రహించవలయును. వాస్తవము నాలోచించిన సూర్యోదయ సూర్యాస్తమయములు జీవకల్పితములేగాని సూర్యునియందు యీ ఉదయాస్తమయములనునవి, ఎంతమాత్రమునులేవు. ఐనను వీనిని మానవులు సూర్యునియందు కల్పించుకొనుచు తమతమ వ్యవహారానుభవ ప్రయోజనములను పొందుచున్నారు. నిజముగ చూచిన సూర్యుడు భ్రమణముచేయుటలేదు. కాని భూమండల భ్రమణముచేతనే ఈ గమనాగమనములు అన్నియును భాస్కరునియందు ఆరోపింపబడుచున్నవి. కాని మరేమియుగాదు. ఇట్లే ఈ జీవులయొక్క అనాది అవిద్యాకామకర్మఫలముల వలన కల్పితమై సంప్రాప్తమైనట్టి యీ పరిచ్ఛిన్నదుఃఖ, జడ, దేహోపాధి ధర్మములను, జీవుడు అవిద్యవలన మాయా వివశుడై తన పరమార్థస్వరూపమైన బ్రహ్మస్వరూపమందే తనపరిచ్ఛిన్న దుఃఖిత్వములను తనయందు ఆపాదించుకొనుచున్నాడు. ఈ విషయమునే వసిష్ఠమునీంద్రులు—

శ్లో॥ అనాద్యంతంజగద్బీజం యత్పరిబ్రహ్మ స్తినిరామయం ।
తదేవకలనాయుక్త మత్ర జీవ ఇతి స్మృతః ॥

అనగా ఆద్యంతరహితంబును, జగత్కారణంబునునగు, నే బ్రహ్మంబుకలదో ఆ బ్రహ్మమే యవిద్యతోగూడి జీవుడని చెప్పబడుచున్నది. ఈ బ్రహ్మమే, అవిద్యోపాధిఖండమునేని యిదియే జీవరూపంబగుచున్నదని స్పష్టముగ తెలుపుచున్నారు. కావున వాస్తవమున జీవునకు ఈ పరిచ్ఛిన్న దుఃఖిత్వ జడత్వ కర్తృత్వాదులతో నెట్టి సంబంధమును ఎంతమాత్రమును పరమార్థముగలేదని నిశ్చయముగ జ్ఞానాభ్యాసకులు గ్రహించవలయును. ఇంకను సూర్యుడు సర్వజీవులకును సర్వప్రదేశముల యందును తానొక్కొక్క పరిమితాకారమండలముగ తెలిసికొనబడుచున్నను లోకమునకంతయును సూర్యుడొక్కడేయని సర్వులచేతను ఎట్లు గ్రహింపబడుచున్నాడో అట్లే తన పరమార్థస్వరూపమైన బ్రహ్మస్వరూపము నానాజీవులయందునను ప్రకాశించుచున్నను దీనికంతయును, ఒక్కటియగు తన నిర్వికార అద్వితీయ అఖండ స్వప్రకాశ పరిపూర్ణ చైతన్యస్వరూపమే అధిష్ఠానముగ నున్నదని తెలిసికొని ముముక్షువు తన అఖండ పరిపూర్ణత్వమును గుర్తించవచ్చును.

ఇంకను ముముక్షువు తన పరమార్థస్వరూపము నిర్మలమహాకాశమువలె నిర్వికార అసంగ సర్వవ్యాపకమని గ్రహించవలయును. ఎట్లన ఈ మహాకాశము సర్వాంతర్బహిర్వ్యాపకమై యున్నను ఆ యా యుపాధులపరిచ్ఛిన్నతనుగాని, వికారములనుగాని ఎంతమాత్రమును పొందదుగదా! అయినను ఈ ఒక్క మహాకాశమే, ఘటాకాశమనియు, మఠాకాశమనియు, జలాకాశమనియు, మేఘాకాశమనియు, వివిధ నామభేదములచే ఆ యా యుపాధులను బట్టి వ్యవహరింపబడుచున్నది కాని నిజమాలోచించిన ఇదియంతయును ఒక్కమహాకాశమే. ఈ మహాకాశము ఉపాధిసంసర్గముగాని, విభాగములనుగాని, వికారములనుగాని, యెంతమాత్రము పొందబడక కేవలనామమాత్రభేదములతో పైవిధముగ వ్యవహరింపబడుచున్నదేగాని, మరేమియూలేదుగదా! ఇట్లే తన పరమార్థస్వరూపమైన బ్రహ్మపదార్థముగూడ నని,

ముముక్షువు నిశ్చయము నొందవలయును. ఈ బ్రహ్మ చిదాకాశస్వరూపుడు. సాదృశ్యమున నిర్మలమహాకాశమువంటివాడు. జ్ఞానాభ్యాసకుడు, స్వశరీర సర్వదృశ్యమంతయును భ్రాంతిమాత్రమేయనియు ఇట్లు తనకు మాయా ప్రభావముచే తన అనాది అవిద్యవలన యీ దృశ్యానుభవములు గలుగుచున్న వనియు కాని పరమార్థ వాస్తవమున, సీ దృశ్యమంతయు లేనిదేయగుచున్న దను నిశ్చయమునొందవలయును.

ఇంకనూ మానవునికి, ఈ తన వ్యవహారానుభవములన్నియు, మందాంధకారములో కనబడు రజ్జువునందు గలుగునట్టి సర్పభ్రాంతివంటివనియు తెలిసికొనవలయును. దీపసహాయముచే రజ్జువును యథార్థముగ త్రాడు అని తెలిసికొనినయెడల సర్పభ్రాంతి యుండదుగదా! ఈ భ్రాంతిపోవుటకు కారణము, తనకు కనబడిన సర్పము యథార్థముకాదని గ్రహించి వ్యవహారాధిష్ఠానమైన రజ్జుస్వరూప వాస్తవికతను అనగా యథార్థమును దీప సాహాయ్యముచే గ్రహించుటయే యగుచున్నది. ఇట్లే ఈ స్వశరీర సర్వదృశ్యమును తన జ్ఞానజ్యోతిసాహాయ్యముచే వాస్తవముకాదని తెలిసికొనవచ్చును. సర్వాధిష్ఠానమైన తన పరమార్థ సత్యస్వరూపమును ఎప్పుడు జీవుడు యథార్థముగ గ్రహింపగలుగునో అప్పుడే యీ స్వశరీర సర్వప్రపంచము అవాస్తవమని జీవునకు తెలియును. జిజ్ఞాసువునకు తనలోనున్న జ్ఞానజ్యోతిని తెలిసికొనుటయెట్లు అను ఈ విషయమును సులభముగ అనుభవరూపమున బోధించుటకుగాను "కింజ్యోతి" అను ఒక్క శ్లోకమువలన శ్రీ శంకర భగవత్పాదులు శిష్యునకిట్లు తెలుపుచున్నారు. ఇది ప్రశ్నోత్తరరూపమున నున్నది.

శ్లో॥ కిం జ్యోతిస్తవ? భానుమా నహని మేరాత్రౌప్రదీపాదికం
స్యా దేవం రవిదీపదర్శనవిధౌ కింజ్యోతి రాఖ్యాహిమే ?
చక్షు, స్తస్యనిమీలనాది సమయే, కిం? ధీ ర్ధియోదర్శనే
కిం? తత్రాహమతో భవాన్ పరమకంజ్యోతి స్తదస్మిప్రభో ॥

అనగా నీకు జ్యోతిస్సు ఏది? పగలు సూర్యుడును, రాత్రులందు దీపాదులును. సూర్యచంద్రులను చూచుటకు ప్రకాశమేది? తెలుపుము. నేత్రములు. నేత్రములు మూసినకాలమున జ్యోతిస్సు ఏది? బుద్ధి. నీ బుద్ధిని చూచుటలో జ్యోతిస్సుఏది? నేనే. "అహం". కావున వీనికన్నిటికిని పరమ జ్యోతిస్స్వరూపుడవు నీవే. (అని తెలుసుకొనుము). స్వామీ నిజము. నేనే పరమ జ్యోతిస్స్వరూపుడనై యున్నాను. (అని శిష్యుడు గ్రహించెను). కావున జీవుడు ఇట్టి తన పరమార్థ స్వరూపమైన జ్ఞానమగు పరంజ్యోతి సహాయమున తానే యీ స్వశరీరసర్వదృశ్యమునకు అధిష్ఠానమని, అద్వితీయమని, అఖండమని, పరిపూర్ణమని, గుర్వీశ్వరానుగ్రహములతో తెలిసికొనినయెడల ఈ స్వశరీర సర్వప్రపంచము భ్రాంతిమాత్రము కాని వాస్తవముకాదను నిశ్చయము కలుగును. కావున జీవునకు తన సత్యాధిష్ఠానజ్ఞానమువలననే యీ జగత్తంత యును మిథ్యయగుచున్నది. అప్పుడు నిర్విశేషమై శేషించునది తన పరమార్థ సత్యాధిష్ఠాన స్వరూపమొక్కటియే గాని తదితరమేదియునూ యుండదు.

ఈ "అహం" జ్యోతియే పరమార్థజ్ఞానము, అద్వితీయము, అఖండము, స్వప్రకాశము అవినాశియై సర్వజీవుల హృదయమందునను జ్యోతిరూపమున ప్రత్యగాత్మగా తెలిసికొనబడునది. కావున జ్ఞానాభ్యాసకుడు తన అభ్యాసకాల మందు ఈద్రష్టృ దృశ్యరూపములుగానున్న జ్ఞాతృజ్ఞేయములను స్వరూప జ్ఞానముతోడ త్యజించి ధ్యానాదుల నభ్యసించునెడల, అప్పుడు గోచరించునది తన అఖండ అద్వితీయ జ్ఞానస్వరూపమొక్కటియే ఇదియే తన పరమార్థ సత్యస్వరూపమని ముముక్షువు గ్రహించి అఖండాకారవృత్తితో ఆత్మాను సంధానమును చేయుచుండవలయును. ఇదియే పరంజ్యోతి, పరమాత్మ. జీవుని యొక్క నిత్యనిరతిశయమైన అఖండ స్వరూపమని గ్రహించి ముముక్షువులు స్వానుభవము నొందుటకు సర్వదా అనుసంధానాద్యభ్యాసాదులను ఆచరించు చుండుట యావశ్యకము.

ఈ స్వశరీర జగత్తంతయు దీర్ఘస్వప్నమువంటిదేగాని మరి వేరేమి యునూగాదు. ఎట్లన, నిద్రచే జీవునకు తన బుద్ధియందే భూమండలాది

సమస్తదృశ్యములు అత్యల్పకాలములోననే సంవత్సర పర్యంతానుభవములు స్వకాలసత్యత్వముతో, తన పరిమిత దేహమందే తన స్వప్నమందు భాసించు చున్నట్లు జాగ్రద్దశయందుగూడ మానవుడు తన అనాది, అజ్ఞానముచే తన ఆత్మయందే, యీ దృశ్యమునంతయు తనకన్న వెలుపలనున్న దానివలె చూచును, తన వ్యవహారకాలమందు స్వశరీర సర్వదృశ్యమును సత్యమైన దానివలె తలంచుచున్నాడు ఇదియే జీవుని అనాది అజ్ఞానము. ఈ అవిద్య వలననే ప్రారబ్ధానుసారమున స్వశరీర దృశ్యాది అనుభవముల నొందుచు కల్పిత సుఖదుఃఖములతో జీవుడు జన్మజరామరణప్రవాహమున సంసార దుఃఖమగ్నుడగుచున్నాడు. ఇంతేకాని జీవుడు తన నిత్యానిత్య వివేకముతో ఈ వ్యవహారానుభవములను, దృశ్యవికారములను బాగుగ విమర్శించిన యెడల యివి యన్నియు కల్పిత మాత్రములని నిశ్చయముగ గ్రహింపగలుగును. ఇంకను యీ స్వశరీర దృశ్యానుభవములన్నియు తనకు పరిమిత కాల నియమానుభవములను మాత్రమే ఇచ్చుచు నశించుచున్నవనిగూడ శాస్త్రీయ విమర్శవలన తనకే స్పష్టమగును ఈ పరిమితకాల భోగములనే వ్యవహార సత్యమని యొక సాంకేతికము పెట్టుకొని, దీనినే సత్యమనియూ పరమార్థ సత్యమనియూ తనకు శాశ్వతమనియూ మానవుడు భ్రమించి, యీ చర్వితచర్వణమైన జన్మపరంపరలో సంసారదుఃఖము నొందుచున్నాడు. ఈ సంసార మహాసముద్రమును దాటి శాశ్వతముక్తి నొందుటకు జీవునకు ఒక్క తత్త్వ జ్ఞానము తప్ప వేరు శరణ్యములేదు.

తత్త్వజ్ఞాన మనగా వస్తువుయొక్క పరమయథార్థ జ్ఞానము. కావున జ్ఞానాభ్యాసకునకు "అహం" నేను అని స్ఫురించుచున్న ప్రతీతికి తన పరమార్థ వాస్తవజ్ఞానమును సంపాదించుటయే వివేకమును తన తరణోపాయమునకు ఆవశ్యకమును అగుచున్నది. ఇందుకుగాను మానవున కిపుడు వ్యవహారము నందు స్ఫురించుచున్న "అహం" "ఇదం" "మమేద"ముల పరమార్థ వాస్తవిక తను గురించి ఇంతవరకునూ విమర్శించియుంటిమి. కాని జీవునికి సంసారము వాస్తవమను భ్రాంతి అనాదిగావచ్చుచుండుటచే ఒకవిధమున నొకమారు

తెలిపినను జీవునియొక్క అనాది ఆవరణ విక్షేపదోషములచే, స్వసిద్ధాంతమందు మనోదార్ఢ్యమును, ప్రీతినిశ్చయములును, కలుగవు. అందుకుగాను "బ్రహ్మ సత్యము, జగన్మిథ్య"యను నీవిషయమునే శ్రుతియుక్తి అనుభవసహితముగ పలువిధముల పలుమారులు విచారణ, నివేచనాదులను చేయుచుండుట యావశ్యకము. ఏలయన ఈ బ్రహ్మజ్ఞానము జీవునకు నిత్య, నిరతిశయ శాశ్వత సుఖము నిచ్చునదియునూ, తనకు పరమశ్రేయోదాయకము గనుకనూ "పథ్యం శతవిధంకృత్వా" అను న్యాయమునుబట్టిగూడ పునఃపునఃవిచారణ మావశ్యకము.

ఈ జగమున ప్రతి జీవియును వారి వారి ప్రారబ్ధకర్మ ఫలానుభవము లకుగాను యీ కల్పితమైన భిన్నభిన్నోపాధులతోడ వారి వారి కర్మఫలాను భవమునకు తగిన పరిస్థితిగల గృహములయందు జన్మముల నొందుదురేగాని వాస్తవము విచారించిన ఒకరితో నొకరికి నెట్టి పరమార్థ సంబంధమునులేదు. వ్యవహారరూపమగు ఈ కుటుంబ సంబంధములన్నియు కల్పితములు. అయినను ఈ కల్పితమైన వ్యవహారసంబంధములనే, వారి వారికి సత్యము, నిత్యమని సమ్మి యొకరితో నొకరు ఎడతెగని అహంకార మమకార రాగద్వేషాది సంబంధములు కల్పించుకొనుచు, యీ నిరంతర సంసారదుఃఖములకు జీవులు లోనగుచున్నారు. ఇట్లే కళత్ర, పుత్ర, మిత్ర, విత్త, క్షేత్ర, వస్తువాహ నాదులయందు కలుగుచున్న తమ తమ కర్తృత్వభోక్తృత్వాదులు తమకు శాశ్వతములని సమ్మి సకల జీవులును చర్వితచర్వణముగ యీ సంసారదుఃఖ ప్రవాహమున మునుగుచున్నారు. జీవులు తమ ప్రారబ్ధకర్మఫలానుభవములకు కల్పితమైన యీ స్థూలశరీర సర్వదృశ్యోపాధులయందు అవిద్యావివశులై వ్యామోహితులగుచుందురు. ఇట్లు జీవులకు కలుగుచున్న "అహం" "మమేదం" అను ఈ జీవాధ్యాసమును తెలుపుటకే శ్రీశంకరభగవత్పాదులు సూత్రభాష్యము నందు ప్రప్రథమముననే "భార్యాపుత్రాదిషు" అను వాక్యము నుదహరించి యుండిరి. ఈ అధ్యాస జీవునకు మహాబలీయము. ముముక్షువులు యీ జీవా ధ్యాసమును తమయొక్క దీర్ఘకాలమననాద్యనుష్ఠానములతో గురుశాస్త్ర

బోధననుసరించి అతిప్రయత్నముచే, నిర్మూలించుకొనవలసి యున్నది. జీవునకు ఈ తన శరీరములే కల్పితములైనప్పుడు, తనకు యీ శరీరాదులను బట్టి కలుగుచున్న పుత్రమిత్రకళత్రక్షేత్రధనధాన్యాదుల సంబంధములెట్లు వాస్తవములు కాగలవు? వాస్తవములుగావు. అయినను సాధారణముగ తన ప్రారబ్ధమునుబట్టి జీవునకు యీ సంబంధ వ్యవహారానుభవములు కలుగు చుండును. జీవునికివ్యవహారమంతయును, మాయబంగారమువంటిది. మాయ బంగార మనగా బంగారము కాదనియేగదా అర్థము. మాయబంగారము బంగారమువలె కనబడుచున్నను వాస్తవమున నది బంగారముగాదని పరీక్షించి యెట్లు తెలిసికొనవలయునో అట్లే ముముక్షువు, స్వశరీర సర్వప్రపంచానుభవ ములను, తన నిత్యానిత్యవివేక జ్ఞానబలముతోడ బాగుగ శ్రుతియుక్తి అనుభవ ములతో వివేచనచేసి తెలిసికొనవలయును. "అహం" నేను అని వ్యవహరించు ఈ జీవునకు, స్వశరీర సర్వదృశ్యమందు ఎంత వెదకిచూచినను "నేను" అను వాస్తవపదార్థమేదియునూ కనబడదు. నేను అనునది వాస్తవమగుటకు వీలులేదు. పరమార్థవాస్తవమున ఈ "అహం" నేను అను ప్రతీతి పరమార్థ మున నిర్వికార అద్వితీయ అఖండస్వప్రకాశ పరిపూర్ణచైతన్య పదార్థమైనను యిదియొక్కటియే సర్వజీవులచేతను 'నేను', 'నేను', అని పరిచ్ఛిన్నభ్రాంతితో, నానాత్వముగ ననుభవింపబడుచున్నది. ఇదియే జీవుని అనాదిఅజ్ఞానము. కావున వాస్తవమున తాను పరిచ్ఛిన్నుడనుగాననియు తనకు ఇప్పుడు గలుగు చున్న సుఖదుఃఖరాగద్వేష కర్తృత్వాభిమాన కర్తృత్వభోక్తృత్వాది ధర్మము లన్నియు తన కల్పిత శరీరోపాధియైన అంతఃకరణధర్మములేగాని తనకు వీనితో ఎట్టి వాస్తవసంబంధమును లేదనియూ, అయినను ఈ యుపాధ్యను భవములు తన ప్రారబ్ధమునునుసరించి సామాన్యముగా తప్పవని తెలిసికొని కేవల తన ప్రారబ్ధక్షయమునకుగాను కర్తృత్వాభిమానరహితముగ తన వ్యవహా రానుభవములను బ్రహ్మాభ్యాసకుడు చేయుచుండవలయునేగాని అట్టి భోగాను భవములందు వ్యామోహితుడై కర్తృత్వాభిమానముల నొందకూడదు. ఏలయన ఇప్పుడు తనకు కలుగుచున్న జీవానుభవములు, తన యుపాధియునుగూడ,

తన అజ్ఞానకాలములో తాను ఆచరించిన కర్మప్రారబ్ధ ఫలానుభవములకుగాను యేర్పడిన కల్పితములు. ఇప్పుడు తనకు కలిగిన యీ జన్మానుభవము విధింప బడిన శిక్షవంటిదని గ్రహించి యీ శరీరోపాధిని తన తరణోపాయసాధన ముగ నుపయోగించుకొనుటయే ముముక్షువునకు వివేకము, పరమశ్రేయో దాయకము, ముక్తిమార్గము, అగునని గ్రహించవలయును.

సర్వముకంటెను బృహత్పదార్థము బ్రహ్మ. ఈ బ్రహ్మ సర్వాంత ర్బహిర్వ్యాపకమైన పరిపూర్ణచైతన్యము. ఇది నిత్యనిరతిశయ సుఖస్వరూపము ఇదియే సర్వాధిష్ఠానము అనగా ఈ ప్రపంచరూపమగు చిత్, జడములు రెండును ఒక్కటియగు అఖండపరిపూర్ణ చైతన్యబ్రహ్మ పదార్థమునందే అజ్ఞానముచే మందాంధకారములో రజ్జువునందు కలుగుచున్న సర్పభ్రాంతిలాగున స్వశరీర సర్వదృశ్యము జీవునకు భాసించుచున్నది. ఇట్లు కనబడుచున్న స్వశరీరసర్వ దృశ్యము అధ్యస్తము, అనగా భ్రాంతి కల్పితము. కాని ఇట్టిదైన యీ ప్రపంచమందే సత్యానృతములు రెండును కలిసి జీవునికి వ్యవహారముకల్పించి సంసారమును కలుగజేయుచున్నవి. సంసారము దుఃఖసాగరమను మాట వివేకులందరికిని తెలిసినవిషయమే. అయినను జీవుడు అనాదిఅవిద్యావివశుడై తన అజ్ఞానముచే దృశ్యము, వాస్తవమను భ్రాంతికి లోనగుచున్నాడు. ఇదియే సంసారము, దీనినుండి జీవుడు విముక్తుడగుటకు ఒక్క బ్రహ్మజ్ఞానము వలనగాని వేరుమార్గములేదు. బ్రహ్మజ్ఞానమనగా "నేను ఈ పరిచ్ఛిన్న శరీరోపాధినిగాను, నా వాస్తవస్వరూపము త్రివిధ భేదరహితమై, దేశకాల వస్తు పరిచ్ఛేదరహితమై, త్రికాలాబాధితమైన స్వప్రకాశనిర్వికార పరిపూర్ణ అఖండచైతన్యము. అదియేనేను" యని జీవుడుగుర్తించి స్వానుభవము పొందుట. ఇది సంభవమా? యని సంశయింపతగదు. ఏలయన ఆకాశమందు శబ్దతరంగములు సర్వత్ర వ్యాపించియున్నవని శాస్త్రజ్ఞులుతెలిసికొని ఇప్పుడు ఆ యా శబ్దతరంగములను, రేడియోద్వారా అనగా శబ్దగ్రహణయంత్రముల ద్వారా ఆకర్షించి మానవులు ఆ యా గానరూపశబ్దముల అనుభవము పొందు చున్న విషయము లోకవిదితమే. ఇట్లే సర్వదృశ్యమును వాయ్వాకాశముల

కాగున చిజ్జడములు (చిత్ + జడము) రెండునుచేరి యున్నవి. అందు
జడాంశమును జ్ఞానపూర్వకముగ, బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు నిరసించి అనగా
త్యజించి తన సత్యస్వరూపమైన చిద్ఘనానందస్వరూపమును సత్యజ్ఞానానంత
లక్షణములతో తానుగనే గ్రహింప సాధ్యమని ముముక్షువులగువారు తెలిసికొన
ఒప్పును.

ఈ విధముగ తన సత్యస్వరూపమునుగుర్తించిన ముముక్షువు తాను
"చిత్" ప్రతిబింబుడను గాననియు, తాను కేవల చిద్బింబుడను, అనగా చిత్
స్వరూపమే యనియు అనగా కేవలజ్ఞానస్వరూపుడననియు తాను సాక్షిమాత్రుడ
ననియు వాస్తవముగ అవ్యవహారిననియు, తానే ప్రత్యగాత్మయనియు, పర
మాత్మయనియు నిశ్చయమునొందవలయును. జీవునకు కలుగుచున్న యీ
సంసారానుభవములన్నియు చిత్ + ప్రతిబింబుడు అనగా చిదాభాసునివేగాని,
కేవల "చిత్" బింబుడనై ప్రత్యగాత్మనగు నావికావు. ఈ "చిత్" ప్రతిబింబుడే
అజ్ఞానుడు, వ్యవహారి, సంసారి, ఉభయాత్మకుడు, పరిచ్ఛిన్నుడు. ఈ చిదా
భాసుడే కర్తృత్వాద్యభిమానియై, రాగద్వేషములతో సుఖదుఃఖ సంసారానుభవ
ములనొందుచున్నాడు. కేవల "చిత్" స్వరూపుడనైననాకు వీనితోనెట్టి వాస్తవ
సంబంధములేదు. నేను స్వప్రకాశపరిపూర్ణుడనై ప్రత్యగాత్మగ, సర్వజీవుల
హృదయములయందుననుజ్ఞానస్వరూపుడనై తెలియబడుచున్నవాడను నేనే. కాని
యిట్టి నేనే అనాదిమాయాప్రభావముచే యీ స్వశరీర సర్వోపాధులయందునను
కలుగుచున్న "చిత్" ప్రతిబింబవికార లక్షణములన్నియు నా ధర్మములుగా
అధ్యాసమునొందుచున్నవానివలె నా జీవానుభవములనుబట్టి కనబడుచున్నది.
కాని వాస్తవమున నాకీ వ్యత్యాసముతోనెట్టి సంబంధమును లేదు అని జ్ఞానాభ్యాస
కుడు నిశ్చయమునొంది, మననాదులచేయుచుండవలయును. జీవునియొక్క
పంచభూతవివేకముచే ఈ సాంసారిక అనుభవవికారములన్నియూ ఉపాధి
అభిమానియైన "చిత్" ప్రతిబింబుడగు ఆభాసునివేగాని తనకు వీనితోనెట్టి
వాస్తవసంబంధములేదని ముముక్షువు గ్రహించి, తన వాస్తవస్వరూపమైన
ప్రత్యగాత్మస్వరూపమును తెలిసికొనవలయును. ఎట్టిన ప్రత్యగాత్మ పరమాత్మ

లొక్కటియే యనియూ ఇదియే "అహం" "ఇదం" సర్వాధిష్ఠానమనియూ తన వాస్తవస్వరూపమనియూ, నిదియే నిత్య నిర్వికార అఖండపరిపూర్ణ చైతన్యమనియు జ్ఞానాభ్యాసకుడు గ్రహించి యిట్టి తన స్వస్వరూపమందు ప్రీతి నిశ్చయములను సంపాదించి తన సాధనాభ్యాసములను ఫలపర్యంతము విసుగుచెందక యాచరించుచుండుటయే ముముక్షువుయొక్క పరమకర్తవ్యము.

ఈ ప్రపంచము సత్యముకాదని శ్రుతిప్రమాణ యుక్తులవలన నెంత గ్రహించినను జీవునకు ప్రపంచమిథ్యాత్వ నిశ్చయముగలుగుట కడుదుర్లభము. ఏలయన దీనికి జీవునియొక్క అనాది అవిద్యావాసనా సంస్కారములే కారణము. ఇట్టి వాసనా సంస్కారములను నిర్మూలించుటకు ముముక్షువు సదా తన యనుభవమునుగూడ శ్రుతిప్రమాణముతో వివేచనచేసికొని స్వశరీరజగదసత్యత్వమును నిశ్చయించుకొను చుండవలయును. ఎంత సూక్ష్మబుద్ధితో విచారించినను ఈ ప్రపంచమున నిర్వికారముగ నుండు పదార్థము యేదియునులేదు. సమస్త దృశ్యము షడ్భావవికారములను బొందునదేగాని వికారరహితముగ నుండునది యేదియునులేదు ఈ ప్రపంచము సర్వదా మారుచునే యుండును. ఇది దీనికి స్వభావము. కాని యిట్టి మార్పులను జీవుడు తన అనాది అజ్ఞానముచే కనుగొనలేక ప్రవాహరూపమున సర్వదామారుచున్న యీ దృశ్యమునే నిత్యమని తలంచుచున్నాడు. ఇది ప్రవాహనిత్యమేగాని వాస్తవనిత్యముగాదు. ఎట్లన నది వాస్తవమైనను నదిలోని జలము అనుక్షణమును సర్వదా మారుచునే యుండునుగదా! అయినను ఆ నీటి ప్రవాహమునే నిత్యమైన నదియని మానవులు వ్యవహరించుచున్నారుగదా! జగన్నిత్యత్వముగూడ ఇట్టిదియే. అనగా ఈ ప్రపంచము సర్వదా ప్రవాహ నిత్యత్వము గలదియగుచు నదిలోని జలమువలె దృశ్యమంతయూ సర్వదామారుచుండును. ప్రవాహ నిత్యత్వమనగా వాస్తవముగ నిత్యముగానిది, యని అర్థము ఈ ప్రవాహ నిత్యత్వమనునది మాయబంగారమువంటిది. మాయబంగారము సత్యసువర్ణ మెప్పటికైనను అగునా? కాజాలదు ఇట్టిదియే యీ స్వశరీరసర్వదృశ్య మంతయు ననియూ, తమకు ఇందు ఏదియునూ నిత్యముగాదనియూ ముముక్షువులు

గట్టిగ తెలిసికొనవలయును. ఈ ప్రపంచమున మానవులందరికిని వారి స్వశరీర దృశ్యానుభవములన్నియు వాస్తవమైనవానివలెనే అనుభూతమగును, కాని ఇట్టి వన్నియూ జీవునకు అల్పసుఖమును మాత్రమే యిచ్చుచు, అధికదుఃఖక్లేశాదుల కలిగించుచున్నవి. ఈ స్వశరీరదృశ్య అవాస్తవికతలను గ్రహించుట కడు దుర్లభము. కాని శాస్త్రప్రమాణమందు దృఢవిశ్వాసమును కలిగించుకొని, సంస్కృతబుద్ధితో అనుభవపదార్థ సూక్ష్మవిచారమును జేసినయెడల, ఈ స్వశరీర జగత్తంతయు మిథ్యా మాత్రమని స్పష్టమగును. ఈ అర్థమునే "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని శ్రుతియు,

శ్లో॥ మాయామాత్ర మిదం ద్వైతం అద్వైతం పరమార్థతః ।
దీర్ఘస్వప్న మిదం విద్ధి విశ్వం బ్రహ్మణి కల్పితమ్ ॥

అను స్మృతివచనములు బోధించుచున్నవి. కావున బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు గురువిశ్వాసానుగ్రహముతోడను, అద్వైతశాస్త్రజ్ఞాన బలముతోడను, తన లోకానుభవములయందు, తన లోకదృష్టిని సశాస్త్రీయముగ సవరణచేసికొనుచుండుట యావశ్యకము. ఇందుకుగాను ఇంతవరకు ఈ "అహం" "ఇదం" ల గురించి వివిధముగ శాస్త్రానుభవవివేచనలను చేసియుంటిమి. వాని నన్నిటిని బాగుగ విమర్శించి బుద్ధియందుంచుకొని యింకను బ్రహ్మజ్ఞానాభ్యాసి తన శరీర లోకానుభవములన్నియు దీర్ఘస్వప్నమువంటివని తెలిసికొనవలయును. నిద్రాదోషమువలన తనకు స్వప్నదృశ్యము ప్రాప్తమై స్వకాల సత్యత్వముతో నెట్లు సుఖములనిచ్చుచు, తన నిద్రావస్థ, జాగ్రదవస్థకు మారగనే, ఎట్లు లేనివియే యగుచున్నవో, అట్లే జీవునకు తన అనాదిఅజ్ఞానముచేత జాగ్రదవస్థయందుగూడ కనబడుచుండే యీ స్వశరీర సర్వ దృశ్యమంతయు కనబడుచు, తన జాగ్రదవస్థయందు మాత్రము స్వకాలసత్యత్వముతో వ్యవహారానుభవముల నిచ్చుచున్నవిగాని యీ జాగ్రదవస్థ స్థితి తక్కిన యే యవస్థలకు మారినను ఈ తన జాగ్రదవస్థయొక్క అనుభవములుకూడ కనబడుట లేమి తమ తమ జాగ్రదనుభవపదార్థములను ఎవరును తమ స్వప్నసుషుప్తి దశలయందుచూచుటలేదుగదా అట్లే తమ స్వప్నపదార్థములను తమ సుషుప్తి

యందుగాని జాగ్రద్దశయందుగాని చూచుట అనుభవించుట లేదు. ఇది అందర
కును అనుభవములోనున్నదే. స్వప్నజాగ్రత్స్థితులు రెండును ఆ యా అవస్థల
యందు మాత్రమే సుఖదుఃఖానుభవముల నిచ్చుచున్నవిగాని ఆ యవస్థాంత
రములందు అదే అనుభవము నియ్య సమర్థములగుటలేదు. ప్రతి జీవునకును,
తాను సాధారణముగ ననుభవించుచున్న వ్యవహార వస్థలు జాగ్రత్స్వప్న
సుషుప్తులు మూడేయైనను. ఈ అవస్థాత్రయాతీతమైన తురీయమను
నాలుగవస్థితి యొకటియున్నది. ఇదియే జీవునకు మోక్షస్థితి. ఈ తురీయస్థితి
యనునది జీవునియొక్క పారమార్థికస్వరూపస్థితి. జీవుని ప్రయత్న మవసరము
లేకయే ప్రతిదినమునను జాగ్రదవస్థనుండి స్వప్నసుషుప్తులు కలుగుచు, ఈ
జాగ్రదవస్థానుభవములు కనబడకపోవుచున్నట్లు, వివేకియైన జీవుడు తన
శాస్త్రీయజ్ఞాన ప్రయత్నములతో నాలుగవదియైన తన పరమార్థ సత్యస్వరూప
మగు తురీయస్థితిని సంపాదించినచో తాను సంసారబంధమునుండి శాశ్వత
ముగ విముక్తుడగును. కావున వివేకియగు జీవుడు తన జాగ్రదవస్థలోనే,
సర్వదా తనముక్తి ప్రయత్నమును, గుర్వీశ్వరానుగ్రహములతో శ్రవణమనన
నిదిధ్యాసనాభ్యాసములు చేయుచుండినయెడల తన జాగ్రదవస్థనుండి స్వప్న
సుషుప్తులు కలుగుచున్నట్లు తన జాగ్రదవస్థనుండి తురీయస్థితి ననుభవింప
గలుగుచుండును. అప్పుడు తన సుషుప్తియందుండు జీవునకు స్వప్నజాగ్రద
నుభవములెట్లు గోచరములుకావో అట్లే యీ బ్రహ్మజ్ఞానాభ్యాసపరునకు తన
జాగ్రదవస్థానుభవములయొక్క సుఖదుఃఖానుభవములు తెలియక తనజాగ్రత్
స్థితినిగూడ స్వప్న సుషుప్త్యనుభవతుల్యములుగ ననుభవింప గలుగును.
అప్పుడు ఈ దృశ్యమంతయు జ్ఞానమందు లయించి తన జాగ్రత్స్థితిగూడ
దీర్ఘస్వప్నమువంటి దగుచుండును. బ్రహ్మజ్ఞానాభ్యాసమునకు ఇట్టి తన ప్రయత్న
ముతో పైవాక్యముల అర్థమును బాగుగ తెలిసికొని అనుభవమును పొందినయెడల
అట్టి మహనీయుడు తన జాగ్రత్స్వప్నానుభవములను ఒక్కటిగా గ్రహింప
గలుగును. అట్టితరి వారికి జాగ్రదనుభవము లన్నియును, కలగాంచినవానికి
తన స్వప్నములో రాజ్యము పరిపాలించితినను సంతోషముగాని భిక్షమెత్తితి

నను దుఃఖముగాని తనజాగ్రదవస్థయం దెట్లుంటవో ఆ విధమునసే ముముక్షువు ప్రారబ్ధానుసారమున తన జాగ్రదనుభవము లెట్టివియైనను పామరునివలె తను హర్షక్లేశములనొందక, తన ప్రారబ్ధానుసారవ్యవహారము తన సత్యస్వరూప స్థితికి బాధ లేదను నిశ్చయముతో స్వస్వరూపసుఖానందమును పొందు చుండును.

బ్రహ్మ జిజ్ఞాసువు లనువారునూ, సర్వజీవులును గూడ యీ ప్రపంచ మున, ఏదోయొకవిధముగ సుఖమును పొందుచునే యున్నారుగదా ! ఇది యంతయు అవాస్తవము మిథ్యయను జ్ఞానముతోడ, మనకు ఇప్పుడులేనిది, కనబడకుండనుండునట్టి సుఖమనుదానికిగాను మనము ప్రయత్నించి శ్రమ పడుట యావశ్యకమా యను సంశయము ఎవరికైనను ఏదోయొక సమయ మున కలుగవచ్చును. కాని శ్రుతివాక్య ప్రమాణమునననుసరించియును మన లోకానుభవమునుబట్టి చూచినను గూడ వివేకులగువారికి ఈ శంకకు అవకాశము ఎంతమాత్రము కనబడదు ఏలయన వాస్తవస్వరూప సుఖము బ్రహ్మస్వరూ పము జగదధిష్ఠానము. ఈ జగత్తు అంతయూ బ్రహ్మమందు అధ్యస్తమై రజ్జువునందు కలుగుచున్న సర్పభ్రాంతిలాగున కల్పితమై యున్నది. ఈ విషయ మును లోగడనే వివేచనచేసి నిశ్చయించి యుంటిమి. కల్పితవస్తువు లన్నియు ఎప్పటికైనను అసత్యములేగదా కావలయును ! వివర్తదృశ్యానుభవము లెప్పటి కిని వాస్తవము శాశ్వతము అగుటకు వీలులేదు. కావున అవియన్నియు మిథ్యాస్వరూపములే కావలయును. మిథ్యయనగా ఒక వస్తువునందు ఆవస్తు స్వరూపముగానిది మరియొకవస్తువు అని భ్రమించుట. ఇందులకు కావలసిన ప్రమాణవాక్యములుగూడ లోగడనే యుదహరింపబడి విమర్శింపబడి "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" యను ప్రామాణ్యము నిశ్చయింపబడినది. కావున మిథ్యాజ్ఞానమువలన కలుగుచున్న సమస్తసుఖానుభవములు కల్పిత ములు, అవాస్తవములు, అనిత్యములు. కాక శాశ్వతసుఖ స్వరూపమెట్లగును? కాజాలవు. ఈ ప్రపంచానుభవములవలన కలుగు సుఖమంతయు కల్పితమైన సుఖాభాసము. ఇవియన్నియు సుఖఛాయాస్వరూపములుగాని, సుఖ

స్వరూపముకాదు. అయినను జీవుని అనాదిఅజ్ఞానముచే ఈ ఛాయాసుఖము లనే వాస్తవ మని నమ్మి వాస్తవ సుఖస్వరూపమును పొందలేకున్నాడు. ఈ ఛాయా సుఖములనునవియే, విషయసుఖములు. లోకవ్యవహారమునందు కూడ వాస్తవవిషయము లభ్యముకానప్పుడు ఆ విషయవస్తు విగ్రహాముల యొక్క ఛాయాపటములతోడనేగదా భక్తులు వారి ఆరాధనాసుఖమును, కాముకులు వారి కామసుఖమును అల్పముగా పొందుచు వానితోడనే తృప్తి నొందుచుందురు. కాని భక్తులు వారి దేవతాసాక్షాత్కారములవలనను, కాము కులకు వారి విషయవస్తువిగ్రహ సాక్షాత్కారములవలననేగదా పూర్తిసుఖము నొందగలుగుచున్నారు. ఇంకను జనసామాన్యమంతయుగూడ కల్పితశబ్ద చలనచిత్రముల నుండియును, కృత్రిమ సువర్ణాద్యాభరణములనుండియేగదా, వారి స్వల్పానందమును పొందుచు తృప్తి నొందుచున్నారు. కావున ఈ కల్పిత విషయ సుఖానందములు కృత్రిమములు, అల్పములగుచు ఆ యా యథార్థవస్తు విషయ లాభములవలన కలుగు సంపూర్ణానందము నివ్వజాలవు. ఎట్టివారికైనను ప్రదర్శనములలోచూచిన దృశ్యానుభవములకన్న ఆ యా దేశములలో నివా సానుభవములవల్లగాని లేక కల్పిత సువర్ణాభరణములకన్న, వాస్తవసువర్ణా భరణముల యనుభవములయందుగాని ఎక్కువ సుఖము కలుగుచున్నదనుమాట అందరి యనుభవములో నున్నదే కావున వాస్తవ పదార్థానుభవమునందుండు సుఖము కల్పిత పదార్థానుభవములవలన కలుగదు అనుమాట నిశ్చయమగు చున్నది. కల్పితమగు ఈ దృశ్యవ్యవహారానుభవములయందే, వ్యవహార వాస్తవపదార్థానుభవములకును, వ్యవహారకల్పితములైనవగునట్టి, ఛాయాను భవములకును, యిట్టి అల్పత్వము అనిత్యత్వము కనబడుచుండగ పరమార్థ వాస్తవమును సర్వదృశ్యాధిష్ఠానమై, సుఖస్వరూపమగు పరబ్రహ్మమందు కల్పింపబడిన యీ ప్రపంచానుభవసుఖ మంతయు కల్పితమాత్రమైన అనిత్యము ఛాయాసుఖము, గాక జీవునకు నిత్యస్వరూపసుఖ మెట్లు కాగలదు? ప్రతి మానవుడును సర్వదా కోరునది నిత్యసుఖమే కాని అనిత్యసుఖమును ఎవరును కోరరు. కోరినను యిట్టి నిత్యస్వరూపసుఖమును తెలియకయు, తెలిసినను

జీవుఁడనాది అవిద్యాంధుఁడై లోకవాసనలను విడువజాలకయు, అనిత్యములగు విషయములయొక్క ఛాయామాత్ర సుఖములతోడనే తృప్తినొందుచు సుఖస్యానంతరము దుఃఖమును దుఃఖస్యానంతరము సుఖాభాసములననుభవించుచు వీనియందు సత్యత్వబుద్ధిచే రాగద్వేషాది సక్తతాభిమానముల నొందుచు సంసారావృతుఁడగుచున్నాఁడు. కాని జీవుఁడు ఒక్కమారు సద్గురీశ్వరానుగ్రహములతోడ తన శాస్త్రీయవివేకవిచారణాభ్యాసాదులవలన వాస్తవమున సుఖస్వరూపము తన పరమార్థస్వరూపమే ననియు, తాను ఈ సుఖముకొరకు విషయముల నాశ్రయింప బనిలేదు, కాని తన ప్రారబ్ధఫలమునుబట్టి అవియే వచ్చుచుండును అనియు, తెలిసికొని అభ్యసించుచు స్వానుభవమునొందు మహనీయులకు ఈ దృశ్యవిషయానుభవములవలన కలుగుచున్న అనిత్యచ్ఛాయా సుఖానుభవములతో పనియుండదు. దానిని కోరరు. అట్టి మహనీయులు యథాప్రాప్తముగ ప్రారబ్ధభోగానుభవములను, నిర్లిప్తతో చేయుచుందురుగాని విషయసుఖాభాసములందు సక్తులుకారు. ఈ నిత్యనిరతిశయ అఖండస్వరూపసుఖమే తాను అనగా నేను, అని స్వానుభవమున తెలిసికొనుటయే జీవునకు నిత్యనిరతిశయ సుఖప్రాప్తినిచ్చు పరమముక్తి యగుచున్నది. కావున ముముక్షువు తానుకోరునట్టి యీ నిత్యసుఖము, తన పరమార్థస్వరూపమేగాని వేరుకాదను నిశ్చయమునొంది తన అనుసంధానాద్యభ్యాసములను చేయుచుండవలయును. ఒక్క బ్రహ్మస్వరూప సుఖముతప్ప జీవునకు తదితర సుఖములన్నియు అనిత్యములును, పర్యవసానమున దుఃఖదాయకములే యగును. కాన మానవుఁడు తనకు నిత్యనిరతిశయమగు వాస్తవసుఖమును ఒక్క బ్రహ్మజ్ఞానమువలననే గాని దృశ్యవిషయానుభవములవలన పొందశక్యము కాదని గ్రహింపవలయును. ఇది నిశ్చయము. సారాంశ మేమనిన జీవునకు బ్రహ్మజ్ఞానసుఖమే నిత్యము, నిరతిశయముకాని తక్కినవికావు. విషయజ్ఞానానుభవములు, అనిత్యములు. పర్యవసానమున జీవునకు దుఃఖకరములై, సంసారబంధహేతువులును అగుచున్నవని నిశ్చయముగ జిజ్ఞాసువులు గ్రహించవలయును. ప్రతిమానవుఁడును కోరునది తన దుఃఖనివృత్తి, ఆనందావాప్తి. అనగా సుఖానుభవము.

జీవులందరును సర్వదా దీనికొరకే ప్రయత్నముచేయుచు అనాదిఅజ్ఞానముతోడ విషయపరంపరనుకోరుచుందురు. కాని ఎంత ప్రయత్నముచేసినను యీ విషయభోగములవలన కలుగు దుఃఖనివృత్తి సుఖానుభవములు, రెండును అనిత్యములై తాత్కాలికానుభవములను మాత్రము నిచ్చుచు, జీవుని సంసారలంపటునిజేయుచు, ఆభాససుఖమునే యిచ్చుచు జీవుని సంసారదుఃఖసాగరమున నిమగ్నుని గావించుచుండును. ఈ సంసారదుఃఖనివృత్తికిగాను, జీవుడు సర్వదా భిన్నభిన్న విషయసుఖములను తన సుఖముకొరకు కోరుచుండును. ఇట్లు కోరబడుచున్నట్టి ఈ విషయసుఖములన్నియు ఆభాసమాత్రములై తాత్కాలికములగుటచే, మానవునకు కోరికలను వృద్ధి చేయుచుండును. సామాన్యుడు యీ విషయవాంఛాప్రవాహమునుండి తప్పించుకొనజాలక, తన కోరికలవలన మానవుడు దుఃఖము ననుభవించుచుండును మానవునకు తన వాంఛాసిద్ధులు కలుగగనే అట్టివి అల్పకాల, అల్పసుఖమును మాత్రము నిచ్చునవగుచు నశించును. తిరిగి కోరిక ప్రారంభమగును. ఇది చర్వితచర్వణముగ జీవునికి తన పరమార్థ స్వస్వరూపానుజ్ఞానము కలుగనపరకునూ, నడుచుచునే యుండును. కావున ఈ విషయవాంఛలే మానవదుఃఖమునకు ముఖ్యకారణ మగుచున్నవి. అయినను విషయభోగములన్నియు పూర్తిగ ననుభవించిన మానవులకు ఆ విషయభోగాసక్తి తగ్గి విషయవైరాగ్యము జనించు ననుతలంపు కొందరు వివేకులనుగూడ బాధించుచుండును కాని యిది నిజముకాదని...

శ్లో॥ న జాతుకామః కామానాం ఉపభోగేన శామ్యతి ।
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే ॥

అను విద్యారణ్యవచనము తెలుపుచున్నది. అనగా విషయభోగములవలన కోరికలు క్షీణించకపోగా, హోమాగ్ని యందువేసిన ఆజ్యములాగున కామములను వృద్ధియే చేయుచుండును కోరికలను తగ్గించుకొనుట ప్రాజ్ఞతగాని వృద్ధి చేసికొనుట దుఃఖహేతువు, అప్రాజ్ఞత.

కావున మానవులకు ఈ కామపరంపరల వలన కలుగుచున్న దుఃఖము నశింపజేయవలెనన్న కోరికలను తన నిత్యానిత్యవివేక శాస్త్రజ్ఞానముతోడ నశింప జేసికొని నిష్కాముడు కావలయును. ఇట్లు నిష్కామము నగుట యనునది జీవునకు ఒక్క తన ఆత్మజ్ఞానమువలననేగాని కలుగదు కాన వివేకులగు జిజ్ఞాసువులకు వారియొక్క నిత్యసుఖమునకుగాను ఆత్మజ్ఞానార్జన మావశ్యకము ఈ ఆత్మజ్ఞాన మనునది గుర్వీశ్వరానుగ్రహములతో గూడిన శాస్త్రజ్ఞానమువలన "అహం" నేను, ఆ నిత్యనిరతిశయ సుఖస్వరూపుడగు బ్రహ్మను అని తెలిసి కొనుటయే. ఇట్టిది పరోక్షజ్ఞానము ఇదిగూడ వారివారి సుకృతపుణ్యఫలము వలనగాని కలుగదు. అనగా ఈ పరోక్షబ్రహ్మజ్ఞానమనునది జీవుని అనేక జన్మములయొక్క సుకృతఫలము వలన శాస్త్రశ్రవణముద్వారా కలుగును. జీవునకు గుర్వీశ్వరానుగ్రహమును, పురాకృతపుణ్యఫలమును లేనిచో, శాస్త్ర శ్రవణముచేసినను శబ్దార్థములతో వాద ప్రతివాదముల జ్ఞానము కలుగునుగాని, అద్వైతసిద్ధాంతమందు ప్రీతి నిశ్చయములు కలుగవు. ఇట్లు అద్వైత సిద్ధాంత మందు ప్రీతినిశ్చయములతో కలుగునట్టి జ్ఞానమే పరోక్షజ్ఞాన మగును. తదితర జ్ఞానము శాస్త్రపరన జ్ఞానమే యగును గాని పరోక్షజ్ఞానముగూడకాజాలదు. ఏలయన ప్రీతినిశ్చయములతో కలుగు అద్వైతసిద్ధాంత జ్ఞానముగాని అపరోక్ష బ్రహ్మజ్ఞానసాధన మగుటకు అవకాశముండదు. ఎందుకనిన ఈ అద్వైత సిద్ధాంతము జీవునియొక్క తత్త్వశాస్త్రమై, స్వానుభవశాస్త్రముగ గూడ నగుచున్నది. ఈ సిద్ధాంతమును ప్రీతినిశ్చయరహితముగ గ్రహించిన యెడల అట్టి జ్ఞానము, స్వానుభవమగు అపరోక్షజ్ఞానమునకు సాధనము కాజాలదు. కావున బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు యీ బ్రహ్మవిద్యాసాంప్రదాయ సిద్ధాంతము లను సంశయరహితుడై, ప్రీతినిశ్చయములతో శాస్త్రీయముగ గ్రహించి, శాస్త్రశ్రవణానంతరము మననని దిధ్యాసనాదులను విసుగుజెందక యుత్సా హముతోడ తన ప్రారబ్ధాంతమువరకు నభ్యసించుచు యీ పరోక్షజ్ఞానమును అపరోక్షముగావించుకొని స్వానుభవమునొందవలయునే గాని వేరుమార్గము లేదు. ఇట్లు పరోక్షజ్ఞానమును అపరోక్షముగ జేసికొని, ఆత్మయే తాము అని

తెలిసికొనిన మహనీయులు, వారి సర్వకామములునూ, నివృత్తములై నిష్కాములగుదురని—

శ్లో॥ "ఆత్మానం చేద్విజానీయా దయమస్మీతి పూరుషః ।
కిమిచ్ఛన్ కస్య కామాయ శరీరమను సంజ్వరేత్" ॥

అను శ్రుతివాక్యము స్పష్టము చేయుచున్నది. కావున బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు సర్వదా తన జగన్మిథ్యాత్వజ్ఞానముచేతను, శాస్త్రీయ మననదిధ్యాసనాభ్యాసములచేతను, తనకు కలుగుచున్న విషయవాంఛలను క్రమక్రమముగ నిర్మూలించ యత్నించుచుండిన కాలక్రమమున తాను సర్వవిషయ నిష్కాముడగుట వలన నిర్విశేషముగ శేషించిన బ్రహ్మసుఖస్వరూపము తన కాత్మాఽభిన్నముగ ప్రకాశించుచు, అట్టి నిత్యనిరతిశయ సుఖానుభవమును తాను పొందగలుగు చుండును.

ఐనను యిట్టి మహనీయులుగూడ దేహతాదాత్మ్యాధ్యాసమువలన కలుగు సుఖదుఃఖానుభవములను, హర్షక్లేశములను, పొందుచునేయుందురు. కాని వీరు అజ్ఞులవలెగాక. క్షీణించిన సక్తతాభిమాన రాగద్వేషములతో, వారి తాత్కాలికానుభవములను పొందుచుందురు జ్ఞానికిని అజ్ఞానికిని ప్రారబ్ధఫలభోగములు సమానముగనే యుండును కాని ప్రారబ్ధఫలభోగములయొక్క సుఖదుఃఖానుభవములలోమాత్రమే భేదముండును. జ్ఞానాభ్యాసకుడు తన జ్ఞానబలముచే ప్రారబ్ధమును అల్పసక్తతాభిమానములతోడనూ, క్షీణించిన సుఖదుఃఖానుభవములతోడనూ భోగమునొందుచుండును. ఇట్టి భోగానుభవములు జ్ఞానాభ్యాసకునకు భావిసంసారబంధహేతువులు కాజాలవు అజ్ఞాని తన ప్రారబ్ధఫలభోగములను పామరత్వముగలిగి అధికసక్తతాభిమానములతో చేయుచుండును గావున అట్టి ప్రారబ్ధభోగానుభవములు భావిసంసార ప్రతిబంధమునకు కారణమగుచుండును బ్రహ్మజ్ఞానాభ్యాసకునకు తన ప్రారబ్ధఫలమును క్షయింపజేసికొనుట తప్ప అట్టి అనుభవములందు ఇతర సంకల్పమేమియు నుండదు. కాలక్రమమున నిదియే ముక్తిసాధనమగును.

జ్ఞానాభ్యాసకునకు ముఖ్యప్రతిబంధములు అహంకారమమకారములు. ఈ యహంకార మమకారములు జగన్మిథ్యాత్వజ్ఞాననిరూఢివలనగాని క్షీణించవు. ఇందునగాను జ్ఞానాభ్యాసకునకు తన స్వానుభవములను, లోకవ్యవహారములను, తన నిత్యానిత్యవివేకములో ఈ జగదనుభవములయొక్క సత్యాసత్యములను, నిత్యానిత్యములను, బాగుగ పరిశీలించి సర్వదా వివేచనచేసికొనుచుండుట యావశ్యకము. ఇట్టి శాస్త్రీయానుభవ విచారణావిమర్శలవలన కాలక్రమమున స్వశరీరమందునను, దృశ్యానుభవములయందునను గూడ, యిట్టివన్నియూ తనకు వాస్తవమను నిశ్చయబుద్ధి క్రమముగ క్షీణించుచు దృశ్యానుభవములందు సక్తతాభిమానములు, రాగద్వేషాదులు తగ్గుచుండును. అప్పుడు తన సత్యస్వరూపానుసంధానాభ్యాసాదులను సౌలభ్యముతోడను, చిత్తస్థైర్యముతోడను ఆచరింపగలుగుచుండును దీనివలన కాలక్రమమున జ్ఞానాభివృద్ధి యగుచుండును ఇందువలననే "విచారాజ్జాయతే బోధః" అని శ్రీ శంకర భగవత్పాదులవచనము తెలుపుచున్నది. ఇట్టి విచారమెట్లుండవలయుననిన శాస్త్రము జీవునకు

శ్లో॥ అహం సర్వమిదం విశ్వం పరమాత్మాహ మచ్యుతః ।
అహంకారాభిధా యా సా కల్ప్యతే నతు వాస్తవీ ॥

అని జీవునకు వాస్తవమున నేను అను అహం నిత్యమనియు, అహమేవ పరమాత్మునదనియు, అహమే యీ సర్వప్రపంచమనియు తెలుపుచున్నది. కాని అహంకారము నేను. అను పరిచ్ఛిన్న ప్రతీతిచే తెలిసికొనబడు అహంకారము, కల్పితము అవాస్తవమనియు శాస్త్రము తెలుపుచున్నది. కావున ఈ "అహం" "అహంకార" మను పదార్థములెవ్వి? యని విచారించి విమర్శపూర్వకముగా తెలిసికొనుట ఆవశ్యకము ఈ "అహం" "అహంకారము"లు రెండును కలిసియే ప్రతిజీవునకును 'నేను' అను ప్రతీతిని కలుగజేయుచున్నవి. ఇందు "అహం" అను కేవల శుద్ధపదార్థము గ్రాహ్యము ఇది సుఖస్వరూపము వాస్తవము. "అహంకార" మనునది త్యజింపవలసినట్టిది, అవాస్తవము.

అహంకారమనగా తన పరిచ్ఛిన్నశరీరోపాధియే తానని భ్రమించుచు, రాగ ద్వేషపూరితుడై సక్తతాభిమానములు గలిగియుండుట. జీవునకు వాస్తవమున "అహం" పదార్థము సర్వవ్యాపకము, అపరిచ్ఛిన్నము, పరిపూర్ణము. ముముక్షు ప్రతను గ్రాహ్యము. "అహంకారము" అను నః పరిచ్ఛిన్నదేహప్రతీతులు, పరిచ్ఛిన్నములు. అవాస్తవములు దుఃఖము జీవునకు సంసారబంధహేతువు అని యెరుగవలయును అయినను మాయాబలముచే ఈః పరిచ్ఛిన్న అపరిచ్ఛిన్న ములైన చిత్, జడములు రెండునుకలిసియే, వరిధాన్యమునందువలె పై భాగ మున నిరుపయోగమైన ఊక, తవుడు, బొట్టు కలిగి లోపలమాత్రము భుజించు టకు యోగ్యమైన తండులభాగము కలిగియున్నట్లు ఒక్కబీజమువలెనే నుండును ఇందు మానవులు ముఖ్యముగ వారికికావలసిన తండులభాగమును మాత్రము దంచుట, చెరగుట, మొదలగు క్రియలచే వేనికవి వేరుగచేసి, తండులములను మాత్రము తీసికొనుచు, తక్కినభాగమును, ఎట్లు వదలివేయు చున్నారో, అట్లే యీ చిత్ జడ మిశ్రితమైన యీ స్వశరీర సర్వదృశ్యము నందునను, జడభాగమును జ్ఞానపూర్వకముగ వదలి, చైతన్యాధిష్ఠానమును మాత్రము, ఆత్మాఽభిన్నముగ, జ్ఞానాభ్యాసకులు, గ్రహింపవలయును. కావున అహంకారిస్వరూపమున 'నేను' అని తోచుచున్న పరిచ్ఛిన్నాంశమందు ఈశ్వరానుగ్రహ, శాస్త్రజ్ఞాన, గురుబోధవలన, భాగత్యాగలక్షణను గ్రహించి చిత్జడమిశ్రితమైన అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనంద మయ కోశములను త్యజించి, వీనికన్నిటికిని సాక్షి భూతమై స్వప్రకాశ మగునట్టి దన యుఖండ చైతన్యస్వరూపమును మాత్రము గ్రహించి అదియే "అహం" శబ్ద వాస్తవస్వరూపమని ముముక్షువు తెలిసికొనవలయును. ఇట్లు తెలిసికొనిన తన వాస్తవ "అహం" పదార్థమే "అహం సర్వమిదం విశ్వం పరమాత్మాహ మచ్యుతః" అను వచనమునకు అర్థమని జ్ఞానాభ్యాసకుడు గ్రహించి తన మననానుసంధానాభ్యాసములను ప్రీతి నిశ్చయములతో నిరంతర ముగ, ఫలపర్యంతము అభ్యసించుచుండుట యావశ్యకము కాని యీ అహంకారమే సర్వజీవులచేతను నేను, నేను అను జ్ఞానముతోడ వ్యవహరింప

బడుచున్నది. జీవునకు అహంకారము ఘటాకాశమువంటిది. వాస్తవమున ఘటాకాశమనునది వేరుగలేకపోయినను ఘటమున్నంతకాలము మహాకాశమే ఘటాకాశమని వ్యవహరింపబడుచున్నట్లు, జీవుని ఉపాధి విలయము కానంత వరకూ యీ అహంకారప్రతీతిగూడ జీవునకు స్ఫురించుచు జీవవ్యవహారమున ఆధారముగ నుండును.

జీవునకు సుఖదుఃఖములు జ్ఞానమువలన గలుగుచున్నవిగాని వస్తు యథార్థ స్థితిగతులనుబట్టి కలుగుటలేదను ముఖ్యాంశమును జ్ఞానాభ్యాసకులు మరువగూడదు ఇచట జ్ఞానమనగా వృత్తిజ్ఞానమే దీనినిగురించి యీ గ్రంథమందచటచట విమర్శించియుంటిమి. ఐనను నీ క్రింది విమర్శవలన నింకనూ స్పష్టముకాగలదు ఎట్లన, ఏ మానవుడైననూ దూరదేశము నందున్న తన పుత్రుడు మరణించి పదిరోజులైనను, ఆ వార్త తనకు తెలియనిచో, అనగా ఆ జ్ఞానములేనియెడల యీ పదిరోజులును సుఖ సంతోషములతోడనే యుండును ఈ వార్త తెలియగనే దుఃఖనిమగ్ను డగును. ఇట్లే దూరదేశమందున్న తన కుమారుడు మరణించక సుఖముగా నున్ననూ, తన శత్రువుచేగాని, మరియెవరిచే యే కారణముచేత నైనను గాని సుఖముగానున్న తన కుమారుడు మరణించినట్లు వినినతోడనే అనగా అట్టి జ్ఞానముకలిగిన యెడల ఆ క్షణమునుంచియే అతిదుఃఖాక్రాంతు డగుచు, తిరిగి తన కుమారుడు సుఖముగాయున్నాడు, మరణించలేదని తెలియుటచే మిక్కిలి హర్షసుఖముల నెట్లుపొందునో అందరకునూ తెలిసిన విషయమే. ఈ నిరూపణనుబట్టి మానవునకు హర్షసుఖదుఃఖములు తనకు కలుగునట్టి అనుకూలప్రతికూల జ్ఞానములవలననే సంభవించుచున్నవిగాని వస్తు పరిస్థితివలన గాదని స్పష్టపడుచున్నదిగదా! ఇంకనూ స్వరూపమునుబట్టి మరణము అందరకును దుఃఖప్రదమైనదైనను, యేమానవునికైనను తన ప్రబలశత్రువునియొక్క మరణవార్త వినినతోడనే మోదమునే కలిగించు చున్నదిగదా! ఇది తన శత్రువునశించుటచే, తనకు లాభముకలుగునను జ్ఞానమువలననేగదా కలుగుచున్నది. ఇంకనూ ఒకానొకనికి అప్పటిపరిస్థితు

లనుబట్టి యొకపెద్ద ధనద్రవ్యములకు తానే వారసు నను నిశ్చయముకలిగిన పిమ్మట, అట్టి ఆస్తికి మరియొక వారసు జన్మించినాడని వినినతోడనే ఉత్సాహముతగ్గి, ఖిన్నుడగును గదా! ఇట్టి సుఖదుఃఖములన్నియూ జీవునకు ముఖ్యముగ తనజ్ఞానమువలననే గలుగుచుండును. జీవునకిట్టి జ్ఞానమందు తన అనుకూలజ్ఞానము సుఖమును, ప్రతికూలజ్ఞానము దుఃఖమును కలుగజేయు చుండును. కాని యీ రెంటికినీ జ్ఞానము ఆవశ్యకమగుచున్నది. ఈ జ్ఞానమనునది జీవునకు సర్వదా అనుకూలము, ప్రతికూలము, ఉపేక్ష యను మూడు భావములతో కలుగుచు, దేనినో యొకదానిని కూడియుండును అనగా యీ మూడు విశేషణములతో వృత్తిజ్ఞానముకూడినదై జీవునకు వ్యవహారముకలుగ జేయుచుండును. కావున జీవునకు యీ జ్ఞానము పైమూడు స్థితివిశేషణములలో దేనినో యొకదానిని పొందియుండి వ్యవహారము కలుగజేయుచుండును. దీనివలన జీవులకు వారివారి సంస్కార, వాసనలు యేర్పడి వాటినిబట్టి ఆ యా పదార్థములయందు అనుకూల ప్రతికూల ఉపేక్షాభావములు—అనగా జ్ఞానములు కలుగుచుండును. ఈ జ్ఞానములన్నియూ అవిద్యాకల్పితములగుటచే జీవునకు అనిత్యములై, శాశ్వతసుఖమునివ్వజాలక, కాలాంతరమున నశించుచు పర్యవసానమున దుఃఖమునే కలిగించుచుండును. కాని జీవుడు శాస్త్ర జ్ఞానముతోడ ఏన నిత్యానిత్య వివేకమునుసంపాదించి, నిత్యమును, వాస్తవమున తన స్వస్వరూపమునగు ఆత్మజ్ఞానమును, తనవృత్తిజ్ఞానముతోడ సంపాదించి తన శ్రవణ, మనన, నిదిధ్యాసనాద్యభ్యాసపాటవములచే కాలక్రమమున కల్పితమైన యీ వృత్తిజ్ఞానము ఏన అధిష్ఠానమగు ఆత్మజ్ఞానమందు లయము నొందింపగలిగినయెడల అప్పుడు జీవునకు తన స్వస్వరూపమగు ఆత్మజ్ఞానము మాత్రము నిర్విశేషముగ మిగులును. ఇదియే జీవునికి సర్వాధిష్ఠానజ్ఞానము, స్వస్వరూపము, నిత్యము, నిర్విశేషము. ఇదియే వాస్తవమున జీవునకు నిత్య నిరతిశయ సుఖస్వరూపము, దుఃఖలేశమిశ్రితములేని శాశ్వత పరమసుఖ స్వరూపము. ఇదియే పరమాత్మ, బ్రహ్మపదార్థము. ఇదియేస్వప్రకాశ, అద్వితీయ, అసంగ, నిర్వికార, నిత్య, అఖండ సర్వాధిష్ఠాన పరిపూర్ణ చైతన్యము.

ఇదియే పరిపూర్ణ స్వరూపజ్ఞానమనియు బ్రహ్మయనియు తెలియబడుచున్నది. ఇది కేవలజ్ఞానస్వరూపము. దీనిని తెలిసికొనుట యెట్లనిన ఇట్టి పరిపూర్ణ జ్ఞానస్వరూపుడగు బ్రహ్మయే, మాయాబలముచే మనలకు మందాంధకారమున గలుగునట్టి సర్పభ్రాంతికి, రజ్జువు యెట్లు సర్వాధిష్ఠానముగనుండునో అట్లే అనాది జీవాజ్ఞానమువలన భాసించుచున్న యీ స్వశరీర సర్వజగత్తునకున్నూ బ్రహ్మయే సర్వాధిష్ఠానముగ నున్నదని, జ్ఞానాభ్యాసకులు బాగుగ గ్రహించవచ్చును. ఇదియే అఖండము, అద్వితీయము, స్వప్రకాశము, పరిపూర్ణము. ఇట్టి స్వప్రకాశ అఖండపరిపూర్ణ పదార్థమగు బ్రహ్మ, మనలకు యేల నగుపడుటలేదని తోచవచ్చును దానినిట్లు తెలిసికొనవలయును లోగడనే శాస్త్రానుభవయుక్తులతో విమర్శించి యీ స్వశరీరజగత్తంతయును, సర్వాధిష్ఠానమగు బ్రహ్మయందు, అధ్యస్తముగనున్నదని తెలిసికొనియుంటిమి ఎల్లప్పుడునూ, కల్పితమగు అధ్యస్తము, అధిష్ఠానమును ఆవరించి అనగా తన స్వరూపముచే కప్పివుచ్చి సత్యమగు అధిష్ఠానమును కనబడకుండజేయును. ఐనను బ్రహ్మజ్ఞానాభ్యాసకుడగు జీవుడు తన శాస్త్రీయప్రయత్నాదులచే చూడగలుగును. దీనిని యీ జీవుడు తన అవిద్యయను అజ్ఞానావరణమును తన జ్ఞానజ్యోతిచే తొలగించునట్టి సమర్థతకలవాడుగనుక, తన పరమార్థ అధిష్ఠానరూపము గోచరించుచుండును. అప్పుడు అధ్యస్తమగునట్టి యీ స్వశరీర జగత్తంతయు మిథ్యయగును. ఎట్లనిన రజ్జుసర్పయుదాహరణములో సర్వాధిష్ఠానమగు రజ్జువును, మందాంధకారముచే దాని వాస్తవ స్వరూపమును చూడలేకబోవుటచేతనేకదా దానియందు అధ్యస్తమైన సర్పము భాసించుచు భయకంపాదులను కలిగించుచున్నది కాని దీపసహాయముచే సర్వాధిష్ఠానమగునట్టి రజ్జుస్వరూపమును జూడగనే అధ్యస్తమగు భ్రాంతిసర్పము మిథ్యయగుచు యెట్లు నిర్బాధకమగుచున్నదో అట్లే జ్ఞానాభ్యాసకుడు తన శాస్త్రీయ ప్రయత్నముచే జ్ఞానజ్యోతిని సంపాదించి, దాని సహాయముతోడ నీ స్వశరీర సర్వదృశ్యమును చూచినయెడల, నీ జగత్తంతయు భ్రాంతిసర్పములాగున మిథ్యయగుచు, జీవునకు తన స్వస్వరూపమగు, స్వప్రకాశ పరిపూర్ణచైతన్యము

గోచరించును. ఇదియే బ్రహ్మజ్ఞానజ్యోతి, జీవుడు తన స్వస్వరూపమని గ్రహింపగలుగును. ఇదియే సర్వాధిష్ఠానజ్ఞానము ఎంత విచారించియైనను, ముముక్షువు, బ్రహ్మ, జీవ, ప్రపంచములయొక్క ఏకత్వమును గ్రహించుట యావశ్యకము. కావున ఇచట జీవ, అహంకారాది స్వరూపమును, బ్రహ్మ జీవాదులకు భేదమునుగురించి, యోగవాసిష్ఠమునందు తెలుపబడిన, విషయమును సంక్షేపముగ నుదహరించుచున్నాడను. జగత్తునకు వ్యక్త కారణ అధిష్ఠానమగు బ్రహ్మ, నిస్తరంగసముద్రమువలెను, గాలిలేనిచోటనున్న దీపమువలెను, నిర్మలస్ఫటిక మహాశిలలాగుననూ, అచలమై సర్వపరిపూర్ణమైన చైతన్యముగ నున్నది. అట్టి బ్రహ్మముయొక్క చలనముగల రూపమే జీవుడని యెరుగ వలయును. ఇట్లు జీవస్వరూపమునొందిన బ్రహ్మయే, అగ్నికణువుకట్టెలు అనగా మండుచున్నకట్టెలు అధికమైనకొలది, అధికప్రకాశమును పొందినట్లు, అనాది అజ్ఞానముచే అభివృద్ధినొందిన అంహకారభావనచే "అహం" నేను అను పరిచ్ఛిన్న అహంకార రూపమునుపొందుచున్నది ఎట్లన, కనుచూపు అనునంతవరకు ఆకసమునందు నలుపు గనబడక, కనబడని దూరపుచోటున, ఆకసమునందు వాస్తవముగలేని నలుపు అనగా నీలత్వము తోచుచున్నట్లు, తనకు అనగా జీవునికి కనబడని తనయందే, నిజముగా తనయందులేనట్టి అహంకారము తోచుచున్నది. ఈ అహంకారమే మనోభావనకు అభిముఖ మగుటచే అనగా తానే మనస్సని తలంచుటచే, చిత్తము, బుద్ధి, మనస్సు, అహంకారము, మాయ, ప్రకృతి, అను పేర్లుగలిగి మనోరూపమున సూక్ష్మో పాధియగు అంతఃకరణమగుచున్నది. ఇట్లు పరమకారణమగు, నా బ్రహ్మము వలన, మొదలు సంకల్పాత్మకమైనట్టియూ, వ్యాపకమైనట్టియూ మనస్సు కలిగినది. ఆ మనసుచే జగమంతయూ రచింపబడుచున్నది, సముద్రము ఉదకముయొక్క చలనామంచే, అలలు, నీటిబుగ్గలు, నురుగు మొదలగు రూప ములనొందినట్లు, చిద్రూపముగు ఆ పరమాత్మయే, మనోరూపమునొంది, ఆ మనస్సుయొక్క సంకల్పముచే, నానారూపముగు జగద్రూపమును పొందు చున్నాడని యెరుగవలయును. ఎట్లనిన, కనుచీకటియందు బాగుగాచూడక

పోవుటచే, స్థాణువయందు మనుష్యభ్రాంతి కలుగుచున్నట్లు, యిప్పడీ జీవునకు తన మనస్సుయొక్క అధీనతచే, దీర్ఘకాలము కనుబడునట్టికలవలె, సంసార దృశ్యమంతయూ కనబడుచున్నది. కాని, నిది యంతయూ పరమార్ధ వాస్తవ మున లేనిదేయగును ఎట్లనః:

శ్లో॥ ద్వైతం యథానాస్తి చిదాత్మజీవయోః
తథైవ భేదోఽస్తినజీవచిత్తయోః।
యథైవ భేదోఽస్తినజీవచిత్తయోః
తథైవభేదోఽస్తి న చిత్తసర్గయోః॥

అనగా పరమాత్మకునూ పరమాత్మవలన గలిగిన జీవునకునూ, ఎట్లు భేదము లేదో, అట్లే జీవునకునూ, జీవుని వలన గలిగిన మనస్సునకును భేదములేదు. ఇంక జీవునకునూ జీవునివలన గలిగిన మనస్సుకును, ఎట్లు భేదములేదో అట్లే మనస్సునకును, మనస్సువలనగలిగిన జగత్తునకునూ భేదములేదు. (మృత్తునకును, మృత్తువలనగలిగిన ఘటమునకును భేదములేనందుచే కార్యకారణములకు వాస్తవభేదములేవని గ్రహించవలయును) బ్రహ్మ స్వశరీర సర్వజగత్తునకు వివర్తకారణము. ఈ స్వశరీర సర్వజగత్తు బ్రహ్మయందు వివర్తకార్యము– అనగా భ్రాంతి మాత్రముగ నున్నదని ముముక్షువులు గ్రహించి నిశ్చయము నొందవలయును.

శ్రుతి "అసద్వాఇదమగ్ర ఆసీత్", "తతోవైసదజాయత" అనగా యీ నామరూప విశేషాత్మకమగు ప్రపంచమంతయూ సృష్టికిముందు అవ్యాకృత నామరూప విశేషములుగల బ్రహ్మముగనుండెను. ఆ అనభివ్యక్త నామరూపవిశేషములుగల అసత్తునుండి యీ నామరూప ప్రవిభక్తమగు ప్రపంచము పుట్టెను అనియూ, కాని వాస్తవమున ఎల్లప్పుడును నున్నది "ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ", బ్రహ్మ ఒక్కడేగాని ద్వితీయ స్వభావముగలవాడుగాడు. ఎల్లప్పుడును ఒక్కడుగనే యుండును అనియూ, "నేహనానాస్తి కించన" యీ దృశ్యనానాత్వము కొంచమైనను యున్నదిగాదు, అనగా వాస్తవమున లేనిదని తెలుపుచున్నది. జీవుని వాస్తవస్వరూపమగు ఆ బ్రహ్మను

గుర్తించుటకుగాను, "సత్యంజ్ఞానమనన్తంబ్రహ్మ" యని బ్రహ్మస్వరూప లక్షణములనుగూడ తెలుపుచున్నది. కావున యీ వాక్యములనుబట్టి ఒక్క బ్రహ్మయే సృష్టికి మొట్టమొదట అనభివ్యక్తముగనుండి, ఆయనయే మాయా ప్రభావముచే జీవనానాత్వప్రపంచములుగ భాసించుచున్నాడని తెలియుచున్నది. కావున యీ సర్వమునకు సత్యస్వరూపుడగు బ్రహ్మయే అధిష్ఠానమనియు, ఈ నానాజీవజగద్దృశ్యమంతయూ అధ్యస్తమనియూ స్పష్టమగుచున్నది కాని జీవు డిట్టి సత్యానృతరూపములైన అధిష్ఠానాధ్యస్తములను వేరువేరుగ గ్రహింప జాలక అంతయూ సత్యమనిభ్రాంతుడై యీ దృశ్యసంసారానుభవములను యనాదిగబొందుచున్నాడు. జీవునకు యిట్టి దృశ్యము వాస్తవమను భ్రాంతినుండి విముక్తిని జేయుటకుగాను శ్రుతియే—"మాయామాత్రమిదం ద్వైతమ్, అద్వైతం పరమార్థతః", అనగా యీ కనుబడుచున్న దృశ్యనానాత్వప్రతీతి అంత యును మాయాకల్పితమని, పరమార్థమునసున్నది అద్వితీయ, అఖండ బ్రహ్మపదార్థమొక్కటేయనియూ, తెలుపుచూ, యింకనూ ఆ బ్రహ్మ జీవుని కన్న వేరుగాదనియూ "జీవో బ్రహ్మైవనాపరః" అనగా జీవుడు బ్రహ్మకంటె భిన్నుడుగాడనియూ, తెలుపుచూ "యోవేద నిహితంగుహాయాంపరమే వ్యోమన్" ఎవరు, వారివారి హృదయగుహాయందు చిదాకాశస్వరూపుడగునట్టి బ్రహ్మస్వరూపమును నేనే యీ బ్రహ్మనని తెలుసుకొందురో, అట్టివారు "బ్రహ్మవిదాప్నోతిపరమ్" పరమోత్కృష్టమగు యీ బ్రహ్మనే పొందుదురని, యిట్లు తెలిసికొనిన జీవునకు ఫలమునుగూడ శ్రుతియే తెలుపుచున్నది. కావున వేదప్రామాణ్యమును గ్రహించిన వివేకులగు జీవులకు యీ జగత్తు యొక్క సత్యానృతములను బాగుగగ్రహించి తన పరమార్థస్వరూపానుభవ మును సంపాదించుట తన నిత్యనిరతిశయ సుఖప్రాప్తియగు మోక్షప్రాప్తి కావశ్యకము.

ఇట్టిజీవులలో ముముక్షువైన బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు, తన శరీరాదు లును యీ పంచభూతాది సర్వప్రపంచంబును వాస్తవముగాదని గ్రహించి, నిశ్చయమునొంది అనగా యీ స్వశరీరసర్వమును తన అవిద్యాకల్పితములని

భ్రాంతిమాత్రములని తెలిసికొనినవాడు. కావున భ్రాంతిమాత్రమై యధ్యస్త మగుచు యీ స్వశరీర ప్రపంచ సర్వమునకున్నూ యధిష్ఠానము యొకటి యుండి తీరవలయునుగదా ? ఏలనన నిరవధిష్ఠానముగ యధ్యస్తముభాసించుటకు వీలులేదు. అధ్యస్థమెప్పుడును యధిష్ఠానమును విడచియుండుట యసంభవము. ఇందు సర్వదా యధిష్ఠానము సత్యముగను, అధ్యస్తముకల్పితముగను, అనగా అసత్యముగను నుండుట నియమము. ఇట్టి పరిస్థితియందు యధ్యస్తమాత్రములగు తన దేహాదిజగత్తంతయూ సత్యస్వరూపమగు యధిష్ఠానమును విడచియుండుటకు వీలులేదుగదా ? కావున యీ యధిష్ఠానాధ్యస్తములు రెండును సత్యానృతరూపముల కలసి తనయందే యున్నవని ముముక్షువు గ్రహించి, యిందు అనృతరూపమునను స్వశరీర సర్వదృశ్యమును జ్ఞానపూర్వకముగ త్యజించి సత్యమగు తన పరమార్థ అధిష్ఠానస్వరూపమును గ్రహించవలయును. ఇది యెట్టిదనిన—భగవంతుడగు కృష్ణపరమాత్మ "నిత్యస్సర్వగతస్థాణు రచలోఽయం సనాతనః" యని తెలుపుచున్నాడు. అనగా సర్వాధిష్ఠానముగా నున్నట్టిన్నీ జీవునియొక్క పరమార్థవాస్తవస్వరూపమగు, పరమాత్మస్వరూపమును నిత్యమనియూ, సర్వపరిపూర్ణమనియూ, స్థాణువులాగున అచలమనియూ, యిది సనాతనమనియూ తెలుపుచున్నారు. కావున ముముక్షువు దీనినే జీవుని పరమార్థవాస్తవ స్వరూపముగ గ్రహించి ఇట్లనుసంధానము చేయుచుండవలయును.

ఏ అద్వితీయ అఖండపదార్థము స్వశరీర జగదుత్పత్తిస్థితిలయములకు విపర్తకారణమో, యేదిసజాతీయ, విజాతీయ, స్వగత భేదరహిత, స్వప్రకాశ, యఖండ పరిపూర్ణచైతన్యమో, యేది సర్వోపాధివినిర్ముక్తమైన నిత్య, నిరతిశయ, నిర్వికార, అద్వితీయ, అసఙ్గ, పరిపూర్ణ, సంవిత్స్వరూపమో, యేది సచ్చిదానన్దరూపమో, దేనికి సత్యజ్ఞానానంతలక్షణములే స్వరూపమో, యేదిస్వప్రకాశమో, దేనిప్రకాశముచే యీ సూర్యచంద్రాదులును, సర్వ జీవ బ్రహ్మాండాదులునూ ప్రకాశింపజేయబడుచున్నవో, ఏ ప్రకాశములేనియడల సూర్యచంద్రాదులునూ, యీ సర్వబ్రహ్మాండంబులునూ ప్రకాశింపవో, ఎచట

సూర్యాస్తమయాదు లనునవి యుండక సర్వదా ఏకరూపమున స్వప్రకాశమై యుండునో, యేది నిరవయవమో, యేది నిష్క్రియమో, యేది నిర్లేప నిరంజన నిర్గుణసర్వవ్యాపకమో, యేది స్వశరీరసర్వమునకు అధిష్ఠానమో, యేది పెద్దవస్తువులలో పెద్దదై చిన్నవస్తువులలో చిన్నదిగనుండునట్టిదినీ, దేనికన్నా పెద్దవస్తువుగాని దేనికన్నా చిన్నవస్తువుగాని యుండుటకువీలు లేదో యేది చెట్టువలె స్తబ్ధముగానుండి ప్రకాశించుచూ పరిపూర్ణ చైతన్య స్వరూపముగానున్నదో, యేది పరిపూర్ణ సుఖస్వరూపమో, యేది నిర్విశేషమై దేనిని పొందినతరువాత జీవునకు పొందవలసిన లాభములేదో సట్టిస్వరూపమే నా వాస్తవపరమార్థస్వరూమని బ్రహ్మాభ్యాసకుడు మనోగోచరము గావించు కొని దాని స్వస్వరూపానుభవము నొందుటకు సర్వకాల సర్వావస్థలయందునూ తన పరమార్థస్వరూపమును మరువక తన ప్రారబ్ధానుసారమున నెట్టివ్యవ హారము లాచరించుచున్ననూ, మనన నిదిధ్యాసనాభ్యాసములను చేయుచుండుట ముముక్షువు కోరునట్టి మోక్షప్రాప్తి కావశ్యకము.

ఇదియే శ్రీకృష్ణపరమాత్మ తాను స్వయముగ జీవులకు కర్మ, భక్తి, జ్ఞాన యోగములవల్ల సారాంశముగ బోధించుచున్న పర్యవసాన రహస్యము, ముముక్షువునకు మోక్షోపాయము. దీనిని సేవించుటవలన యీ యనాది సంసార మహావ్యాధినుండి జీవుడు విముక్తుడగును. కాని ముముక్షువులకు మరియొక సంశయము కలుగవచ్చును. నిత్యనిర్వికార అద్వితీయ అఖండ పరిపూర్ణస్వరూపుడగు బ్రహ్మయందు యీ సమస్త దృశ్యజీవ నానాత్వములు వాస్తవముగ కలుగుట సంభవమా యనునది? కాని యీ సంశయము సరియై నదికాదు. శాస్త్రముగూడ యీ సమస్త దృశ్యజీవ నానాత్వములు వాస్తవ ముగ బ్రహ్మయందు కలిగినవని చెప్పుటలేదు. ఇంక నేమనిన ఇదియంతయూ మాయామాత్రముగ కనబడుచున్నదనియూ, వాస్తవముకాదనియూ, జీవునకు శ్రుతిమాత "మాయామాత్రమిదంద్వైతం అద్వైతంపరమార్థతః" అనిన్ని దీనినే శ్రీ శంకరభగవత్పాదులు విస్తరించి "భ్రాంతిమాత్రమిదం విద్వన్, విశ్వంబ్రహ్మణికల్పితం" అని తెలుపుచున్నారు. కావున నిదియెట్లని సంశ

యించక ముముక్షువులగువారు, వాక్యప్రమాణమును గ్రహించి, శాస్త్రీయాను భవ వివేచనలతోడ తెలిసికొన వలయునేగాని శ్రుతివాక్యమును సంశయించుటకు వీలులేదు. కాని జిజ్ఞాసువు లిట్లు తెలిసికొనవలసియున్నది ఎట్లన అఖండమగు శుద్ధ సముద్రజలమే బాహ్యమగు మలిన వాయుసంపర్క ప్రసారములచే వికారమునొంది, నురుగు, బుడగలు, తరంగములుగ నగుపడుచున్నను, వాస్తవముగ, యివి యన్నియూ, అఖండసముద్ర శుద్ధజలముకన్న నెట్లు భిన్నములుకాజాలవో, అట్లే యీ స్వశరీర సర్వదృశ్యము, ఆ బ్రహ్మపదార్థమునందే నగుపడుచున్నను, యిందు బ్రహ్మేతర మేదియునూ వాస్తవముగ లేదని తెలిసికొనవలయును. జ్ఞానాభ్యాసకు డిచట నొక సూక్ష్మమును గ్రహించవలయును అదియేది యనిన, యీ బ్రహ్మపదార్థము నిర్వికార, అసంగ, అమూర్తపదార్థము. ఇట్టిదానికి వికారము కలుగుట అసహజము కాదా యను సంశయమును సూక్ష్మబుద్ధితోడ గ్రహించవలసియున్నది. బ్రహ్మ లక్షణములను బట్టి వికారములు వాస్తవముగ కలుగకూడదుగాని అవాస్తవముగ యెన్ని వికారములైననూ కలుగవచ్చును పైన తెలిపిన దృష్టాంతము, వ్యవహారములు మూర్తపదార్థములందు కలుగు పరిణామములోనిది. కావున యీ దృష్టాంతమందు కనబడుచున్న, నురుగు, బుద్బుద, తరంగములు, అఖండ సముద్ర శుద్ధ జలముకన్న వేరుకాదు అను నంతవరకే గ్రహించవలయును గాని, తదితరాంశములలోగాదు. ప్రకరణమునుబట్టి యిచట మన విషయము, పరమార్థమైన, అమూర్తపదార్థము ఇదియే దృష్టాంతమందు అఖండ సముద్ర శుద్ధ జలస్థానీయము, బాహ్య మలిన వాయు స్థానీయములేవియనిన జీవునియొక్క అవిద్యా కామ కర్మములు. జీవునకివి మాయా ప్రభావముచే కలుగుచున్న అజ్ఞానమువలన అనాదిగా కలుగుచున్నవి. మన సముద్రజల దృష్టాంతమందు, యివియే, బాహ్య మాలిన్య వాయు సమానములై, జీవుని పరమార్థస్వరూపమగు యీ అద్వితీయ అఖండ శుద్ధ బ్రహ్మమందే, జీవనానాత్వమును, యీ నానాకల్పిత జీవులయొక్క భోగార్థము, స్వశరీర సర్వదృశ్యములను కలుగజేయుచున్నవి. ఇవియన్నియూ భ్రాంతి

కల్పితములేగాని వాస్తవములుగావు మందాంధకారమున మానవునకు రజ్జువయందు కలుగు సర్పభ్రాంతిలాగున వాస్తవములుకావు. ఇంకనూ ఆక్షణమందే, వివిధావయవములతో సర్పచలనాదులుగూడ నెట్లు కనబడుచు, మానవునకు భయకంపాదులు కలిగించుచుండునో, అట్లే యీ స్వశరీర సర్వదృశ్యానుభవములును, ఆ ఒక్కటియైన, నిర్వికార అఖండ పరిపూర్ణ బ్రహ్మపదార్థమునందే కనబడుచున్నవని తెలిసికొనవలయును. భ్రాంతిచే మానవున కిట్లగుపడుచున్న సర్పముగాని, సర్పావయవములుగాని, సర్పచలనాదులుగాని యెట్లు వాస్తవములుకాజాలవో అట్లే జీవునకు యీ స్వశరీరదృశ్యము, వానివలన కలుగుచున్న అనుభవములన్నియూగూడ వాస్తవములుకావని, ముముక్షువులు నిశ్చయముగ గ్రహించవలయును. ఇట్లు సశాస్త్రీయ సయుక్తికముగ "బ్రహ్మ సత్యం జగన్మిథ్య"యని గ్రహించి, అట్టి జ్ఞానమును స్వానుభవమునొందుటకే ముముక్షువులగు వారికి, సాధుసంగమ సచ్ఛాస్త్రములు, శ్రవణ, మనన, నిదిధ్యాసనములతో బ్రహ్మజ్ఞానాభ్యాసమును ఫల పర్యంతము, నాచరించుట యావశ్యక మగుచున్నది. ఇంతనూ యీ స్వశరీర సర్వప్రపంచమునూ, జలమునందు కనబడు ఫేన, బుద్బుదములలాగున నున్నవని నెరుగవలయును. ఎందుకన, యీ బుద్బుదములు నురుగు, జలస్వరూపమని చెప్పుటకునూ, జలస్వరూపముకానివని చెప్పుటకునూ వీలుగానివగుచు, జలమునందే అవాస్తవముగ కనబడుచుండును. ఇట్లే యీ స్వశరీర సర్వదృశ్యము ఆ బ్రహ్మయందున్నదని గ్రహించి, ముముక్షువులగువారు "సర్వంఖల్విదం బ్రహ్మ" అను వాక్యమును బట్టి యీ సర్వమునూ, నేనునూ, వాస్తవమున బ్రహ్మపదార్థమే యను నిశ్చయజ్ఞానముతోడ సర్వమును, నామరూప రహితముగ బ్రహ్మాకార వృత్తితో గ్రహించుటగాని, లేనిచో "నేహనానాస్తికించన" అను వచనాను సారమున యీ స్వశరీర, నానాజీవ, దృశ్యముగా కనబడుచున్నదంతయునూ, బ్రహ్మమేగాని వాస్తవమున ఇదిఇతర మేమియూ లేదనిగాని, యిట్టి అన్వయ వ్యతిరేక వివేచనలతో జీవుడు తన పరమార్థ వాస్తవస్వరూపమగు బ్రహ్మ

స్వరూపమును గ్రహించవలయును, గాని యీ పరిచ్ఛిన్న జడమగు అహంకార మును నేను అని వాస్తవముగ తలచకూడదు.

జీవునకు తన పరమార్థ స్వరూపమగు, నిర్వికార, అఖండ, పరిపూర్ణ చైతన్య పదార్థమే, జలప్రవాహమునందుపడిన వెదురువలె తన వాస్తవస్వరూప మున వంకరలేనిదై ననూ, జలప్రవాహమునందున్నంతకాలము, చూచువారికి ఆ వెదురుయే. వంకరకలిగిన దానివలె, నెట్లు కనబడుచుండునో అట్లే జీవుడు తన అవిద్యా సంసారప్రవాహములో నున్నంతకాలము, తిన్నని వెదురుకు వంకర యను దోషసమానమగు పరిచ్ఛిన్న దుఃఖిత్వముతోడ భ్రాంతినొందుచు తన జీవానుభవములను జేయుచుండును కాని యీ జీవత్వము, జీవానుభావములు, జీవునకు ఎంతమాత్రము వాస్తవములుకావు కావున జ్ఞానాభ్యాసకుడు తన సత్య జ్ఞాన మను నావతోడ తన స్వరూపమును యీ అజ్ఞానమను జలప్రవాహమునుండి లేవనెత్తినయెడల అప్పుడు తనకు యీ వంకరదోష సమానమగు, పరిచ్ఛిన్న జడత్వ, దుఃఖిత్వములు అన్నియూ తాముగనేపోయి, జీవుడు తన పరమార్థ సత్యస్వరూపమగు, సత్యజ్ఞానానంత లక్షణములతో శాశ్వతస్థితినొందును. ఇదియే జీవునకు మోక్షము.

మోక్షజ్ఞానసాధములుగ జ్ఞానాభ్యాసకులకు యిందు, వివిధ విషయ, లోకపరిస్థితి, స్వరూపములను నిరూపించి, నిరూపణాంతములందు సందర్భాను సారమున దీనిని బాగుగా గ్రహించవలెననియు, తెలిసికొనవలయుననియూ, తెలుపబడినది. తెలిసికొనుటయన్నను, గ్రహించుటయన్నను దాదాపు ఒక్కటియే ఇట్లు తరుచుగ తెలిసికొనవలయును అని చెప్పబడు మాటకు తెలిసికొనుట యనగా నేమో కొంచెము విచారించుట యావశ్యకము ఏలనన మానవులకు యీ తెలిసికొనుటయనునదియే, వారి వారి అనుభవములకు వ్యవహారమందున, పరమార్థమందునను గూడ చాల ముఖ్యాంశము. కావున జీవులకు యీ "బాగుగ తెలిసికొనుట" యనగా నేమిటి ? ఎట్లుకలుగుచున్నది ? అను మొదలుగాగల విమర్శ చాలపెద్దది ఐనను యిచట ముముక్షువుల

కావశ్యక మగు నంతవరకై నను సంగ్రహముగ విచారించుదము. ప్రతి జీవికి యునూ, యీ "తెలిసికొనుట" యనునది మనోవ్యాపారము ఈ వ్యాపారము జ్ఞానేంద్రియములచే నిర్వహింపబడుచున్నది. ఈ జ్ఞానేంద్రియములకు రాజు మనస్సు. ఇంద్రియములు పరిచారకులు. విషయములయందు యింద్రియ సన్నికర్ష, సంయోగములు కలుగునప్పుడెల్ల మనసు గ్రహించుచుండును ఎట్లు గ్రహించుననగా యీ మనస్సుయే. నామరూపములుగల విషయాకారా కారితమగుచుండును. ఇట్లు విషయములను గ్రహించు మనస్సుయే వృత్తి యనబడును. ఇదియే వృత్తిజ్ఞానము ఈ వృత్తియే, జీవునకు విషయ సంబంధములు కలుగుచుండగనే, యీ వృత్తియే ఆయా విషయాకారములుగ పరిణమించుచుండును. ఇట్లు వృత్తి విషయాకారాకారితమగుచుండుటయే "తెలిసినది" అను శబ్దమునకు అర్థము వృత్తి విషయాకారముగ పరిణమించని యెడల జీవునకు "తెలిసికొనుట" అనునదియే సంభవముకాదు. ఏ మానవుని నైనను తానులోగడ పేరు వినిగాని, స్వరూపము చూచిగాని యుండని మనిషి పేరుగాని, వస్తువుపేరుగాని చెప్పి "మీకు తెలుసునా?" యని యడిగిన నాకు తెలియదని బదులుచెప్పును ఏలనన ఆ విషయ నామరూపములను తన మనస్సు గ్రహింపలేక, ఆ విషయమునందు తన వృత్తి పరిణమించుటలేదు. కావున నాకు తెలియదనిచెప్పును. తన మనసు ఆ విషయనామ, రూప, పరిణామము నొందె నేని తెలుసుననిచెప్పును. ఈ తెలుసును, తెలియలేదు అనునవి రెండును జీవునకు తన వృత్తి జ్ఞానమువలనే గలుగుచుండును ఈ జ్ఞానమును బట్టియే వారివారి, గ్రహణసామర్థ్యములు మారుచుండును పదార్థ వాస్తవ జ్ఞానము తోడ వస్తు యథార్థ స్వరూపజ్ఞానమును అవాస్తవజ్ఞానముతోడ పదార్థ అవాస్తవజ్ఞానమును కలుగుచుండును. మానవునియొక్క మనసుచే కలుగు జ్ఞానమును ప్రధానముగ సామాన్యవిషయమనియూ, విశేషవిషయమనియూ రెండు విధములుగ జెప్ప వచ్చును. వీనినే విషయ ఆపాతజ్ఞానము లేక గౌణజ్ఞానము అనియు, ముఖ్య జ్ఞానము లేక విశేషజ్ఞానమనియు నందురు ఇందు విషయ అపాతజ్ఞానము ఫల కారి కాజాలదు ఇట్లుండీ శబ్దమునందు నొక దోషముగలదు. ఏదియనిన శబ్దము

వినినయుంటనే ఆపాతజ్ఞానము కలుగును ఆపాతజ్ఞానమనగా యేశబ్దమునైనను కొన్నిసారులు మానవుడు వినగనే, నావిషయ వాస్తవ స్వభావ, స్వరూపములు తెలియకపోయినను, ఆ విషయము తెలిసినట్లొక జ్ఞానము కలుగుచుండును. ఇట్టి జ్ఞానము చాలా భాగము కుతూహల మాత్రమేయగుచు కార్యకారిగాని ఫలకారిగాని కాజాలదు. కాని ఈ జ్ఞానముతోన విషయవిమర్శను బాగుగా జేసి, ప్రయత్నించినగాని ఆ విషయముయొక్క స్వభావస్వరూపములగు విశేషజ్ఞానముకలుగదు. ఇదియే వ్యవహారమునందు, ముఖ్యజ్ఞానమగుచున్నది. పైన తెలిపినటుల మానవులు వారుతెలిసికొనిన ఆపాతజ్ఞానముచే, తెలిసి కొనవలసిన విషయములను విశేష విమర్శ ప్రయత్నములు చేయుటచేతగాని, వారికి ఆ విషయ, స్వరూప స్వభావములు బాగుగ గోచరించవు. ఇట్లు బాగుగ విషయమును మనోగోచరము జేసుకొని ప్రయత్నించినగాని ఆ విషయలాభమును మానవులు పొందలేకున్నారు. ఇది అంతయునూ విషయము బాగుగ తెలియుట, తెలియకపోవుట అను మనోవ్యాపారమువల్లనే కలుగుచున్నది. ఈ తెలియుట యనుదానిలోనే లోకమునందు రెండువిధములుగ కనబడుచున్నవి ఎట్లన ఒకానొక అధికారివల్ల యెవరికైనను, నొక పనికావలసియున్నయెడల, వారిమిత్రుని, నీకు వారు బాగా తెలుసునాయని ముందుగనే అడుగును. బాగా తెలియక ఆ అధికారి ఫలానవారు అని సామాన్యముగ తెలిసినంతమాత్రమున, తనకుకావలసినఫలము అధికారివలన కలుగదుగదా! ఇట్లుగాక ఆ యధికారి స్వరూపస్వభావముల బాగుగ నెరిగి పరిచయజ్ఞానమున్నచో, అధికారితో నొకమాటచెప్పినమాత్రముననే తన పనియగును గదా! ఇట్లు ఫలమును కలుగజేయుసామర్థ్యము, విశేషజ్ఞానపరిచయములు గల వానికెట్లు సులభసాధ్యమో, అట్లే యీ బ్రహ్మవిద్యయందుగూడ యావశ్యకమని గ్రహించవలయును. శాస్త్రము నంతయును కేవలశబ్దార్థ జ్ఞానపటిమతోడనే, విషయస్ఫురణములేక పఠించుటచే కలిగినజ్ఞానము ఆపాతజ్ఞానమై, తెలిసినట్లుండి, బాగుగ తెలియబడక ముముక్షువునకు పూర్తి ఫలకారి కాజాలదు. దీనిని తెలుపుటకే పంచదశికారులు, నొకచిన్న యుదాహ

రణము నిచ్చియున్నారు ఏదియన, ఒకానొక రాజు సభయందు తన పండితు
లతో "ఎవరైనను నాలుగువేదములను బాగుగ తెలిసికొనగలవారికి నా
రాజ్యమం దర్ధరాజ్యమునైనను నివ్వగలన"నిచెప్పగ, దీనిని అచటయున్న నొక
మూర్ఖుడునిని, రాజునడ కేతెంచి "వేదములు నాలుగు, నాకు తెలుసును
(అనగా వాని అర్థము నాలుగు వేదములని నాకుతెలుసును) అర్ధరాజ్య మిమ్మని"
యడిగెనట అంతట వానిని రాజపరివారము పరిహసించి బైటకుపంపిరి—
అనునటి అట్లే బ్రహ్మాభ్యాసకులు శాస్త్రము నొక్కసారి వినినంతనే తెలిసిన
దని తలుచుట యవివేకము. వినినట్టి, యీ నిర్విషయబ్రహ్మస్వరూపము
బాగుగ వారి మనసుకు, సంశయరహితముగ గోచరించు నంతవరకు, సాంప్ర
దాయ గురుసహాయముతోడ, పఠించుచు, వివేచన, మననాదులచేయుచుండిన
యడల కాలక్రమమున వృత్తి తదాకారాకారితమగుచు, యీ సత్స్వరూపము
కరతలామలకమువలె గోచరించుచుండును. కావున ముముక్షువులగువారికి,
తత్స్వరూపమును, దాని సాధనములను బాగుగ నిట్లు తెలిసికొనుటకే అనేకసారు
లనేక విధముల తెలుపబడెను. పర్యవసాన మేమనిన అభ్యాసకునకు తనవృత్తి
విషయాకారత బాగుగ నొందిన బాగుగతెలిసినట్లునూ, లేనిచో విషయము
తెలియనట్లునూ తెలిసికొనవలయును. ఆ విషయమునే ప్రీతినిశ్చయ
విశ్వాసములతో గ్రహించగలిగిన యెడల, ఆ విషయము బాగుగ తెలిసినట్లని
అభ్యాసకులు తెలిసికొనవలయును. ఆపాతజ్ఞానముచే గ్రహించినది తెలియని
దానిలోనే లెక్క. ఏలనన దాని ప్రయోజనము అల్పము.

శాస్త్రము చెప్పుచున్నయటుల, యెంత శ్రుతియుక్తి, అనుభవవివేచనల
వలన జగత్తు సత్యముగాదని తెలిసికొనినను జీవునకు ఈ దృశ్యానుభవముల
వలన సుఖదుఃఖములు గలుగుచున్నవిగదా! ఇవి తప్పుటలేదే! మహనీయులకు
గూడ సుఖదుఃఖానుభవములు తప్పుటలేదే. అట్టితరి ఈ ప్రపంచ మసత్యమని
అనుకొనిన నేమిప్రయోజనము? ఇట్లుండ జగత్తు యనుకొనుటయెట్లు? మిథ్య
యెట్లగును? అని శంక కలుగవచ్చును. కాని యిది సరికాదు ఏలయన
జీవుని సుఖదుఃఖానుభవములకు భోగవస్తువులు సత్యముగానే యుండవలయు

నను నియమములేదు ఎట్లన తన నిద్రచే స్వప్నమునందు గనబడుచు, అనుభవింపబడుచున్న, చోరవ్యాఘ్రాదులచేత తాను భయక్లేశములనొంది తన జాగ్రదవస్థయందుగూడ స్వల్పకాలమైనను అట్టి అనుభవములు తనకు గలుగు చున్నవిగదా! ఎట్టివారైనను స్వప్నదృశ్యములకు వాస్తవికత నొప్పుకొనరు గదా! స్వప్నపదార్థములు సర్వము కల్పితములే గదా! ఇదిగాక ఈ కాల మందు ప్రతిదేశమందు ప్రతిదినమున జనులు విశేషద్రవ్యవ్యయములు దూరపురాకపోకలు మొదలగు శ్రమలనోర్చి సినిమా టాకీ ప్రదర్శనములు వారి వారికి సుఖము అనగా ఆనందమునిచ్చుననియేగదా వెళ్ళి చూచుచున్నారు. ఇట్టి ప్రదర్శనములందు ఘోరదృశ్యములు వచ్చినప్పుడు తాత్కాలిక క్లేశవిషాద ములనుగూడ పొందుచున్నారుగదా! జనసామాన్యమున కిది వారి ఆనందమున కొరక వ్యసనముగా నున్నదనుమాట అందరి అనుభవములో నున్నదే. ఈ ప్రదర్శనములలోని దృశ్యములు వాస్తవము కాకపోయినను వానివలన మానవులు సుఖదుఃఖములను అనుభవించుచునే యున్నారు. అట్టివారికి ఈ చిత్ర దృశ్యములు అవాస్తవములని తెలియదా? అవి అవాస్తకములని తెలసియే గదా వారివారి సుఖదుఃఖములతో గూడిన ఆనందవిషాదములను పొందు చున్నారు. ఇట్లే అవాస్తవమగు ఈ ప్రపంచదృశ్యానుభవములవలన మానవులు వారివారి పూర్వ సంస్కారవాసనాబలమునుబట్టి సుఖదుఃఖములనొందుచున్నారే గాని ప్రపంచదృశ్యమంతయు వాస్తవమగుటచేకాదు సూక్ష్మబుద్ధితో నాలో చించిన మానవునికి కలుగుచున్న సుఖదుఃఖములు వారివారి వాసనలవలన వారి, వారి, పూర్వసంస్కారబలమునుబట్టియున్ని వారివారి మనోనిష్ఠమువలననూ కలుగుచున్నవిగాని బాగుగా పరిశీలించిన ప్రపంచవస్తువులలో అన్నికాలము లందునను అందరకును ఏకవిధముగ యెల్లప్పుడునూ సుఖదుఃఖములనిచ్చునట్టి క్రియలనిగాని, పదార్థములనిగాని, నిర్దిష్టవిభాగములులేవు అన్యకాలమందు అవియే దుఃఖక్లేశకరములుగ మారుచుండును. ఒక దేశమందు పరమప్రీతిగ పరిగణింపబడు వస్తువులు అన్యదేశములవారికి అసహ్యకరముగనుండుచున్నవి. ఇట్లైనను ఒకే దేశమందునగూడ కొందరకు పరమప్రీతికరమగు పదార్థములు

అన్యులకు పరమాసహ్యామగుచున్నవి. ఇట్లే పంచభూతములు మొదలు మానవ, జంతు, వృక్ష, కీటక, ఖనిజములవరకు అన్నియునూ, జీవులకు వారివారి పూర్వ వాసనలయొక్క బలములే సుఖదుఃఖములకు హేతువగు చున్నవిగాని వస్తుయాథార్థ్య లక్షణములనుబట్టి కలుగుటలేదు లోకమున నెంత విచారించినను జీవులందరికిని అన్నికాలములలోను అన్నిదేశములలోను సర్వదా యిట్టివి సుఖవస్తువులు, ఇట్టివి దుఃఖవస్తువులు; వీరు మిత్రులు, వీరు శత్రువులు అను నిత్యనిర్దిష్టకరములుగ, విభజించి పరిగణింపబడదగినవి మానవులలోగాని, యితర జీవరాశియందు గాని, దేశకాలములయందుగాని, వస్తువులయందుగాని ఏమియులేవు ఈ సుఖదుఃఖములు వస్తునిష్ఠములుగాక కేవలము మనోనిష్ఠములగు, బుద్ధికల్పితములని నిశ్చయముగ గ్రహింపవలెను. కావున జీవునకు సుఖదుఃఖములు కలుగుచున్నంతమాత్రమున ఈ స్వశరీర జగత్తంతయు పరమార్థసత్యము కావలెనను నియమము రాజాలదు. వివేకాను భవమునుబట్టి చూచిన ఈ స్వశరీర దృశ్యమంతయు కల్పితము అని యను టకు నెంతమాత్రము శంకించుటకు మానవునకు అవకాశములేదు.

ఇంకను మానవులకు కలుగుచున్న సంబంధబాంధవ్యములుగూడ నిట్టివే. అనగా యీ సంబంధ బాంధవ్యములన్నియు మానవకల్పితములై కొంత కాలము మాత్రమే యుండుచు మారుచునేయుండును గాని, లోకానుభవమును బట్టి యిందు స్థిరమగు సంబంధబాంధవ్యములనునవి ఎన్నటికిని యొచటను ఏక రూపముగ నుండుటలేదు. వాస్తవముగ నుండుట అసంభవము. ఈ బంధుత్వ ములు, బంధుప్రేమలు, ప్రారంభమున ప్రీతికరములై తాత్కాలిక సుఖభోగ ముల నిచ్చుచున్నను, నివియే కాలక్రమమున ఉపేక్షితములుగను, కాలాంతర మందు నొకానొక సమయమున దుఃఖక్లేశనిరోధకరములుగను గూడ మారు చుండును. కావున జ్ఞానాభ్యాసకుడు స్వశరీర పుత్రమిత్ర కళత్ర విత్తక్షేత్ర ధనధాన్యాదులయందు తాను అతివ్యామోహితుడగుచు పామరుడై యెడతెగని సక్తతాభిమానుడుగాక, యిట్టి సంబంధములన్నియు తనకు తన ప్రారబ్ధకర్మ

ఫల క్షయమునకు మాత్రమే కల్పితముగ ఏర్పడినవనియు, ఇవి యన్నియు తనకు కేవల వ్యవహారమాత్రములేయనియు, నివి యన్నియూ తనపరమార్థ స్వరూపమునకు నెంతమాత్రము సంబంధించినవిగావనియు దృఢముగ గ్రహించి తన ప్రారబ్ధభోగానుభవములను పొందుచుండువాడే వివేకము

ఏ జీవుడు శాస్త్రోక్తసత్కర్మానుష్ఠానా చరణములవలన సాధనచతుష్టయ సంపత్తిని సంపాదించి గుర్వీశ్వరానుగ్రహములతో చిత్తశుద్ధినొంది పరమార్థమైన స్వస్వరూపానుభవమును సంపాదింపనిశ్చయించి ప్రయత్నము చేయుచుండునో అట్టి ముముక్షువైన సాధకుడే జ్ఞానాభ్యాసకు డనబడును జ్ఞానమనగా జీవునకు గల పరమార్థస్వరూపముగు బ్రహ్మజ్ఞానము ఇదియే స్వరూపజ్ఞానమనబడును. ఏక్కినజ్ఞానములన్నియు గౌణముగ జ్ఞానశబ్దముచే వాడబడుచున్న వృత్తిజ్ఞానములు. వృత్తియనగా అంతఃకరణముయొక్క విషయాకారపరిణామము. ముముక్షువు ఈ తనవృత్తి జ్ఞానసహాయముచేతనే తన పరమార్థరూపమైన అద్వితీయ అఖండ పరిపూర్ణ స్వరూపజ్ఞానమును సంపాదింపవలయును గాని వృత్తిహీనముగ తన సత్యస్వరూప జ్ఞానమును సంపాదించుటకు వీలు లేదు. ఈ తన పరమార్థస్వరూప జ్ఞానము నొందిన జీవునకుగాని అజ్ఞాననాశము పూర్తిగ కాజాలదు. జీవునకు తన సత్యస్వరూపజ్ఞానము సంపాదించుటకు వృత్తిజ్ఞానసాహాయ్యము అపేక్షితము, ఆవశ్యకము. దీనినే "బ్రహ్మణ్యజ్ఞాననాశాయ వృత్తి వ్యాప్తిరపేక్షతే" అనగా జీవునకు స్వస్వరూపమగు బ్రహ్మజ్ఞానమును కప్పివుంచిన తన అనాది అజ్ఞానమును నశింపజేసికొనుటకు వృత్తిజ్ఞానమావశ్యకమని శ్రీ విద్యారణ్యస్వామి తెలుపుచున్నారు.

ఈ వృత్తియనునది అంతఃకరణ ధర్మము. ఈ అంతఃకరణవృత్తులు ముఖ్యముగ సద్వృత్తులనియు దుర్వృత్తులనియు రెండు విధములుగ నుండును. ఇందు సత్సంప్రదాయగురుశాస్త్ర ప్రమాణములననుసరించి యుండునవి సద్వృత్తులు అసంప్రదాయములై, శాస్త్రబాహ్యమై, సర్వదా విషయలౌల్యమునే యపేక్షించుచుండునవి దుర్వృత్తులు. మానవునకు దుర్వృత్తులు

అనగా రాగద్వేషాది విషయవాంఛలు. కలుగుచుండుట సహజము. ఇట్టి దుర్వృత్తులు జీవునకు తన పరమార్థస్వరూపము నెంతమాత్రమును తెలియనివ్వక కప్పివుచ్చుచుండును. ఇవియే జీవుని సంసారలంపటునిగ జేయుచు శాస్త్రతత్త్వవాసనలను ఏంతమాత్రమును కలుగనీయవు జీవునకు ఇట్టి దుష్ప్రవృత్తివాసనలు ఫావిబంధహేతువులై సంసారదుఃఖపరంపరను గలిగించుచుండును. కావున జిజ్ఞాసులైన ముముక్షువులు వీనిని బాగుగ కనిపెట్టి తమ యభ్యాసపాటవముచే, నీ వృత్తులను క్షీణింపచేసికొనుటే, తమ ముక్తికి సాధనమగునని తెలిసికొనవలయును. కావున జ్ఞానాభ్యాసిపనకు తన స్వప్రయత్నముతోడనూ శాస్త్రీయవర్తనతోడను, నిత్యానిత్య వివేకవివేచనాభ్యాసములతోడను తనకు సహజముగకలుగుచున్న అశాస్త్రీయ అవైదిక రాగద్వేషాది దుష్ప్రవృత్తులను స్వప్రయత్నముతో క్షీణింపజేసి, శాస్త్రప్రమాణయుక్తమగు సత్ప్రవృత్తులను వృద్ధిచేసికొనుచుండుట శ్రేయస్కరము, యావశ్యకము ఇట్టియభ్యాసమే కాలక్రమమున ముముక్షువునకు సద్వాసనాపరిణామములనిచ్చును. వాసనయనగా జీవుని అవిద్యా కామకర్మములవలన చిత్తమునకేర్పడునట్టి సంస్కారములు ఇందు సద్వాసనలును దుర్వాసనలును రెండునూ చేరియుండును. సద్వాసనా సంస్కారములు మాత్రమే ముముక్షువునకు తన జ్ఞానాభ్యాసమునకు అత్యంతముగ నుపకరించును. మరియు ఈ వాసనలలో జీవునకు, శుభవాసనలనియు అశుభవాసనలనియు రెండువిధముల నుండును. వీనినే సద్వాసనలు మలినవాసనలని గూడ యందురు. సద్వాసనలనగా శాస్త్రవిహితముగా జీవునకు తన అభ్యుదయ నిశ్శ్రేయసములకు సాధనముగా కలుగు చిత్తసంస్కారములు. మలినవాసనలనగా శాస్త్రవిరుద్ధమై జీవునియొక్క సంసారదుఃఖపరంపరకు హేతువగునట్టి వాసనలు కాని యీ రెండువాసనలును చిత్తపరిణామములే గనుక జ్ఞానాభ్యాసకుడు మొదట తన సద్వాసనలచే తన మలినవాసనలను క్షీణింపజేసికొని పిదప యీ రెండువాసనలనుగూడ తన జ్ఞానబలముచే త్యజింపవలయును. జీవునకు ఈ వాసనలు మహాబలీయమై క్షణక్షణమునను తన దృశ్యానుభవము లన్నియును వాస్తవమని భ్రమింపజేయుచుండును. కావున ముముక్షువు తన

జ్ఞానాభ్యాసబలముచేతనే, వీనిని త్యజింపవలయునుగాని, మరివేరుదారిలేదు. పైనతెలుపబడిన సంకల్పవృత్తివాసనా సంస్కారములను నివియన్నియు జీవునకు తన మనఃపరిణామములేగాని వేరుగాదు

ఈ మనస్సనునది జీవునకు తన అనాది అవిద్యవలన—ప్రారబ్ధకర్మఫల భోగమునకుగాను కల్పితమైన యొక సూక్ష్మోపాధి. ఈ సూక్ష్మోపాధియే అంతఃకరణ మను పేరుతో గూడ తెలియబడుచున్నది. ఇదియే జీవుని ముఖ్యో పాధి. ఇది జీవుని మూలావిద్యవలన అనాదిగ నుండును. జీవుని మోక్ష పర్యంతము సంసారబంధమున బంధించుచుండును. ఇది కల్పితోపాధి గనుక జీవుడు తన పరమార్థస్వరూపమును గుర్తించి మోక్షమునొందగనే, రజ్జువు నందు భ్రాంతిచే గలిగిన సర్పము, రజ్జువును తెలిసికొనగానే ఎట్లులేనిదగు చున్నదో, అట్లే యీ సూక్ష్మోపాధి లేనిదేయగుచు తనంత తానుగానే నశించును. కాని అంత పర్యంతము అనగా జీవుని మోక్షపర్యంతము జీవుడు యీ వివిధ అంతఃకరణోపాధులను గ్రహించి తన భోగానుభవములనొందుచు ఆ ఉపాధితో తా ననుభవించవలసినట్టి ప్రారబ్ధకర్మఫలభోగకాలము పూర్తికాగనే తత్క్షణమే తన ఆ యుపాధిని నిర్దాక్షిణ్యముగ శ్మశానమందు ఘటమును పారవైచునట్లు వదలి అన్యోపాధుల స్వీకరించుచు జన్మపరంపరతో తనను దుఃఖ సంసారసాగరమున ఎండు సొరకాయ బుఱ్ఱవలె అటునిటు నోలలాడించు చుండును. ఇదంతయును జీవుడు తన శాస్త్రీయ వివేకముచే తెలిసికొని స్వప్రయత్నముతో ఈ తన అనాదిఅవిద్యను అస్తమింపజేసి తన స్వస్వరూ పానుభవమునునొందిననాడే యీ సంసార జన్మపరంపర పోవునుగాని అంత వరకును యెన్నికోటి జన్మములైనను జీవుడు యీ నీచ అతినీచోపాధులతో జన్మజరామరణ దుఃఖానుభవములను తన కర్మనుబట్టి అనుభవించుచునే యుండవ లయును. దీనినే చెప్పుచు "నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి" అని వచనము తెలుపుచున్నది. జీవునకు ఈ అవిద్యఅస్తమించిననాడే మోక్ష మని "అవిద్యాస్తమయోమోక్షః" అని వచనము తెలియపరచుచున్నది. జీవునకు యీ అవిద్యాస్తమయమనునది ఒక్క బ్రహ్మజ్ఞానమువలనగాని కలుగుటకు

వీలులేదు. ఈ బ్రహ్మజ్ఞానమనునది, జీవుడు తానే యీ సర్వదృశ్యమునకు అద్వితీయ అఖండాధిష్ఠాన పరిపూర్ణ స్వరూపుడనియు ఈ స్వశరీరదృశ్యమంతయు వివర్తముగ తనయందే రజ్జు సర్పభ్రాంతిలాగున భాసించుచున్నది గాని వాస్తవముకాదనియు తెలిసికొని స్వానుభవమునొందుట. ఇదియే బ్రహ్మజ్ఞానము. ఇచట తెలిసికొనుట యనగా స్వానుభవము నొందుటయనియూ, తత్స్వరూపమగుటయనియూ ముఖ్యార్థము. జీవునకు ఇదియే మోక్షము

ఈ మోక్షమనునది జీవునికి సహజస్థితియే గాని వేరుగ సంపాదింపవలసినదికాదు. అయినను మాయాప్రభావముచే జీవుడు, తన వాస్తవ నిత్యబుద్ధముక్త స్వరూపమును తన సత్యజ్ఞానానంత లక్షణములను తన కంఠములో నున్న హారమును మరచినట్లు, తన పరమార్థస్వరూపమును మరచినవాడగుచు అనాదికాలమునుండి సంసారావృతుడగుచున్నాడు. జీవుడు ఇప్పుడు తన వివేకప్రయత్నాదులచే, నేను పరిచ్ఛిన్న జీవుడనుగాను, నేనును ఆ బ్రహ్మము నొక్కటియే "అహం బ్రహ్మాస్మి" యని తెలిసికొనుటయే మోక్షము. ఇట్లు తెలిసికొనుటకు జ్ఞానాభ్యాసకునకు ఈ దేహతాదాత్మ్యబుద్ధి ప్రబల ఆటంకము. అందుకుగాను ముముక్షువు "అహం" "ఇదం"ల పదార్థశోధన గురుశాస్త్రబోధతో బాగుగ వివేచనచేసి యీ యుపాధివిశిష్ట "అహం" నేను కాననియు, ఈ సర్వదృశ్యము భ్రాంతికల్పితమేగాని వాస్తవముకాదను దృఢజ్ఞానముతో, మనన, నిదిధ్యసనాదులను గావించుచున్నయెడల కాలక్రమమున తాను అనాదిగా మరచిన తన వాస్తవ అఖండపరిపూర్ణ స్వరూపజ్ఞానమును తన మెడలోని హారమువలె చూడగలుగును. ఇట్లు స్వానుభవముతో తన పరమార్థస్వరూపమును బాగుగ తెలిసికొనినవాడే బ్రహ్మజ్ఞాని. ఇట్టివానిని గురించియే 'బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి' అని శ్రుతిమాత స్పష్టముగ తెలుపుచున్నది.

కాని ముముక్షువు నేను బ్రహ్మను అని పరోక్షముగ తెలిసికొనినను స్వానుభవమునొందుటకు మనన నిదిధ్యసనములు ఫలపర్యంతము అభ్యాసించుచుండుట యావశ్యకము దేహధారియైన జీవుడు తన ప్రారబ్ధ కర్మఫలాను

సారమున సుఖదుఃఖభోగానుభవములను నెట్టివి పొందుచున్నను, జ్ఞానాభ్యాసకు డైనవాడు తన పరమార్థస్వరూపమగు స్వప్రకాశసర్వాధిష్ఠాన అద్వితీయ అఖండ పరిపూర్ణచైతన్య స్వరూపమును మరువగూడదు ఇచట ఒక సంశ యముకలుగవచ్చును. జీవుడు తన ప్రారబ్ధానుసారమున సాధారణముగ తన జీవితానుభవములను చేయవలసియుండగ, సర్వదా యీ బ్రహ్మచింతనము సాధ్యమాయని తోచవచ్చును. అట్లు సంశయమునొందుటకు అవకాశములేదు. ఏలయన, మానవుడు తాను అన్నిటికంటెను అత్యధికముగ దేనిని పరమ ప్రీతితో ప్రేమించుచుండునో అట్టి స్వరూపమునే తాను ఏపనిచేయుచున్నను మానసికముగ చూచుచుండుటయు, నిరంతరము తలచుచుండుటయునుగూడ సహజము. ఇది లోకానుభవము. ఇంకను పరపురుషుని ప్రేమించుస్త్రీ తాను యెన్ని యెట్టి గృహకృత్యములాచరించుచుండినను, తాను ప్రేమించిన పురుషునే సదాభావమునందుంచుకొని తన గృహకృత్యములనన్నిటిని చేయు చుండునుగదా! కాని తన ప్రియుని మరచి యెప్పుడును యుండదు. తన ప్రియుని మరువక, తన ప్రియుని అనుసంధానముచేయుచునే యింటిపను లన్నియూ చేయుచుండును. దీనికి కారణము ప్రేమయేకాని వేరుకాదు. ఇట్లే జ్ఞానాభ్యాసకుడైన ముముక్షువు తన ప్రారబ్ధానుసారమున నెన్ని వ్యవహారము లను నిర్వర్తించుచున్నను, తనకు పరమప్రీతియైన అఖండ సచ్చిదానంద స్వరూపమును మరువకయే తన వ్యవహారములను బాగుగ, చేయగలుగు చుండును.

ఈ యభ్యాసకుడు తన నిత్యస్వరూపమును బాగుగ గ్రహించి అను సంధానము చేయుటకుగాను వ్యవహారమందు పంచభూతములలో బ్రహ్మ లక్షణములకు సన్నిహితసాదృశ్యములు కలది మహాకాశము. ఆ లక్షణము లెవ్వియనిన సర్వవ్యాపకత్వ అసంగత్వ నిర్మలత్వములు. తక్కినయంశము లలో అయినను బ్రహ్మవస్తువునకు ఇంతకన్న సన్నిహిత సదృశమగునది వ్యవహారమందు మరియొకపదార్థములేదు. కావున అభ్యాసకుడు తాను మహా కాశములాగున నిర్మల అసంగ సర్వవ్యాపకత్వములుగలవాడనని తెలిసికొనవల

యును. ముముక్షువు యొక్క వాస్తవస్వరూపము చిదాకాశము చిదాకాశమన్నను బ్రహ్మయన్నను ఒక్కటియే. ఇచట అభ్యాసకుడు మహాకాశ చిదాకాశముల వైలక్షణ్యములను బాగుగ గుర్తించుట యావశ్యకము. వాటిని తెలిసికొనినగాని ముముక్షువు తన సత్యస్వరూపము అన్నిఅంశములందున మహాకాశమువంటిది కాదనియు, మహాకాశము అనిత్యమనియు, తాను నిత్యమనియు మొదలుగాగల లక్షణములను బాగుగ గ్రహింపజాలడు. అట్టి వైలక్షణ్యము లెవ్వియనిన :

| చిదాకాశము | మహాకాశము |
|---|---|
| నిత్యము, అవినాశి అనగా కల్పాంతమందు కూడ నశింపనిది. నిర్విశేషముగ శేషించునది. | వినాశి—కల్పాంతమున నశించునది. |
| నిర్వికారమైనది—అవికారి. | వికారి — అనగా అవకాశమిచ్చు స్వభావముగలది. |
| స్వప్రకాశము, | పరప్రకాశము — అనగా అన్యముచే ప్రకాశింప జేయబడునది. |
| చైతన్యము-అనగా జ్ఞానస్వరూపము. | జడము — అనగా జ్ఞానరహితమైనది. |
| అధిష్ఠానము | అధ్యస్తము |

అని జ్ఞానాభ్యాసకులు యీ తారతమ్యములను బాగుగ గ్రహించి, వారి చిదాకాశానుసంధానాభ్యాసమును చేయుచుండవలయును. చిదాకాశ మహాకాశములు రెండును సర్వవ్యాపకత్వ నిర్మలత్వ అసంగత్వములలో సమానధర్మములు ఈ అంశములలో మహాకాశము చిదాకాశ లక్షణములకు సమీపమని తెలిసికొనవలయును. కావున వ్యవహారమందు బ్రహ్మకు సన్నిహితమైన భూతము ఈ మహాకాశమొక్కటియే. మహాకాశము వ్యవహారములోనిది. చిదాకాశము పరమార్థస్వరూపమైనది. రెండును అమూర్తపదార్థములే. కాని బ్రహ్మపదార్థము నిత్య నిర్వికార అఖండ పరిపూర్ణవస్తువు. మహాకాశమునకు చిదాకాశము వివర్తాధిష్ఠానము. మహాకాశము అధ్యస్తము. ద్వైతకోటిలోనిది. చిదాకాశము

సర్వాధిష్ఠాన అద్వితీయ నిర్వికార అఖండ పరిపూర్ణ సత్పదార్థము. కావున అభ్యాసకునకు తన అనుసంధానమునకు బ్రహ్మ మహాకాశమువంటిదియని తెలిపిన అంశములనుమాత్రము ముముక్షువు తన మనస్సుచే బాగుగ గ్రహించి తన మనసును నిర్వికార అసంగ అఖండాకార పరిపూర్ణ బ్రహ్మము తానుగా వృత్తిస్వరూపమును పొందించుటయే బ్రహ్మాకారవృత్తి యనబడునని జ్ఞానాభ్యాసకులు గ్రహించవలయును.

ఇదియే ముముక్షువునకు అభ్యాసామృతము. ఈ అఖండాకారవృత్తిని ప్రతిజీవుడును తన సుషుప్తియందు అజ్ఞానావృతుడై పొందుచు, సుఖమననుభవించు చుండును అఖండాకారవృత్తియనగా అపరిచ్ఛిన్న నిర్విషయవృత్తి. బ్రహ్మ నిర్విషయుడు. సుఖస్వరూపుడు. కనుక జీవునకు నిర్విషయాకార వృత్తి సుఖస్వరూపమగుచున్నది. ఇట్టి సుఖమును ప్రతిజీవుడును సుషుప్తియందనుభవించు చున్నను దీనిని తన అజ్ఞానముతో ననుభవించుచున్నాడు సుషుప్తి యనగా తమోవిశిష్ట నిర్విషయవృత్తి. ఇట్టి సుషుప్తి స్థితిలో జీవుడు విషయాలంబన మేదియును లేక తన స్వస్వరూపమున నజ్ఞానావృతుడై యుండును. అపుడు ప్రతిజీవుడును తన స్వస్వరూపమును నొందును. అయినను అజ్ఞానావృతుడై యీ సుఖము ననుభవించును ఈ సుషుప్తిసుఖము అజ్ఞానావృతమైనదిగనుకనే జీవునకు నిత్యముకాజాలదు. ఏలయన అజ్ఞానము ఆగంతుకము. సుషుప్తినొందినజీవునకు ఇంకను తాననుభవింపవలసిన తన ప్రారబ్ధ కర్మఫలశేషముండును. అందుకుగాను తిరిగి వారివారి కర్మఫలముల ననుభవించుటకుగాను తమోరూపమైన సుషుప్తినుండి జీవుడు జాగ్రద్దశకు మెలకువ కాంచుచుండును. ఈ సుషుప్త్యవస్థ జీవునకు అజ్ఞానావృత సుఖస్వరూపము. కావుననే నిద్రనుండి మేల్కాంచినవాడు "ఇంతకాలము నేను సుఖముగా నిద్రపోయితిని. నాకేమియు తెలియలేదు" అని తన సుఖానుభవమును తన యజ్ఞానమునుగూడ స్మరించుకొనుచుండును. స్మరణ మనునది ఎవరి యనుభవమువలన వారికే గలుగుట సంభవము కాని యొకరి యనుభవము చేత మరియొకరికి స్మరణగలుగుట యనునది యసంభవము. కావున సుషుప్తి

నుండి మేల్కాంచిన జీవుని స్మరణమువలననే యీ సుఖము అజ్ఞానావృతమని గూడ నిశ్చయమగుచున్నది. జీవునకు ఈ సుఖానుభవము సుఖస్వరూపజ్ఞానముతో గలిగినయెడల అజ్ఞానముండుటకువీలులేదు. కాని సుషుప్తినుండి మేలుగాంచిన మానవుని యనుభవమునుబట్టి చూడ నజ్ఞానముతోకూడిన సుఖమునే తెలుపుచున్నది ప్రతి జీవునకును తన దేహధారణకు ఈ సుషుప్తి సుఖము కొంతవరకావశ్యకమైనను, ఈ సుఖము నిషిద్ధము గాని గ్రాహ్యము గాదు ఏలయన ఈ సుఖము జీవునికి, తమోగుణప్రధానమగుచు అజ్ఞానము వలన కలుగుచున్నది. కాన నిత్యమగుటకు వీలులేదు. కావున జీవునకు సుఖము నిత్యమగుటకు, అనగా ముముక్షువు తాను నిత్యనిరతిశయ సుఖస్వరూపుడే యగుటకు ఈ సుఖస్వరూపమును తన యఖండాకారవృత్తితో శాస్త్రజ్ఞానపూర్వకముగ నభ్యసించి పొందవలయునుగాని వేరుమార్గములేదు. కావున జ్ఞానాభ్యాసకుడు తన యఖండపరిపూర్ణచైతన్యస్వరూపమును తన వృత్తిసహాయముతోడనే యఖండాకారముగ ఆత్మసాక్షాత్కారపర్యంతము విసుగుచెందక యభ్యసించుచుండవలయును. అఖండత్వమనగా దేశకాలవస్తుపరిచ్ఛేదరహితత్వము. ముముక్షువునకు యీ అఖండవృత్తిస్వరూపము దేశముచేతగాని, కాలముచేతగాని, వస్తువుచేతగాని, పరిచ్ఛిన్నముగాక నిత్యమైనదిగాను, పరిపూర్ణమైనదిగాను, స్వప్రకాశముగలదిగను, సర్వదా అన్నిదేశములయందును అన్నికాలములయందును అన్నివస్తువులయందును యుండునట్టి నిత్య నిర్వికార పరిపూర్ణ అఖండచైతన్యముగానుండవలయును. ముముక్షువు తన అఖండాకారవృత్తిచే నిట్టిదియే తన పరమార్థస్వరూపమనియు తదితరమంతయు కల్పితవ్యవహారమాత్రమనియు నిశ్చయమునొంది తన స్వస్వరూపమును సర్వదా ఫలపర్యంతము విసుగుచెందక ప్రీత్యుత్సాహములతో అనుసంధానాదులను ఆచరించుట ముముక్షువునకు పరమకర్తవ్యము. ముముక్షువునకు ఇట్టి ప్రయత్నాభ్యాసములలోడ తాను పరోక్షముగా పొందు జ్ఞానమే కాలక్రమమున అపరోక్షమై తనను నిత్యనిరతిశయ సుఖప్రాప్తినొందచేయును.

ఈ జ్ఞానాభ్యాసకులకు, వాస్తవముగనున్నది యొక బ్రహ్మపదార్థమేయై, సర్వదృశ్యము అవాస్తవమై, లేనిదే యగునెడల ఈ ప్రపంచమంతయు

ఇన్నివిధముల భిన్నభిన్న జీవులకు భిన్నభిన్న అనుభవముల నెట్లు కలుగు చున్నదను సంశయము కలుగవచ్చును. కాని యిట్టిశంకకు నెంతమాత్ర మవకాశములేదు ఏలయన లోకానుభవమునుబట్టి చూచినను వస్తువొక్కటి యైనంతమాత్రమున అందరకునూ, యెల్లప్పుడునూ ఏకవిధముగ -గన బడవలె ననిగాని, యనుభవ మివ్వవలె ననిగాని నియమములేదు. ఎట్లన మందాంధకారములో చూడబడు పూలదండను ఒకడు త్రాడనియు, మరియొకడు సర్పమనియు, మరియొకడు నేలపగులేమో ననియు, మరియొకడు పారవైచిన పూలదండ యనియు, మరియొకడు జలధార యనియు, ఇట్లనేక విధముల వారివారి మనోగతి ననుసరించి భ్రమించుచుందురు. ఇట్లే చీకటి యందున్న నేదోయొక విధమున గనబడు నొకమొద్దునేచూచి, చోరుడు రాజ భటుడేమో యనియు, మరియొకడు తన మిత్రుడేమో యనియు, కాముకుడు తన ప్రియురాలేమో యనియు, భయస్థుడు పిశాచమేమో యనియు, ఇట్లు పరి పరి విధముల వారివారి మనోగతుల ననుసరించి చూచుచుందురుగదా! కాని యిట్లైవ దెన్ని విధముల తలంచినను, చీకటిలో చూచినను, దీపప్రకాశములో చూచినను అచట సర్వదా యుండునది యొకమొద్దేగాని దానికి మార్పుగాని తదితరమేదియునుగాని యుండదుగదా! ఇంకనూ స్త్రీ యొక్కతెయే యైనను పసిబాలునిచే తల్లియనియు, తండ్రిచే కూతురనియు, భర్తచే భార్యయనియు అత్తచే కోడలనియు, అక్కచే చెల్లెలనియు, ప్రియునిచే ప్రియురాలనియు, వివిధములు తలచబడును. వారివారి వృత్తుల ననుసరించి ఒక స్త్రీయేగదా భిన్నభిన్న వృత్తులతో భిన్నభిన్న జీవులచే గ్రహింపబడి, వ్యవహరింపబడు చున్నది. ఇచట వారి వృత్తుల తారతమ్యమేగాని వస్తుభేద మేమియును లేదుగదా! ఇట్లే ఒక్కతెయగు స్త్రీగాని ఒక్కడగు పురుషుడుగాని వారి వారి కల్పితసంబంధ బాంధవ్యములనుబట్టి భిన్నభిన్న సంబంధ నామము లతో వ్యవహరింపబడుచున్న విషయ మందరకునూ లోకానుభవములో నున్నదియే కావున వస్తువొక్కటి యైనంతమాత్రమున నందరకును ఒక్క విధముగనే యెల్లప్పుడును కనబడవలెనను నియమముగాని, ఒకే విధమైన సుఖదుఃఖానుభవములను ఇయ్యవలయునను నియమముగాని కనబడుటలేదు.

ఇట్లే ఒక్కటియైన అఖండ బ్రహ్మపదార్థమునందే యీ స్వశరీర సర్వదృశ్య మును ఆ యా జీవుల యనాదివాసనా సంస్కారములనుబట్టి పరిపరి విధముల భిన్నభిన్నముగ పరిచ్ఛిన్నోపాధులతో యీ సర్వదృశ్యమును జీవుల అనాది అజ్ఞానముతో గ్రహించబడుచున్నదేగాని పరమార్థవాస్తవమును తెలిసికొనిన మహనీయునకు సర్వదా వాస్తవమున నుండునదియును గోచరించునదియును తన అఖండ స్వరూపమైన పరమాత్మస్వరూప మొక్కటియే. ఈ పరమాత్మ స్వప్రకాశ అద్వితీయఅఖండపరిపూర్ణ చైతన్యఘనస్వరూపుడొక్కడేయైనను అనాది మాయాప్రభావమువలన జీవుడు తన అనాది అవిద్యచే, జీవనానాత్వ పరిచ్ఛిన్నత్వ భ్రాంతినొందుచున్నాడు. ఈ పరిచ్ఛిన్నత్వనానాత్వములు అజ్ఞాన కల్పితములుగాని వాస్తవముకావు. కనుకనే ప్రతిజీవుడును పరమార్థ స్వరూప మున తాను నిర్వికార అద్వితీయ అఖండ పరిపూర్ణస్వరూపుడే యగు చున్నాడు. ఈ దృశ్యకల్పిత నానాత్వ భిన్నభిన్నత్వములను త్యజించినయెడల జీవునకు మిగులునది — తన అసంగ అఖండ పరిపూర్ణ జ్ఞానస్వరూప మొక్కటియే. కావున పరమార్థవాస్తవమున ప్రతి జీవియు పరిపూర్ణ జ్ఞాన స్వరూపు డనియే చెప్పవలయును. ఈ అఖండ స్వరూపజ్ఞానమందు భిన్నభిన్న పరిచ్ఛిన్నత్వములు వాస్తవముగ నుండుటకు వీలులేదు. కావున జీవున కిట్టి చిత్ర విచిత్ర భిన్నభిన్న దృశ్యవికారానుభవములన్నియు కేవల అజ్ఞానకల్పితము అనియే నిశ్చయమగుచున్నది.

ఈ స్వశరీర సర్వదృశ్యమంతయు వాస్తవము కాదని తెలిసికొనుటయే జగన్మిథ్యాత్వజ్ఞానము. ఈ ప్రపంచము సత్యమైనదానివలె నమ్మింపజేయుచు జీవుని యజ్ఞానకాలములో భాసించుచున్నదే గాని, జ్ఞానముదయించగనే తన స్వప్నానుభవములన్నియూ మెలకువ వచ్చినంతనే నశించుచున్నట్లు, జీవునకు ఈ దృశ్యము ఎంతమాత్రము వాస్తవమున లేనిదియే యగును. లేనిది యగుట యనగా యీ స్వశరీర సర్వజగత్తు వాస్తవముకాదను నిశ్చయజ్ఞానమే. ఈ జ్ఞానమే జగన్మిథ్యాత్వజ్ఞానము. లేకపోవుటయనగా ఈ ప్రపంచము ఘట పటాదులవలె భస్మమగు ననిగాదు. ఏలయన వాస్తవముగనున్న పదార్థమునకే

నాశమనునది యుండునుగాని కల్పితపదార్థములకు స్వరూప నాశమనునది యుండుటకు వీలులేదు. ఎట్లన వాస్తవసర్పమును నశింపజేయవచ్చుగాని భ్రాంతిచే గలిగిన రజ్జు సర్పమును నశింపజేయుటకు వీ లెట్లగును ? అసలు సర్పమున్నగదా నాశము ? సర్పమే భ్రాంతియైనప్పుడు దానిని నాశముచేయుట ఎట్లు ? కావున భ్రాంతికల్పిత వస్తువులన్నిటికిని అధిష్ఠాన జ్ఞానము వలననే అనగా అధిష్ఠాన సత్యజ్ఞానమువలన, ఈ కనబడుచున్నట్టి స్వశరీరసర్వ దృశ్యము సత్యముకాదని దృఢముగ తెలిసికొనుటవలననే ఆ పదార్థములు కనబడక నిర్బాధకముగనుండును. కనబడుచున్నను అవి యన్నియు నిర్బాధితములగుచు నష్టతుల్యమగును. ఈ ప్రపంచముగూడ అజ్ఞానకల్పితమే గనుక అధిష్ఠానవస్తువగు బ్రహ్మయొక్క జ్ఞానమువలన ముముక్షువునకు దృశ్యమంతయూ నిర్బాధకమైనదిగా నుండును.

జ్ఞానాభ్యాసకుడు జగన్మిథ్యాత్వమును నిట్లు తెలిసికొని తన సత్యస్వరూపానుసంధానాభ్యాసములవలన, ఆవరణదోషములను క్షీణింప జేసికొనినను, తన ప్రారబ్ధమునుబట్టి విక్షేపదోషము బాధించుచునే యుండును. ఈ విక్షేపావరణ దోషములు అంతఃకరణ ధర్మములుగాని సత్యస్వరూపుడైన పరమార్థజీవునకు వీనితో వాస్తవసంబంధములేదని తెలిసికొనవలయును. పరమార్థ జీవుడు నిత్యుడు, వాస్తవుడు, ఆత్మస్వరూపుడు, పరిపూర్ణుడు. అంతఃకరణము జీవుని యొక్క కల్పితోపాధి. ఐనను అవిద్యాప్రతిబంధముచే ఈ రెండును జీవునకు తనయందే యొక్కటిగా తెలియబడుచున్నది. కాని యీ రెండును వేరు వేరని, జీవుడు గ్రహింపలేకున్నాడు. కావున ముముక్షువు తన సత్యస్వరూపమగు ఆత్మ ధర్మములను, తన కల్పితోపాధియొక్క అంతఃకరణ ధర్మములను బాగుగ వివేచనచేసి తెలిసికొని, ఉపాధిధర్మములను జ్ఞానపూర్వకముగ త్యజించి, ఆత్మధర్మములను గ్రహింపవలయును. దీనికిగాను ఆత్మాంతఃకరణములయొక్క విలక్షణధర్మముల నిట్లు తెలిసికొనుట ముముక్షువునకు యావశ్యకము.

| ఆత్మస్వభావములు | అంతఃకరణస్వభావములు |
|---|---|
| ఆత్మ వాస్తవుడు, నిత్యుడు. | ఆభాసములు, అనిత్యములు |
| 1. ఆత్మ సచ్చిదానంద స్వరూపుడు. | 1. అంతఃకరణము అనృతజడ దుఃఖస్వరూపము గలది. |
| 2. ఆత్మ పరిపూర్ణము, సర్వ వ్యాపకము. | 2. అంతఃకరణము, పరిచ్ఛిన్నము, ఏకదేశి. |
| 3. ఆత్మ స్వప్రకాశుడు, సుఖ స్వరూపుడు. | 3. అంతఃకరణము పరప్రకాశ్యము. |
| 4. ఆత్మ వికారరహితుడు, చైతన్య స్వరూపుడు. | 4. అంతఃకరణము వికారములు పొందునది — జడము. |
| 5. ఆత్మ ఏకము —— పరిపూర్ణము. నిస్సంకల్పము. | 5. అంతఃకరణములు అనేకములు, పరిచ్ఛిన్నములు. సంకల్పాత్మకము. |
| 6. ఆత్మ కర్తృత్వ భోక్తృత్వాది రహితుడు. సుఖ దుఃఖ ధర్మ రహితుడు. | 6 అంతఃకరణము కర్తృత్వ భోక్తృత్వాది సహితము. సుఖదుఃఖ ధర్మములు గలది |
| 7. ఆత్మ నిత్యుడు, నిర్వికారుడు, అసంగుడు | 7. అంతఃకరణము, అనిత్యము. వికారి, సంగముగలది. |
| 8. ఆత్మఅద్వితీయుడు. అద్వితీయ స్వరూపుడు. | 8. అంతఃకరణము సద్వితీయము అనగా ద్వైతకోటిలోనిది. |
| 9. ఆత్మ అధిష్ఠానము, సత్యస్వరూపుడు. నిత్యుడు, నిరతిశయుడు. | 9. అంతఃకరణము అనాత్మ పదార్థము. అధ్యస్తము, కల్పితము. |
| 10. ఆత్మ అవినాశి, అఖండము, పరిపూర్ణము, అచలుడు. | 10. అంతఃకరణము నాశముగలది. సఖండము అనగా పరిచ్ఛిన్నము, చలించునది. |
| 11. ఆత్మ నిరుపాధికుడు, నిర్విశేషము. | 11. అంతఃకరణము సోపాధికము, సవిశేషము. |

జ్ఞానాభ్యాసకుడు ఇట్టి ఆత్మాంతఃకరణముల విలక్షణధర్మములను బాగుగ గుర్తించినచో తాను పరమార్థమున ఆత్మస్వరూపుడనియు అంతఃకరణము తనకు కేవల వ్యవహారసాధనమైన యుపకరణమే ననియు, నిశ్చయముగ తెలిసికొన సమర్థుడగును. అప్పుడు తనకు తన వాసనా సంస్కారములచే కలుగుచున్న దేహధర్మములు, కర్తృత్వాద్యభిమానములు, సుఖదుఃఖములు, మొదలగు ధర్మములతో తనకెట్టి వాస్తవసంబంధము లేదని గ్రహించ గలుగును. ఇట్టి దృఢజ్ఞాన నిశ్చయములతో తన ప్రారబ్ధఫలానుభవములను సక్తతాభిమానరహితముగ చేయగలుగుచుండును. అట్టి తరి అభ్యాసపాటవ ముచే కాలక్రమమున ఈదేహమే "తాను" అనగా "నేను"అను దేహతాదాత్మ్య బుద్ధియును, ప్రపంచమందు సత్యత్వబుద్ధియును, క్రమక్రమముగ శైథిల్యము నొందుచుండును. అప్పుడు ముముక్షువు తన స్వస్వరూపానుసంధానాదులను సులభముగను పటిమతోడను ఆచరింపగలుగుచుండును. ఈ అభ్యాసకుడు భ్రమప్రమాదములనొందక సర్వకాలసర్వావస్థలయందునను తన సత్య స్వరూపము – సర్వోపాధి వినిర్ముక్తసజాతీయవిజాతీయస్వగతభేదరహిత, స్వప్రకాశ, జగదుత్పత్తిలయ వివర్త అభిన్న నిమిత్తోపాదానకారణ త్రివిధభేద రహిత, కాలత్రయాపరిచ్ఛిన్న, నిత్యనిరతిశయ, అసంగ అద్వితీయసర్వాధిష్ఠాన అఖండ పరిపూర్ణచైతన్యస్వరూపమనియు; తాను నిరవయవుడగుటచే నిష్క్రియు డననియు, వాస్తవమున కర్తృత్వభోక్తృత్వ రహితుడననియు, జన్మజరామరణ రహితుడననియు, కేవల సుఖస్వరూపుడ ననియు, బాగుగ మనోగోచరము గావించుకొనవలయును. ఇట్టి తన పరమార్థ సత్యస్వరూపమును జ్ఞానాభ్యాస కుడు నిరంతరము మనన ధ్యానాదులు చేయుచుండవలయును.

జగన్మిథ్యాత్వము నిర్లెంత గ్రహించినను యెట్టి ముముక్షువును గూడ జగత్తు సత్యమనుభ్రాంతి తేలికగా విడువదు. అందుకుగాను ముముక్షువు తన లోకానుభవములను శాస్త్రీయముగ నింకనూ యీ క్రింది విధమున విచార వివేచనలుచేసి తన దృశ్యానుభవములను అనిత్యములనియు, అవాస్తవము లనియు, తన మనోనిశ్చయమును నిస్సంశయముగ నొందుట ఆవశ్యకము.

ఏలయన ఇట్టి నిశ్చయ మనోదార్ఢ్యములచేతగాని, ముముక్షువునకు వైరాగ్యాదులు జనింపవు. వైరాగ్యములేని జ్ఞానాభ్యాసము నీళ్ళులేని నూతివంటిది అగుచు నిష్ప్రయోజనమగును. కావున జ్ఞానాభ్యాసకునకు తన లోకభోగానుభవముల వివేక విచారమును శాస్త్రీయముగ పలువిధములచేయుట యావశ్యకము. అది యెట్లన, వివేకియైనవాడు ఈ ప్రపంచము తనకు కౌలు భూమి వంటిదిగాని తనకు శాశ్వతహక్కు అనుభవముల నేమియును యిచ్చునదిగాదు అని గ్రహించవచ్చును. ఏ జీవుడైనను ఈ ప్రపంచమున నేను అని అనుకొనుచున్న తన శరీరము మొదలు భార్యాపుత్రవిత్తక్షేత్రాదులతోసహా, కొద్ది సంవత్సరముల కాలముమాత్రమే యుంచుకొనగలుగుచున్నాడుగాని, శాశ్వతముగా కాని, లేనిచో తాను కోరుకున్న విధమున, తాను కోరుకొన్నంతకాలముగాని తన దేహమునుగాని, నాది యను తనయొక్క దృశ్యవస్తుసంబంధ భోగానుభవములనుగాని, నిలుపుగొన లేకున్నాడుగదా! దీనికి కారణమేమి యనిన—జీవునకుగల తన పరిచ్ఛిన్నత్వ, ప్రపంచసత్యత్వబుద్ధియే. జీవుడు నేను అనుకొనుచున్న యీ పరిచ్ఛిన్నదేహాదులును, నాదియనుకొనుచున్న భార్యాపుత్రగృహ విత్త క్షేత్రాదులును, సర్వము జీవ కల్పితములేగాని వాస్తవములుగాదు. కనుకనే జీవుడు తన అనాది అజ్ఞానముచే తన అవిద్యాకామకర్మఫలానుభవములకుగాను, తాను ఎంతకాలము ఏ ఉపాధిని అభిమానించునో అంతకాలమే యీ దృశ్యసంబంధములతో నుండగలుగుచుండును. జీవుడు ఎప్పుడు యీ స్వశరీర సర్వదృశ్యమంతయూ, వాస్తవములుకావని గ్రహించగలుగునో, అంతవరకే జీవునకు యీ దృశ్యసుఖదుఃఖ భోగానుభవములుండును. తదుపరినుండవు. అంతవరకునూ యీ దృశ్యమంతయూ అహంకార మమకార సక్తతాభిమానముల కలుగజేయుచు తన పూర్వాపూర్వ భ్రాంత్యనుభవములు, ఉత్తరోత్తరభ్రాంతికి కారణమై, ప్రపంచానుభవములను జీవునకు కలుగజేయుచుండును. కావున వివేకియగు జీవుడు తనకు ఈప్రపంచ జీవితమనునది హ్రస్వ, దీర్ఘకౌళ్ళవంటిదని నిశ్చయము నొందవలయును. కాని యీ జీవితమే తనకు శాశ్వత మను భ్రమచెంది దీనియందు జీవుడు వ్యామోహితుడై యీ భార్యాపుత్రాదులను గూడ నేనేయని వ్యామోహితు

ఉగుచు వారి సుఖదుఃఖములు తనవేయని భ్రమించుచు, వీనితో తన ప్రారబ్ధ కర్మఫలానుభవములు తీరగనే ప్రపంచమను, యీ తన కొలుభూమిని వదలి, మరియొకచోటున ప్రవేశించుచున్నాడు. కాని యెన్నిచోటులయందు అనగా యెన్ని ఉపాధులందు జీవుడు ప్రవేశించినను యివియన్నియు తనకు స్వల్ప పరిమితి కొళ్ళయొక్క అనుభవములే యగునుగాని, శాశ్వతముగాగాని లేక తాను తలచినంత కాలమైనసూ తన సుఖమును జీవుడు నిలుపుకొనలేకయున్నాడు గదా! ఇంకను జీవునకు ఈ హ్రస్వకొళ్ళ కాలమందుగూడ తన వ్యవహారానుభవములందుగాని కుటుంబములందుగాని, పరతంత్రమేగాని తన సుఖానుభవములకు స్వతంత్రత యేదియును వాస్తవమున కనబడుటలేదు.

ఏలయన ప్రతి జీవియు కోరునది సుఖమైనను ఈ విషయ సుఖములు గూడ తానుకోరునట్లు కలుగుటలేదు. ప్రతి మానవుడును ఏదోయొక లోపముచే దుఃఖము నొందుచునేయుండును కాని యిట్టివన్నియూ కొన్ని బాహ్యములు గను మరికొన్ని ఆంతరములుగను నుండును. ఎట్లన సాధారణముగ ధనవంతునికి సంతానము తక్కువ. ఉన్నను అందరు ప్రజ్ఞావంతులుకారు. ఇట్లున్నను తాను సర్వదా రోగ పీడితుడుగ నుండును. భార్య అతిగయ్యాళిగనో, కురూపిగనో, అనారోగ్యవంతురాలుగనో ఉండును. ఇట్టి సమయమున నీ ధనవంతునిదుఃఖము ఆంతరముగనుండును. దరిద్రునకు సంతానము మెండు. సాధారణముగ సుగుణసంతానము అరుదు. కుటుంబభార మెక్కువ. సంతానము అల్పప్రజ్ఞులుగా నుందురు. ఇట్టితరి దుఃఖము బాహ్యముగా నుండును. భార్య రూపవతిగా నున్నను సంతానలోపము లేనిచో నిత్యరోగి లేనిచో దుష్ప్రవర్తనాపరురాలుగా నుండినను భర్తకు సుఖముండదుగదా. భర్త దరిద్రుడైనను, కురూపియైనను, అప్రయోజకుడైనను, దుష్ప్రవర్తనగల వాడైనను, భార్యకు సుఖముండదుగదా! సంతానమున్నను దుష్టులైనచో తలిదండ్రులకు దుఃఖమేకదా. ఎక్కడనో యొకచోట నివి యన్నియు నున్నను వాడు అల్పాయుర్దాయముగలవాడైన యెడల అప్పుడును దుఃఖమేగదా! భార్యాభర్తలలోను, తండ్రి కుమారులలోను, అన్నదమ్ములలోను, మొదలగు వారి

యందు యొకరు మరణించిన మరియొకరికి దుఃఖమేగదా! మరణములు ముందు వెనుకలే యగుచుండునుగదా! కొంచెము హెచ్చుతగ్గులుగ సంసార కుటుంబములు చాలభాగమిట్లే యుండును. జీవుడు తానుకట్టిన యింటినిగాని, సంపాదించిన ధనమునుగాని, కోరినవస్తువునుగాని, తన సంతానమునుగాని, చివరకు తన దేహమునైనను ఎంత ప్రేమించినను, తాను కోరుకొన్నంత కాలము భోగము నొందజాలక తానుగూడ మరణించుచున్నాడే! అందరకును సర్వదా సిరిసంపదలు మారుచునేయున్నవిగదా! ఈ ప్రపంచమున మార్పు లేకుండ నుండు పదార్థమేమియును కనబడుటలేదేయని తెలిసిగొని జ్ఞానాభ్యాసకుడు శాస్త్రీయముగ యీ స్వశరీరదృశ్యానుభవ వివేచనలను, సయుక్తికముగ చేసినయెడల, ఈ దృశ్యము తనకు అశాశ్వతము, కల్పితము, నిత్యముకాదు, తన కర్తృత్వాదులు వ్యామోహములు, భ్రాంతి మాత్రమని స్పష్టపడగలవు. జ్ఞానాభ్యాసకుడు తన సుఖదుఃఖ సమస్తలోకానుభవములను తన శాస్త్రీయ జ్ఞానముతోడ తాను ఇట్టి పరమార్థమైన అద్వితీయఅఖండ పరిపూర్ణస్వరూపుడనను దృఢ నిశ్చయము తోడను, తన శరీరసర్వ దృశ్యము వాస్తవము గాదను నిశ్చయముతోడనే, తన అనుభవములను పొందుచుండవలయునుగాని శరీరము తానే యను దేహాత్మబుద్ధిని క్షణమాత్రముగూడ నొందగూడదు.

జీవునకు ఈ దేహము రథమువంటిది. తన బుద్ధి సారథివంటిది. ముముక్షువు ఈ రెంటిని శాస్త్రోక్తముగ రక్షించుకొనుచు వీటివలననే తన పరమార్థలాభము నొందవలసియున్నది. ఎంత మహనీయునైనను, దేహధారియై యున్నంతకాలము దేహధర్మములు విడువవు. మనోధర్మములుగూడ ప్రారబ్ధానుసారమున జీవుని బలాత్కరించుచు వారివారి సంస్కారవాసనానుసారమున, కర్మానుభవములను కలుగజేయుచుండును. జ్ఞానాభ్యాసకుడు తన ప్రారబ్ధానుసారమున నెట్టి భోగానుభవములను నొందుచున్నను అట్టివి యన్నియు తనయొక్క అంతఃకరణధర్మములుగనే తెలిసికొని, తానీప్రపంచమును శబ్దచలన చిత్ర దృశ్యములలాగున ననుభవించుచుండవలయును. అట్టితరి స్వశరీర సర్వదృశ్యమందునను తన సక్తతాభిమానములు క్షీణించు

చుండును. ఇట్లు క్షయమునొందిన సక్తతాభిమానములతో చేయబడు కర్మములు జీవునకు భావిఫలోత్పత్తిని గావింపజాలక అట్టి కర్మములన్నియు దగ్ధ బీజములలాగున వానియందుండునట్టి అంకుర శక్తి నశించినవగును. కావున వాస్తవమాలోచించిన ఈ అభ్యాసకునకు తన ప్రారబ్ధమును క్షయింపజేసికొను నావశ్యకత మాత్రమే మిగులును. ఇట్టి జ్ఞానాభ్యాసకునకు తన ప్రారబ్ధాంతము వరకును తన సుఖదుఃఖ వ్యవహారానుభవము లన్నియు ఛాయామాత్రములుగ అనుభవము లగుచుండును. అయినను జ్ఞానాభ్యాసకుడు తనచరమ వృత్తి సాక్షాత్కారపర్యంతము బ్రహ్మాభ్యాసమును చేయుచునే యుండవలయునుగాని పరోక్షజ్ఞానమునే స్వరూపజ్ఞానమని భ్రమించి యభ్యాసాదులు మానినయెడల అనాది ఆవరణ దోషముచే నీటిని నాచు ఆవరించునట్లు ఈ జీవుని అజ్ఞానము ఆవరించి తనకు పతనహేతువు అగును. కావున జ్ఞానాభ్యాసకులు యిట్టి భ్రమ ప్రమాదములకు లోను కాకూడదు

ఇచట కొందరకు నొక సంశయము కలుగవచ్చును. ఏది యనిన ఈ కాలమున ఇట్లాచరించి ముక్తిని బడయుట సాధ్యమా యని తోచవచ్చును. కాని వివేకులకు ఇట్టి శంకకు ఎంతమాత్రమును అవకాశము కనబడదు. ఏలయన శుక వ్యాస వసిష్ఠ వాల్మీకాదుల పౌరాణిక కాలమునుండియు, వేలశతాబ్దముల క్రిందనుండి శ్రీ శంకరభగవత్పాద సురేశ్వరాది అనేక పూర్వాచార్యులును కొద్ది శతాబ్దములక్రింద శ్రీ విద్యారణ్య, మధుసూదన సరస్వతీ, అప్పయ్య దీక్షిత ఇత్యాదులును, ఈ శతాబ్దములోగూడ శ్రీ రామకృష్ణ పరమహంసస్వామి వివేకానందస్వామి, రామతీర్థ, స్వామిశివానంద, రమణమహర్షి యిత్యాదులునూ, ఇంకను లోకమునకు తెలియబడని మహనీయులనేకులు ఆత్మ సాక్షాత్కారమునొంది వారు లోకమునకు బోధపూర్వకముగ చేసిన మహోపకారములు ప్రాజ్ఞులకందరకును విశదమే ఏ విద్యయైనను ఒక కాలమున ఒకరికి సాధ్యమైనచో, అది తక్కిన వారికిని, అన్యకాలములందుగూడ సాధ్యమైనదిగా కావలసియుండును. ఇట్టి కార్యసిద్ధియగుటయు, కాకపోవుటయు, ఆ యా వ్యక్తులయొక్క ప్రజ్ఞా ప్రయత్న భావనా దార్ఢ్యములమీద

నాధారపడియుండునుగాని వేరుగాదు జీవునకు తన పరమార్థలాభమును సంపాదించుటయందును అసాధ్య మేదియునులేదు. ఏలయన పైన తెలిపిన మహనీయుల జీవితము లన్నిటికిని శతాబ్దములు దూరమున్నను వీరి యందరి పరమార్థానుభవములు ఒక్కవిధముననే తెలియబడుచున్నవిగాని, వేల సంవత్సరములైనను ఈ స్వరూపజ్ఞానానుభవమునకెట్టి మార్పును యుండ లేదు. ఉండుటకు వీలులేదు. ఇది సర్వదా ఏకరూపము, నిత్యము, నిర్వికారము, అఖండము, పరిపూర్ణము. ఇదియే జీవుని పరమార్థ స్వరూపము, స్వస్వరూపము కావున జీవునకిట్టి తన నిత్యానుభవ పరమార్ధ స్వరూపప్రాప్తి సాధ్యమా యని యీ కాలముననైనను ఏ కాలముననైననుగూడ సంశయించుట పరమ అవివేకము. ఇట్టి ఉత్కృష్టఫలమును ఇచ్ఛయించి ప్రయత్నముచేయు మహనీయులు ఈ కాలమున అతిస్వల్పముగ నుండవచ్చును. కాని లేరన గూడదు. ఏలనన యిప్పుడున్నూ అరుదుగ కనపడుచుందురు. ఈ కాలమున దీనిని సాధించుటకు శక్తిపాటవములు తక్కువగ నుండవచ్చును. కాని యిట్టి స్థితినిపొంది యీ ఫలము ననుభవింపగలమా, ఇది యీ కాలమున సాధ్యమా యని ఎంతమాత్రము సంశయించుటకు అవకాశములేదు.

ఈ బ్రహ్మవిద్యాఫలము ప్రత్యక్షముగాని, కాలాంతరమున కలుగు ఫలముకాదు. జీవన్ముక్తి సుఖఫలమునిచ్చు శాస్త్రమిది యొక్కటియే. అనగా జీవదశయందే బ్రహ్మసుఖానుభవము జీవునికి కలుగుచుండుట. కాని యిట్లు కలుగుటకు యీ అద్వైతసిద్ధాంతమును ప్రామాణ్యముతోడ బాగుగ తెలిసికొని స్వానుభవమును సంపాదింపవలసియున్నది. తెలియుట యనగా వాస్తవికార్థమును శాస్త్రీయముగ గ్రహించి దానిని ప్రీతినిశ్చయములతో స్వానుభవము నొందుటయేగాని కేవల గ్రంథపఠనజ్ఞానముకాదు స్వానుభవమునకు రాని యట్టి జ్ఞానము తెలియనిదానిలోనే లెక్క. తెలియుట యనగా విషయమును చదువుటయును దానిని తన ప్రజ్ఞావిశేషములచే కరతలామలకములాగున నొకరికి మనోహరముగ ప్రావీణ్యముతో చెప్పుటయేగాదు. తెలియుటయనగా అ విషయమునందు ప్రీతివిశ్వాస నిశ్చయములను సంపాదించి, స్వానుభవము

లోనికి తెచ్చుకొని దాని అనుభవలాభమును పొందుట. తెలియుటయనగా నెట్టిదో యీ క్రింద నుదహరించిన గాథవలన స్పష్టముకాగలదు. పూర్వకాలమున ఒకానొక రాజునొద్ద తన పరివారములో సామర్థ్యవిశేషముగల పురాణవిశారదుం డొక్కఁడుండెను. ప్రతిదినమునను రాజుగారికి భగవద్గీతా కాలక్షేపము చేయుచుండెను. ఆ గ్రంథపురాణము ఇట్లు కొంతకాలము గడువగా నొకదినమున సభలో రాజుగారి సమక్షమున—

శ్లో॥ అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥

అను గీతావచనమునకు ఈ పండితుడు అతిలాఘవముతో బాహ్యాంతరార్థములను అనేకవిధముల చెప్పుచుండెను చెప్పిన దంతయు రాజుగారు సమగ్రముగ విని ఆ పండితునితో "తమకీ శ్లోకార్థవిషయము యథార్థముగ తెలియలేదని మీరు చెప్పునర్థములవలననే నాకు స్పష్టపడుచున్నది" యని సభామధ్యమందు పలికెను. అప్పుడు ఈ శ్లోకార్థమును ఆ పండితవరేణ్యుడు ఇంకను అనేకవిధముల నాలోచించి ప్రతిపద శబ్దార్థమును శాస్త్రీయముగ సయుక్తికముగ ఆ రాజునకు అతిమనోహరముగ బోధించెను. కాని యా రాజేంద్రుడు అప్పుడు గూడ ఆ పండితునితో "మీ కీ విషయము వాస్తవముగ తెలియలేదని" చెప్పి సభాముఖమునుండి వెడలిపోయెను. అంతట ఆ పండితుడు అతిరోషాక్రాంతుడై చింతనొందుచు స్వగృహమునకు జనెను. గృహమందు మిక్కిలి విషాదముతోనుండి రాత్రి శయనించు సమయమున భార్య తన భర్తను చూచి, "నేడెందులకు మీరిట్లున్నారు? మీ మనఃక్లేశమునకు కారణము నాకు తెలుపు" మని ప్రార్థించగా కొంతసేపూరకుండి కడకు రాజసభాముఖమందు, తనకు జరిగిన యవమానమును తెలిపెను. అందులకు సాధ్వీమణియగు నా పండితుని భార్య తన భర్తను చూచి, "నాకు గూడ రాజుగారు చెప్పినయటుల తమకీ శ్లోకార్థము బాగుగ తెలియలేదనియే అభిప్రాయము కలుగుచున్నది. మీకీ శ్లోకార్థము బాగుగ తెలియలేదు" అని చెప్పెను. అందుమీదట ఆ పండితుడు అతిరోషావిష్టుడై తన భార్యను పలువిధముల

నిందించి "జగత్ప్రఖ్యాతమైన నా పాండిత్యమునే దూషించుచున్న మూర్ఖురాలవు నీవు. ఇట్టి గంభీరశాస్త్రార్థములు మూఢురాలవును, విద్యాగంధములేనిదానవైన నీవంటి స్త్రీకెట్లు తెలియును?" అని పరిపరివిధముల నామెతో రోషభాషణము లాడ దొడగెను. అప్పుడుగూడ నామె తన భర్తతో "మీ కీ శ్లోకవాస్తవార్థ విషయము సరిగా తెలియలేద"ని వాదించి చెప్పెను. అందుమీద ఆ పండితుడు కోపోద్దీపితుడై భార్యను తన వద్దనుండి వెడలగొట్టెను. అంతట నా పండితుడు రాజుగారును తన భార్యయునుగూడ, ఇంత నిశ్చయముగ తన కీ శ్లోకార్థము వాస్తవముగ తెలియలేదని చెప్పుమాటకు, రహస్యార్థమేదియో యుండునని చింతించుచుండెను ఇంతలో తిరిగి ప్రతివ్రతాశిరోమణియైన యా పండితుని భార్య గదికడకేతెంచి, భర్తనుచూచి "బాగుగా విచారించితిరా? ఈ శ్లోకము నకు వాస్తవార్థమును తెలిసికొంటిరా?" యని యడిగిన, ఆ పండితుడూర కుండెను. అప్పుడు ఆ సాధ్వి తన భర్తతో "మీ కీ శ్లోకమున కర్థము బాగుగ తెలిసియుండినయెడల మీరు రాజుగారికడకు వెళ్ళి యుండెడివారే గాద" ని చెప్పెను. ఎందుకన ఈ శ్లోకము సాక్షాద్భగవంతునిచే "ఎవరు తనను అనగా భగవంతుని నిరంతరము అన్యాపేక్షలేక భజించుచుందురో వారి యోగ క్షేమములు నేను చూచెదను" అనిగదా చెప్పబడెను. ఈ శ్లోకార్థము మీకు బాగుగ తెలిసి పరమేశ్వరుని విశ్వసించినయెడల, మీ క్షేమలాభములకు ఆ పరమేశ్వరునే ఆశ్రయించియుండవలయునుగాని ఆ పరమేశ్వరసృష్టియందలి మానవునికడకు మీరు వెళ్ళియుండరుగదా! ఆ రాజు నకైనను క్షేమ సంపత్తుల నిచ్చునది యీ పరమేశ్వరుదేగదా! ఇట్టి జ్ఞాననిశ్చయములతో మీ కీ శ్లోకముయొక్క పరమతాత్పర్యవాస్తవార్థము తెలిసియుండినయెడల ఆ రాజుగారికడకేల మీరు మీ లాభక్షేమములకు భగవంతునివిడచి, వెళ్ళి యుందురు? ఒకవేళ వెళ్ళినను పౌరాణికవృత్తితో రాజుకడకు వెళ్ళియుండరు గదా! ఈ విషయమునే రాజేంద్రుడు గ్రహించి మీకు ఈ శ్లోకవిషయార్థము బాగుగ తెలియలేదని చెప్పెనుగాని, అన్యోద్దేశముతో గాద"ని తన భార్యచే తెలుపబడినవాడై విశ్వాసములేని తన పాండిత్యమునకు సిగ్గుపడినవాడాయెను. ఆ పండితునకిట్లు జరుగగా మరుసటిరోజున రాజుగారే తన పండితునకు ఈ

శ్లోకార్థమును తిరిగి తెలుపుటకుగాను సభకు రావలసినదిగా వర్తమానముచేసెను. కాని ఆ పండితుడు ఈ శ్లోకార్థమును ఇప్పుడు బాగుగ గ్రహించినవాడగుటచే, తన క్షేమలాభములకు పరమేశ్వరుడే శరణ్యముగాని రాజుగారుగాదను నిశ్చయ విశ్వాసములతోడ యీ శ్లోకార్థమునుగ్రహించి, రాజసభకు వెళ్ళినవాడు కాడాయెను. రాజు ఈ పండితుడు తన సభకు రాలేదని తెలిసికొని సభ్యులందరి తోడను "ఈ పండితునకు ఈ శ్లోకవిషయవాస్తవార్థము ఇప్పుడు తెలిసినది గనుక ఇంకరాడు" అని పలికెను ఆ పండితుడుగూడ తాను రాజుగారికి చెప్పిన యర్థము కేవల వాచామాత్రమైనదై తన కా పరమేశ్వర వాక్యమందు నిశ్చయ విశ్వాసములను గలిగింపలేదని రాజుగారు గ్రహించి, తనకు యీ శ్లోకార్థము బాగుగ తెలియలేదని చెప్పెనుగాని, శబ్దములకర్థము చెప్పుటలో దోషమున్న దని గాదని అప్పుడు తెలిసికొనెను. కావున వాస్తవముగా తెలియుట యనగా తానుచెప్పు ఆ వాక్యార్థ విషయమందు విశ్వాసమునొంది నిశ్చయానుభవమును తాను పొందుటేకాని శబ్దకౌశల్యముతో మనోహరముగ వాచా యుచ్చరించు వ్యాఖ్యాన విమర్శలుచేయుట శబ్దార్థజ్ఞానమే యగునుగాని విషయము వాస్తవ ముగ తెలియుట యనునదిగాదు.

కావున నెట్టివారికైనను ఈ బ్రహ్మజ్ఞానము తెలియుట యనగా స్వానుభవమును సంపాదించుటయే ముఖ్యార్థము బ్రహ్మజ్ఞానాభ్యాసకునకు ఇట్టి జ్ఞానానుభవములు ఒక్కమారుగ గలుగవు. కాని యీ బ్రహ్మజ్ఞానమును తన వృత్తి జ్ఞానముతోడ, మెల్ల మెల్లగ మననాద్యభ్యాసములను చేయుచు యీ జ్ఞానలాభమును సాధింపవలయును. తీవ్రముముక్షువైన జ్ఞానాభ్యాసికి అభ్యాస పాటవముచే ఈ జ్ఞానలాభము క్రమక్రమముగ గలుగుచుండును. ఈ జ్ఞానాభ్యాసమునకు తన చరమవృత్తి సాక్షాత్కారము అవధి. అంతవఱకును ఈ అభ్యాసాదులు నిరంతరముచేయుచునే యుండవలయును. ఇట్లు సాధనాభ్యాస ములు చేయు ముముక్షువు తనకు జ్ఞానలాభము గలుగుచున్నదా లేదా యని పరిశీలించుకొనుటగూడ యావశ్యకము. ఇట్లు తన యభ్యాసలాభమును గ్రహింపనిచో ఒకానొకప్పుడు ముముక్షువు నిరుత్సాహపరుడగును. అందుకు

గాను తనకు ఈ జ్ఞానలాభ మెంతెంత గలుగుచున్నదో ఈ క్రిందివిధ మున జ్ఞానాభ్యాసకుడు పరీక్షించి తన జ్ఞానలాభమును తెలిసికొనుచుండినచో, తన యభ్యాసాదులకు సహాకరించి తృప్తి సంతోషముల నిచ్చుచు తన అభ్యాస మునకు ప్రోత్సాహము నిచ్చుచుండును ఇదియే గొప్పలాభము. కావున ముముక్షువు తన జ్ఞానలాభ పరీక్షను ఈ క్రింది విధమున గ్రహించుచుండ వలయును.

ఈ ముముక్షువు ఎప్పుడు తన వ్యవహారానుభవములను క్షీణించిన సక్తతాభిమానములతోడ ననుభవింప గలుగుచుండునో, ఎప్పుడు తన సంకల్ప ములు క్షీణించుచుండునో, ఎప్పుడు తన రాగద్వేషాదులు తగ్గుచుండునో, ఎప్పుడు తన లాభనష్టములు తనకు అధికోత్సాహ అధికక్లేశదుఃఖము లను గలిగింపకుండునో, ఎప్పుడు తన మనన నిదిధ్యసనాభ్యాసములను శాంత వృత్తితోడ నభ్యసింపగలుగుచుండునో, ఎప్పుడు తన చిత్తప్రసాదముచే తృప్తి సంతోషములు జనించుచుండునో, ఎప్పుడు తనకు విషయభోగలాల సేచ్ఛ క్షీణించుచుండునో, ఎప్పుడు తనకు స్వశరీరదృశ్యానుభవములన్నియూ నిమిత్తమాత్రముగ తోచుచు తనకు వీనితో వాస్తవ సంబంధములేదను నిశ్చయముతోడ నుండగలుగుచుండునో, ఎప్పుడు తనకు సాధుసంగమ సచ్ఛాస్త్రములయందును, ధర్మాచరణమందును ప్రీతి గలుగుచుండునో, ఎప్పుడు తన కామక్రోధ యీర్ష్యాదులచే నధికదుఃఖక్లేశములనొందడో, ఎప్పుడు సాధ్యమైనంతవరకు నిత్యతృప్తుడుగా నుండగలుగునో, ఎప్పుడు జ్ఞానపూర్వకముగ తన విషయవాంఛలు కోరికలు తగ్గుచుండునో, ఎప్పుడు మరణభీతి తగ్గునో, ఎప్పుడు స్వమరణమును ఉత్సవతుల్యముగ తలంపగలుగు చుండునో, అప్పుడు ముముక్షువు తనకీ జ్ఞానాభ్యాస లాభము కలుగుచున్నట్లు గ్రహింపవచ్చును.

ముముక్షు విట్లు తనకు బ్రహ్మజ్ఞానాభ్యాస లాభము క్రమక్రమముగ నెంతెంత కలుగుచున్నదియునూ పరీక్షించుకొనుచు యింకనూ తన పరమార్థ వాస్తవస్వరూపమగు ప్రత్యగాత్మాఽభిన్న పరమాత్మను యిట్లు తెలిసికొనుచుండ

వలయును. పాలయందంతటను వ్యాపించియున్న ఘృతమును పాలను కాచి, బాగుగ చిలికినగాని పొందుట సంభవము కాని యటుల పరమాత్మ యీ ప్రపంచమున సర్వవ్యాపకుడై పరిపూర్ణముగనున్నను ఆ బ్రహ్మానుభవము నొందుటకు ముముక్షువు ఈ దృశ్యము నంతయునూ తన జ్ఞానాగ్నితో తప్తముచేసి తన వివేకవైరాగ్యములతో చిలికిన యెడల అనగా శాస్త్రీయ వివేచన మననాదులు బాగుగ చేయుచుండగా క్రమక్రమమున ఆ పరమాత్మానుభవము కలుగుచుండును. ఈ పరమాత్మ పరిపూర్ణుడై యీ ప్రపంచమున సర్వత్ర వ్యాపించి యున్నప్పటికిని లోకమునందు సూర్యుడు సర్వదా ప్రకాశించుచున్నను, సర్వదా అందరకునూ ఒకేకాలమున కనబడక యున్నట్లున్నూ, ఒక కాలమున అందరిచే చూడబడుచున్ననూ గ్రుడ్డివారికి మాత్రము అగుపడకుండునట్లు శ్రవణాదులవలన మనన విచారములుచేయు జ్ఞానులందరకునూ కనబడుచుండును. వారికైననూ వారి జ్ఞానకాలమున నగపడుచు, అజ్ఞాన కాలమున కనబడక అనగా గోచరించక యుండును అజ్ఞానులనగా అంధసమానులు. అనగా దేహేంద్రియాదులే నేను "అహం" అని ఆత్మగా భ్రమించువారికి కనబడడు. అయిననూ యీయన సర్వత్ర సర్వజీవుల హృదయములందు సర్వదా యుండును. ఈయన సుఖస్వరూపుడు. అందువలననే తెలిసియో తెలియకయో ప్రతిజీవుడును తనను తాను పరమప్రీతితో ప్రేమించుకొనుచుండును. సర్వులకును క్షీరమునందు ఘృతమాధుర్యము లుండుటచే ప్రియమగుచున్నదిగాని, దానియందుండు కేవలశ్వేతద్రవత్వములకు మాత్రము క్షీరము నెవ్వరును కోరుటలేదుగదా! అట్లే యీ సర్వశరీరోపాధులయందును సుఖస్వరూపుడగు పరమాత్మ వారియందుండుటచే అందరకునూ వారివారి శరీరోపాధియందు పరమప్రీతి కలుగుచున్నది గాని యీ పరమాత్మ దానియందు ప్రకాశించనినాడు తనకు పరమప్రీతికరమగు యీ శరీరమునే నెవరునూ స్పృశించక అమంగళముగను అశుభముగను తలంచుచు పారవేయుచున్నారు గదా! కావున స్వశరీరమందు పరమప్రీతి ప్రతివారికినీ ఆ పరమాత్మ యందుండుటబట్టియే కలుగుచున్నదని గ్రహించవలయును.

ఇందుకుముందు ముముక్షువు తన అభ్యాస లాభమును పరీక్షించుకొను విషయ విమర్శలో "ఎప్పుడు తనకు మరణభీతి తగ్గునో, ఎప్పుడు యీ ముముక్షువు స్వమరణమును ఉత్సవతుల్యముగ గ్రహింపగలుగునో" అను వాక్యము వ్రాయబడెను. కాని యిట్లు యెట్టివారికైనను కలుగునా? కలుగుట సహజమా? ఇది అమంగళము కాదా యని తోచ వచ్చును కాని లోక దృష్ట్యా యిట్లు తలంచినను, ముముక్షువైన జ్ఞానాభ్యాసకునకు యీ మరణ స్వరూపమును తెలిసికొనుట మంగళకరమై అభయప్రదమైనదగును. నచికేతుడు యమధర్మరాజు నొద్దకేగి సమస్తభోగములను నిరాకరించి, పట్టుదలతో నడిగితెలిసికొనిన విషయమిదియే. కావున నీ మరణ మననేమి? జీవులకు మరణమెందుకు కలుగుచున్నది? దీనినుండి తప్పించుకొనుటయెట్లు? ఇట్లు తప్పించుకొనుట జీవునకు సంభవమా? అను విషయవాస్తవమును శాస్త్ర ప్రమాణదృష్టితో బాగుగ వివేచనచేసి గ్రహించిన మహనీయులకు ఈ మరణ భయముండదు ఈ మరణభయమును జయించుటకు దాని స్వరూప స్వభావ ములను బాగుగ గ్రహించినగాని సంభవము కాదు. అద్వైతసిద్ధాంతమునుబట్టి జీవునకు ఈ జననమరణములు అనాది భ్రాంతికల్పితములు. అంతేకాని వాస్తవ ములుగావు. పరమార్థ జీవునకు జననమరణములు లేవు. ఆయన అద్వితీయ అఖండ పరిపూర్ణస్వరూపుడు. వ్యవహారజీవులందరును అవిద్యాకల్పితులు. అనగా అనాది మాయాప్రభావముచే చిత్రవిచిత్ర భిన్న భిన్న పరిచ్ఛిన్న భ్రాంతుల నొందినవారు ఈ జీవులు వీరు ఈ పరిచ్ఛిన్నభ్రాంతితో వారివారి అవిద్యాకామకర్మఫల భోక్తృత్వములకుగాను వివిధ ఉచ్చ నీచ అతినీచో పాధులను గ్రహించుచుందురు. జీవునకు ఈ మృత్యువు ప్రమాదము వలననే కలుగుచున్న దనిస్మృతి, "ప్రమాదంవై మృత్యుమహంబ్రవీమి" అని తెలుపు చున్నది. ప్రతి జీవియును వాని పరమార్థ వాస్తవమైన అద్వితీయ అఖండ పరిపూర్ణ స్వరూపమును తెలిసికొని స్వానుభవమునొందువరకును అనగా మోక్షప్రాప్తి పర్యంతము ఈ సంసారమహార్ణవమున చర్వితచర్వణముగ సుఖ దుఃఖములతో భ్రమణము చేయుచుండును. జీవు డిట్లు పరిచ్ఛిన్నభ్రాంతుడై నట్లు అగపడుచు తన అవిద్యా కామకర్మఫలానుభవముల నిమిత్తము ఒక

ఉపాధిని గ్రహించుట జననము. ఆ భోగానుభవమయిన తదుపరి తిరిగి తన భ్రాంతి కల్పితభోగానుభవములకుగాను ఈ స్థూలోపాధిని విడుచుట మరణము. ఇవి రెండును జీవునికి అవిద్యాభ్రాంతి కల్పితములు. ఇట్లే ప్రపంచాదులు నడుచు చున్నవి ఇది ప్రకృతి సహజము, కల్పితము. అయినను ముముక్షువైనవానికి, తన మోక్షప్రాప్తికిగాను ఈ జననమరణస్వరూప రహస్యమును తెలిసికొనుట యావశ్యకము. దేనికైనను ఉప్పురహస్యము తెలిసికొనిన గదా భయము నివర్తించును! వీనిని గురించి శాస్త్రచర్చ విమర్శలు చాల నున్నవి కాని యిచట మన గ్రంథోద్దేశ అవకాశములను బట్టి మానవానుభవములను మాత్రము విచారించి తెలిసికొందము.

జీవునకు మరణమనగా తన స్థూలోపాధియగు దేహముయొక్క పతనము కాని మరణానంతరము తాను మిగులు చున్నాడు. ఎట్లనిన ప్రతి మానవుడును తన పూర్వ ప్రస్తుత ఉత్తర జన్మములను స్మరించుకొను చున్నాడు. కనుక జీవునకు తన స్థూలదేహము నశించినను "నేను" "అహం" అను తనను మాత్రము ఏదో యొక రూపమున మిగులుచుకొనుచు దానినే తన మరణానంతర స్థితిగా ఇప్పుడు మానవుడు స్మరించుచున్నాడు మృత్యువు అమంగళ మని లోకవాసనలచే తలచినను జ్ఞానాభ్యాసకుడు ఈ క్రింది వివేచన వలన వాస్తవమును గ్రహింపగలుగును ఎట్లన మానవు లందరకును తాము మరణించుదుము అను జ్ఞానమున్నను అట్టి మరణము వారికి తెలిసియో తెలియకయో నెప్పుడో వచ్చుచున్నది అంత వరకును వారి కిప్పుడు "నేను" అని స్ఫురించుచున్న యీ దేహమును నావి యనుకొను, స్వశరీర సమస్తదృశ్య పదార్థములను, సత్యము, నిత్యమనియే నమ్మి వ్యవహరించుచుందురు ఇట్టి నమ్మకముతోనే స్వశరీర దృశ్యములను "నేను, నావి" యను అహంకార మమకారముల నొందుచు పృథక్సత్తాభిమానములతో మితిలేని కాంక్షలవలన ఈ శరీరమగు తానును, తన పుత్రమిత్రకళత్రక్షేత్రవిత్తాదులన్నియునూ నేమగునో యను పరమ భీతితో అతిదుఃఖాక్రాంతుడై తన మనోభీష్టములన్నియు ఈ ప్రపంచమందే

యుంచినవా డగుచు అవశుడై జీవుడు ప్రాణములు వదలుచు తన యీ స్థూల దేహమును విడుచుచున్నాడు. కాని యీ స్థూలోపాధిని యింతకాలము నాది యని యనుకొనుచున్న తన సూక్ష్మోపాధితో అనగా జీవునియొక్క అంతరంగిక ప్రధాన పరిచారకునివంటి యీ తన అంతఃకరణముతో జీవుడు తన పరిచ్ఛిన్న భ్రాంతివలన ఉపాధి తాదాత్మ్యమువలన సంకల్పములను కోరికలను తన అజ్ఞానమును అనగా తన అవిద్యా కామకర్మములను మూటగట్టుకొని యిల్లు లేని వానివలె సంచరించుచు ఈ తన కర్మఫలములు కోరికలన్నియూ ఎట్లు ఎచట జన్మించిన సఫలతనొందునో అచట జన్మించి తన ప్రారబ్ధఫలానుభవ ములను, రాగద్వేషాది సక్తాభిమానములతో ననుభవించుచు చేయుచు ఆ యుపాధితో అనుభవింపవలసిన ప్రారబ్ధకర్మఫల మనుభవించిన తదుపరి మునుపటివలెనే యీ దేహమునువదలి మరియొక దేహమందు ప్రవేశించుచు, చర్విత చర్వణముగ సంసార దుఃఖము ననుభవించుచుండును. ఇది యంతయూ జీవుడు తన పరమార్థ స్వరూపము నిత్యనిరతిశయ సుఖస్వరూపము, అద్వితీయ అఖండ పరిపూర్ణచైతన్యమే కాని, మరియొకటి కాదని తన అనాది అజ్ఞానమువలన గ్రహింపజాలనందుననే కలుగుచున్నది. ఇదియే అనాది అజ్ఞానము ఈ జననమరణములు తనకు అవిద్యాకల్పితములుగాని వాస్తవము కాదను దృఢజ్ఞానము లేనందువలన పరిచ్ఛిన్నోపాధులే తాను అను భ్రాంతి నొంది పరిచ్ఛిన్నానుభవములను చేయుచు మరణము నొందుచున్నాడు. కాని వాస్తవ మాలోచించిన తన నిర్వికార అఖండ పరిపూర్ణ సత్యస్వరూపమును గ్రహించిన మహనీయులకు మరణమెట్లుండును? ఇట్టి మహనీయులకు మరణ మనగా పునర్జన్మ గలుగుటయే కాని యీ ఉపాధిని విడచుటకాదు ఈ ఉపాధు లన్నియు భ్రాంతి కల్పితములు గనుక అవి నిత్యమై యుండుటకువీలులేదు. వీలు ఉండదు. ఈ మరణములనుగురించి దుఃఖించుట స్వప్నములో తాను జేసిన రాజ్యము పోయినదే అని దుఃఖించుటవంటిది. అజ్ఞానవశమున మర ణించు జీవుడు తన అవిద్యాకామకర్మముల సంకల్పములతో తిరిగి తన జన్మ మును తానే కల్పించుకొనుచున్నాడు కావున జ్ఞానాభ్యాసకుడు తన సమస్త కర్మములను నిత్యానిత్యవివేకముతో సక్తాభిమాన రహితుడై చేయుచు ఈ

సూక్ష్మస్థూల దేహములు రెండునూ తాను కానని యు తనకు కర్తృత్వాదులు కల్పితములుగాని వాస్తవముగ నుండుటకు వీలులేదని తెలిసికొనినయెడల, అట్టి జ్ఞానాభ్యాసకునకు మిగులునది తన ప్రారబ్ధానుభవము మాత్రమే ఇట్లు తెలిసికొని తన ప్రారబ్ధానుభవమును నిర్లిప్తతతో నొందుచు తాను పరిపూర్ణు డని తన అఖండ పరిపూర్ణతను గ్రహించిన మహనీయునకు శరీరము భారము అయినను, తనకు విధింపబడిన శిక్షవంటి తన ప్రారబ్ధఫలమెట్టిదియై నను సంతోషముతోననుభవించుచు, తన స్థూలోపాధిని బంధించుచున్న తన ప్రారబ్ధానుభవము ఎప్పుడు తీరిపోయి తన యీ దుఃఖక్లేశ పూరితమైన యీ పరిచ్ఛిన్నోపాధిని మరణరూపమని విసర్జించి తన నిర్వికార అద్వితీయ అఖండ పరిపూర్ణస్వరూపము నెప్పుడు పొందుదునాయని జ్ఞాని తలంచు చుండును. ఇట్టివారు వారి మరణమును ఉత్సవతుల్యముగ లోన తలంచు చుందురు.

జ్ఞానాభ్యాసకుడు తన అభ్యాసకాల మందు తన మరణమును ఇట్లు వివే చనచేసి తన పరిపూర్ణ స్వభావమును గుర్తించు చుండవలయును. అది యెట్లనిన అభ్యాసకుడు మానసికముగ తన శరీర దహన సంస్కారములను కల్పించుకొని తదుపరి తనకు మిగులనిది యీ అంతఃకరణమేగదా (అనగా సూక్ష్మోపాధి) అని గ్రహించి యిట్టి తన అంతఃకరణము పరిచ్ఛిన్నము అజ్ఞాన కల్పితము ఏకదేశి దుఃఖియగుచు తనకు కర్తృత్వ భోక్తృత్వాదులను కల్పించుచున్న తన శత్రువు, అని వాస్తవముగ గ్రహించి, దీనితోడ నాకెట్టి వాస్తవసంబంధములేదని అంతఃకరణ సంత్యాగమును జ్ఞానపూర్వకముగ అభ్యసించుచుండిన యెడల కాలక్రమమున తన సత్యస్వరూపము స్ఫురించుచు నిర్లిప్తుడై జీవయాత్రను గడుపగలుగుచు ప్రారబ్ధాంతమున తన ముక్తిని తప్పక బడయును. తిరిగి వీరికి జన్మముండదు. ఇట్టి పునర్జన్మము లేకపోవుటే జ్ఞానులకు మరణరాహిత్యము, అమృతత్వము అగుచున్నది.

జ్ఞానాభ్యాసకులు మరియొక ముఖ్యవిషయమును జాగరూకులై గ్రహింపవలయును. అదియేది యనిన బ్రహ్మాభ్యాసకులు వారి మననధ్యానా

ములనభ్యసించుకాలమున వారు ఎంత నిర్జన శుచిర్భూతమైన ప్రదేశములలో కూర్చుండినను వారి మనసు విఘ్నపరంపరలు కలుగజేయుచునే యుండును. ఎట్లన అభ్యాసకుడు జపధ్యానాదులకు సంసిద్ధుడు కాగానే యీ ముముక్షువునకు లోగడ తా ననుభవించిన అనుభవములయొక్క స్మృతి గాని, అనగా మాటలు క్రియలు పదార్థములుగాని దృశ్యములుగాని, లేక యిప్పుడుగాని ముందుగాని తనకుకావలసిన విషయములుగాని, తాను విన్నమాటలుగాని, చూచినవస్తువులు గని, అనుకొను పదార్థములుగాని, అన్నియు స్మరణకు వచ్చుచు విక్షేపమును కలిగించుచుండును అభ్యాసకుడు అట్టివానిని తన జ్ఞానబలముచే నిరోధించి వానిని తనకు కల్పితవ్యవహార మాత్రములుగ నిశ్చయించి అట్టి స్మరణ సంకల్పములను నిరాకరించి తన చిత్తమును నిరోధించి వృత్తిని బ్రహ్మాకారాకారితము చేయుచుండుటగాని, లేనిచో వృత్తిచే అర్థమును బాగుగా గ్రహించి నట్టి అనుసంధాన వాక్యముల మననముగాని చేయుచుండవలెనేగాని, అట్టి తన జ్ఞానాభ్యాసకాలములో వ్యవహారవిషయ సంకల్పములను ఎంతమాత్రము తనకు రానీయగూడదు. వాటి కిది కాలము కాదని తన వృత్తిని, విషయచింత సము నుండి నిరోధించుట యావశ్యకము. చిత్తవిక్షేపముతో మననాద్యభ్యాస ములు జరుగవు. జరిగినను అల్పఫలము లగును గాన ముముక్షువులు ఈ విష యమును జాగరూకులై ——

శ్లో॥ దద్యాన్నావసరం కిఞ్చిత్ కామాదీనాం మ నాగ పి ।
ఆసుప్తే రామృతేః కాలం నయే ద్వేదాన్త చిన్తయా ॥

అను పంచదశీవాక్యమును జ్ఞప్తినుంచుకొని వారివారి అభ్యాసములను, చిత్త విక్షేపరహితముగ చేయుచుండవలెను. దీనినే శాస్త్రము ముముక్షువులకు బోధించుచున్నది.

జ్ఞానాభ్యాసకులు మరియొక విషయమును జ్ఞప్తియందుంచుకొనవల యును. ఏదియన నింతకుముందు తానుచేసిన పుణ్యపాప కర్మములను గురించి యిప్పుడు తాను చింత నొంచ గూడదు. ఏలయన, ఇట్టి చింత ముఖ్యము

ఇప్పుడు తన మనోదౌర్బల్యమునకు కారణమగును. దౌర్బల్యమువలన నెప్పుడును దౌర్బల్యమే హెచ్చునుగాని బలము రాజాలదు. ఎవరికైననూ బలము వలన బలము రావలయునుగాని దుర్బలమువలన బలము రాజాలదు. ముముక్షువున కిప్పుడు కావలసినది తన మనోబలము. మనోబలములేనిది జ్ఞానపూర్వకముగ స్వశరీర సర్వదృశ్యపరిత్యాగముచేసి తన పరమార్థ వాస్తవస్వరూపమైన అఖండ అద్వితీయ పరిపూర్ణత్వములను బాగుగ గ్రహింప సమర్థుడు కాడు. దీనినే శ్రుతి "నాయమాత్మా బలహీనేన లభ్యః" అని తెలుపుచున్నది. ముముక్షువునకు ఈ బల మనగా శ్రవణాదులచే తనకు గలిగిన పరోక్ష జ్ఞానబలముతో స్వశరీర సర్వదృశ్యమును అవాస్తవ మని బాగుగ నిశ్చయించుట. అనగా తనను యిప్పుడు బాధించుచున్న దృశ్య సత్యత్వబుద్ధిని జ్ఞానపూర్వకముగ నిరసించుట మూలమున సర్వదృశ్య త్యాగమును చేయుట. అనగా ముముక్షువు ఇట్లు అనుసంధించుచు తన పరమార్థ స్వరూపమును సర్వదా ప్రీతి నిశ్చయములతో, అనుసంధానమును చేయుచుండుటయే ఇట్లు చేయగలుగు అభ్యాసకుడు ఇప్పుడు తనకు తన యంతఃకరణధర్మములతో నెట్టి వాస్తవ సంబంధము లేదు అని గుర్తించినవాడు గనుక యీ ముముక్షువు లోగడ తన అజ్ఞానముచే తన అంతఃకరణధర్మములను తన ధర్మములే అనునధ్యాసతో చేసిన కృత్యములను ఇప్పుడు ఎంతమాత్రము స్మరించక అవియన్నియు తనవలన జరిగినవని చింతించగూడదు. దేహధారియైన యే మానవుడైనను, పాపకార్య మనునది చేయకయుండుట అసంభవము. జ్ఞానాభ్యాసకునకు ఈ పుణ్య పాప ధర్మములు తన లోపలి యుపకరణ మగు అంతఃకరణమునకు సంబంధించినవిగాని తనకు వీనితో వాస్తవసంబంధమేమియును లేదు. ఇది అంతయు తన అనాది అజ్ఞానకాలములో ఆత్మాంతఃకరణముల యొక్క తాదాత్మ్యాధ్యాసవలన తనకు కలిగినదేకాని మరియొకటికాదు. జ్ఞానాభ్యాసకుడు ఈ రహస్యమును ఇప్పుడు తెలిసికొనినవాడు గనుక ఇప్పుడు తన అంతఃకరణ ధర్మములతో తనకు వాస్తవసంబంధము లేదని నిశ్చయము నొందవలయును అట్టితరి వాస్తవమున తానుగాక మరియొకరిచే చేయబడిన కర్మఫలములతో తనకెట్టి సంబంధము? లోకమున ఋణగ్రస్తుడైనవాడు

లోగడ తనవారిచేతను, వారికిగాను తనచేతను, చేయబడిన ఋణముల భార మధికమైనప్పుడు వీని సంబంధము తెగగొట్టుకొనుటకు ఋణదాతలకు ఆస్తి పాస్తులను ఒప్పచెప్పి ఋణవిమోచన, పరిపాలనాచట్టమును తన ఉపకరణముగ గ్రహించి, తన వ్యవహారసంబంధము నెట్లు తెగగొట్టుకొనునో అట్లే యీ జ్ఞానాభ్యాసకుడు గూడ తన అజ్ఞానముచే తాను లోగడ చేసిన పుణ్యకర్మ ఫల సంబంధములను తన జ్ఞానబలముచే, వానితో తనకు యిప్పుడు నెట్టి వాస్తవసంబంధములేదని గ్రహించి యీ సంసారవృక్షమును ఛేదింపగలిగి నప్పుడు తాను ఋణవిముక్తుడై బలవంతుడగును. ఇదియే జ్ఞానాభ్యాసకునకు కావలసిన ప్రధానబలము అనగా వాస్తవసంబంధమును యీ స్వశరీరసర్వ దృశ్యముతోడ జ్ఞానపూర్వకముగ త్యజించుట అయినను ఇప్పుడు ఈ అభ్యాసకుడు ప్రారబ్ధానుసారమున బద్ధుడై వ్యవహారానుభవములకు తాను అనగా ముముక్షువు, అంతఃకరణములతో నున్నను తన పరమార్థ స్వరూప జ్ఞానముచే తన సంబంధమును అంతఃకరణముతో వదలుకొన దలంచువాడు గనుక తన వ్యవహారానుభవములను ధర్మశాలలందు యాత్రికులు గడుపులాగున గడపవలయును. అనగా యాత్రికుడు ధర్మశాలలయందు తా నున్నంతకాలమే తన నివాసకాలమునకు కావలసిన యేర్పాటులు మాత్రము చేసికొనుచు ధర్మ శాల స్థితి, రక్షణ, నాశములయందు ఎట్లు సక్తుడుకాడో, యట్లే ముముక్షువు తన యీ దేహయాత్రాకాలమునకుగాను, తన అంతఃకరణ మను ధర్మశాల యొక్క యుపయోగమును తన తరణోపాయమునకు మాత్రము నిర్లిప్తతతో సక్తతాభిమానరహితుడై తన గమ్యస్థానమైన మోక్షప్రాప్తివరకు జీవ యాత్రను చేయుచుండవలెను.

జీవున కీ సంసారము అప్రయత్నముగా జననమరణ ప్రవాహరూప మున నిరంతరముగా ప్రవహించునది. కావుననే "సం – సరతి" ఇతి "సంసారః" అని పేరు గలిగినది. జీవు డిట్టి నిరంతర సంసారమును తన అనాది అజ్ఞానమువలన ననుభవించుచున్నాడు. అజ్ఞానమువలన జీవునికి కలుగు నది దుఃఖమేగాని సుఖము రాజాలదు. వివేకుల అనుభవము గూడ నిట్లే

యున్నది. ఎంత అవివేకి యైనవానికిగూడ యీ సంసారమునందు నేను ఎల్లప్పుడును సుఖమునే అనుభవించుచున్నానని చెప్పసాధ్యముకాదు. సంసారము సాగరమువంటిది, దుఃఖకరము అనుమాట లోకవిదితమే. ఈ దుఃఖరూపమగు సంసారమును జీవుడు తన అజ్ఞానముచే నిరంతరముగ పొందుచున్నవాడు గనుక నిట్టి నిరంతర సంసారప్రవాహమును ఒకసారి జీవుడు తన పరమార్థజ్ఞానముచే నిరోధించి తన అఖండ పరిపూర్ణ జ్ఞానానుభవము పొందిన యెడల దానిచే యీ అజ్ఞాననిరంతర ప్రవాహమను సంసారము పోవుచు తిరిగి యెన్నటికిని జనింపదు. కావున జీవుడు తన మోక్షప్రాప్తికిగాను తన సత్యస్వరూప జ్ఞానార్జనము నొక్కసారి పొందిన యెడల అదియే జీవునకు తన నిత్య నిరతిశయ సుఖస్వరూపమై సచ్చిదానంద లక్షణముల నిచ్చును. ఈ లక్షణము లన్నియు స్వరూపలక్షణములగు అద్వితీయ పరిపూర్ణ అఖండరూపముగాని వేరుగాదని గ్రహింపవలయును. ఎట్లన ఈ లక్షణములన్నియు క్షీరమునకు ద్రవత్వశ్వేతత్వమాధుర్యములున్నట్లు ఒక్కటిగనే యున్నవి. జ్ఞానాభ్యాసకుడు ఇట్లు తన పరిపూర్ణ అఖండ స్వరూపమును తెలిసికొని "మాయా మాత్ర మిదం ద్వైతం అద్వైతం పరమార్థతః" "జీవో బ్రహ్మైవ నా పరః" అను శ్రుతివచనములను మరువక ఫలావగతి పర్యంతము శ్రవణ మనన నిదిధ్యసనములతోడను, స్వస్వరూపాను సంధానాద్యభ్యాసములతోడను, తన కాలము గడుపు చుండవలయును జ్ఞానాభ్యాసకులకు నిదియే జ్ఞానామృతము, సాక్షాన్ముక్తిమార్గము అని నిశ్చయముగ ముముక్షువులు గ్రహింపవలయును. మరియును ఏ ప్రకాశముచేత సూర్యచంద్రాదులు ప్రకాశింప జేయబడు చున్నారో, సూర్యాది ప్రకాశముచేతగూడ నే వస్తువు ప్రకాశింపజేయబడుటకు సాధ్యముకాదో, ఏ యాత్మ ప్రకాశముచేత నీ సర్వప్రపంచము తెలియబడు చున్నదో, ఏ వస్తువు ఈ స్వశరీర సర్వదృశ్యమున బాహ్యాంతరముల వ్యాపించి వానిని ప్రకాశింపజేయుచు, అగ్ని — అయః పిండమందు అనగా (ఇనుపముద్ద) లోపలను వెలుపలను వ్యాపించి, ఇనుమును ప్రకాశింపజేయుచు, ఈ యగ్నియగు తాను వేరుగ ప్రకాశవస్తువు నపేక్షింపక తానుగనే ఎట్లు ప్రకాశించుచుండునో అట్లే ఈ పరమాత్మయు తన స్థితిమాత్రముచేతనే,

సీ జగము నంతనూ గూడ ప్రకాశింప జేయుచు తనకుతాను ప్రకాశించుచుండు నని తెలియవలయును. ప్రకాశమనగా ముఖ్యార్థము జ్ఞానము జ్ఞానము పరమాత్మ స్వరూపము, కావున ఆయనస్థితి వలననే సర్వము ప్రకాశింప జేయ బడుచున్నది.

ఇట్టి పూర్వోక్త విమర్శలనన్నిటిని జిజ్ఞాసువు బాగుగ గ్రహించి, తన పరమార్థ సత్యస్వరూపము చిదాకాశమని తెలిసికొనవలయును చిదాకాశ మన్నను బ్రహ్మయన్నను ఒక్కటియే. కావున ముముక్షువు మహాకాశము నకు సదృశమగు తన చిదాకాశస్వరూపమును ఇట్లనుసంధించుచుండవల యును. బ్రహ్మ పరిపూర్ణజ్ఞాన స్వరూపుడు ప్రపంచమంతయు ప్రధానముగ జ్ఞాన జ్ఞాతృజ్ఞేయముల కంటే భిన్నముగ లేదని లోగడనే తెలిపియుంటిమి. ఇందు జ్ఞానము సత్యము అధిష్ఠానమనియు, జ్ఞాతృజ్ఞేయములు కల్పితములును అధ్యస్తములును అనికూడ నిశ్చయించియుంటిమి. అధ్యస్తపదార్థ మెప్పుడును అధిష్ఠానమును ఆవరించి అనగా కప్పివుచ్చినదై యుండును. మానవునకు "అహం" నేను "ఇదం" ఈ జగత్తు అను ఈ రెండు ప్రతీతులును అధ్యస్త మైన జ్ఞాతృజ్ఞేయములే ద్రష్టృత్వము అనగా చూచుట, దృశ్యము అనగా చూడబడునదిగా స్ఫురించుచున్నవి. ఇవి రెండునూ పరమార్థముగ కల్పితము లను జ్ఞాననిశ్చయముతోడ వీనిని త్యజించిన యెడల మిగులునది తెలివి యను నది యొక్కటియేగదా! ఇదియే అఖండ అద్వితీయ పరిపూర్ణ జ్ఞానపదార్థము, జీవుని వాస్తవ స్వరూపము అగుచున్నది. జీవుని పరమార్థ స్వరూపమగు యీ అఖండ జ్ఞానపదార్థమందే కల్పితములను ద్రష్టృదర్శనములుగ తోచు చున్నవి. అనగా "అహం" చూచునది "ఇదం" చూడబడునదిగా స్ఫురించు చున్నవి. ఇవి పరిచ్ఛిన్నములుగను మూర్తములుగను బాహ్యములుగ నుండును. జ్ఞానము అమూర్తము, సర్వవ్యాపకము, పరిపూర్ణము సర్వాధిష్ఠా నము. బ్రహ్మజ్ఞానాభ్యాస మనగా జీవుడు తన సత్యస్వరూపము వాస్తవమున ఈ ద్రష్టృదర్శనములకు సంబంధించినది కాదని తెలిసికొనుచు, తన ద్రష్టృత్వమునకును స్ఫురణదృశ్యములకును నడుమ పరమార్థ పరిపూర్ణమై

యుండు జ్ఞానమే తన సత్యస్వరూపమని ముముక్షువులు గ్రహింపవలయును. ఈ జ్ఞానములేనిదే జీవునకు ద్రష్టృత్వముగాని స్ఫురణగాని కలుగుటకు వీలు లేదు. జీవునకు ద్రష్టృదృశ్యములయందు పరిపూర్ణమై యుండు అధిష్ఠాన పదార్థమే స్వరూపజ్ఞాన మనియును, తెలివి, ప్రకాశము అని గూడ తెలియబడు చున్నది ఈ జ్ఞానము దేశకాల వస్తుసంబంధములేక సర్వత్రపరిపూర్ణమై అఖండముగ నుండును. ఇదియే స్వరూపజ్ఞానము దీనిని గ్రహించుట యెట్లనిన—మానవుడు అహం అను ప్రతీతితో ద్రష్టగా దృశ్యమును ఏ దేశము లోనిదైనను ఏ కాలములోనిదైనను ఏ వస్తువునందైనను తనవృత్తితో గ్రహించుచున్నాడు. కాని కేవల ఈ వృత్తి జడము. కావున తన వృత్తికి యీ జ్ఞాన సాహాయ్యమునే తీసికొని చూచుచున్నాడు. ఇట్లు వృత్తికి సహాయ ముగ తీసికొనబడు జ్ఞానమే వృత్తిజ్ఞానమైన పరిచ్ఛిన్నము. కాని వాస్తవ స్వరూపజ్ఞానము సర్వత్ర అఖండమై మహాకాశమువలె సర్వత్రయునూ వ్యాపించి యున్నది. జీవునకిది తెలుపుటకే శ్రుతి "ఆకాశశరీరం బ్రహ్మ" యని తెలుపుచున్నది. అనగా బ్రహ్మ మహాకాశమువలె సర్వవ్యాపకుడని గ్రహింప వలయును. ఇట్టి సర్వవ్యాపక అఖండ పరిపూర్ణజ్ఞానమే చిదాకాశము. చిత్ అనగా జ్ఞానము. ఆకాశసాదృశ్యముచే సర్వవ్యాపకమని గ్రహింపవలెను. ముముక్షువు ఇట్టి చిదాకాశమునే తన పరిచ్ఛిన్నద్రష్టృదృశ్యములను త్యజించి తన వృత్తిజ్ఞానముతోడ, తాను ఈ అఖండపరిపూర్ణ జ్ఞానానుసంధానము (అనగా నాస్వరూపమే యని) చేయవలయునని శాస్త్రము తెలుపుచున్నది.

జ్ఞానాభ్యాసమని వాసనాత్యాగమును గురించి లోగడ కొంత విచారించి యుంటిమి. కాని వాసనాత్యాగము నభ్యసించుటకు వాసనాస్వరూపమునుగూడ విచారించి తెలిసికొనుట యావశ్యకము. ఈ వాసనలనునవి ఆ యా జీవుల బహుకాలసంకల్ప వికల్పములనుబట్టి కలుగు చిత్తసంస్కారములు. అనాది సంస్కారములవలన జీవునకు గలుగు ఈ వాసనలు మహాబలీయములుగ వివిధములుగ నుండును. ఈ వాసనలను బట్టియే వివిధ జీవులు వివిధ సామర్థ్య ములను పొందుచు వారి వారి సుఖదుఃఖములను వివిధముగ అనుభవించు

చుందురు. ఈ వాసనాసంస్కారము లన్నియు ఆయా జీవుల సంకల్పముల వలన వారి వారి అంతఃకరణమందు కలుగుచు యివి యన్నియు గ్రామఫోను ప్లేట్లలోని పాటలు, మాటలు రికార్డు అగునట్లును, కెమేరా అనగా ఛాయా పటములను గ్రహించు యంత్రము లాగునను, జీవుడు తాను చేయు సర్వ సంకల్పములును సర్వదా అంతఃకరణమందే రికార్డు అగుచుండును. ప్రతి జీవి యొక్క అంతఃకరణము నందునను యీ వాసనలు గ్రామఫోను ప్లేట్లయందు లాగున అంతులేని సంస్కారములతో నుండును ఈ పూర్వపూర్వ సంస్కారములు జీవుని ఉత్తరోత్తరసంస్కారములకు హేతు వగుచుండును. ఈ వాసనా సామర్థ్యములు ఆయాజీవుల పుట్టుకతోడనే వివిధముగ నుండును. ఎట్లన— కోడిపిల్ల గ్రుడ్డునుండి బైటికి రాగనే మట్టిప్రోగుల మీదికి వెళ్ళి వెదకును. బాతుపిల్ల గ్రుడ్డునుండి బైటికి రాగనే దరినున్న నీళ్ళలోనికి వెళ్ళియీదును. ఈ కోడిపిల్లకు ఆ నీళ్ళు చూచినయెడల భయముతో మృత్యువుని చూచి నట్లగును. కాని బాతుపిల్లకు జలము ఆహ్లాదముగ నుండి అందు యీదును. ఇట్లే సర్వజీవులును వారి సుఖదుఃఖములను వారివారి వాసనాబలములనుబట్టి పొందుచుందురు గాని వస్తుస్వభావమునుబట్టి పొందుటలేదు. దీనిని గురించి ఎంత వ్రాసినను వ్రాయవచ్చును. కాని గ్రంథ బాహుళ్య మగునను భీతిచే నిలుపుచున్నాడను. విమర్శించిజూడ జీవుని సుఖదుఃఖములకు కారణము వారివారి అనాది చిత్తవాసనా సంస్కారములనియే స్పష్టపడును. కావున ముముక్షువు ఈ వాసనలకు కారణమగు తన సంకల్పజాలమును అభ్యాసబలముచే నిరోధించినయెడల కాలక్రమమున వాసనలు క్షీణించుచు తన స్వస్వరూపానుసంధానాదులకు సహకరించును. ఇదియే గొప్పలాభము.

ఇంకనూ ముముక్షువు బాగుగ శాస్త్రబుద్ధితో విచారించి చూచిన యెడల ఈ "నేను" అని కర్తృత్వభోక్తృత్వాభిమానములు చేయువాడు వాస్తవమున నెవ్వడును కనబడుటలేదు. ఏలయన జ్ఞానాభ్యాసకునకు తన శరీరమందుండునవి అనగా తన శరీరమును నడపుచున్న పదార్థములు మూడింటి కన్న నితరములు కనబడుటలేదు. అవియేవి యన 1. స్థూలదేహము, 2. సూక్ష్మ

దేహము అనగా సాభాసాంతఃకరణము, 3 ప్రత్యగాత్మ. ఈ మూడింటికన్న నాలుగవ పదార్థ మేదియును లేదు. ఇందు ఈ కరచరణాది విశిష్టమగు కేవల స్థూలదేహము కాష్ఠతుల్యము. దీనికి జ్ఞానమనునదియే లేదు. కుర్చి, బల్లలవలె అగ్నిసంస్కారముతో భస్మమగును. ఇంక రెండవదియగు సూక్ష్మ దేహమును తీసికొని విచారించినను కేవల అంతఃకరణము జడము. అయినను ఇది దర్పణమువంటి యుపాధి. ఆభాసు దనగా ప్రతిబింబుడు ప్రతిబింబము ఎన్నటికిని బింబమువలె వాస్తవమగుటకు వీలులేదు. ఎట్లన, దర్పణమును తీసివేసిన యెడల ఆ దర్పణమం దగబడు ప్రతిబింబ ముండదు గదా. అట్లే దర్పణము ముందర నుంచి, బింబమును తీసివైచిన ప్రతిబింబ మనునదియే యుండదుగదా ! కావున ఈ సూక్ష్మోపాధి యగు అంతఃకరణ ప్రతిబింబ మందు కేవల అంతఃకరణముగాని, కేవల ప్రతిబింబము గాని ఏదియునూగూడ వాస్తవమై జ్ఞానము కలిగియుండుటకు వీలులేదు. జ్ఞానమనునది లేనిదే "నేను, నాది" అను మొదలగు ప్రతీతి కలుగుటకు వీలు లేదు. కాని కలుగుచున్నది. ప్రతివారికిని యీ జ్ఞానము, స్ఫురణ, ఇట్లు కలుగుటనుబట్టి జ్ఞానము వీనియం దున్నదని స్పష్టమగుచున్నది. ఈ చైతన్య మను జ్ఞానము ఒక్క ప్రత్యగాత్మకంటె యితరముగ నుండుటకు వీలులేదు. కావున ప్రత్యగాత్మ చైతన్యమగు జ్ఞానమే, దర్పణమువంటి తన అంతఃకరణ మందు ప్రతిబింబించుచు, జీవుని అనాది అవిద్యాప్రభావముచే యీ జడో పాధియైన అంతఃకరణ ధర్మము లన్నియు తనవే యని అన్యోన్యాధ్యాస, నొందిన వానివలె, యీ ప్రత్మగాత్మయే సంసారివలె, జీవత్వానుభవముల నొందుచున్నదని శాస్త్రమువల్లను, లోకానుభవ వివేచనవల్లనూ గూడ ధృవ మగుచున్నది. ఇది యంతయూ అనాది జీవభ్రాంతి మాత్రమే కాని వేరుగాదు. ఏలయన జడములగు స్థూల సూక్ష్మోపాధులకు జ్ఞానము వాస్తవముగ నుండు టకు వీలులేనందున, కర్తృత్వాదులు కలుగుటకు వీలులేదు. ఈ కర్తృత్వాదు లన్నియూ భిన్న భిన్న పరిచ్ఛిన్నోపాధులున్నగాని యుండుటకు వీలులేదు. ఈ భిన్న భిన్న పరిచ్ఛిన్నోపాధులన్నియు కల్పితములనిన్నీ వాస్తవములు కావనిన్నీ శాస్త్ర వివేకానుభవములు తెలుపుచున్నవి. ఎట్లన యీ ప్రత్యగాత్మ

నిర్వికార అద్వితీయ అఖండపరిపూర్ణ పరమాత్మయేగాని యెంత మాత్రము వేరుగాదు. వాస్తవమున యిట్టి అఖండ పరిపూర్ణుడైన జీవునకు యీ కర్తృత్వ భోక్తృత్వాదులు కల్పితములేగదా కావలయును! కావున ముముక్షువు యీ కర్తృత్వభోక్తృత్వాది, దృశ్యానుభవములన్నియూ తనకు వాస్తవములు గావను నిశ్చయము నొందవలయును.

బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు నిత్యనిర్వికార అద్వితీయ అఖండ పరిపూర్ణమగు బ్రహ్మయందు నీ స్వశరీర సర్వప్రపంచ మంతయు నెట్లున్నది? ఎట్లు భాసించుచున్నది? అను సంశయమును సంక్షేపముగ నిట్లు తెలిసికొని, సంశయనివృత్తిని గావించుకొనవచ్చును. ఎట్లన, యీ స్వశరీర సర్వప్రపంచ మంతయును ఆబ్రహ్మ యందు మానవునకు మందాంధకారమున రజ్జువు యందు తోచునట్టి సర్పాకార వివిధ అవయవచలనాది భ్రాంతిలాగునను, ఆకాశమునందుతోచు నీలత్వములలాగుననూ, జపాకుసుమసాన్నిధ్యముచే స్ఫటికమందుతోచునట్టి కుసుమరూప చలన లౌహిత్యములలాగుననూ నిద్రించు మానవునికి కలుగునట్టి ఆకాశ సముద్ర భూమండలాది స్వప్నదృశ్యముల లాగుననూ, యీ దృశ్యమంతయూ ఆబ్రహ్మయందుండి భాసించుచున్నదని ముముక్షువులు సులభముగ గ్రహించవచ్చును. పై దృష్టాంతములయందున, వాటి వాటి అధిష్ఠానములగు రజ్జువు, ఆకాశము, స్ఫటికము, నిద్రించు మానవుడునుగూడ యెట్టి వికారములను పొందకయే వాటియందు వికారత్వ దృశ్యత్వ భయత్వానుభవములు కలుగుచున్నవిగదా! ఇవి వాస్తవమున లేనివేగదా! ఇట్లే యీ స్వశరీర సర్వప్రపంచమంతయు ఆ అద్వితీయ నిర్వికార అఖండ పరిపూర్ణ బ్రహ్మయందే కనబడుచు, కల్పితమగు యీ దృశ్యానుభవముల జీవునికి నిచ్చుచున్నదేగాని, యివియన్నియు వ్యవహార కల్పితములు, అవాస్తవములని గ్రహించవలయును ఈ ప్రసిద్ధ దృష్టాంత ద్రాష్టాంతికములను గురించి యీ గ్రంథమునందచటచట విపులముగా వివేచన చేసి యుంటిమి. కావున ముముక్షువులు వానినంతయు జ్ఞప్తియందుంచుకొని, యీ విషయమందు శ్రుతియుక్తి యుక్తముగను, సులభముగను గ్రహణ నిశ్చయములను పొందవచ్చును.

ఈ విషయ విమర్శనలన్నిటిని అధికముగా తెలిసికొనగోరువారు నాచే అద్వైతసిద్ధాంతమును వివిధ నిరూపణానుసారమున శ్రుతి యుక్త్యనుభవములతోడను, యితిహాస స్మృతివాక్య యుదాహరణములతోడను విపులముగా రచింపబడిన "బ్రహ్మవిద్యానుసంధానదర్పణమ్" అను గ్రంథమును చూడవలయును. అయ్యది ముఖ్యముగ ముముక్షుజనోపయోగముకొరకే, మననగ్రంథముగ నుద్దేశింపబడి పెక్కు వాక్య యితిహాస అనుభవ యుదాహరణలతో ససిద్ధాంతశాస్త్రీయముగ నిరూపింపబడిన గ్రంథము.

శుద్ధజీవుడగు నిత్యనిర్వికార అద్వితీయ అఖండ పరమాత్మయగు నా బ్రహ్మయందే మాయాస్వరూపమగు ప్రకృతివికారములవలన యీ చరాచర ప్రపంచమంతయు ప్రవాహ నిత్యత్వముతోడ సర్వదా యుండును. దీనితో తనకెట్టి వాస్తవసంబంధము లేకపోయినను జీవుడు తన అనాది అజ్ఞానముచే యీ స్వశరీర దృశ్యసంబంధము తనకు నిత్యము, సత్యము అని వ్యామోహితుడగుచు సంసారదుఃఖము నొందుచున్నాడుగాని, యిది జీవుని పరమార్థ వాస్తవస్థితికాదు. జీవుడు తన వాస్తవస్వరూపమగు నిత్యనిరతిశయ సుఖస్వరూపమును తెలిసికొనలేకున్నాడు. ఒక్క ఉపనిషచ్ఛాస్త్రమే దీనిని గురించి తెలుపుచున్నదిగాని యితర శాస్త్రములు తెలుపుటలేదు. వాస్తవమాలోచించిన యెడల జీవునకు తన శరీరమే కల్పితము. ఇది అనిత్యమై నశించుచున్నదన్న విషయము అందరకునూ తెలిసినదియే. జీవునకు తన శరీరమే కల్పితమై, అనిత్యమై, నశించుచున్నతరి యీ శరీర సంబంధముతోడ జీవునకు కలుగుచున్న యీ స్వస్వామిత్వములు, సంబంధ బాంధవ్యములు మొదలగునవి యెట్లు వాస్తవములును, తనకు నిత్యములును కాగలవు? సత్య నిత్యత్వము వీటియందెంతమాత్రమును లేదు. అయినను జీవుడు యివి యన్నియు తనకు వాస్తవములు, నిత్యములు, సుఖకరములను భ్రాంతిచే వీనియందు అపరిమితవ్యామోహితు డగుచు వీనియందు మితిలేని సక్తతాభిమానములజేయుచు, అందువలన తీవ్రరాగద్వేషాదుల నొందుచు, సుఖదుఃఖభోగానుభవములను తన కర్తృత్వభోక్తృత్వాదులచే ననుభవించుచున్నాడు.

వాస్తవమగు కర్తృత్వభోక్తృత్వములు జీవుడగు తనకులేవు—ఐనను సమస్త భోగములను తన కర్తృత్వాదులతోడనే ననుభవించుచుండుటవల్ల సంసార సుఖదుఃఖములు మెండుగ కలుగుచున్నవి. ఇట్లు కలుగుచున్న సుఖదుఃఖము లలో నూటికి తొంబదిపాళ్ళు దుఃఖమును, మిగిలిన పదిపాళ్ళు దుఃఖమును సుఖాభాసముగ ననుభవించుచున్నారు—శాస్త్రదృష్టితోడ నిత్యానిత్యవివేకమును సంపాదించి నీ సంసారమును బాగుగ విమర్శించునట్టి జీవులకు నిది ప్రత్యక్ష ముగ తెలియును. దీనిని తెలిసికొని తన అనాది అజ్ఞాన సంసార దుఃఖము నుండి శాశ్వత ముక్తికి ప్రయత్నించువాడే యీ ప్రపంచమున వివేకియు, ప్రాజ్ఞుడునుగాని తదితరులు ఎంత వ్యవహార ప్రజ్ఞావంతులైనను ప్రాజ్ఞులు కాజాలరు. కావున యీ ప్రపంచమున వివేకియగు జీవుడు తన యదార్థ స్వరూపమగు నిత్య నిరతిశయ సుఖస్వరూప సంపాదనకు సర్వదా ప్రయ త్నించుచుండవలయునని శాస్త్రము బోధించుచున్నది. వేదము నూరుతల్లుల సమానము గావున జీవుడు దీనిని ఉపేక్షించుట అవివేకము. ఏ జీవుడు తన పరమార్థ వాస్తవ స్వరూపమును పొందగలిగిన ప్రజ్ఞను సంపాదించునో అట్టి వాడే స్థితప్రజ్ఞుడు. ఆ స్థితిని నొందుటయే జీవునకు పరమపురుషార్థ మగు చున్నది. ఇట్టి స్థితప్రజ్ఞుని లక్షణములను శ్రీకృష్ణ భగవానులు గీతలలో తెలిపి యున్నారు. అందరమును స్థితప్రజ్ఞుల మను భ్రమనొందక అట్టి స్థితిని వాస్తవ ముగ నొందుటకు ఆత్మసాక్షాత్కార పర్యంతము శాస్త్రీయప్రయత్నములగు శ్రవణమనననిదిధ్యసనాభ్యాసముల నభ్యసించుచుండుట యావశ్యకము. జీవ వివేకమునకు శాస్త్రమే శరణ్యము. శాస్త్ర మనగా ముఖ్యార్థము, ఉపనిషత్ప్రతి పాదిత జీవబ్రహ్మైక్య జ్ఞానము.

ముముక్షువులకు వారి మోక్షప్రాప్తికి బ్రహ్మాభ్యాసము కరతలామల కమువంటి సాధనము ప్రత్యక్షఫలము నిచ్చునదియును అగుచున్నది. కావున ముముక్షుజనోపయోగమునకుగాను యోగవాశిష్ఠమందు లీలోపాఖ్యానములో సరస్వతీదేవి లీలకు యీ బ్రహ్మాభ్యాసమును గురించి తెలిపినట్టి వచనముల నిచట నుదహరించుచున్నాడను :

శ్లో॥ తచ్చింతనం తత్కథనమన్యోన్యం తత్ప్రబోధనం ।
ఏతదేకపరత్వం చ తదభ్యాసం విదుర్బుధాః ॥

గురువువలన తాను విని బ్రహ్మలక్షణమును (సందేహరాహిత్యమునకై) యుక్తిచే పర్యాలోచనము చేయుటయు, (ఈ యర్థము ఇంకొకరి బుద్ధికి సంగతముగా తోచునో లేదో అని నిశ్చయించుటకొఱకు) ఇంకొకరికి చెప్పుటయు, (ఒకరొకరికి తెలియని యంశములు తెలిసికొనుటకై) ఒకరొకరికి బోధించుకొనుటయు. నిదిధ్యాసంబును (సమాధినిష్ఠయు) అభ్యాసమని చెప్పబడును. మొదటి మూడు ఉపాయములచేత అసంభావనా (అసంగతమనుబుద్ధి) నివృత్తియు, నాల్గవ సమాధినిష్ఠచే విపరీతభావనా నివృత్తియు ఫలమగును.

శ్లో॥ ఉదితౌదార్యసౌందర్యా వైరాగ్యరసగర్భిణీ ।
ఆనందస్యందినీ యేషాం మతిస్తేఽభ్యాసినః పరే ॥

మహత్త్వము (లేక సర్వసిద్ధ పరిగ్రహత్యాగము) చే సుందరమైనట్టియు, వైరాగ్యసారములోన గలిగినట్టియు, ఆనందమును వర్షించునట్టి మనస్సు ఎవ్వారలకు కలదో, వారలు బ్రహ్మాభ్యాసము గలవారలు అగుదురు.

శ్లో॥ అత్యంతాభావ సంపత్తౌ జ్ఞాతుర్జ్ఞేయస్య వస్తునః ।
యుక్త్యా శాస్త్రైర్యతంతే యే తే బ్రహ్మాభ్యాసినః స్థిరాః ॥

ప్రమాణముయొక్క నిజమును నిశ్చయించుటకు అనుకూలమైనట్టియు ప్రమేయముయొక్క యథార్థ్యమును నిశ్చయించుటకు అనుకూలమైనట్టియు యుక్తిచేతను, వేదాంతశాస్త్రములచేతను, ఎవ్వారలు దృశ్యము (కనుపడునది) అగు పదార్థము బొత్తిగా లేనిదే–అను నిశ్చయజ్ఞానవిషయమై ప్రయత్నపడుచుందురో, వారలు బ్రహ్మాభ్యాసము కలవారు అగుదురు.

శ్లో॥ సర్గాదావేవ నోత్పన్నం దృశ్యం నాస్త్యేవ సర్వదా ।
ఇదం జగదహం చేతి బోధాభ్యాసం విదుః పరే ॥

ఇది జగము నేను అను దృశ్యమగు పదార్థము సృష్ట్యాదియందే కలిగినది. కావున సృష్టికి పూర్వముగాని ప్రళయమునకు పిదపగాని లేదు.

బంగారుకంటె ఆభరణంబును, మృత్తుకంటె ఘటంబును వేఱుగా లేనట్లు స్థితి కాలమందునులేదు. కావున దృశ్యము మూడుకాలములయందును లేదని అభ్యాసముచేయుటను పరమాత్మవిషయమగు జ్ఞానాభ్యాసమునుగా చెప్పిరి. "ఉదితౌదార్య సౌందర్య" అను శ్లోకముచే చెప్పబడినట్టియు ప్రపంచ మిథ్యాత్వమును చక్కగ తెలిసికొని నిష్ప్రపంచ బ్రహ్మానందమునందు మునింగిన చిత్తముగలవారు ఉత్తమాధికారులు, దృశ్యపదార్థము మిథ్యయని తెలిసికొని ఆ యర్థము చిత్తమున దృఢపడుటకై ప్రయత్నపడువారు మధ్యమాధికారులు, జగము మిథ్యయని ఎఱుంగుటకు శాస్త్రయుక్తులచే ప్రయత్నపడువారు అధమాధికారులును నగుదురు.

శ్లో॥ దృశ్యాసంభవబోధేన రాగద్వేషాదితానవే ।
రతిర్బలోదితా యాసౌ బ్రహ్మాభ్యాసస్స ఉచ్యతే ॥

దృశ్యము ద్రష్టయందు కాలత్రయమునను సంభవింపదు. అజ్ఞానముచే రాగము ద్వేషము మొదలగు దోషములు నశింపగా మననముచే గలిగిన జ్ఞాన వాసనయొక్క బలముచే అభివ్యక్తము (స్పష్టము) అయిన బ్రహ్మానందానుభవము బ్రహ్మాభ్యాసమని చెప్పబడును. (ఇందు అభ్యాసమెట్లు వృద్ధినొందు నను ప్రశ్నకు సమాధానము చెప్పబడినది.)

శ్లో॥ దృశ్యాసంభవబోధోహి జ్ఞానం జ్ఞేయం చ కథ్యతే ।
తదభ్యాసేన నిర్వాణమిత్యభ్యాసో మహోదయః ॥

దృశ్యము బొత్తిగాలేదను దృఢమగు జ్ఞానమే జ్ఞానమనియు జ్ఞేయ మనియు చెప్పబడును. అట్టి యభ్యాసముచే అపరోక్షజ్ఞాన ప్రాప్తిద్వారా మోక్షంబును గలుగును. కావున అభ్యాసము గొప్పలాభమును గలుగజేయునది యగును. (ఇందు అభ్యాసమునకు ఫలము చెప్పబడినది.)

బ్రహ్మజ్ఞానాభ్యాసకులకు యీ ప్రపంచము నాటకరంగము వంటిదని తెలిసికొనుట యావశ్యకము. ఏలనన శాస్త్రము యీ స్వశరీర సర్వదృశ్యమును వాస్తవముగాదని తెలుపుచున్ననూ, దానివలన జీవునకు గలుగుచున్న

సుఖదుఃఖానుభవములనుబట్టి యీ జీవానుభవములన్నియునూ తమకు నిత్యము లనిన్నీ, వాస్తవములనిన్నీ, మానవులు భ్రమించుచు యీ దృశ్యసంసార సుఖదుఃఖానుభవములను పామరత్వముగా ననుభవించుచుండుదురు. ఇట్టి జగ దనుభవములు గలుగుచున్న మాత్రమున జగత్తు వాస్తవమే గావలయునను నియమములేదు కావుననే శాస్త్రము జీవునకు యీ స్వశరీర సర్వదృశ్యమును నాటకరంగము వంటి దనియు దీనియందు, పరమార్థవాస్తవికత యింతమాత్రము లేదనియూ తెలుపుచున్నది. కావున జ్ఞానాభ్యాసకుడు తన ప్రారబ్ధానుసార ఫలానుభవములను నాటకరంగమునందు నటునివలె యనుభవించుచుండ వలయునని శాస్త్రము తెలుపుచున్నది. ఇది యెట్లనిన, నాటకరంగమందు జూపబడునట్టి ప్రదర్శనములన్నియూ వాస్తవములు గాకపోయిననూ, చూచునట్టి ప్రేక్షకులు వారివారి సుఖదుఃఖ రసానుభవములను పొందుచున్నారుగదా! ఇట్లే యీ జగద్దృశ్యము అంతయూ నని అభ్యాసకులు గ్రహించవలయును. జీవునకు స్వశరీర దృశ్యానుభవములుగూడ నాటకరంగ దృశ్యానుభవముల వలెనే గలుగుచూ, నాటకరంగ దృశ్యానుభవములకన్న జగద్దృశ్యానుభవములు మరికొంత దీర్ఘకాలముగానుండుచున్నవేగాని వాస్తవమున రెండనుభవము లునూ నశించుచున్నవే. కావున జీవునకు యీ జగద్దృశ్యానుభవములు దీర్ఘ నాటక దృశ్యానుభవములవంటివేగాని వేరుగావని వివేకులు గ్రహించవలసి యున్నది. వాస్తవ మాలోచించిన యీ ప్రపంచదృశ్యనాటకరంగమందు జీవుడు నటునివంటివాడు.

కాని యీ జీవుడే తన యనాదియజ్ఞానముచే యీ జగద్దృశ్యమునంత యునూ వాస్తవమని భ్రమించి తనసంసారదుఃఖపరంపరను నొందుచున్నాడు. అయిననూ వివేకియైన జీవుడు తన శాస్త్రజ్ఞానబలముచే యీ స్వశరీర జగద్దృశ్యస్వభావమును శాస్త్రీయముగ బాగుగ్రహించిన యెడల తనప్రారబ్ధా నుసారముగ ననుభవించవలసిన సుఖదుఃఖభోగానుభవములను నాటకరంగ మందుండు నటునివలె చేయగలుగుచుండును. దీనివలన లాభమేమి యని విచారించినచో దానినిట్లు తెలిసికొనవలయును. ఎట్లన, నాటకరంగ స్థలమున

నున్న నటుడు తన వాస్తవనామరూపలక్షణములను మరువకయే తానభిన యించునట్టి రాజు, మంత్రి, ప్రియుడు, పిచ్చివాడు, సైనికుడు, దరిద్రుడు, వికలాంగుడు, స్త్రీ మొదలగు పాత్రలను నిపుణతతో నెట్లు ప్రదర్శింప గలుగుచున్నాడో యట్లే బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు తాను బాగుగ నభ్యసించునట్టి తన పరమార్థస్వరూపలక్షణములను మరువకయే తన ప్రారబ్ధానుసారముగ సర్వవ్యవహారములను చేయగలుగు సమర్థుడగును. ఇట్టి సమర్థత వలన ముముక్షువునకు గలుగు లాభ మేమనిన, సర్వదా తన పరమార్థ స్వరూపమగు సత్యజ్ఞానానంతలక్షణములను, అఖండ పరిపూర్ణత్వమునూ, మరువక తను లోకవ్యవహారములను చేయునప్పుడు ఆ వ్యవహారములవలన గలుగు సుఖ దుఃఖానుభవములు, నటునియొక్క వేష, పోషణ, రసాభినయములు, నటుని బాధింపక, తన జీవనోపాధికి యెట్లు సహకరించుచున్నవో, యట్లే యీ యభ్యాసకుని తన లోకవ్యవహార సుఖదుఃఖములు తనకు ఆభాసమాత్రము లగుచూ, తన పరమలాభలక్ష్యమగు స్వస్వరూప సాక్షాత్కారసాధనములగును. ఇది గొప్పలాభము. కాన యిట్టి లోకదృష్టిని సంపాదించుట కష్టప్రయత్న సాధ్యము. కావుననే శాస్త్రము ముక్షువునకు సర్వదా తన జగన్మిథ్యాత్వజ్ఞాన నిరూఢికి యత్నించుచుండుట యావశ్యకమని తెలుపుచున్నది. దీనిని ముముక్షువు తన నిత్యానిత్యవివేకాది సంపత్తితో శ్రవణ మననాభ్యాసాదులవల్లగాని యీ జగన్మిథ్యాత్వజ్ఞాననిరూఢి గలుగదు. ఇట్టి యత్నములోనున్న జిజ్ఞాసు ముముక్షువులకు వారివారి యభ్యాసపాటవచిత్తదారుఢ్యములనుబట్టి, పైన తెలిపిన యటుల యీ ప్రపంచమంతయు నాటకరంగము వంటిదని స్ఫురించు చుండును.

ఈ ప్రపంచమున మోక్షము నిచ్ఛగించు ముముక్షువునకు తన యాశయ మెట్టిదనిన, మహాప్రవాహముగల గొప్ప నదికి ఆనకట్ట కట్టుట వంటిది. ఈ కార్యమును సాధించుటయందు ముముక్షువునకు, తన శరీరాదుల సహాయము అత్యావశ్యకము. పరమార్థ వాస్తవమున యీ శరీరాదులు యథార్థము గాకపోయినను, యీ శరీరాదుల సహాయమువలననే ముముక్షువు

తన మోక్షప్రాప్తిని సాధించవలయునుగాని వేరుమార్గములేదు. ముముక్షువు నకు తన శరీరాదులు, నీటిప్రవాహమును నాపుటకు తాత్కాలికముగ పోయు నట్టి బలకరమైనమట్టికట్ట, అనగా (Coffer dam) కాఫర్ డామ వంటిది. ఎట్లనగా మనకు ఈప్సితమైన యీ వాస్తవ ఆనకట్టను కట్టుటకుపూర్వము అట్టి నిర్మాణమునకు సావకాశము గలుగుటకుగాను నొక మట్టికట్టను తాత్కాలికముగ పోసి నీటిప్రవాహము నాపి తదుపరి మనలకు శాశ్వతముగ నుండవలసిన వాస్తవమైన ఆనకట్టను నిర్మాణము చేయుదురు. తదుపరి ప్రథమమున పోసిన మట్టి ఆనకట్ట దానంతట యదియే కాలక్రమమున ప్రవాహమున కొట్టుకుపోయి నిర్మాణముచేసిన ఆనకట్ట శాశ్వతముగ మిగులును. ఈ మట్టికట్టను పోసి ప్రవాహము నాపినగాని అసలు ఆనకట్టను నిర్మాణము చేయుటకు వీలుకాదు. ఇట్లే జ్ఞానాభ్యాసకుడు తన అవాస్తవికములగు శరీరా దుల సహాయమున తన మోక్షప్రాప్తి కలుగగనే యీ యుపాధులు వాటంత టవియే వాస్తవమున లేనివియే యగును. ఎట్లన భ్రాంతి సర్పజ్ఞానము అధిష్ఠాన మగు రజ్జు జ్ఞానమందు లయమగుచున్నట్లు, అనగా సర్పము వాస్తవముగాదని తెలిసికొన్నట్లు యీ శరీరాదులుగూడ యట్లే యగుచు నిర్బాధకములగునని బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు గ్రహించి తన శరీరాదుల సహాయమును గౌణముగ తన వ్యవహారానుభవములకును, ముఖ్యముగ తన పరమార్థసాధనములుగను నుపయోగించుకొనుచుండుటయే ముముక్షు వివేకము.

సంసార మనగా జీవుడు తనకు యీ స్వశరీర సర్వదృశ్యములు వాస్తవ ములునూ శాశ్వతములునూనని యూ భ్రమించుచూ వాటియందు సక్తతాభిమాన ములచే తన సుఖదుఃఖానుభవములచేయుచూ జననమరణ ప్రవాహమున భ్రమ ణముచేయుచుండుట. ఈ సంసారభ్రమణము చర్వితచర్వణముగ జీవునకు తన అనాది యజ్ఞానమువలననే గలుగుచుండును. జీవునకు యిట్లు గలుగుచున్నట్టి సంసారము భల్లూకపు పట్టువంటిది. ఒకానొక సందర్భమున యే జీవుడైననూ విసగటచెంది దీనిని విడచుదమన్ననూ యది వీనిని విడచిపెట్టదు. కావున ప్రాజ్ఞుడైన జీవుడు యీ సంసార భల్లూకపు పట్టునుంచి వదల్చుకొని బయటికి

వచ్చుటకు ప్రయత్నించుట యావశ్యకము. కాని యిది స్వప్రయత్న కష్ట సాధ్యము. అయినను వివేకునకు తప్పదుగదా! ఇట్టి ప్రయత్నము యేది యనిన, జీవుడు శాస్త్రీయజ్ఞానముతోడ తాను నిత్యానిత్య వివేకాదులతో శ్రవణ మననాది యభ్యాసములతో యీ స్వశరీర సర్వజగత్తును సత్యము గాదనునట్టి జగన్మిథ్యాత్వజ్ఞానమును సంశయవిపర్యరహితముగ సంపాదించుటయే. ఇట్టి ప్రయత్నజ్ఞాన సంపాదనవలన యీ సంసారమను భల్లూకము తనను వదలి నిప్పును జూచిన ఎలుగుబంటు యచట నిలువనియటుల తనను విడచి పోవును. అప్పుడు జీవుడు తానుమాత్రము తన పరమార్థ వాస్తవ స్వరూప సచ్చిదానందలక్షణములతో నిర్విశేషముగ శేషించును. ఇదియే జీవునకు మోక్ష సాధనమని గ్రహించవలెను.

బ్రహ్మజ్ఞానాభ్యాసకునకు తన పరమలాభము పొందుటకు ఈ ప్రపంచమే ఆధారము. కాని యీ ప్రపంచము బురదనీటి మహాప్రవాహమువంటిది. ఈ ప్రవాహమందే మాలిన్యమును, శుద్ధ మధురజలమును కలిసియున్నవి. ముముక్షుతాశయమునకు అనగా ముముక్షువగువాడు తన మోక్షప్రాప్తికియూ సాంసారిక రోగపీడితుడు గాకుండుటకునూ చైతన్యసమానమగు శుద్ధమధుర జలమునే విడదీసి త్రాగవలయునుగాని, ఆ బురదతోగూడిన నీటిని త్రాగు చుండిన యెడల కాలక్రమమున మృణ్మాలిన్యములు శరీరమునచేరి వ్యాధి గ్రస్తుడగును. మాలిన్య మహాజలప్రవాహమందు, మలిన మధురజలములు కలిసి యుండునట్లు ఈ దృశ్యమందు చైతన్యజడములు కలసి ప్రవహించు చున్నవి. ఇట్టి దృశ్యప్రవాహమునుండి జడాంశమును అనగా మలిన భాగమును విడదీసి మధురజలమువంటి కేవల చైతన్యమునే బ్రహ్మజ్ఞానా భ్యాసకుడు గ్రోలుచుండవలయును. అనగా స్వస్వరూపమున నుసంధించు చుండవలయును. ఇట్లు గావించుటకు నీటినుండి బురదను(మాలిన్యమును) వేరుపరచి మధురమైన నీటినిమాత్రము తేల్చుటకు చిల్లగింజ గంధము వలననేగదా సాధ్యమగును? ఇందు చిల్లగింజ గంధ సమానమగు, శాస్త్ర జ్ఞానానుసంధానములతోడ ముముక్షువు తన యాప్సితమైన స్వస్వరూప

జ్ఞానమును పొందగలుగును. ఎట్లన, ఈ చిత్ జడ మిశ్రితమైన ప్రవాహము నుండి తన జ్ఞానాభ్యాసపాటవముతో జడపదార్థములను స్వశరీర సర్వదృశ్య మాలిన్యమును జ్ఞానపూర్వకముగ విసర్జించి సర్వాధిష్ఠానమైన చైతన్యమును మాత్రము గ్రహించి సర్వాధిష్ఠానమగునట్టి యఖండపరిపూర్ణ చైతన్యమునే తానని అనగా "నేను, అహం" అని నిరంతరము అనుసంధానాదుల నాచరించు చుండిన అట్టి మహనీయుడు సంసారమహావ్యాధిచే పీడింపబడక తన అభ్యాస పాటవములతో కాలక్రమమున అమృతసిద్ధి నొందును. ఈ బ్రహ్మజ్ఞానా భ్యాసమును గురించి యిది మనకు సాధ్యమా యని యెవరును భయపడ దగదు. ఏలయన, ఈ బ్రహ్మజ్ఞానమనగా "అహం" అను నేను వాస్తవమున ఈ పరిచ్ఛిన్న దేహాది వస్తువుగాదు, మరియొక పరిపూర్ణ వస్తువు అని జీవుడు తనను తాను తెలిసికొనుటయే. జీవునకా మరియొక వస్తువేది యనిన తనకు నిత్యముగ నుండు తన అఖండపరిపూర్ణ సుఖస్వరూపమేగాని అన్యముకాదు. కావుననే యిట్టి జ్ఞానమువలన జీవుడు పరమానంద స్వరూపుడేయగుచున్నాడు. ఎవరికైనను వారివారి వాస్తవలాభమును పూర్తిగ పొందుటయేగదా పరమానందము! అనగా జీవుడు తనను తాను వాస్తవముగ నేను పరిపూర్ణసుఖస్వరూపుడనని తెలిసికొనుట. ఎట్లన సూర్యనందనుడైన కుంతీపుత్రుడగు కర్ణుడు తన జన్మ వృత్తాంతము తనకు తెలియక అజ్ఞానముచే తాను దాసీపుత్రుడనని కొంత కాలము దుఃఖించెను కాని యిట్టి దుఃఖమునొందిన కర్ణుడే కాలాంతరమున తాను వాస్తవమున దాసీపుత్రుడను కాదు, సూర్యనందనుడనని తన వాస్తవ జన్మ వృత్తాంతము తెలిసికొని దుఃఖనివృత్తిని పొంది, పరమానందమును గాంచెనుగదా! బ్రహ్మజ్ఞానము నొందుట యనగా యిట్టిదియే. జీవుడు తాను నేను ఈ పరిచ్ఛిన్న జడదుఃఖోపాధినిగాను, నేను వాస్తవమున అఖండ సచ్చిదా నంద స్వరూపుడను అని తెలిసికొని తన నిత్యనిరతిశయ సుఖస్వరూపానంద మును నొందుటయేకాని మరేమియుగాదు. ముముక్షువు ఇట్లు తన పరమార్థ సత్యస్వరూపమును గురూపదేశమువలన శాస్త్రోక్తముగ గ్రహించి అసంభా వనా విపరీతభావనా రహితుడై సమస్తప్రపంచము సర్వాధిష్ఠాన అఖండరూపు డైన తనయందే వివర్తముగ భాసించుచున్నదిగాని వేరేదియును వాస్తవమున

లేదని తన జ్ఞానదృష్టిచేత తెలిసికొనినయెడల తాను నిత్యనిరతిశయానందుడై యుండును. ఇదియే ముక్తి. బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు తన నిరంతర అభ్యాస సాధనలయొక్క పాటవముచే ఆత్మను విచారింపగా కాలక్రమమున భ్రమర కీట న్యాయముగ తన జీవధర్మములను వదలి సచ్చిదానంద స్వరూపమైన బ్రహ్మస్వరూపమును పొందును. దేహధారియై యున్నకాలమున ఇట్టి జ్ఞానస్థితి దార్ఢ్యములే జీవన్ముక్తి సుఖము నిచ్చుచుండును. జీవన్ముక్తి యనగా విషయ వృత్తిరహితుడై బ్రహ్మాత్మనా సంస్థితుడై యుండుట వృత్తిరహిత మనగా విషయములయందు రాగద్వేషాదిరహిత వృత్తిని కలిగియుండుట. ఇట్టి వృత్తి యున్నను దగ్ధబీజ న్యాయమున అంకురశక్తి నశించినదై యుండును. కావున ఇట్టిస్థితి జీవన్ముక్తిసుఖమునకు విరోధిగాక భావి ప్రతిబంధ రహితమై యుండును. దీనినే బాధితానువృత్తి యనికూడ నందురు. ఈ వృత్తి జ్ఞాని యొక్క ప్రయత్నేచ్ఛారహితముగ కులాలుని ఘటకార్యమైనను మరికొంత కాలమువరకును కుమ్మరిసారెయు, చక్రదండమున్నా ఆ వడి చేతనే తిరుగు చుండునట్లు వృత్తులు కలుగుచుండును. కాని అవి నిర్బాధకము లగుచు ముముక్షువునకు భావిప్రతిబంధహేతువైన కర్మఫలములను పుట్టింపజాలవు జ్ఞాని వ్యవహారమంతయూ యిట్టి బాధితానువృత్తితోడనే జరుగుచుండును.

ఇంకను మందాంధకారములో చూచిన యొక పురుషుని ప్రథమమున స్థాణువుగా తలచినను, తదుపరి దీపసహాయముతో చూచి 'ఇది స్థాణువుగాదు. పురుషుడ'ని యెట్లు మానవుడు తెలిసికొనుచున్నాడో అట్లే మందాంధకారమను నజ్ఞానములో నున్న పరిచ్ఛిన్న జీవుడే తన జ్ఞానజ్యోతి సహాయమున తాను పరిచ్ఛిన్నుడను గాననియు జడదుఃఖిత్వములు తనకు వాస్తవముగ లేవనియు, సంబంధించినవి కావనియూ, తన సత్యస్వరూపము అఖండ సచ్చిదానంద పరిపూర్ణ స్వరూప మనియు జ్ఞానాభ్యాసకుడు గ్రహించి తెలిసికొనవచ్చును.

ఇంకనూ యీ జ్ఞానాభ్యాసకుడు తన నిద్రయందు తన దేహాది సర్వ ప్రపంచము నెట్లు కనబడక నెట్లు లయము నొందుచున్నదో అట్లే ఈ యగ

పడు నామరూపాత్మక మగు సర్వప్రపంచమును, నిర్మలమైన తన బుద్ధిచేత, ఆత్మయందు లయింపజేసికొని అనగా తనయందే యెల్లప్పుడును వెన్నెలచేత నిర్మలమైన యాకాశమువలె స్వాత్మాభిన్నముగ అఖండబ్రహ్మానుసంధానము చేయుచుండవలయును. మరియును ఏ లాభముకంటె వేరు అధికలాభము లేదో, యే సుఖముకంటె వేరు అధికసుఖము లేదో దేనిని తెలిసికొనుటకంటె నధికముగ తెలిసికొనదగినది లేదో యదియే బ్రహ్మస్వరూపమని నిశ్చయముగ తెలిసికొనవలయును. ఇంకను దేనిని చూచిన వెనుక మరియొకటి చూడతగినది యుండదో, ఏది తానుగనైన తరువాత మరల జన్మము నొందడో, ఏది సర్వదిక్కులయందును పైనను క్రిందను వ్యాపించి పరిపూర్ణమైయున్నదో, ఏది సచ్చిదానంద రూపమై తనకంటే వేరు వస్తువులేదో, ఏది పరమశాశ్వతమై యఖండమై స్వప్రకాశమై యున్నదో యట్టిది బ్రహ్మయనియు, ఆ బ్రహ్మయే నేననియు ముముక్షువు నిశ్చయము నొందవలయును. ఎంత శాస్త్ర పఠనము చేసిన మహనీయులకైనను, ఈ జగదనుభవములయందు వాస్తవబుద్ధియును, ప్రీతియును తగ్గవు. ఇది సంసారరోగము. అనాదిగ నున్నది. ఈ ముముక్షువు రోగనిదానమును చేయదలచినవాడు గనుక దీర్ఘ, క్లిష్టరోగముల నిదానము చేయదలచిన వైద్యులకు మలమూత్ర పరీక్ష యావశ్యకమగునటుల ఈ దృశ్యానుభవము లన్నియూ మలసమానమైనవైనను వీని వివేచనా పరిశీలనలు, జ్ఞానాభ్యాసకులగు ముముక్షువులకు యీ దీర్ఘసంసార వ్యాధియొక్క యాథార్థ్యము తెలిసికొనుటకుగాను పరీక్షా పరిశోధనలు యావశ్యకమగుచున్నవి. కావున విచారించుదము. ప్రతి మానవునకును అధిక సుఖసంపత్తి, అధికారము, భోగములయందు కోరికయుండుట లోకసహజము. ఇట్టి వాని యందుగూడ మానవు డెప్పుడును సాధారణముగ తనకున్నదానితో తృప్తి జెందక, సదా అధికభోగానుభవములను కోరుచుండుటగూడ సహజము. ఇంకనూ మానవులు గౌరవ అధికార అధికార్జనలయందు వ్యామోహితు లగుచుందురు. అయినను బాగుగ విచారించిన మన లోకానుభవమును బట్టియే యిట్టివి యన్నియు వారి వారి కోరికల ప్రకారము అందరికిని కలుగుటలేదని విశదమగును. అందరు మానవులునూ సుఖగౌరవములనే కోరుచున్నను గౌరవము

నకు బదులు అగౌరవమును, సుఖమునకు బదులు దుఃఖమును కొందరకు సంభవించుచు కొందరికి మాత్రమే వారి వారి పుణ్యఫలమునుబట్టి గౌరవ సుఖములు కలుగుచున్నవి. కాని యీ గౌరవభోగములు కోరుకొన్న వారంద రకునూ వారివారి కృషిప్రయత్నములు సమానముగ నున్నను సమానలాభములు కలుగుట లేదు. ధనగౌరవములు కలిగిన వారికిని, వారున్నంత కాలము గూడ నవి నిలుచుట లేదు. కలిగిన వారికి పోవుచున్నవి. లేనివారికి అల్పకాల అల్ప ప్రయత్నములతోడనే అధిక ధనాధికారములు కలుగుచున్నవి. ఇట్టివి యన్నియు మానవులకు వారి వారి కోరికలనుబట్టి సిద్ధించుట లేదు. కేవల కోరికలవలన మానవులకు సిద్ధించునది దుఃఖమేతప్ప సుఖము రాజాలదు. వచ్చుటలేదు. కాని యీ సుఖదుఃఖగౌరవ భోగానుభవములు దేనిని బట్టి వచ్చుచున్నవని విచారించినయెడల వివేకులందరికిని ఇవి యన్నియు ముఖ్య ముగ వారి వారి ప్రారబ్ధకర్మఫలానుభవముల బట్టియే కలుగుచున్నవిగాని అన్యముగాదని స్పష్టపడగలదు మానవునకు ఇట్టి భోగానుభవములు కలుగు పరిస్థితులుగూడ వారి వారి కర్మఫలములను బట్టి కలుగుచు అట్టి పరిస్థితులు, నిమిత్త కారణములుగ నుండును. కాని యీ పరిస్థితుల ఫల పర్యవసానము వారి వారి కర్మఫలమును బట్టియే యుండును ఇవి యన్నియు మానవునకు, పరమార్ధమున అవాస్తవానుభవములు, తాత్కాలికములు అగుచు పర్యవసాన మున దుఃఖమునే కలిగించుచుండును. ఏలయన కర్మఫలమెప్పటికిని నిత్యము కాజాలదు. మనమనుకొను వారి వారి తెలివితేటలు, శక్తి సామర్ధ్యములుగూడ వారి వారి ప్రారబ్ధకర్మఫలానుభవములే యగుచు సర్వదా మారుచుండును. ఇట్టివి యన్నియు జీవుల అదృష్ట దురదృష్టఫల కాలములనుబట్టి వృద్ధి క్షయ నాశముల నొందుచుండును. అదే మానవులు కాలభేదమున దరిద్రులుగను, వారే అధిక ధనవంతులుగనూ నగుచున్నారు. ఆగర్భశ్రీమంతులు అధోగతి పాలగుచున్నారు. ఒక కాలమున పరిపాలనా నైపుణ్యములతో విఖ్యాతిగాంచి ఉన్నతాధికారపీఠముల నున్నవారే, కాలాంతరమున తెలివితక్కువ వారుగను, పిచ్చివారుగనుగూడ, పరిగణింపబడుచున్నారు. సర్వసామాన్యులే ప్రభువులు గను అదే ప్రభువులు సామాన్యులుగను మారుచు ఒకప్పుడు వారే ప్రబల

శిక్షలను, మరియొకప్పుడు అత్యధిక గౌరవములను కొందరు పొందుచున్నారు. ఈ విషయము లందరికిని తెలిసినవే కాని వివేకికి తన పరమార్ధ విషయ వివేచనకునూ విషయనిర్ధారణకునూ యిది యావశ్యకము. ఇంకను మానవుడు తన శరీరమును ఎంత మృష్టాన్నములతో పోషించి రక్షించుకొన్నను ఎట్టి శరీరమైనను కాలధర్మముల నొందక తప్పుటలేదు. దేహదౌర్బల్య మనో దౌర్బల్యవార్ధక్యము లనునవి వాటియంతటవియే వచ్చుచున్నవి. వీనిని ఎవరును కోరరు. కాని యివి కోరకపోయినను మానవుడు వద్దన్నను, నైసర్గికముగ కలుగుచుండును. దీని నాపుట యెవరిశక్యముగాదు. ఇంకను మానవుడు తన ఆత్మీయులని తలచు పుత్రమిత్ర కళత్రాదులను గూడ మానవుడు తాను కోరునంత కాలముంచుటకు అసమర్థుడగుచున్నాడు. తాను గూడ కోరునంత కాలము జీవింపజాలక అవశుడై మరణించుచున్నాడు. తన శరీరమును తాను యెంత జాగ్రతతో కాపాడుకొనుచున్నను తాను కోరునంత కాలము తన దేహమును నిలుపు సమర్థుడు గాక పోవుచున్నాడు. ఇట్టితరి మానవునకు నేను స్వతంత్రుడను, నేను శాశ్వతము, అను తలంపు లన్నియును తాత్కాలికములై భ్రాంతి మాత్రములేగదా యగుచున్నవి. ఈ యనుభవము లందరకును సామాన్యముగ తెలిసినవే కాని జ్ఞానాభ్యాసకుడైనవాడు తాను శ్రవణాదులు చేసిననూ తన జ్ఞానదార్ఢ్యమునకునూ, వైరాగ్యాదులు దృఢమగుటకుగానున్నూ సర్వదా స్వశరీర దృశ్య లోకానుభవములన్నిటిని, శాస్త్రీయమైన తన నిత్యానిత్యవివేక బలముతోడ పైవిధమున విచారణ వివేచనలను చేయుచుండవలయును అట్టివారికి మానవుల ఈ ప్రాపంచిక విషయ సుఖదుఃఖభోగానుభవములన్నియు ఎట్లు అనిత్యములై అవాస్తవములై పర్యవసానమున దుఃఖమునే కలిగించుచున్నవో విశదమగుచు జగదసత్యత్వమును గోచరింపజేయుచుండును. కావున అనుక్షణమునను ముముక్షువైనవాడు లోకానుభవములను శాస్త్రీయముగ పరిశీలించుకొనుచుండు నెడల దృశ్యాసక్తతా వ్యామోహములు కాలక్రమమున తగ్గుచుండును. అప్పుడు తాను విధిగా ననుభవింపవలసిన తన ప్రారబ్ధ సుఖదుఃఖ కర్మఫలానుభవములను నిర్లిప్తతతోడను నిరభిమానముతోడను, తన లాభనష్టములను, హర్షక్లేశములను, ఇతర ద్వంద్వములనన్నిటి

యందున అధికానసక్తుడుగాక, ఉపేక్షాభావముతో ఛాయామాత్రముగ ననుభ వింప సమర్థుడగును. ఇట్టి సమర్థతవలన జ్ఞానాభ్యాసకుడు తన స్వస్వరూపాను సంధానాదులను బాగుగ సుస్థిరుడై యభ్యసింపగలుగును. ఇట్టి అభ్యాసమే కాల క్రమమున ముముక్షువునకు తన ఆత్మసాక్షాత్కార సాధనమగును. కావున ముముక్షువులకు ఈ విచారణ పరమశ్రేయోదాయకము. జ్ఞానాభ్యాసకులగు గృహస్థులకు ప్రధానముగ వారివారి కుటుంబ పరిస్థితులును సంబంధబాంధ వ్యములును వారి చిత్తవిక్షేపక్లేశములకు కారణమగుచు వారి సత్యస్వరూప అను సంధానధ్యానాభ్యాసములకు విఘ్నము కలిగించుచుండును. కాన వీని వాస్తవ స్వరూపము విచారించిన ఇవియన్నియు కల్పితములనియు వీనిని గురించి ముముక్షువు తన మమకారాదులతో అత్యంతసక్తతాభిమానముల నొందుట యవివేకమనియూ తన పరమార్థ సాధనకు హానికరమనియు ముముక్షువులకు స్పష్టపడగలదు.

ఈ లోకమందు జీవులు వానివాని ప్రారబ్ధకర్మఫలానుభవములకు గాను వారియొక్క కర్మఫలానుభవమునకు తగిన ప్రదేశములు కుటుంబములు, పరిస్థితులలో ఆ యా గర్భములయందు జన్మమునెత్తి ఆ యా ఫలములను వారి వారి (అనగా ఆ యా జీవులయొక్క) ప్రారబ్ధఫలాంతము వరకు అనుభమును పొంది వారి ప్రారబ్ధఫలము తీరినవెంటనే మరియొక క్షణమైన నుండక వారి కర్మఫలమునుబట్టి మృత్యువును పొందుచుందురు. ప్రతి జీవునకున్నూ అనుభ వములు అనగా ఆయుష్కాలము, మృత్యువు, వారి వారియొక్క కర్మఫలమును బట్టియే ముఖ్యముగ కలుగుచుండును. కాని అన్యులకు అనగా భర్తకు భార్య, తల్లికి కూతుర, తండ్రికి కుమారుడు, అక్కకు చెల్లెలు, అన్నకు తమ్ముడు, అత్తకు కోడలు యీ మొదలగు సంబంధములన్నియు కల్పితము లైనవగుచు; వారివారి కర్మఫలము ననుసరించి ఎవరికి వారు అనగా ఒకరి కొకరు అన్యులు, ఒకరితో నొకరికి వారి వారి సుఖదుఃఖములు ఎంతమాత్రము వాస్తవమున సంబంధించినవి కావు వలసిన జీవుని ప్రారబ్ధకర్మఫలమా జీవునిదై యుండగా అది అన్యుల కెట్లు వచ్చును? రాదు. అయినను ఆ యా జీవులు

వారివారి కర్మఫలానుభవమునకు తగిన వారి గర్భమున ఆ యా పరిస్థితులు గల చోటులయందును, కుటుంబములయందును జన్మింతురు. జీవులందరునూ వారి వారి కర్మానుభవములకుగాను అట్టి కుటుంబములలో అట్టి వారియొక్క గర్భమున జన్మింతురుగాని, వారు జన్మించిన తల్లిదండ్రుల యుత్తీర్ణతకు మాత్రమేకాదు. అయినను లోకదృష్టిని బట్టియు శాస్త్రదృష్ట్యాకూడ ఈ జీవులు వారివారి తల్లిదండ్రుల తరణోపాయమునకు సహాయభూతులగుచున్నారు. ఇదియైనను ఈ జన్మించిన జీవుని ప్రారబ్ధకర్మమునుబట్టి అట్టియవకాశమున్నప్పుడే సహాయభూతులగుచున్నారు కాని లేనియెడల తన తండ్రి కన్నను తల్లికన్నను ముందే యీ జీవుడు మృతుడగుచున్నాడు. ఇట్లే యీలోకమం దనుభవించు ధన సంపత్తులలోను సుఖదుఃఖములలోను స్థితిగతులలోను గుణాగుణములలోను చాల వ్యత్యాసములు చిత్రవిచిత్రములుగ కనబడుచున్నవి. కాని ఆ యా జీవులకర్మ పరిపాక సామీప్యసాదృశ్యములనుబట్టి యెచటనైనను తండ్రి కుమారులుగాని, అన్నదమ్ములుగాని, తల్లికుమార్తెలుగాని, భార్యాభర్తలుగాని కాకతాళీయముగ సమానానుభవములుగలవారై యుండవచ్చును. అయినను యిట్టివన్నియు ఆ యా జీవులయొక్క ప్రారబ్ధకర్మఫలపరిపాక సాదృశ్యసామీప్యములనుబట్టి సంభవించునవేగాని, యీ జన్మమున వీరి సంబంధబాంధవ్యములనుబట్టి కలుగుచున్నవిగావని గట్టిగా వివేకులు గ్రహించవచ్చును. రహస్య మేమనిన యే జీవుని కర్మఫల మా జీవుడు అనుభవముల నొందుటకుగాను ఈ ప్రపంచమున జన్మించుచుందురు. కావున వీరి సంబంధ బాంధవ్యము లెట్టివి యనిన యీ జగదనుభవములయందు యీ జీవులు కలియుచుండుటయే.

ఈ జీవరాశిలో ఆ యా జీవుల కర్మ పరిపాకమునుబట్టి తదనుకూలమైన కుటుంబ పరిస్థితులలో జన్మించి ఆ యా యనుభవములు పొంది ఒకరికొకరను ముందువెనుక విచక్షత లేక వారివారి ప్రారబ్ధఫలాంతమందు యెవరికివారు ఎంత ఆత్మీయులైనను ఒకరి కొరకొకరు క్షణకాలమైనను నిలువక మరణించుచుందురు. ఇంతియేగాని వాస్తవమున జూచిన నిందులో ఒకరి కొకరి కర్మాను

భవసంబంధము లేమియు నుండవు. అయినను దేహధారియైన శరీరికి వ్యవ
హార ధర్మములు తప్పవు. కావున వారివారి కుటుంబస్థితిగతుల ననుసరించి
వారివారి కుటుంబ సంరక్షణకు ప్రయత్నించుట సర్వజీవులకును నావశ్యకము.
దీనికి ధనసంపాదన మానవున కావశ్యకము. అయినను ముముక్షువులగు వారి
అర్జనాశయమెట్లుండ వలె ననిన శ్రీవసిష్ఠభగవానులు :—

శ్లో॥ దేశక్రమేణధన మల్పవిగర్హణేన
తేనాఙ్గ సాధుజనమార్జయ మానపూర్వమ్ ।
తత్సఙ్గమోత్థవిషయా ద్యవహేళనేన
సమ్యగ్విచార విభవేన తవాత్మలాభః ॥

అనగా దేశాచారము ననుసరించి అనింద్యమగు వృత్తితో ధనము నార్జించి,
ఆదరపూర్వకముగా సత్పురుషుల నాశ్రయింపుము. సత్సాంగత్యముచే గల్గిన
విషయవైరాగ్యము వలనను, వేదాంతవిచారము వలనను నీకు ఆత్మతత్త్వ
జ్ఞానము చేకూరును అని తెలుపుచున్నారు. జీవునకు ఈ తన సత్యాలాభమే
పరమలాభమగు మోక్షము అని గ్రహించవలయును.

కాని జీవులయొక్క కర్మఫలములు భిన్నభిన్నములుగాను చిత్రవిచిత్ర
ములుగాను ఉండును. కుటుంబములోనే అత్యంత సన్నిహితులైన అన్న
దమ్ములైనను, తండ్రి కుమారులైనను, భార్యాభర్తలైనను వారి మనో
ధర్మములుగాని, ఆహారవిహారాదులుగాని, తెలివితేటలుగాని సమర్థతాసమర్థత
లుగాని, సుఖదుఃఖానుభవములుగాని, సాధారణముగ నొకేవిధముగ నుండవు.
ఐనను పైన తెల్పినట్లు కాకతాళీయముగ నుండిన నుండవచ్చును. కాని
సహజముగ యెవరి వాసనాసంస్కారములు, మనోధర్మములు వారి
నాశ్రయించియుండును. దీనినే సాంప్రదాయకు లిట్లు చెప్పుచున్నారు—

శ్లో॥ ఐకమద్గు శరారూణాం త్రయమేకౌక సామపి ।
సంకరోఽస్తి మిథోబుద్ధేః న మూర్ఖవిదుషామివ ॥

ఈ కుటుంబములు సంబంధములు ఎట్టివనగా జీవునకు. ఈ కుటుంబము ఒక చెరువువంటిది. ఎట్లనగా ఒక్కటియైన చెరువునందే మత్స్యములు, తాబేళ్లు, ఎండ్రకాయలు, కొంగలు, నీటికాకులు. బాతులు, హంసలు మొదలుగా గల వన్నియు కలసి నివసించుచుండును. కాని వేని స్వభావము వానిది. వేని యాహారము వానిదేయై యున్నదికదా. ఎట్లన హంసలు తామరతూండ్లను తినును. కొంగలు పురుగులను చేపలను తినుచుండును. ఎండ్రకాయలు నీటి పురుగులను తినును. పెద్ద చేపలు చిన్నచేపలను తినుచుండును. ఇట్లయ్యును ఇవియన్నియునూ, ఒక్క చెరువునందే యుండు విధమున మానవులకు కుటుంబానుభవములు కలుగుచున్నవి. కాని ఒకరితో నొకరికి పరమార్థ వాస్తవసంబంధ మెంతమాత్రములేదు. కనుక గృహస్థులైన ముముక్షువులు సంసారాసారతను బాగుగ విమర్శతో గ్రహించి దృశ్యవిక్షేపముల యందత్యం తానక్తులుగాక, యథోచిత వ్యవహారములతో ప్రవర్తించుచు ఆత్మానుసంధాన తత్పరులై కృతకృత్యులుకావలసియున్నది.

ఎంత విచారించినను ఈ జననమరణ సంసారప్రవాహమునందు జీవునకు తన సుఖము కేవలమై నిత్యమగుటకు వీలులేదు. ఏలయన సంసారమున జీవునకు పుణ్యపాప కర్మల సంబంధమనునది లేకయుండుటకు శక్యముకాదు. కర్మస్వరూపమునుబట్టి పుణ్యపాప కర్మములు రెండును జీవునకు బంధములే యగుచున్నవి. ఇట్టి బంధములే జన్మపరంపరను జీవునకు కలిగించుచు సంసార నిమగ్నుని చేయుచున్నవి. కాని వివేకియగువాడు సంసారమందు విరక్తినొందుట తన శాశ్వతసుఖమున కావశ్యక మగుచున్నది. దీనినే "తస్మాజ్జుగుప్సేత్" అను శ్రుతి తెలుపుచున్నది. వివేకియైన జీవునకీ సంసారము దుఃఖపూరితము నిస్సారమగుటచే, వైరాగ్యము పూనవలయునని స్పష్టముగా శాస్త్రము తెలుపుచున్నది కావున ముముక్షువు తన నిత్యానిత్యవివేచనల వలన యీదృశ్యమందు విరక్తుడై మోక్షోపాయమును విమర్శింపవలయును జీవునకు స్వశరీర సర్వప్రపంచానుభవములతోనున్న యీ సంసారమంతయు కల్పితమే యగుటవలన, శాస్త్రాభ్యాసాదులవలన భ్రాంతితొలగు

సేని విముక్తుడగును. ఇదియే వైరాగ్యాభ్యాసముయొక్క పరమలాభము. "నవైరాగ్యాత్పరోబన్ధుర్నసంసారాత్పరోరిపుః" అని స్మృతి వాక్యముగూడ తెలుపుచున్నది, అనగా వైరాగ్యమునకు మించిన బంధువుగాని, సంసారమునకు మించిన శత్రువుగాని లేదు అని వాక్యము తెలుపుచున్నది. బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు యీ స్వశరీర సర్వదృశ్యము నెటుల కలుగుచూ భాసించుచున్నదను విషయమిప్పుడు నెంచిచేసినను ఆత్మానుసంధానమునకు తన దృశ్యజ్ఞానము తనను బాధించుచునే యుండును. కావున నింకనూ నేవిధమున వివర్శించి గ్రహించుట సిద్ధాంతసమ్మతమైన సాధనముగ నుండును. ఏ విధమున ననిన, ఈ స్వశరీర సర్వదృశ్యము జీవుని అనాదిభ్రాంతిచే రజ్జువునందు భాసించు సర్పమువలె నున్నదని లోగడనే తెలిసికొని యుంటిమి. ఈ సర్పభ్రాంతి కాలములో, సర్పముయొక్క వివిధావయవములు కనబడుచు దాని చలనాది క్రియలుకూడ స్ఫురించుచుండునుగదా! కాని వాస్తవమున రజ్జువునందు, వివిధావయవములుగాని చలనాదులు గాని యుండవుగదా! ఈ అచలమైన రజ్జువునందే వివిధావయవ చలనాద్యనుభవములు మానవుని భ్రాంతిచే కలుగుచు రజ్జువునకు ఏంతమాత్రము సంబంధింపనివై రజ్జువుయొక్క వాస్తవ జ్ఞానమును కప్పిపుచ్చి యీ సర్పదృశ్యమంతయునూ రజ్జువునందే కలుగుచున్నది గాని రజ్జువును విడచి కలుగుటలేదు. ఈ దృశ్యవికారము లన్నియు వాస్తవమున రజ్జువునందులేని లక్షణములతోడ రజ్జువునందే ప్రకాశించుచు మానవులకు భయకంపాదులను కలిగించుచున్నవిగదా! ఇచట బాహ్యాంతరము లను వివక్షణచేయుటకుకూడ అవకాశములేదు. ఆంతరమందు రజ్జువెట్టి వికారమును పొందుటలేదు బాహ్యమందు నీ రజ్జువును విడిచి యీ భ్రాంతి కలుగుటలేదు కావున ఇచట బాహ్యాంతర వివక్షతచేయుటకు, అసంభవము, అనావశ్యకము. ఏలనన సర్పభ్రాంతివలన తనకు యిప్పుడు కలుగుచున్న భయకంపాదులను పోగొట్టుకొనుట ప్రథమావశ్యకము. రజ్జువునందే కలుగుచున్న సర్పభ్రాంతివలెననే యీ అద్వితీయఅఖండ చైతన్య బ్రహ్మపదార్థమునందే అనాది జీవభ్రాంతిచే ఈ స్వశరీర సర్వదృశ్యమంతయు బాహ్యాంతరములను వివక్షలేక ప్రకాశించుచు జీవునకు యీ సంసార సుఖ

దుఃఖానుభవముల నిచ్చుచున్నది. అనగా సర్పభ్రాంతికి నీ రజ్జువే యెట్లధిష్ఠాన మగుచున్నదో అట్లే యీ సర్వశరీర సర్వదృశ్యములకునూ బ్రహ్మ అధిష్ఠాన మని జ్ఞానాభ్యాసకులు గ్రహింపవలయును. జీవునకు యీ స్వశరీర దృశ్య నానాత్వమును వాస్తవమని గ్రహించుటయే అజ్ఞానము. ఇదియే అవిద్య, మాయ అని కూడ శాస్త్రములలో చెప్పబడుచున్నది. ఏలయన, ఈ స్వశరీర పరిచ్ఛిన్న దృశ్యోపాధులన్నియు అంతఃకరణ వృత్తికల్పితములు ఈ కల్పితములను వాస్తవములు, తనకు నిత్యములు అని నమ్ముటయే జీవునికి వ్యవహారస్థితి. ఈ వ్యవహారస్థితియంతయు జీవునికి అపరమార్థికము, అనిత్యము దుఃఖము, అగుచున్నది. కావున వివేకియైన జీవుడు ఈ వ్యవహారస్థితిని తన పారమార్థికలాభమునకు సాధనముగా తీసికొనవలయునేగాని తన వ్యవహార స్థితి అనుభవములు యెట్టివియైనను యుండియున్నియూ, జీవుడు తనకు శాశ్వతము, నిత్యము, కేవల సుఖ కరములు అని భ్రమనొందరాదు. జీవునకు పరిచ్ఛిన్న గ్రహణము సంసారము, దుఃఖము అజ్ఞానము, తన అపరిచ్ఛిన్న పరిపూర్ణత్వ గ్రహణము, నిత్యము సుఖస్వరూపము, వాస్తవ జ్ఞానము అగుచున్నది. ఇట్టి జ్ఞానాభ్యాసమే కాలక్రమమున మోక్షసిద్ధి నిచ్చుననియు, నిదియే పరమపవిత్ర మనియు, దీనికంటె అధికమగు జ్ఞానములేదని—

శ్లో॥ నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే ।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి ॥

అనియు, ఇంకను—

శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిద ముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్ ॥

అనగా నీ జ్ఞానము విద్యలలోకెల్ల శ్రేష్ఠము. రహస్యములలో అతి రహస్యము. మిక్కిలి పవిత్రమైనది ప్రత్యక్షమగు ధర్మమార్గము, నాశములేనిది, వ్యయము లేనిది, సుఖకరము అని శ్రీకృష్ణభగవానులు తెలుపుచున్నారు.

ఇట్టి జ్ఞానము విద్యలలోనెల్ల శ్రేష్ఠమైన విద్యయగుటచేత ఈ బ్రహ్మ జ్ఞానము, రాజవిద్యయని చెప్పబడుచున్నది. కనుకనే యీ ఉత్కృష్టమైన విద్యను నీవు నాకు సఖుడవు, భక్తుడవు గనుక ఈ ఉత్తమ విద్యను నీకు తెలిపితినని అర్జునునితో శ్రీకృష్ణ భగవానులు "భక్తోఽసిమే సఖాచేతి రహస్యం హ్యేతదుత్తమమ్" అని తెలుపుచున్నారు. కావున ముముక్షువులు ఈ నిర్గుణ జ్ఞానాభ్యాస లాభము ఇట్టిదనియూ, యిదియే రాజవిద్యయనియూ తెలిసికొన వలయును. ఇట్టి రాజవిద్య ముక్కుమూసికొని అడవులయందున్నవారికే సాధ్యము, గ్రాహ్యముగాని మనకేలయని కొందరి యభిప్రాయము. కాని యిట్లు తలచుట వివేకముకాదు. ఏలనన వారివారి ప్రారబ్ధ కర్మానుసారముల చొప్పున జీవులు వ్యవహారానుభవములను పొందవలసియున్ననూ, మానవులందరును నీ విద్య నభ్యసించి ప్రత్యక్షలాభమును పొందవచ్చునని పై గీతావచనము విస్పష్టపరచు చున్నది. ఈ నిర్గుణ బ్రహ్మవిద్య మనకెందులకని తలంచుటయును, మనమిట్టి విద్యను పొందగలమా? యని తలంచుటయును మనోదౌర్బల్యమేగాని మరి వేరేమియుగాదు. పురాణేతిహాసములలో నెచట చూచినను ఇట్టి విద్య సర్వరాజ్య భారములు కలిగి, లౌకిక ప్రజ్ఞావంతులైన చక్రవర్తులచేగూడ నీ విద్య పొంద బడినదిగా తెలియుచున్నది. బాగుగ నాలోచించిన యీ చక్రవర్తులకు వారి కుటుంబములతోబాటు, వారి రాజ్యపరిపాలనాభారముగూడ గలిగియున్నపుడు వారి బాధ్యతాభారములెట్టివో లేక కేవలము వారి సంసారములోని బాధ్యతాభారము లెట్టివో వివేకులు ఆలోచించుకొనవలసియుండును. కావున నెట్టి సంసారులకైనను, ఎంత లౌకిక వ్యవహారపరిపాలనాబాధ్యతలున్న జీవులకైనను ఇట్టి విద్యను సంపాదించి దాని వాస్తవ సుఖము ననుభవించుట అసంభవముకాదు. కాని మానవుడు శాస్త్రజ్ఞానముతోడను, అనుష్ఠానాదులతోడను చిత్తశుద్ధిని సంపాదించి, శ్రుతి వాక్యమందు ప్రామాణ్యబుద్ధిని సంపాదించి, శ్రవణమన నాద్యనుష్ఠానాదుల వలనను, సాధుసంగమ సచ్ఛాస్త్ర సహాయములవలనను సాధ్యమైనంతవరకు యమనియమాదులతో, చిత్తవిక్షేపమును తగ్గించుకొనుచు యీ మోక్షవిద్యాప్రాప్తికి ప్రయత్నముచేసిన, ఫలము కాలక్రమమున కలుగు నను మాటకు సందియములేదు. సారాంశమేమనిన కొంతవరకైనను

మానవుడు తన నిత్యానిత్య వివేకవివేచనముల వలననూ, మననధ్యానాద్యభ్యాసముల వలనను, చిత్తవిక్షేపాదులను తగ్గించుకొనుట యీ బ్రహ్మవిద్యా సంపాదనమునకావశ్యకము. ఇట్లు చిత్తవిక్షేపాదులనుతగ్గించుకొనిన వారికీవిద్య సులభసుఖసాధ్యముగ నుండును. కాని ప్రయత్నముచేయక భయపడుట మానవ వివేకముకాదు. ఇంకను బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు ముఖ్యముగ తన స్వరూప ప్రపంచములను యిట్లు తెలిసికొనవలయును, జీవుడు పరమార్థవాస్తవమున బ్రహ్మస్వరూపుడు. దీనినే బ్రహ్మస్వరూపుడగు శ్రీకృష్ణ భగవానులు చెప్పదైన అర్జునున కిట్లు పదేశించుచున్నాడు—

శ్లో॥ మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా ।
మత్స్థాని సర్వ భూతాని నచాహం తేష్వవస్థితః ॥

శ్లో॥ న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్ ।
భూతభృన్నచ భూతస్థో మమాత్మా భూతభావనః ॥

శ్లో॥ యథాకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్ ।
తథా సర్వాణి భూతాని మత్స్థానీ త్యుపధారయ ॥

అనగా దృష్టిగోచరము కాని నామూర్తిచే (అనగా జ్ఞానముచే) ఈ జగత్తంతయు వ్యాప్తమైయున్నది (అనగా అధిష్ఠానము). సర్వభూతములు (అధ్యస్తములుగ) నా యందున్నవి. (అధిష్ఠాన రూపుడనైన) నేనుమాత్రము వానిలో లేను. ఆ భూతములు నాయందుండినగాని అవియన్నియు వివర్తములగుటచే నాయందు లేవు. ఇట్టి విలక్షణమైన మాయాశక్తిని గ్రహింపుము. ఇదియెట్లనగా ఆకాశమందు వాయువు సర్వత్ర వ్యాపించియున్నను ఆకాశము మాత్రమేవిధమైన వికారము చెందక యుండునట్లు ఈ భూతము లన్నియూ నాయందున్ననూ వాని మూలమున నెట్టి వికారము వాస్తవముగ నాయందులేదని నిశ్చయించుకొనుము. అని భగవంతుడే తన స్వరూపమును భావింపవలసిన విధము చెప్పియున్నాడు. కాన మహాకాశమందంతటను సంచరించు వాయువు నిత్యముగ ఎట్లు ఆకాశమందుండునో, అట్లే సర్వభూతములు నాయందున్నవి

యని, బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు తన వాస్తవ (అధిష్ఠాన) స్వరూపమైన జ్ఞానమునకును, తత్స్వరూపమైన (అధ్యస్తమగు) జగత్తునకును గల సంబంధమిట్టిదియని తెలిసికొనవలయును. మహాకాశమునందు వాయువుసర్వదా వ్యాపించియుండినను, ఇంచుక యైనను ఆకాశసంబంధము పొందనియట్లు సర్వవ్యాపక పరిపూర్ణ జ్ఞాన స్వరూపుడైన ఆత్మయందు, ఈ ప్రపంచమంతయు నెంత మాత్రము సంబంధపడక అసంగముగానుండి మనలకు ఈ సర్వదృశ్యమును, (రజ్జువునందు సర్పభ్రాంతిలాగున) అధ్యస్తమై కనబడుచున్నదని ముముక్షువులు నిశ్చయముగ గ్రహింపవలెను. కావున అధిష్ఠానమగు జ్ఞానమునకును అధ్యస్తమైన యీ జగత్తునకును ఎట్టి వాస్తవ సంబంధమునూ లేదు అని జ్ఞానాభ్యాసకులు నిశ్చయము నొందవలయును. అధిష్ఠానము తెలియక పోవుటచే భ్రాంతివలన ఆ అధిష్ఠానమగు బ్రహ్మయే, జీవునకు జగత్తుగా భాసించుచున్నదిగాని వాస్తవముగ వేరు జగత్తులేదని తెలిసికొనవలయును. ఈ స్వశరీర సర్వదృశ్యమందునను, వాస్తవముగ నున్నది—"ఇది" అను సన్మాత్రబోధక శబ్దముచే తెలియబడుచున్నట్టియూ, జీవుని పరమార్థ స్వరూపమగునట్టియూ బ్రహ్మపదార్థమొక్కటియేగాని రెండవది లేదు. ఇదియే అద్వితీయ అఖండ స్వప్రకాశ పరిపూర్ణ చైతన్యమనియు, నిదియే జగదధిష్ఠానమనియు, నిదియే తన ఆత్మస్వరూపమనియు, జ్ఞానాభ్యాసకుడు నిశ్చయముగ గ్రహింపవలయును. ఇట్లు సంశయవిపర్యయ రహితముగ నిశ్చయమునొంది, యీ అఖండస్వరూప జ్ఞానమును స్వానుభవము నొందుటకు ముముక్షువు మననిదిధ్యాసనములను నిరంతరము ఫలావగతి పర్యంతము నభ్యసించుచుండుట ఆవశ్యకము. ఇట్టి అభ్యాసము ఇంతవరకు మననముచేసిన "అహం" "ఇదం"ల విమర్శ వివేచనలను, బాగుగ జ్ఞప్తియందుంచుకొని వృత్తిగోచరముతో బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు తన పరమార్థస్వరూపమును సర్వోపాధి వినిర్ముక్త సజాతీయ విజాతీయస్వగతభేదరహిత స్వప్రకాశ జగదుత్పత్తి స్థితి లయ వివర్త అభిన్న నిమిత్తోపాదానకారణ నిత్యనిరతిశయ నిర్వికార అద్వితీయ అసంగఅఖండ పరిపూర్ణ చైతన్యస్వరూపమైనదానినిగనూ, వాస్తవముననీ కనబడు శరీరాదులు తాను కాననియు, వీనితో తనకు వాస్తవ సంబంధ

మెంతమాత్రము లేననియు, తన పరమార్థస్వరూపమైన ప్రత్యగాత్మయే పర మాత్మయనియు, కావున తానే అనగా నేనే పరమాత్మయనియు, సర్వదా ముముక్షువు తన అనుసంధానాదుల నాచరించుచుండుట తన పరమముక్తికి సాక్షాత్సాధనము.

ఇదియే జీవ బ్రహ్మైక్యానుసంధానము. అనగా జ్ఞానాభ్యాసకుడు "అహం" పదార్థమునకు వాస్తవార్థమగు తన ప్రత్యగాత్మ స్వరూపమునూ, "సః" అనగా ఆ పరమాత్మయునూ నొక్కటే యని తెలిసికొనుట. ఇట్టి జీవ బ్రహ్మైక్యజ్ఞాన నిరూఢికొరకే "సోహం" అను మంత్రము జీవునకు తెలుప బడినది. ఇది సర్వదా ముముక్షువులు జపించుచుండ వలసినది. సర్వదా అనగా శ్వాస ప్రశ్వాసలతోడ జపించుచుండవలసినది. దీనినే "హంస" విద్య యందురు బ్రహ్మోపాసకుల కిది అమృతవిద్య. ముముక్షువు కేవల శాస్త్రపఠన జ్ఞానముతోడ నెంతగ "అహంబ్రహ్మాస్మి" యని వాచా యనుకొనుచుండినను, స్వానుభవము కలుగుట కష్టము స్వానుభవము కలుగుటకు జ్ఞానపూర్వకముగ మనసుతో చేసిన మననానుసంధానములే శీఘ్రఫలప్రాప్తి నిచ్చునుగాని కేవలము శాస్త్రశబ్ద జ్ఞానముతో వాచా ఆచరించుక్రియలు ఉత్తమ ఫలకారులు కాజాలవు ఐనను ఫలము అల్పము కలుగుచుండును. కావున ముముక్షువు తన మనస్సును సుస్థిరముగా జేసికొని తన అనుష్ఠానకాలమందు భ్రమబుద్ధితోనైనను అన్యా లంబన లేక—అనగా చిత్తమును అన్యాయత్తము గానీయక జపతపాది మన నాద్యభ్యాసములను చేయుచుండవలయును. ఇంకను జ్ఞానాభ్యాసకులు తమ తమ ప్రారబ్ధోచితమైన లౌకిక కర్మలను చేయుచున్నను వానితోపాటు కేవల కాయముతో ననుష్ఠించిన కర్మలకన్న మానసిక నిశ్చయముతోచేయు, అను సంధానములకే యెక్కువ ఫలము ముముక్షువు తన చిత్తము నన్యాయత్తము గానీయక, తన సత్స్వరూపమందే లక్ష్యముంచి జపతపాదుల నాచరించుచుండ వలయును అట్లుకానిచో విపరీత ఫలములనుగూడ పొందుదురను విషయము ఈ క్రింది గాథ వలన నిశ్చితము కాగలదు.

ఒకానొకప్పు డొక ఋషి పుంగవుండు తనయొక్క జపానుష్ఠానాదులను నిర్విఘ్నముగ నాచరించుటకుగాను, ఆ ఊరి బైటనుండు నొక నదియొడ్డున తన ఆశ్రమమును నేర్పరచుకొని, జపతపాదులను ఆచరించుచుండెడివాడు. ఇట్లు కొంతకాలము గడుపగా ఆ నదియొక్క ఆవలిగట్టున, తనకు రహస్యము గను విజనప్రదేశముగను నుండునను తలంపుతో ఒక భక్తురాలైన స్త్రీ అచట తన గృహమును నిర్మించుకొని వసించుచుండెను. కాని యామెయొక్క కుల ధర్మము చొప్పున ప్రతిదినమును నామెకొఱకు పలుమంది విటులు వచ్చు చుండెడివారు ఆ విధమున నామె జీవయాత్రను గడుపుచుండెను. అయినను ఆమె పరమభక్తురాలు గావున భగవంతుడు తన కిదితప్ప వేరు జీవయాత్రా సాధనమును చూపలేదేయని సదా చింతించుచు శ్రీకృష్ణధ్యానవంతురాలై తన కుల ధర్మమును అనుసరించుచుండెను ఈ దృశ్యమునంతయునూ, నావలియొడ్డున నున్న ఋషిపుంగవుడు ప్రతిదినమును జూచుచున్నవాడగుచు నిది పాపకార్యమని తన మనసున సదా దానినే తలంచుచు తన జపాదుల నాచరించుచుండెడివాడు. కాని కాలక్రమముగ ప్రతిదినమునను యిట్లు చింతించుచు, ఆమెకొఱకు వచ్చుచు పోవుచున్న, విటులనే గాంచుచు నిట్టి దుర్వృత్తివలన నామెకెట్టి నరకములు సంప్రాప్తమగునోయని చింతించుచు, తన జపానుష్ఠానములను నిర్విఘ్నముగ సాగించుచుండెను. కాలాంతరమున క్రమముగ వీరిద్దరును ఆసన్న మరణులైన సమయమున నీ ఋషిపుంగవుని యొక్క జీవమును యమభటులును, ఈ వేశ్యయొక్క జీవమును విష్ణు దూత లును తీసికొని చనిరి. అప్పుడు ఈ ఋషిపుంగవుడు — "నేను ఏకాకినై సదా జపతపములనే కావించినవాడను, నన్ను యమభటులు ఏల కొనిపోవు చున్నా"రని యడుగగా, అందులకు యమభటులు— "నీవు దేహముతోడ జప మును జేయుచున్నను సదా నీ మనస్సుతోడ వ్యభిచారచింతన యందుననే మునింగియుంటివి. కాని ఆ వేశ్యయగు భక్తురాలు సదా తన మనసుతో భగవ ద్ధ్యానపరురాలైయుండి, ఆమె కులవృత్తిని దేహముతో నాచరించుచుండెను. ఇట్లాచరించిన దేహము లిప్పుడు మీయిరువురకునూ లేవుగదా! కావున నిప్పుడు నీ మనఃక్రియా ఫలమును నీవనుభవింపవలెనుగాని, దహన సంస్కారము

పొందిన ఏ భౌతికశరీర మిపుడెట్లువచ్చునని చెప్పుచు. యమభటులు ఆ ఋషి పుంగవుని యమపురికిం గొనిపోయిరి. ఈ గాథవలన స్పష్టపడున దేమి యనిన ముఖ్యముగ పరమార్థ విషయములలో ఫలప్రాప్తికి వారివారి మానసిక వృత్తియే ప్రధానముగాని కేవలకాయముచే నాచరించుక్రియలు వాంఛా ఫల దాయకములు కాజాలవని స్పష్టపడుచున్నది. కావున జ్ఞానాభ్యాసకుడు ఈ బ్రహ్మవిద్యను సంప్రదాయానుసారముగ గ్రహించి దానిని స్వానుభవము నొందుటకు తన పరమార్థ సత్యస్వరూపమగు ప్రత్యగాత్మను మనోగోచరము గావించుకొని చిత్తస్థైర్య ఏకాగ్రతలతో బ్రహ్మానుసంధానాదులజేయు చుండు టయే తన యిష్టఫలసిద్ధికి ప్రధానమని గ్రహింపవలయును.

బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు తన సర్వకాల సర్వావస్థలయందునను తాను వాస్తవముగ, అవస్థాత్రయ, త్రికాలాబాధిత, అపరిచ్ఛిన్న అఖండపరిపూర్ణ చైతన్యస్వరూపుడననుభావము మఱవక తాను యేపని చేయుచున్నను తన పర మార్థస్వరూపమును చింతించుచుండవలయును అయినను యిట్టి స్వరూపుడైన తానే, తన అవిద్యాకామ కర్మవశములచే నీ యుపాధియందు అనాది మాయా ప్రభావముచే బంధింపబడిన వానివలె నున్నాననియు, నీ వ్యవహారానుభవము లన్నియు తనకు కల్పితములు, తాత్కాలికములు, అను నిశ్చయముతోడ విషయ ములయందు సక్తతాభిమాన రహితుడై సుఖదుఃఖభోగములను పొందుచుండ వలయునుగాని, రాగద్వేషాభిమాననాసక్తుడు కాకూడదు. కాని యిట్లు చేయుటకు ముముక్షువు ఎంత ప్రయత్నించుచున్నను తన అహంకార మమకారములు తన సక్తతాభిమాన త్యాగమునకు అడ్డువచ్చును "నేను, నాది" యను పరిచ్ఛిన్న జ్ఞానమునే బలపరచుచుండును ఇదియే జీవునికి అనాదిభ్రాంతి. ముముక్షువగు వాడు దీనినుండి విముక్తుడగుటకు శాస్త్రజ్ఞానబలముతో లోకానుభవములను సయుక్తికముగ వివేచనచేసికొను చుండిన యెడల కాలక్రమమున నీ విషయ సక్తతాభిమానములు క్షీణించుచుండును కావున వివేకియగువాడు తనకు ఈ శరీరోపాధి తన ప్రారబ్ధకర్మ ఫలానుభవమునకై గాను కల్పితమైనదేగాని, యీ తన దేహాదులు వాస్తవమను భ్రమనునొందగూడదు. ఈ దేహముతోడ తన

కర్మానుభవములన్నియు తన ప్రారబ్ధఫల ప్రకారము నడచునుగాని తానుకోరి నట్లు నడువవు అయినను మానవుడు తన అజ్ఞానముచే అనేకములగు కోరికల నొందుచు సర్వకార్యములను తనశక్తిచే తానే చేయుచున్నానని యీ దేహాదు లను స్మరించుకొని అభిమానము నొందుచుండును. ఇంకను సాధారణముగ. నేదైనను మంచిగాని, గొప్పకార్యముగాని కలిగిన యెడల తాను చేసితినను సంతోషమును, ఏదైన కీడువచ్చి తనకు అపకారము కలిగిన యెడల మరి యొకరివలన తనకిట్లు జరిగినదనిగాని. జరుగుతున్నదనిగాని తలచి వారిని ద్వేషించుచు క్రోధముతో దుఃఖము నొందుచుండును ఇందువలన ద్వేషక్రోధ పూరితుడగుచుండును కాని వాస్తవ మాలోచించిన యెడల యీమంచిచెడ్డలు, ఉపకారాపకారములచే తనకు కలుగునట్టి సుఖదుఃఖములు రెండును తన కర్మ ఫలములే యని తెలిసికొనలేక తన సుఖమునకు యొకరిని ప్రేమించుచు అనగా రాగాభినివిష్టుడగుచు, తన దుఃఖమునకు మరియొకరిని ద్వేషించుచు క్రోధాభి నివిష్టుడగుచు, నిట్లు రాగద్వేషములను వృద్ధిచేసికొనుచు మానవుడు సంసార దుఃఖము నొందుచున్నాడు. ఇది యంతయునూ భ్రాంతి. ప్రతి మానవునకును తన సుఖదుఃఖములు తన ప్రారబ్ధ కర్మఫలము చొప్పున తా నాచరించిన పుణ్య పాపములవలననే కలుగుచున్నవిగాని అన్యులవలన కలుగుట అసంభవమని గ్రహించవలయును. దీనినే—

శ్లో॥ సుఖస్య దుఃఖస్య నకోపిదాతా పరో దదాతీతి కుబుద్ధిరేషా ।
అహం కరోమీతి వృథాభిమానః స్వకర్మసూత్రగ్రథితోహి లోకః ॥

అని శాస్త్రము తెలుపుచున్నది. కావున జ్ఞానాభ్యాసకుడు దీనిని బాగుగ గ్రహిం చినయెడల, అన్యులయందు తన రాగద్వేషాదులు తగ్గుచు తన సక్తతాభి మానములుకూడ క్షీణించుచుండును. ఇట్లు క్షీణించగా బుద్ధి నిర్మలమై సుస్థిర ముగ ముముక్షువు తన బ్రహ్మాభ్యాసాదులను బాగుగ నాచరింప సమర్థుడగు చుండును. ఈ విచారమువలన కలుగు పరమలాభమిది యని జ్ఞానాభ్యాసకులు తెలిసికొనవలయును.

జ్ఞానాభ్యాసకులు ముఖ్యముగ జాగరూకులై యుండి మరొక విషయమున భ్రమచెందగూడదు. అదియేది యనిన, తమ మనసే తామని భ్రమించుట. ఈ మనసు ఇంద్రియములకు రాజువంటిది. సమస్త వ్యవహారములును సర్వులకు, ఈ మనస్సుచేతనే నడుచుచున్నను ఇదియునుగూడ తక్కిన యింద్రియములవంటి జడపదార్థమే ఇది లోగడనే నిశ్చయించియుంటిమి. కాని పండితులనబడువారు గూడ నీ తమ మనసే తామను భ్రమ నొందుచుందురు. ఇది భ్రాంతియే కాని వాస్తవమెట్లుగను కాజాలదు. కేవల జడపదార్థములకు గ్రహణ శక్తులుండుటకు అసంభవము. ఈ మనసుగూడ తక్కిన యింద్రియ సమూహమువంటిదే గనుక తక్కిన వానివలనే నిదియు పరప్రకాశ్యమేగాని స్వప్రకాశము కాదు ఎట్లన నేత్రములున్నను సూర్యప్రకాశముగాని, దీప ప్రకాశసహాయముగాని లేనియెడల కేవల నేత్రములు (విషయ) పదార్థములను చూచుటకు ఎట్లు అసమర్థమగుచున్నవో, అట్లే యీ శ్రేష్ఠేంద్రియమగు తన మనసునుగూడ ప్రకాశింపజేయుటకు మరియొక ప్రకాశముండి తీరవలయునని నిశ్చయమగుచున్నది. ఈ విషయమునే "కింజ్యోతిః" అను శ్లోక వివరణ మందు లోగడనే తెలిపి యుంటిమి ఇట్లు తన మనసును ప్రకాశింపజేయునట్టి స్వప్రకాశరూపుడే "అహం" "నేను" అను తనవాస్తవ జ్ఞానస్వరూపమునే ప్రత్యగాత్మస్వరూపుడుగ తమ హృదయపుండరీకమునందున జ్ఞానులచే తెలిసికొనబడుచున్నాడు. ఈయనయే పరమాత్మ. ఈయనయే "అహం" నేను అను ప్రతీతికి వాస్తవార్థము. కాని యీయనయే జీవోపాధిగానున్న అంతఃకరణమను తన మనస్సును "నాది, నేను" అని భ్రమించి మాయాప్రభావముచే అన్యోన్యాధ్యాసతో సంసారదుఃఖము పొందుచున్నవాని వలె జీవానుభవములను బట్టి కనబడుచున్నాడుగాని, వాస్తవమాలోచించిన యీ అంతఃకరణోపాధిధర్మము లగు సుఖదుఃఖము లేవియును ఆయన నంటక అసగా వీనితో నెట్టి సంబంధమును లేక సర్వసాక్షి చైతన్యప్రకాశుడై యుండును. ఇట్లసంగుడుగా నుండునట్టి ప్రత్యగాత్మప్రకాశమే, మనస్సును సర్వదా ప్రకాశింపజేయునది. ఈ విషయమునే——

శ్లో॥ జపాకుసుమ సాన్నిధ్యా ద్రక్తత్వం స్ఫటికే యథా ।
రహమంకార సాన్నిధ్యా జ్జీవత్వం ప్రత్యగాత్మని ॥

అనగా జపాకుసుమ సాన్నిధ్యమువలన స్ఫటికమందు రక్తత్వము అగపడు చున్నట్లు అహంకార సాన్నిధ్యముచే, ప్రత్యగాత్మయందు జీవత్వము భాసించు చున్నది అని శ్రీశంకరభగవత్పాదులు తెలుపుచున్నారు. కావున జీవునకు ఈ జీవత్వము వాస్తవముకాదని స్పష్టపడుచున్నది గాన జీవవ్యవహారమే భ్రమ. వాస్తవమున సర్వప్రకాశకుడైన ఆప్రత్యగాత్మకు యీ మనోధర్మములైన సుఖదుఃఖాది వికారములతో నెంతమాత్రమునను వాస్తవసంబంధములేదు. ఈ సంబంధము భ్రాంతి మాత్రము, కల్పితము. అయినను సూర్యుడు యెట్లు తనస్థితి మాత్రము చేతనే నదీ, తటాక, కూప, మూత్రపురీషజలమందున సమానముగ ప్రకాశించుచు. వానిసంబంధము తానెంతమాత్రమునూ పొందుటలేదో, అట్లే యీ ప్రత్యగాత్మప్రకాశము మనసును, మనోవికారముల నన్నింటిని ప్రకాశింప జేయుచు వాని ధర్మములతో తానెంతమాత్రము సంబంధపడక యున్నాడని ముముక్షువులు తెలిసికొనవలయును ఇట్టి సాక్షి, ప్రత్యగాత్మయైన స్వప్రకాశ పరిపూర్ణచైతన్యమే, తన వాస్తవిక "అహం" నేను అనుప్రతీతికి అర్థముగాని తన మనస్సు మాత్రముకాదని ముముక్షువులు నిశ్చయముగ గ్రహింపవలెను. ఈ మనస్సనునది మహాబలీయమైనది ఇది జడస్వరూపమైనను ప్రత్యగాత్మ శక్తిసాన్నిధ్యమున, నుండుటంజేసి తానే సత్యమైనదానివలె సర్వ జీవులకును తోపింపజేయుచు, విద్వాంసులనుగూడ మోహింపజేయునది గావున బ్రహ్మ జ్ఞానాభ్యాసకు లిచట పొరబడకుండుటకునూ, సిద్ధాంత నిరూఢికినీ యిచట తిరిగి వివరించడమైనది.

బ్రహ్మాభ్యాసకులు తమ సత్యస్వరూపమును ఎంతశాస్త్రీయ విచార వివేచనలుచేసి తెలిసికొన్నను ఈ దేహతాదాత్మ్య కర్తృత్వాభిమానములు, జీవుని విడువక దుఃఖక్లేశములను కలిగించుచునేయుండును జీవునకిట్టి క్లేశ దుఃఖములు ముఖ్యముగా విషయభోగాభిలాష వలనను విషయచింతన వలనను కలుగుచుండును. ఎంత విరాగినైనను ఈ విషయవాంఛలు ఏదోయొక విధమున

క్రిందికిలాగుచునే యుండును అనగా సంసారమున పడద్రోయుచునే యుండును. విషయములు మహాబలీయము లను విషయమును—

శ్లో॥ విషయాభిముఖంద్రష్ట్వా విద్వాంసమపి విస్మృతిః ।
విక్షేపయతి ధీదోషై ర్యోషా జారమివ ప్రియమ్ ॥

అనగా జారునియందు స్త్రీ తనయందలి ప్రీతినిజూపి తన హాసవిలాసములచే వానిని మోహింపజేయునట్లు సత్పురుషుడైనను, విషయవాంఛితుడయ్యెనేని, విస్మృతికలిగించి తన ఆత్మ తత్త్వచింతనమునుండి మరలించి నానా విషయ ప్రవృత్తులను కలిగించి సంసారభోగలంపటునిగ చేసి చెరచునని శ్రీశంకర భగవత్పాదులు తెలుపుచున్నారు. ఇంకను ఈ విషయ భోగచింతనాదులచే కలుగు విషము జీవునికి సర్పవిషముకన్నను అధికమైన అపాయహేతువని శ్రీ వసిష్ఠ భగవానులు తెలుపుచున్నారు. ఎట్లన, సర్పవిషము ఈ జన్మము నందు మాత్రము ప్రమాదమును కలిగించును. కాని విషయభోగచింతనాదుల వలన కలుగు విషము సంకల్పసంస్కార వాసనారూపముల బరిణమించి అనేక జన్మములు చెరచును. కావున జ్ఞానాభ్యాసకుడు తన యథాప్రారబ్ధకర్మఫల భోగములనుగూడ విషయసక్తతాభిమానరహితుడై తన సత్యస్వరూప జ్ఞానముతో ననుభవింపవలెనుగాని, విషయభోగములందు సక్తుడు కాగూడదు. ముముక్షువులగువారు, వారివారిస్థితి దేహధారణావశ్యకమగు భోగములనైనను నిర్లిప్తతతో ననుభవించుచుండవలయునేగాని, అట్టి సంప్రాప్తభోగములందు గూడ సక్తతావ్యామోహితులు కాగూడదు. ఇది కష్టసాధ్యము. అయినను అభ్యాసకునకిది విధి.

బ్రహ్మజ్ఞానాభ్యాసకు డన్న సాధకుడేగాని సిద్ధుడగు యోగారూఢుడు కాడు. కావున శాస్త్రబద్ధుడు. అందుచే సాధన చతుష్టయసంపత్తి కలుగువరకు తన జ్ఞానాభ్యాసాదులతోబాటు శాస్త్రవిహిత కర్మములుచేసినగాని పైమెట్టుకు పోజాలడు. ప్రతిదేహధారికిని దేవ ఋషి పితృఋణములనుండి విముక్తుడగుట, తన పరమార్థ సిద్ధికి అవశ్యకమని శాస్త్రమే తెలుపుచున్నది. జీవునికి ఈ

కర్మలు పండునకు ముచ్చికవంటివి. కాలపరిపాకమున కాయ, పండు కాగానే యాముచ్చికయే పండును విడుచును. పరిపక్వము గాకముందు నా కాయను ముచ్చికనుండి విడదీసినచో ఆకాయ పరిపాకమునకు రాక చెడిపోవును గదా! అట్లే జ్ఞానాభ్యాసకునికి ఈ కర్మాచరణమనునది దానంతటనది సహజముగనూ సశాస్త్రీయముగనూ, నుపశమింపవలసినదేగాని అభ్యాసకుడు తానుగ, సక్తుడై మానగూడదు. ఈ కర్మాచరణ జీవునకు క్షుత్పిపాసలవంటివి అభ్యాసకునకే క్షుత్పిపాసాదు లుపశమించిన యెడల కర్మచేయుట యనునదే సంభవముకాదు. అభ్యాసకుడు సత్కర్మానుష్ఠానము మానినను ఏదోయొక కర్మచేయుచునే యుండవలయును గాని మానకుండుట సాధ్యముకాదు. దీనినే "నహి కశ్చిత్ క్షణమపి జాతుతిష్ఠత్యకర్మకృత్" అని గీతావచనము తెలుపుచున్నది. ఇంతను అర్జును డంత వానికిగూడ కర్మ మానుటకంటె చేయుచుండుటవలననే, నీకు మేలని "కర్మజ్యాయో హ్యకర్మణః" అని శ్రీకృష్ణభగవానులు చెప్పుచున్నారు.

మరియును జ్ఞానాభ్యాసకులైనవారు కొంత గుహలయందు కౌపీన ధారులై అప్రయత్నముగ దొరికిన ఆహారమును భుజించువారై యుండవలెనను యొక లోకాభిప్రాయముగూడ కనబడుచున్నది. కాని యిది కొంతవరకు వాస్తవమైనను అందరును ఇట్లే చేయుచుండవలయునను నియమము లేదు. కొందరు మహానుభావు లిట్లున్నను నుండవచ్చునుగాని, అట్లున్నవారందరు బ్రహ్మ జ్ఞానులని చెప్పుటకు మాత్రము వీలులేదు బ్రహ్మజ్ఞానులును, అభ్యాసకులును గూడ వారివారి ప్రారబ్ధానుసారముగ నుందురు. అయినను వారి జ్ఞానమే ప్రధానము, గ్రాహ్యము గాని, వారి యునికి పరిస్థితులుగావు. లోకవ్యవహార ములయందు జ్ఞాని, అజ్ఞానుల చర్యలయందు స్థూలదృష్టికి గనపడు వైలక్షణ్యము లేమియు నుండవు కాని సూక్ష్మదృష్టిచే పరిశీలించిన యెడల నుభయులకునూ తారతమ్యము కనబడుచునేయుండును. ప్రారబ్ధభోగములు జ్ఞాని యజ్ఞానుల కిద్దర కును సమానమే యైనను వారివారి భోగములచేకలుగు సుఖదుఃఖానుభవములందు భేదముండును. అజ్ఞాని తన లోకానుభవముల నన్నిటిని నిత్యసత్యబుద్ధితోడ నొందుచు వాని వలన అధిక సుఖదుఃఖ క్లేశముల నొందుచుండును. జ్ఞాని

అనగా జ్ఞానాభ్యాసకుడు వాని నన్నిటిని తన ప్రారబ్ధకర్మఫలానుసారమున తన అసక్త్వబుద్ధితో వాటి ననుభవించుచు వానిచే కలుగు సుఖదుఃఖములను కల్పితములని గ్రహించి ఆభాసమాత్రముగ వానిని పొందుచుండును. బ్రహ్మజ్ఞాని యందుగాని, బ్రహ్మజ్ఞానాభ్యాసకుని యందుగాని, విధిగా మహత్తు లేమియును నుండ నవసరము లేదు. విధిగానుండవు. ఈ మహత్తులన్నియు అల్పములు కావున వానిని జ్ఞానులు కోరరు. ఎవరికైనను ఒకానొక మహా జ్ఞానియందు వారి ప్రారబ్ధమును బట్టి మహత్తులుండిన నుండవచ్చును. కాని వానివలన వారిజ్ఞానమునకు న్యూనాధిక్యతయేమియును నుండదు. బ్రహ్మ జ్ఞానులగువారు వారివారి ప్రారబ్ధకర్మఫలానుసారమున నెట్టి వర్ణాశ్రమవృత్తి పరిస్థితులలోనున్నను వారి జ్ఞానమంతయు నొక్కటిగనే యుండును. జ్ఞానము సర్వదా యొక్కటిగానేయుండును, కాని మారుటకు వీలులేదు. ఎన్నటికినీ మారదు. ఇంకనూ మానవులకు బ్రహ్మజ్ఞానమును సిద్ధత్త్వ విద్యాభ్యాసము వలన మాంద్యము, జడత్వముగలిగి వ్యవహారయోగ్యత తప్పుననియు, యుండదనియూ, మరియొక సామాన్యాభిప్రాయముగూడ సాధారణముగ కనబడుచున్నది. కాని యిదియునూ సరియైనదికాదు. బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు తన అభ్యాసపటిమా సౌకర్యములకుగాను వ్యవహారములను తగ్గించుకొన వచ్చును తగ్గించుకొనుటగూడ యావశ్యకము కాని అట్లుచేయుట తన అసమర్థతా మాంద్యములనుబట్టి కాదు. ఏలయన నిట్టివారి బుద్ధి సత్త్వప్రధాన ముగ నుండునుగాని తమోగుణావృతముగా నుండదు. జ్ఞానులుగాని, జ్ఞానా భ్యాసకులుగాని, వారి సత్త్వగుణప్రాధాన్యముచే వ్యవహారముల వాస్తవికతను తక్కినవారికన్న బాగుగ గ్రహింపగలుగుచు వ్యవహార నైపుణ్యమునుగూడ గలిగియుందురు. కాని అట్టివారు వారివారి ప్రారబ్ధబలమునుబట్టి తప్ప, వ్యవహారములను యుప్పుయించుటగాని, అందు నిమగ్నులగుటగాని చేయరు. తత్త్వజ్ఞానాభ్యాసకులు లోకవ్యవహారములను వారి ప్రారబ్ధక్షయమునకే నిర్వర్తించుచుందురుగాని ఆ కర్మఫలములను వారుకోరరు. ఏలయన కర్మఫల మెట్టిదైనను వారికి పునఃప్రతిబంధము కల్పించునుగాన వానిని వారు సదా మానసికముగ నిరాకరించుచునే యుందురు. ఇట్లువారు గావింప గలుగుటకు

వారి జగన్మిథ్యాత్వజ్ఞాన నిశ్చయములే వారికిబలము. ఇట్టి నిశ్చయముతోడనే జ్ఞానాభ్యాసకులు వారి అనుసంధానాభ్యాసములను నిర్విఘ్నముగ చేయుచుందురు. ఇట్టి అభ్యాసము వారికి నిరంతరముగానుండును. కాని పాఠకుల కిచ్చట నొక చిన్న విజ్ఞప్తి. ఏమనిన కేవలశాస్త్ర గ్రంథములు చదివిన మాత్రమున వారికి స్వశరీర జగన్మిథ్యాత్వ నిరూఢిగాని, స్వస్వరూపానుసంధానాదులయందు ప్రీతి దార్ఢ్యములుగాని కలుగునని తలంపగూడదు. ఎవరికైనను వారి పురాకృతపుణ్యము వలన అట్లు కలిగినను దానికి వారి చిత్తశుద్ధి, పురాకృతపుణ్య ఫలమే కారణముగాని కేవల గ్రంథపఠన మాత్రమువలన కాదని గ్రహించవలయును. ఈ బ్రహ్మవిద్యా విషయమునందిచ్ఛ చిత్తశుద్ధి వలన గాని లభ్యముకాదు. కావున ముముక్షువులగువారు ఈ బ్రహ్మాభ్యాస విషయ విమర్శ అనుష్ఠానములందు వారివారి చిత్తము ప్రసరించుచున్నదా లేదా యని పరీక్షించుకొని వారికి బ్రహ్మాభ్యాసమందు జ్ఞాన ప్రీతిపూర్వక నిశ్చయ సామర్థ్యములను గలిగియున్నయెడల అట్టివానినే నభ్యసించుచుండవలయును. లేనిచో వారివారి చిత్తశుద్ధికిగాను శాస్త్రముచెప్పిన చొప్పున వారివారికియుచిత మైన జపతప ఉపాసనలను గురుముఖతః అభ్యసించుచు, చిత్తశుద్ధిని సంపాదించుట యావశ్యకము. ఇట్టి జపఉపాసనలకు "నగాయత్ర్యాః పరంమన్త్రమ్" అనియు "గాయత్రీ పరబ్రహ్మస్వరూపిణీ" యనియు "గాయంతంత్రాయతేతి గాయత్రీ" యనియు శాస్త్రము తెలుపుచున్నది. కావున దానిని శ్రద్ధతో చిత్తశుద్ధికిగాను నియమముగా ధ్యాన మంత్రానుష్ఠానములు కొంతకాల మాచరించిన యెడల కాలపరిపాకమున చిత్తశుద్ధి తప్పక కలుగును. ఈ గాయత్రీ దేవతా మంత్రము సాక్షాద్బ్రహ్మ స్వరూపము. కావుననే ఉపనయన సంస్కారము నందు ప్రతివటువునకు ఈ మంత్రోపదేశము విధిగా చేయబడుచున్నది. ఈ ఉపదేశమునే బ్రహ్మోపదేశమనికూడ నందురు. కావున చిత్తశుద్ధి కిట్టి సత్కర్మానుష్ఠాన జపోపాసనలు ఆవశ్యకము. బ్రహ్మవిద్యా సాధనములుగ శాస్త్రము అనేక ఉపాసనలను తెలుపుచున్నది. వానిని వారివారి అధికారమును బట్టి ఉచితరీతిని గురుముఖతః పొంది, మంత్రధ్యానానుష్ఠానముల నాచరింపవలయునని శాస్త్రము తెలుపుచున్నది.

ఇట్లు చిత్తశుద్ధిని సంపాదించినవారు సద్గురువుల నాశ్రయించి శాస్త్రశ్రవణముచేసి, తత్త్వగ్రంథముల జూచినయెడల వారికి విషయములన్నియు కరతలామలకమువలె స్ఫురించుచు, వారి పరమార్థసాధనాభ్యాసములకు సహకరించును. అట్టి ముముక్షువులకు వారి జ్ఞానాభివృద్ధిని సాధుసంగమ సచ్ఛాస్త్రముల వలన వృద్ధిగావించుకొనుచు, భాగత్యాగలక్షణచే మహావాక్యార్థమును, బాగుగ తెలిసికొని, వారి సత్యస్వరూపము బ్రహ్మాభిన్నమని, శాస్త్రీయముగ గ్రహించి జ్ఞానపూర్వకముగ స్థూలశరీర సర్వదృశ్య నిరాకరణమును స్వస్వరూపానుసంధానాదులను ఆచరించుచుండుటయే ముఖ్యకర్తవ్యము. ఇట్టి అనుసంధానాద్యభ్యాసములు జ్ఞానాభ్యాసకులు విసుగుచెందక నిరంతరము అనగా సదా, ఆమరణాంతము వరకుగాని, లేక తమ ప్రారబ్ధాంతమువరకుగాని, యాచరించు చుండవలయునని శాస్త్రము బోధించుచున్నది.

అనుసంధాన మనగా ఒకే విషయమును ఆ విషయ నిరూఢికిగాను తిరిగి తిరిగి యనుకొనుట. ఇచట కొందరకు నొకసంశయము కలుగవచ్చును. ఏదియనిన జీవుడు ప్రారబ్ధకర్మఫలానుభవబద్ధుడు కావున ప్రారబ్ధము ననుభవించుచు, "నేను బ్రహ్మను, పరమాత్ముడను, అఖండపరిపూర్ణస్వరూపుడను. నాకన్న వాస్తవముగ వేరేమియులేదు" అని యెంత యనుకొన్నను యీ జీవుడు తాను బ్రహ్మయెట్లగును? ఇది సంభవమా? అనుకొన్నంత మాత్రమున ఒక వస్తువు మరియొక వస్తువుగ మారునా? అను సంశయము కలుగవచ్చును. ఇట్టి సంశయమునకెంత మాత్రము శాస్త్రమును బట్టిగాని, మన యనుభవమునుబట్టి చూచినగాని అవకాశములేదు. ఇట్టి బ్రహ్మాభ్యాసకునకు కాలక్రమమున తన ప్రారబ్ధక్షయము అయినవెంటనే స్వస్వరూప సాక్షాత్కారము కలిగి తాను అద్వితీయ బ్రహ్మస్వరూపమే యగునని శాస్త్రము స్పష్టముగా తెలుపుచున్నది. కావున శాస్త్రప్రమాణమునుబట్టి అట్లగు ననుటకు సంశయము లేదు. ఇంకను మన అనుభవములోనున్న భ్రమరకీట న్యాయమునుబట్టి గూడ బ్రహ్మజ్ఞానాభ్యాసికి స్వస్వరూప సాక్షాత్కారము కలిగి తాను అద్వితీయఅఖండ పరిపూర్ణబ్రహ్మయే యగుననుటకు సందేహము కనబడుటలేదు. భ్రమరకీట

న్యాయ మనగా — తుమ్మెద యొక పురుగును దెచ్చి దానిచుట్టును గూడుకట్టి ఆ గూడుచుట్టును ఝుంకారముచేయుచు తిరుగుచుండును. ఇట్లుండగా గూటి యందుండు కీటకము తన నెక్కడ నీ తుమ్మెద చంపునో యను భయము తోడ సర్వదా నాతుమ్మెద స్వరూపమునే స్మరించుచు చూచుచుండును. సర్వదా యీకీటకము తుమ్మెదయొక్క స్మరణస్వరూపచింతలోనే యుండుటచే కొంతకాలమునకు ఈ కీటకమునకు రెక్కలు జనించి భ్రమరమే యగుచు ఆ గూటినుండి యెగిరి పోవును. ఇచట తదేకచింతనచే కీటకమే కదా తుమ్మెద అయినది: ఇది పలువురకు తెలిసినవిషయమే. ఇట్లే బ్రహ్మాభ్యాసకుడు కాల క్రమమున తన అభ్యాసబాహుళ్యముచే ప్రారబ్ధాంతమందు బ్రహ్మస్వరూపుడగు ననుటకు యెంతమాత్రమును సందేహములేదు. ఇదిగాకనూ—ఇచట నొక రహస్యము కలదు. పై నిదర్శనయందు వాస్తవమున తుమ్మెద కానట్టి కీటకమే తనయొక్క తదేకచింతన, అను స్మరణ వలన, భ్రమరముగా మారి నప్పుడు, జీవుడు పరమార్థ వాస్తవమున బ్రహ్మస్వరూపుడై పరిపూర్ణుడై యున్నాడు. కాని దానిని మాయాప్రధానముచే మరచి, పరిచ్ఛిన్న దుఃఖిత్వము లతో నున్న వాడుగాని, వాస్తవమున తాను అఖండ పరిపూర్ణ బ్రహ్మపదార్థమే కావున తన వాస్తవస్వరూపమును పొందుట కేమికష్టము: కావున జ్ఞానా భ్యాసకుడు ఇట్టి తన పరమార్థ వాస్తవస్వరూపమును గ్రహించి తాను మరచిన తన వాస్తవస్వరూపమును గురించి నిరంతరము ప్రీతితో అనుసంధించుచుండిన యెడల జీవునకు తన సత్యస్వరూపమగు బ్రహ్మత్వము లభించుననుటకు ఎట్టి సందియము నుండుటకు వీలులేదు. ఇంకనూ లోకానుభవమునుబట్టి చూచి నను, ఏజీవుడు ఎట్టి తీవ్రప్రయత్నాభ్యాసములతో మరణించుచున్నాడో అట్టి జీవునకు మరునటి జన్మమందు వారి వారి లోగటి జన్మప్రయత్నఫలములు కలుగుచున్నవి. అట్టి నిదర్శనములు జీవుల పసితనమునందునను, బాల్యము నందునను వారియొక్క దృష్టప్రయత్నమేమియు లేకుండగనే ఆ యా ఫలములు కలుగుచున్నట్లు మనము చూచుట, వినుట గూడ జరుగుచున్నవి. కొన్ని పట్టణములందు దరిద్రులై చిన్నవాళ్ళుగనుండు బాలురు కొందరు పెంకు ముక్కయును బొగ్గునుమాత్రము తీసకొని, వివిధ దేవతాచిత్రములను

దృశ్యములను అతి కౌశలముతో మనోహరముగను, సజీవోత్కృష్టమైనను, హాడు గోచరములైనను, చిత్రించ నెట్లు సమర్థులగుచున్నారో చాలమందికి తెలిసిన విషయమే. వీరి చిత్రలేఖనము ఎవరును అభ్యసించినదిగాని, దానికి కావలసిన సాధన సామగ్రియుండిగాని వ్రాయుచున్నవారు కాదుగదా? ఈ దొగ్గు పెంకు ముక్కలను ఇచ్చి ఇతరులను వ్రాయమన్నయెడల పది సంవత్సరము లభ్యసించినను వ్రాయలేరనుమాట నిశ్చయము. ఇట్లే కొందరు వారి అయిదవ సంవత్సరముననే భగవద్గీత పదునెనిమిది అధ్యాయములు ఒప్పగింప గలుగు చున్నారు. ఇంకను ఏడు సంవత్సరముల బాలుర, వివిధ రాజ్యాంతరంగ పోటీ లలో ఆడినట్లు తెలియుచున్నది. ఇవియునుగాక కొంతమంది పసితనములోనే కోట్ల సంఖ్యలుగల గణితములను అవలీలగ చేయుచున్నారు. ఇంకను రెండు సంవత్సరముల బాలిక సంగీత శాస్త్రమందును నూరురాగములు తప్పకుండ గుర్తించి పేర్లు చెప్పగలుగుచున్నట్లు, పత్రికలు తెలియ జేయుచున్నవి. కావున నీ లోకానుభవములను బట్టిచూచిన నేవిద్య ప్రీతి పట్టుదలలతో అభ్యసింప బడునో దాని ఫలము స్పష్టముగ పరజన్మమందు కలుగుట కనబడుచున్నది గదా! కాళిదాసు పార్వతీదేవి బాల్యమును వర్ణించునప్పుడు "ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యాః" యని పసితనమునందే తన పూర్వజన్మ విద్యలన్నియూ ఆమెను వరించినవని వర్ణించియున్నారుగదా! ఈ ముముక్షు జీవుడు మరచిన తన పరమార్థ వాస్తవస్వరూపమగు పరమాత్మస్వరూపమును గ్రహించుచూ అట్టి ఫలమును కోరుచునేగదా యీ అనుసంధానాదులను చేయుచుండును! ఇచట ముముక్షువు కోరునట్టి ఫలము తత్స్వరూపమగుటయే. ఈ స్వరూపము జీవునియొక్క వాస్తవస్వరూపమే గనుక అట్టిదానినే చింతించుచుండును. కీటకము తుమ్మెద వలె కావలెనను కోరికలేకయే, తన భయముతోడ సర్వదా తుమ్మెద ధ్యానము వలన తుమ్మెద స్వరూపమైనప్పుడు. ముముక్షువు తన వాస్తవస్వరూపమగు అద్వితీయ అఖండపరిపూర్ణ స్వరూపమును తన నిరంతర దీర్ఘకాల స్వస్వరూప మననాద్యభ్యాసములతోడ తన స్వరూపమును పొందుటకు ఎంతమాత్రము సంశయములేదు. కాని ఫలము అభ్యాస తీవ్రతనుబట్టియున్ను ప్రారబ్ధ ప్రతిబంధ మునుబట్టియున్ను ఆ యా వ్యవహిత అవ్యవహితకాలములందు కలుగుచుండును గాని

కలుగునా యని సందేహించుటకు అవకాశములేదు. ముముక్షువు ఎంత తీవ్ర ప్రయత్నముచేసిన అంత శీఘ్రఫలము తనకు కలుగునని, "తీవ్రవేగానామాసన్నమ్" అను సూత్రము తెలియజేయుచున్నది. కనుక యీ ఫలసిద్ధి యెప్పుడు కలుగునను విషయము ముముక్షువుయొక్క తీవ్రప్రయత్న పాటవముల మీదనే ఆధారపడియుండును. కావున ముముక్షువు సంశయ విపర్యయ రహితముగ ప్రీతినిశ్చయములతో తన సత్యస్వరూపమును నిరంతరాభ్యాసము చేయుచుండిన యెడల కాలక్రమమున తన ప్రారబ్ధక్షయ పరిపాకకాలమందు "అహంబ్రహ్మాస్మి" నేనును, ఆ పరమాత్మయు నొక్కటే యను నిశ్చయజ్ఞానము కలుగును. ఇట్టి నిశ్చయజ్ఞానాభ్యాసము వలన కాలక్రమమున ఈ అభ్యాసకుడు బ్రహ్మను తెలిసినవాడై తాను బ్రహ్మమే యగునని "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి"అని శ్రుతివచనము స్పష్టము చేయుచున్నది. బ్రహ్మాభ్యాస మనగా బ్రహ్మస్వరూపమును గురించియే సర్వదా చింతించుచుండుట, బ్రహ్మను గురించియే ప్రసంగించుచుండుట, బ్రహ్మనుగురించి నే యితరులకు బోధించుచు తన బ్రహ్మజ్ఞానమును వృద్ధినొందించుకొనుట. ముముక్షువు సర్వదా యీ బ్రహ్మస్వరూపమందే నిమగ్నుడై, అనగా బ్రహ్మాత్మనా సంస్థితుడై యుండుటయే బ్రహ్మాభ్యాసమని శ్రీ విద్యారణ్యస్వామి తెలుపుచున్నారు.

ముముక్షువునకు సర్వదా తత్త్వజ్ఞాన, వాసనాక్షయ, మనోనాశముల నభ్యసించుట యావశ్యకమని శ్రీ వసిష్ఠభగవానులు తెలుపుచున్నారు. తత్త్వజ్ఞాన మనగా "అహం" "ఇదం"ల, పదార్థశోధన బాగుగచేసి, స్వశరీర సర్వ దృశ్యము అవాస్తవ మనియు, ముముక్షువునకు తన శోధిత "అహం" మాత్రమే పరమార్థ సత్యపదార్థమనియు, తదితర మంతయు అవాస్తవము, భ్రాంతి, కల్పితము, వాస్తవతః లేనిదే యని జ్ఞానాభ్యాసకుడు నిశ్చయము నొంది తన పరమార్థ సత్యస్వరూపమును గ్రహించుట. వాసనాక్షయ మనగా ముముక్షువు తన శాస్త్రీయజ్ఞానముతో స్వశరీర సర్వదృశ్య మిథ్యాత్వ నిశ్చయమును సంపాదించి, యిట్టివానియందు తనకు పూర్వజన్మ వాసనాసంస్కారములచే కలుగుచున్న అశాస్త్రీయవాసనలను (అనగా ఇష్టానిష్టములను) తన

వివేకముతో శాస్త్రీయవాసనలచే జయించి సద్వాసనల వలన చిత్తశుద్ధిని సంపాదించి తన జ్ఞానాభ్యాస బలమువలన నీ రెంటినిగూడ జ్ఞానపూర్వకముగ త్యజించుట. ఇట్టి అభ్యాసమే వాసనాక్షయ అభ్యాసమనబడును. మనోనాశ మనగా తన మనసువలన తనకు కలుగు సంకల్ప ప్రవాహములను తాను తన నిత్యానిత్యవివేక వైరాగ్యాదులతో నిరోధించుట యనిగాని మనస్సులేక పోవుట యనిగాని, నశించుటయని గాని అర్థముకాదు. అనగా మనోరూపమగు తన వృత్తిని విషయనిష్ఠమగు తన సంకల్పవికల్ప ప్రవాహములనుండి మరల్చి అనగా నిరోధించి తన మనసును నిర్విషయమగు అఖండ బ్రహ్మపదార్థమందు లగ్నముచేయుచుండుట. ఇట్టి స్థితియే మనోనాశ మనబడునుగాని మనస్సు లేకుండుట యని అర్థముకాదు. ఈ మూడును స్వప్రయత్నముతో ముముక్షువు సర్వదా అభ్యసింపదగినవి అయినను ఇందు మొదటిదియగు తత్త్వజ్ఞానా భ్యాసము ప్రధానము. ఆయా జీవుల కర్మపరిపాకము వలన ఒకానొక జీవికి తత్త్వజ్ఞానము అధికముగానుండి తక్కినవి రెండును కొంచెము తక్కువగా నున్నను అందుచే జీవన్ముక్తిసుఖము తగ్గునుగాని అట్టి మహనీయులకు విదేహ కైవల్యముక్తి తప్పక కలుగునని శ్రీ వశిష్ఠభగవానులు తెలుపుచున్నారు. కాని తత్త్వజ్ఞానమును విడచి తక్కిన వాసనాక్షయ మనోనాశములున్నను అవి సాధనములే అగునుగాని ముక్తికాజాలవని గూడ తెలుపుచున్నారు.

సందర్భానుసారమున జ్ఞానాభ్యాసకునకు జాగ్రత్సుషుప్తియన నెట్టిదో శ్రీ వసిష్ఠభవానులు యోగవాసిష్ఠమునందు శ్రీరామచంద్రమూర్తికిట్లు తెలుపు చున్నారు. అద్దాని నిచట ముముక్షు జనోపయోగమునకుగాను యుదహరించు చున్నాడను :

శ్లో॥ చిత్తే చేత్యదశాహీనే యాస్థితిః క్షీణచేతసామ్ ।
సోచ్యతే శాంతకలనా జాగ్రత్యేవ సుషుప్తతా ॥

అనగా చిత్తము దృశ్యసంబంధములగు వృత్తులతో శూన్యమైనదగు చుండగా

చిత్తక్షయము నొందిన వారలయొక్క వాసనారహితమైన ఆస్థితి జాగ్రత్తు నందలి సుషుప్తత్వము (నిద్రావస్థ) అని చెప్పబడు చున్నది.

శ్లో॥ ఏషైవ రామసౌషుప్తి స్థితిరభ్యాసయోగతః ।
ప్రౌఢాస్థితిస్తుర్యమితి కథితా తత్త్వకోవిదైః ॥

ఓ రామచంద్రా! జాగ్రత్తునందలి సుషుప్తియగు ఈ స్థితియే అభ్యాస యోగము వలన ప్రౌఢినొంది తురీయమని తత్త్వజ్ఞులచే చెప్పబడుచున్నది. ఇది జాగ్రత్తుమొదలగు మూడవస్థలకు విలక్షణమైనది గావున తురీయస్థితి (నాల్గవది) అని గ్రహింపవలయును. ఇంకనూ మోక్షమన నేమియనిన నిట్లు తెలుపుచున్నారు :

శ్లో॥ నమోక్షో నభసఃపృష్ఠే నపాతాలే న భూతలే ।
సర్వాశాసంక్షయే చేతఃక్షయో మోక్ష ఇతీష్యతే ॥

ఓ రామచంద్రా! మోక్షము స్వర్గమునందుగాని, పాతాళమందుగాని, భూమి యందుగాని లేదు. సమస్తమగు ఆశలు క్షయమొందగా చిత్తము క్షయించుటయే మోక్షమని గ్రహింపవలయును.

శ్లో॥ మోక్షోమేస్త్వితి చిన్తాన్తర్జాతాచే దుత్థితం మనః ।
మననోత్థే మనస్యస్మి న్బద్ధస్సాంసారికో దృఢః ॥

బ్రహ్మజ్ఞానాభ్యాసకునకు మోక్షము నాకు కలుగుగాక యని లోన చింత కలిగిన యెడల తన మనస్సు సంకల్పముతోఁ గూడినదగును. మనస్సు సంకల్పసహితము కాగా సంసార సంబంధమగు బంధము దృఢమగును. కావున జిజ్ఞాసువు స్వాత్మాభిన్నముగ పరమాత్మానుసంధానమును తాను తత్స్వరూపుడుగ అనగా తానే అద్వితీయ అఖండ పరిపూర్ణజ్ఞానస్వరూపుడుగ ధ్యానించుచుండ వలయును. కాని తాను వేరు, మోక్షస్వరూపము వేరు అది తనకు రావలెనను యిచ్ఛతో చేయగూడదు ముముక్షువు వాస్తవమున మోక్షస్వరూపము తానే అనగా నేనే యని సర్వదా అఖండసచ్చిదానంద లక్షణములతో సత్యజ్ఞానానంత

లక్షణస్వరూపుఁడను నేనే యని అనుసంధానము చేయుచుండిన నిందు సంకల్ప మనునదియే కలుగుటకు అవకాశముండదు.

శ్లో॥ ఆత్మన్యతీతే సర్వస్మాత్ సర్వరూపేఽథవా తతే ।
కోబన్ధః కశ్చవా మోక్షో నిర్మూలం మననం కురు ॥

ఆత్మ సర్వంబు కంటెను విలక్షణంబును లేక సర్వరూపంబైన వ్యాప్తంబును నై యుండగా బంధం బెయ్యది? మోక్షం బెయ్యది? అట్లు గావున సంకల్పమును నిర్మూలము చేయుము అని వసిష్ఠమునీంద్రులు చెప్పుచున్నారు. ఈ సంకల్ప నిర్మూలనము చేయుటకు చిత్తస్పంద నిరోధము ముఖ్యసాధనము. జీవునకు సర్వసంకల్పములు ప్రాణస్పందము వలననే కలుగుచున్నవి కావున బ్రహ్మ జ్ఞానాభ్యాసకునకు ఈ స్పంద నిరోధాభ్యాసముగూడ యావశ్యకము ఈ చిత్త వృత్తులకు ప్రాణ స్పందమునుబట్టి హెచ్చుతగ్గులు కలుగుచుండును. కాన చిత్తనిరోధమునకు స్పందనిరోధ యావశ్యకము ఈ చిత్తప్రాణ స్పందములకు అన్యోన్యసంబంధము. చిత్తము నిరోధించిన ప్రాణస్పందమూ తగ్గుచుండును. ప్రాణస్పంద నిరోధముచే చిత్తవృత్తులు తగ్గుచుండును. కావున నిచట మనప్రకరణమునుబట్టి నిరోధాభ్యాస మనగా చిత్తమును నిరోధించుటయే. సాంఖ్యవేదాంత మతముల ననుసరించి ప్రాణాయామాభ్యాసమును మాత్రము చిత్తనిరోధమునకు సహాయముగ గ్రహించి, బ్రహ్మజ్ఞానాభ్యాసము వలన చిత్తమును నిరోధించవలయును. బ్రహ్మజ్ఞానాభ్యాసము నిర్విషయము, అఖండము, స్వాత్మాభిన్నము గనుక నిట్టి అభ్యాసాదులచే చిత్తము దసంత తానుగనే ఉపశమించుచుండును. ఇట్టి అభ్యాసాదులనే రాజయోగమని శిష్టులు గ్రహించిరి. ఇట్టి దానిని గురించి శ్రీ వసిష్ఠభగవానులు—

శ్లో॥ శాస్త్రసజ్జనసంపర్క వైరాగ్యాభ్యాస యోగతః ।
అవస్థాయాం కృతాస్థాయాం పూర్వం సంసారవృత్తిషు ॥

శ్లో॥ యథాభివాఞ్ఛితధ్యానా చ్చిరమేకతయోదితాత్ ।
ఏకతత్త్వఘనాభ్యాసాత్ ప్రాణస్పన్దో నిరుధ్యతే ॥

అనగా అధ్యాత్మశాస్త్రము, సజ్జనసాంగత్యము, వైరాగ్యము శ్రవణ మనన సమాధ్యభ్యాసములు వీనివలన మొదలు సాంసారిక వ్యవహారములందు అనాదరము దృఢపరుచుకొని చిరకాలంబు యీ ఏకతత్త్వమునే, నిరంతరాభ్యాసంబు చేయుటచే కలిగి వృద్ధినొందిన తత్త్వజ్ఞానమును అందు ప్రీతి అభ్యాసములను నతిక్రమింపక అనగా విడువక నిరంతరము తన సత్యస్వరూపమునే ధ్యానించు చుండుటవలన దృఢమగు తత్త్వాభ్యాసము సిద్ధించి అందువలన ప్రాణవాయువు యొక్క చలనము నిరోధింపబడుచున్నది.

శ్లో॥ పూరకాద్యనిలాయామాత్ దృఢాభ్యాసాదఖేదజాత్ ।
ఏకాంతధ్యానయోగాచ్చ ప్రాణస్పన్దో నిరుధ్యతే ॥

ఇంకనూ మరల మరల జేయబడు విచారణవలనను, అనాయాసముగా కుంభకము సిద్ధించువరకు జేయంబడు ప్రాణాయామము వలనను విజనప్రదేశమున ధ్యానముచేయుటవలన ప్రాణవాయువుయొక్క చలనము నిరోధింపబడుచున్నది.

శ్లో॥ ఓంకారోచ్చారణప్రాన్త శబ్దతత్త్వాను భావనాత్ ।
సుషుప్తే సంవిదోజాతే ప్రాణస్పన్దో నిరుధ్యతే ॥

మరియును యోగయుక్తుండు హృదయమునందు వాసనారహితంబగు మనంబును చిరకాలము నిలిపి ధ్యానించి చిదాకాశరూపంబగు నాత్మను సాక్షాత్కరింపచేసి కొనగా ప్రాణవాయువుయొక్క చలనము నిరోధింపబడుచున్నది, అని ప్రాణస్పంద చిత్తవృత్తి నిరోధోపాయములు శ్రీ వశిష్ఠభగవాను లిట్లు యోగవాశిష్ఠంబున తెలుపుచున్నారు.

ముముక్షువునకు ప్రణవానుసంధాన ఉపాసనాభ్యాసములు అమృతతుల్యములు. ఈ బ్రహ్మస్వరూపంబైన ప్రణవోపాసనల గురించి శాస్త్రగ్రంథంబు లందును, పూర్వాచార్యుల వలనను బహువిధంబుల తెలుపబడి యున్నది ఇవి యన్నియు సామాన్యులకు అతిగంభీరముగను గూఢముగనుండు

నను సుద్దేశ్యముతోడ నిచట ప్రధానాంశములను మాత్రము కొంచెము వివరించు చున్నాడను. "ఓం ఇత్యేకాక్షరంబ్రహ్మ" ఓంకారము బ్రహ్మస్వరూపము అని శ్రుతి తెలుపుచున్నది. దీనినే సంధ్యావందనమందు పఠించుచున్నారు "సర్వం ఖల్విదం బ్రహ్మ" యను ఉపనిషద్వాక్యమందు సర్వశబ్దవాచ్యమగు నీదృశ్య రూపమైన సర్వమును జ్ఞానపూర్వకముగ పరిత్యజించి అధిష్ఠానమగు అద్వితీయ పరిపూర్ణ అఖండ బ్రహ్మస్వరూపంబును సత్యజ్ఞానానంత లక్షణములతో మాత్రము నెట్లు గ్రహింపవలయునో యట్లే యీ ప్రణవస్వరూపంబైన ఓం కారమునందు త్రిగుణాత్మకమైన "అకార, ఉకార, మకార" రూపంబులగు జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలను పరిత్యజించి అనగా శుద్ధాత్మస్వరూపమందు లయింపజేసి యీ యవస్థాత్రయంబున కతీతంబైన తురీయంబును నాదరూపం బున నఖండాకార పరిపూర్ణచైతన్యంబుగ ముముక్షులు అనుసంధానముచేయు చుండవలయును మహావాక్యార్థమందున భాగత్యాగలక్షణచే ముముక్షువు లెట్లు వాక్యలాక్షణికార్థమును మాత్రము గ్రహింపవలయునో యట్లే బ్రహ్మస్వరూపం బైన యీ ప్రణవానుసంధానమున ఓంకారమును లాక్షణికార్థముగ గ్రహించి యనుసంధానాదుల నాచరించుచుండుట శ్రేష్ఠమని శాస్త్రము తెలుపుచున్నది. ఈ యనుసంధానాదులను కేవల వాగ్రూపముననేగాక, మనోగోచరము గావించు కొని ధ్యానాభ్యాసములను నాచరించుట శీఘ్రఫలప్రదము. కావున జ్ఞానా భ్యాసకులు దీనిని బాగుగ గ్రహింపవలయును.

ఓంకారలక్ష్యార్థంబును అద్వితీయంబును, దృశ్యరహిత పరిపూర్ణంబును నిరుపమానంబగు సత్యజ్ఞానానంత స్వరూపమైన బ్రహ్మయే తన వాస్తవ స్వరూపంబని జీవుడు గుర్తించి స్వానుభవము నొందుటకుగాను ఈ బ్రహ్మ విద్యానుసంధానము ముముక్షువుల కావశ్యకమై యున్నది. ఇది విద్యలలోని కెల్ల రాజవిద్యయై పరమశ్రేయోదాయక మగుచున్నది. కాని యిది కష్ట సాధ్యమై గుర్వీశ్వరానుగ్రహములతో స్వప్రయత్నము వలన చిరకాల శ్రవణ మనన నిదిధ్యాసనాభ్యాసపాటవములతోగాని పొందబడదు. దీనికిగాను ముముక్షువునకు ఈ విద్యానుసంధానము పెన్నిధి వంటిది.

బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు ప్రారబ్ధానుసారమున ఎట్టి సుఖదుఃఖభోగాను భవముల ననుభవించుచున్నను అవి యన్నియు తనకు పరమార్థ వాస్తవమున ఆకాశమునకు గంధర్వనగరములు మేఘములు సంబంధింపక ఆకాశమునందే అవి మనలకు కనబడుచున్నట్లును మనలకు రజ్జువునందు కలుగుచున్న సర్ప భ్రాంతి రజ్జువునకు ఎంతమాత్రము సంబంధింపనిదై రజ్జువునందే కలుగు చున్నట్లును, జీవునకు తన అనాది అవిద్యచే తనకు పరమార్థ వాస్తవమునకు నెంతమాత్రము సంబంధింపనిదై తనయందే కల్పితముగ నీ స్వశరీర సర్వ దృశ్యానుభవములును కలుగుచున్నవని తెలిసికొని ముముక్షువైనవాడు తన పరమార్థ స్వరూపమును కాలత్రయ అవస్థాత్రయాబాధితమైనట్టియు, త్రివిధ భేదరహితమై త్రివిధాపరిచ్ఛిన్నమైనట్టియు, సర్వోపాధివినిర్ముక్త స్వప్రకాశ, సజాతీయ విజాతీయ స్వగతభేదరహిత, జగదుత్పత్తి స్థితిలయ వివర్త కారణ నిత్యనిరతిశయ అసంగ అద్వితీయ అఖండ సర్వాధిష్ఠాన పరిపూర్ణ చైతన్యమే తానని అనగా "నేను" "అహం"అని సర్వదా తనవృత్తిని తదాకారాకారితము చేయ నభ్యసించు చుండవలయును. జ్ఞానాభ్యాసకునకిది మానసికముగా జరుగు చునే యుండవలయును. కాయముతో తన వ్యవహారములు ఆ యా జీవుని యొక్క ప్రారబ్ధానుసారమున తాను మనస్సుతో తలచిననూ తలచకపోయి ననూ జరుగుచునేయుండును. ఏలనన యిది తన పూర్వకర్మఫలము. కావున తమంతగనే వచ్చుచు పోవుచుండును. దీనికి అనుసంధానాదులు ఆవశ్యకము లేదు.

జీవునకు కలుగుచున్న సంసార పరంపర దుఃఖమునకు అహంకార మమకారములే బీజము. అహంకార మనగా నేను, నాది యను పరిచ్ఛిన్న భ్రాంతి. ఈ భ్రాంతి జీవునకు అనాదిగా అఖండపరిపూర్ణుడైన తాను వాస్తవ ముగా కానట్టి పరిచ్ఛిన్న ఉపాధితాదాత్మ్యాధ్యాసమువల్ల కలుగుచున్నది. ఈ అధ్యాస జీవునికి అనాదియైనను సాంతము. జీవుని అజ్ఞానమువల్ల కలుగుచున్న యీ ఉపాధితాదాత్మ్యములన్నియూ కల్పితములైన తాత్కాలిక ఆగంతుక ములై, వీనియందు ఆ యా జీవులకు కలుగుచున్న రాగద్వేషాది సక్తాభి

మానములనుబట్టి ఆవృతమగుచుండును. ఇదియే సంసారము జీవునకు దుఃఖ ప్రదము అగుచున్నది. కాని యిది యంతయూ కేవల భ్రాంతిమాత్రము. కావున జీవుడు తన శాస్త్రీయ నిత్యానిత్య వివేక వివేచనలచే యీ అనాదిభ్రాంతినుండి విముక్తుడు కావచ్చుననియూ, యిట్లు భ్రాంతి నుండి విముక్తుడగుటయే జీవునకు మోక్షమనియూ, శ్రుతి— "అవిద్యాస్తమయో మోక్షః" అని తెలుపుచున్నది. కావున వివేకియైన జీవునకు యీ అవిద్యా నివృత్తిని సంపాదించుట తన నిత్య నిరతిశయ సుఖమునకు ఆవశ్యకము. ఈ అవిద్యకు మూలస్థానము జీవుని మనసే. జీవునకు నేను, నాది, అని కలుగుచున్న ప్రతీతులకుగూడ ముఖ్యాశ్రయము మనసే. ఈ "నేను" యను పరిచ్ఛిన్న భ్రాంతియే జీవునకు అహంకారమని చెప్పబడుచున్నది. ఈ అహంకార మనునది, సర్వజీవులకునూ వారివారి ప్రారబ్ధానుసార ఫలభోగములనుగాను జన్మరూపమున కలుగుచు మరణరూపమున నశించుచు, వివేకులకు అవాస్తవముగను అనిత్యము అని తెలియబడుచు నుండును. దీనినే జీవుడు వాస్తవము, నిత్యమని భ్రాంతిచెంది దీనియందు సత్యత్వబుద్ధిచే పామరత్వముజెంది సక్తతాభిమానములతో సుఖ దుఃఖాద్యనుభవముల నొందుచుండును. ఈ అహంకారము మనోరూపముగనే యుండును. ఈ మనోరూప మనునది జీవునకు సంకల్పరూప ప్రవాహమున యుండును జీవునకు సంకల్పరహితమైన మనస్సే బ్రహ్మస్వరూపము, మోక్షమని శ్రీ వశిష్ఠభగవానులు శ్రీరామచంద్రున కిట్లు బోధించుచున్నారు. కాన జ్ఞానాభ్యాసకుల కిది అమృతబోధయని యెరుంగవలయును.

శ్లో॥ స్మరణం విద్ధి సంకల్పం శివంహ్యాస్మరణంవిదుః ।
తత్ర ప్రాగనుభూతం చ నానుభూతం చ భావ్యతే ॥

అనగా "తలంపే సంకల్పమనియూ, తలంపులేమియు లేకుండగ స్వస్వరూపమున నుండుటయే బ్రహ్మంబనియూ నెరుంగుము. ఆ తలంపునందు పూర్వమనుభవించినదియూ, అనుభవింపనిదియూ గూడ తోచుచుండును." అనిన్నీ, ఇంకనూ "అనుభవించిన వస్తుసంబంధమైనదియూ, అనుభవింపని వస్తుసంబంధమగు సమస్త తలంపులను మరచి కాష్ఠమువలె దేనిని తలంపక మహా బుద్ధి

మంతుడవైననూ, మూఢునివలె నుండుము"ని యుపదేశించుచు నిది దృఢమగు టకుగాను మరియునిట్లు చెప్పుచున్నారు.

శ్లో॥ ఊర్ధ్వబాహూ ర్విరౌమ్యేష న చ కశ్చిచ్ఛృణోతితత్ ।
అసంకల్పః పరంశ్రేయః స కిమంత ర్న భావ్యతే ॥

శ్లో॥ కిలతూష్ణీం స్థితేనైవ తత్పదం ప్రాప్యతేపరం ।
పరమం యత్ర సామ్రాజ్యమపి రామ తృణాయతే ॥

అనగా "నేను చేతులుపైకెత్తికొని చాటుచున్నాడను. ఐననూ నామాట వినువా రొక్కరును కనబడుటలేదు. అది యేమనిన సంకల్ప రాహిత్యమే పరమ శ్రేయము. దానిని ఏల లోన ముముక్షువులు భావింపరు" అనిన్నీ యింకనూ, "ఏ బ్రహ్మపదము లభింపగా సార్వభౌమపదంబు తృణప్రాయంబగునో అట్టి బ్రహ్మపదము దేనినీ తలంపక యూరక యున్న మాత్రముచే దొరుకుచున్నది" యని చెప్పుచున్నది ఇంకనూ 'గ్రామాంతరమునకు పోవు పాంథుని యొక్క అడుగులు అనగా పాదవిక్షేపములు సంకల్పరహితంబుగ గలుగుచున్నట్లు బ్రహ్మ నిష్ఠునియొక్క కర్మానుభవములయందు కలిసి వ్యవహరించుచునూ సంకల్ప రహితంబై ప్రవర్తించుచుండు'నని గూడ తెలుపుచున్నారు ఇట్లు సంకల్ప రహితంబగు ప్రారబ్ధకర్మానుభవములు భావి ప్రతిబంధములుగాక ప్రారబ్ధమును క్షీణింపజేయుచు, నశింపజేయును. ఇదియే జీవునకు మోక్షప్రాప్తికి సాధన మగును కావున జ్ఞానాభ్యాసకుని ఆశయము సర్వదా సంకల్పరాహిత్యము, బ్రహ్మాత్మనా సంస్థితి లక్ష్యము గలదిగా నుండవలయును జగన్మిథ్యాత్వ జ్ఞాన దార్ఢ్యముచే సంకల్పరహితంబునూ, సర్వాధిష్ఠాన జ్ఞానముచే బ్రహ్మజ్ఞాన మునూ అభివృద్ధి నొందుచుండును. ముముక్షువు అభ్యసింపవలసినది యీ జ్ఞానమే. ఈ జ్ఞానము గుర్వీశ్వరానుగ్రహముతో చిత్తశుద్ధిని సంపాదించి, శ్రవణ, మనన నిదిధ్యసనాభ్యాసముచేతనూ లోగడతెలిపిన యట్లు ప్రణవో పాసనాభ్యాసములచేతనూ శాస్త్రీయ క్రమమున సంపాదించవలసి యున్నది. జ్ఞానాభ్యాసకుడు తన సంస్కృతబుద్ధిని విల్లుగా గైకొని యీ ప్రణవమును

ధనస్సుగా తీసికొని బ్రహ్మవస్తువును తన లక్ష్యముగా నుంచుకొని విద్య నభ్యసించు చుండవలయునని శ్రుతి : "ప్రణవోధనుః శరోహ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే" అని ఓంకారము ధనస్సు (వంటిది) అనియూ, బుద్ధి అంబు (వంటిది) అనియూ దానికి బ్రహ్మవస్తువు లక్ష్యముగాను చెప్పబడుచున్నదని తెలుపుచున్నది. ఇట్టి అభ్యాసమువలన ముముక్షువులు కాలక్రమమున వారివారి అభ్యాసజ్ఞాన పాటవములచే పరముక్తిని గాంచుచుందురు. కావున ముముక్షువులకు నిత్యాభ్యాసమే అమృతసిద్ధినిచ్చును. సర్వసిద్ధులునూ అభ్యాసమువలన కలుగుననియూ యిది వేదశాసనమనియూగూడ శ్రీ వశిష్ఠభగవానులు :

> శ్లో॥ అభ్యాసాత్సర్వ సిద్ధిః స్యాదితివేదానుశాసనం ।
> తస్మాత్త్వం సర్వముత్సృజ్య కుర్వభ్యాసే స్థిరం మనః ॥

అనగా (శాస్త్రవిచారము వలననూ, గురూపదేశము వలననూ) ఆత్మానుసంధానాభ్యాసము వలననూ సర్వమును సిద్ధించునని వేదములు చెప్పుచున్నవి. కావున నీవు సర్వంబును విడిచి ఆత్మానుసంధానాభ్యాసమునందు నీ మనస్సు సుస్థిరమైన దానిగా జేయుము.

ఇట్టి మహిమగల బ్రహ్మాభ్యాసపాటవము సంపాదించుటకు ముముక్షువునకు శ్రద్ధోత్సాహములు, వైరాగ్యము, యావశ్యకము వైరాగ్య మనగా జగన్మిథ్యాత్వ జ్ఞానబలముచే స్వశరీరసర్వదృశ్యభోగములునూ పిపీలికాది బ్రహ్మపర్యంతము సర్వపదార్థములను అవాస్తవములు అను దృఢ జ్ఞానవిశ్వాసములతో వాటిని కోరకుండుట. దీనినే శాస్త్రము ఇహాముత్ర ఫలభోగ విరాగమనియూ చెప్పుచున్నది. విషయములయందిట్టి విరాగము కలిగినగాని, విషయ వాంఛలు తగ్గవు విషయవాంఛలు తగ్గినగాని సంకల్ప వికల్పములు తగ్గవు ఇట్టి సంకల్ప వికల్పప్రవాహమే మనసనుచున్నది. మనోనాశము కలుగనిదే వృత్తిబ్రహ్మాకారముగ పరిణమించదు బ్రహ్మాకార వృత్తివలనగాని ముముక్షువునకు జ్ఞానాభ్యాసపాటవము కలుగదు కావున జ్ఞానాభ్యాసకుడు విషయ చింతనను క్షీణింపజేయు ప్రయత్నము సర్వదా చేయుచుండ వలయును. ఇట్లు

గావించుటకు నొక్కటియే మార్గము. అదియేమి యనిన స్థూలశరీర సర్వ విషయములయొక్క అవాస్తవికత అనిత్యత్వములను శాస్త్రబుద్ధితో బాగుగ గ్రహించి, నిశ్చయమునొంది విషయములయందు సతతవిమర్శచే దోషదృష్టిని వృద్ధిచేయుచున్న యెడల చిత్తము విషయవాంఛలను చేయదు. అప్పుడు సంకల్పములు క్షీణించినవై తన సత్యస్వరూప మనన నిదిధ్యాసన అభ్యాసములు స్వస్థచిత్తుడై చేయగలుగుచు వృత్తిని బ్రహ్మాకారముగ నుంచగలుగును

కాని ఇది శాస్త్రీయ స్వప్రయత్నసతతాభ్యాస సాధ్యముకాని వేరువిధమున కాదు. జ్ఞానాభ్యాసకుని స్థితి దేహధారణలు వ్యవహారకోటిలోనివై సద్వితీయ ముగ నున్నవి. ప్రారబ్ధక్షయమనగా తప్పదు ఈ ప్రారబ్ధక్షయ మనునది దేహ ధారణ, భోగానుభవములవలన కాని కలుగదు. ఇది యంతయూ సద్వితీయము వ్యవహారస్థితియై యున్నది. జ్ఞానాభ్యాసకుడు యిట్టి స్థితి దేహధారణతో యుండియే తన జ్ఞానాభ్యాసమువలన తాను పరమార్థతః అవ్యవహారియనియూ అద్వితీయ అఖండ జ్ఞానస్వరూపుడననియూ తెలిసికొని స్వానుభవమును నొంద వలసియున్నది. దీనికి తన శరీరమే సాధనముగాని వేరొండుగాదు. జ్ఞానా భ్యాసకుడు యీ తన దేహమునే సాధనముగ గ్రహించి తన పరమముక్తిని సాధించవలెనుగాని వేరుదారిలేదు కాని తన దేహమా? ద్వైతకోటిలోనిది. తన లక్ష్యమా? అద్వితీయము అఖండము పరిపూర్ణము. ఈ అద్వితీయ, సద్వితీయములు, వ్యవహార పరమార్థములు నొకదానికొకటి తమఃప్రకాశముల లాగున విరోధస్వభావము గలవి. అయినను జీవునకు వ్యవహారము సాధనము. పరమార్థము సిద్ధమైనదగుచు పొందుటకు సాధ్యముగా నున్నది. ఇందు సాధనమైన వ్యవహారము అవాస్తవమని జ్ఞానాభ్యాసకుడు గ్రహించి వాస్తవ మైన తన పరమార్థ స్వరూపము తానొందవలయును. ఇది దురవగాహము. కష్టసాధ్యము అయినను దీనిని సాధింప వచ్చును. కాని దీనిని సాధించుటకు బహుజాగరూకత అతినిశితమైన బుద్ధియూ కావలెననియూ యీ మార్గము పదునైన కత్తిమీద నడుచుట వంటిదని విద్వాంసులు తెలుపుచున్నారనియూ శ్రుతి "క్షురస్య ధారా నిశితాదురత్యయా దుర్గంపథస్తత్కవయోవేదయన్తి" అని

తెలుపుచున్నది. ముముక్షువు కోరు ఫలము సర్వోత్కృష్టమైన నిత్య నిరతిశయ సుఖస్వరూపము గావున "యక్షానురూపో బలిః" అను న్యాయమున యెంత కష్ట సాధ్యమైననూ యీ నిత్యనిరతిశయ సుఖము సాధింపదగినది. కాని మరి వేరొండుగాదు దీనికి ముఖ్యసాధనము బ్రహ్మధ్యానము ఈ ధ్యానము విషయ చింత నను వదలినగాని కలుగదు. విషయచింతనము స్వప్నదృశ్యము వంటిది. కాని స్వప్నదృశ్యము అవస్థాంతరమున అసత్యమను జ్ఞానము కలుగుచున్నది. అవస్థాత్రయములు మారుట సహజము అయిననూ స్వప్నదృశ్యమందు స్వకాల సత్యత్వముతోచి మానవుడు బాధనొందుచునే యున్నాడు. ఎట్లన సుఖముగ తన శయ్యమీద నిద్రించుచున్న మానవుడు తన స్వప్నమందు తాను పాడునూతి యందు పడినట్లు కలగాంచి భయకంపాదుల నొందుచున్నాడు. తన స్వప్న దృశ్యములు అవాస్తవమైననూ, ఆ స్వప్నానుభవకాలమందు అది అవాస్తవ మను జ్ఞానము లేనందున భయకంపాదుల నొందుచున్నాడు. కాని స్వప్నకాల మందుగూడ తనకు దానియందసత్యత్వ బుద్ధియున్నయెడల భయమేయుండదు గదా! అట్లే మానవుడు తనకు యీ విషయదృశ్యమంతయూ సత్యమని తలచి సర్వదా విషయచింతననే చేయుచు భయమునొందుచున్నాడు గాని స్వప్న దృశ్యము లాగున జాగ్రతయందుగూడ యీ విషయదృశ్యములన్నియూ వాస్తవముకావను సత్యజ్ఞాన నిశ్చయమును సంపాదించిన యెడల జాగ్రద్ద శలో ననుభవములుగూడ స్వప్నానుభవతుల్యములే యగును. ఈ జాగ్రద్దశలో యనుభవింపబడుచున్న విషయములు స్వశరీరముతో సహా పక్కన రెండవస్థ లలోననూ గూడ ఆ యా కాలములందున లేనివే యగుచున్నవి గదా! కావున యీ జాగ్రదనుభవములకుగూడ పరమార్థ సత్యత్వము లేదని ముముక్షువు గ్రహించి తన ప్రారబ్ధము ననుభవము చేయుచుండిన యెడల అనుభవములు అల్ప సుఖదుఃఖభోగకరము లగుచుండును. కావున జ్ఞానాభ్యాసకుడు విషయ చింతనమును వాటియందు సత్యత్వబుద్ధిని వదలి తన ప్రారబ్ధఫలముల ననుభవించుచు, సర్వదా తన పరమార్థ స్వరూపమైన అద్వితీయ, అఖండ పరి పూర్ణజ్ఞాన స్వరూపమును అనుసంధించుచుండ వలయును. అప్పుడు తనమనసు నిర్విషయాకారమగును ముముక్షువు తన మనసును నిర్విషయాకారముగ

నుంచుటయే ధ్యానమని పాతంజలి సూత్రము "ధ్యానం నిర్విషయం మనః" అని తెలుపుచున్నది. ఇంకనూ "అచింత్యైవ పరంధ్యానం" విషయ చింతా త్యాగమే పరమమైన ధ్యానమని శంకరభగవత్పాదులు తెలుపుచున్నారు కావున ముముక్షువు తన వివేక సర్వప్రయత్నములచేతనూ సుషుప్తియందువలె తన జాగ్రద్దశయందుగూడ విషయ చింతనమును దూరముచేసిన యెడల జాగ్రద్దశయందుగూడ తనకు సుషుప్తియందు కలుగుచున్న సుఖము కలుగు చుండును. ఎవరైననూ సుషుప్తియందు వారికి సుఖానుభవము లేనట్లు చెప్ప జాలరుగదా. ఎవరైననూ అట్లు చెప్పిననూ అది అనుభవ విరుద్ధము కావున జీవన్ముక్తి కోరు ముముక్షువు తన జాగ్రద్దశయందు ప్రారబ్ధము ననుభవించు చున్ననూ సుషుప్తి స్థితిని సంపాదించవలయును దీనినే జాగ్రత్సుషుప్తి యని శాస్త్రము తెలుపుచున్నది.

జ్ఞానాభ్యాసకుడు అనుక్షణమునను తన లోకానుభవములయొక్క వాస్తవికతా, అవాస్తవికతలను. నిత్య, అనిత్యత్వములను తన శాస్త్ర జ్ఞాన వివేకబలముతో వివేచన చేసికొనుచుండిన యెడల యిట్టి శాస్త్రీయ వివేచనలచే, తనకు కలుగుచున్న దృశ్యానుభవములు తాత్కాలికములేగాని సత్యము కావనిన్ని, తనకు యీ స్వశరీర కళత్ర పుత్ర మిత్ర విత్త క్షేత్రాదులు శాశ్వత సుఖమివ్వజాలవనియూ క్రమక్రమముగ గోచరించును. ఇట్టి నిశ్చ యమువలన విషయ వైరాగ్యము కలుగును ఇదియే ముముక్షువునకు పరమ బంధువు. తక్కిన విషయ బంధువర్గమంతయూ తాత్కాలికములగుచు పర్యవసానమున జీవునకు దుఃఖకరములే యగును. దీనినే "న వైరాగ్యాత్పరో బంధుః, న సంసారాత్పరో రిపుః" అని శాస్త్రవచనము తెలుపుచున్నది. (సంసారమనగా, విషయములయందు నర్తితాభిమానచింత) ఇదియే భావి ప్రతిబంధమును గలుగజేయుచు జీవుని జనన మరణ సంసార ప్రవాహమున పర్విత చర్వణముగ ద్రిప్పుచుండును కావున ముముక్షువునకు విషయచింతనము పరమ శత్రువు గనుక జ్ఞానాభ్యాసకుని జీవయాత్ర పట్టుంతవరకునిన యేదో నొక వస్తువునపేక్షించి రాజబాటయందంగడికి వెళ్ళువాని చందంబున గాని,

తీర్థయాత్రకు జనుదెంచు బాటసారిలాగునగాని యుండవలెను. అనగా వీరిరువురునూ వారి వస్తులాభమునుగాని, వారి గమ్యస్థానమైన పుణ్యక్షేత్రమునుగాని మనసునందుంచుకొని మార్గమధ్యంబున యెన్ని దృశ్యములు, ఎట్టి సంఘర్షణలు కలిగినను వాటితో సక్తులుగాక యుపేక్షించి ఎన్ని అడుగులు వేసితిమి? ఎంతదూరమును, విమర్శచేయకనే వారి వారికి కావలసిన వస్తులాభమును, పుణ్యక్షేత్ర లాభములనెట్లు పొందుచున్నారో అట్లే జ్ఞానాభ్యాసకుడు తన పరమార్థ స్వరూపమును మాత్రమే ముఖ్యముగ లక్ష్యమందుంచుకొని ఉపేక్షాభావముతో తన ప్రారబ్ధము ననుభవించుచూ స్వశరీర సర్వవిషయములయందు సక్తతాభిమానుడుగాక తన ప్రారబ్ధమును క్షయింపచేయుచు జీవయాత్రను గడుపుచుండవలయునని శాస్త్రము తెలుపుచున్నది.

ముముక్షువుల కిచట యొక సంశయము తోచవచ్చును. ఎట్లనుభవించినను ప్రారబ్ధానుభవము తప్పదుగదా? ఇది జ్ఞానికి, యజ్ఞానికిని సమానమేకదా యని తోచవచ్చును ప్రారబ్ధ ఫలభోగము యిద్దరకునూ సమానమే. అయినను వారి వారి సుఖదుఃఖానుభవములయందు అత్యంత తారతమ్యముండును. జ్ఞానియైనను తన దేహధర్మముల విడువజాలడు. అభ్యాసము తన జ్ఞానముతోనుంచవలెనని శ్రీ వసిష్ఠభగవానులు యోగవాశిష్ఠమందిట్లు తెలుపుచున్నారు. "నువ్వుగింజ యుండువరకు నూనెయూ, దేహముండునంతవరకు సుఖదుఃఖ దశలను యుండును ఎవడు దేహ దశను దలచడో వాడు కత్తిచేత నాకసమును ఛేదింప యత్నించువాడు అనగా అట్లుండుట దుస్సాధ్యమనుట" అనిన్నీ ఇంకనూ—

శ్లో॥ యావ దేహదశా తావత్ పరిత్యాగో హ్యనుత్తమః ।
యత్నాదప్యంగ చేతనో యోగాన్నతు కర్మేంద్రియ స్థితేః ॥

శ్లో॥ యావద్దేహం యథాకాలం దశా స్వంగ విజానతా ।
కర్మేంద్రియై ర్హి స్థాతవ్యం నతు బుద్ధీంద్రియైః క్వచిత్ ॥

అనగా—సమాధినిష్ఠచే చిత్తమునకు ఏ నిర్వికారత్వము కలుగునో, అదియే శ్రేష్ఠమైనదికాని కర్మేంద్రియములయొక్క సుఖదుఃఖదశలను విడుచుట శ్రేష్ఠముకానేరదు. కావున జ్ఞానవంతుడు (అభ్యాసకుడు) శరీరముండునంతవరకు కర్మేంద్రియములతో సర్వావస్థలయందునూ సదాచారము ననుసరించియే యుండవలయునుగాని, సదాచారమును (మేము జ్ఞానులము లేక జ్ఞానాభ్యాసకుల మను తలంపుతో) ఉల్లంఘింపరాదు మనస్సు మొదలగు జ్ఞానేంద్రియములతో నెపుడునూ నిర్వికారతతో నుండవలయునేకాని సవికారతతో నుండదగదు. (వివరము — వాక్కు పాణి, పాద, పాయు, ఉపస్థలు అయిదు కర్మేంద్రియములును త్వక్, చక్షు, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణేంద్రియములైదు జ్ఞానేంద్రియములు, కలసి మొత్తము పది) మరియునూ ఇట్లు తెలుపుచున్నారు.

శ్లో॥ పరమేష్ఠిప్రభృతయ స్సర్వఏవో దితాశయాః ।
దేహావస్థాసు తిష్ఠంతి నియతేరేష నిశ్చయః ॥

శ్లో॥ అజ్ఞతత్త్వజ్ఞ భూతాని దృశ్యజాతమిదం హి యత్ ।
తత్సర్వమేవ నియతిం ధావత్యంబుయథాం బుధిమ్ ॥

శ్లో॥ తజ్ఞా బుధ్యాదిసామ్యేన పాణ్యాది చలనేన చ ।
నియతింయాపయంతీమాం యావద్దేహమఖండితామ్ ॥

శ్లో॥ అజ్ఞస్తు సర్వక్షోభేన సుఖదుఃఖవశాహతాః ।
నియతిం యాపయంత్యంగదేహాలక్షై ర్విఖండితామ్ ॥

అనగా బ్రహ్మాదులునూ వారివారి దేహావస్థలయందు ప్రవర్తించుచున్నారు. ఇయ్యది ప్రారబ్ధకర్మ నియతియొక్క నిశ్చయము. జలము సముద్రమును గూర్చి పరుగిడునటుల నజ్ఞులును, తత్త్వజ్ఞులును మొదలగు సర్వప్రాణి జాతంబును సమస్త దృశ్యజాతంబును యిట్టి నియతినే యనుసరించుచున్నది. అటులైన అజ్ఞ, తజ్ఞులిద్దరునూ, సములేగదా యంటివేని అట్లనగూడదు. ఏలనన జ్ఞానులు బుధ్యాదులయందు నిర్వికారతనొంది, హస్తపాదాదిచలన

మాత్రంబుచే దేహావసానము వరకునూ వారివారి ప్రారబ్ధ కర్మఫలములను అసత్యత్వబుద్ధితో ననుభవించుచుందురు. కాని అజ్ఞానులు సవికారచిత్తులై, సర్వేంద్రియములను క్షోభము నొందించిన వారలగుచు సుఖదుఃఖములను సత్యత్వబుద్ధితో ననుభవించుచుందురు. జ్ఞాని, అజ్ఞాని అనుభవములయం దిట్టి భేద ముండును.

కావున జ్ఞానాభ్యాసకులైననూ, జ్ఞానులైననూ, వారివారి ప్రారబ్ధ కర్మ ఫలభోగములను స్వశరీర సర్వదృశ్యమందుననూ యిట్టి అసత్యత్వ బుద్ధితో ననుభవించవలయునుగాని దేహమున్నంతకాలము ప్రారబ్ధము నుల్లంఘించుటకు సామాన్యముగ శక్యముకాదని శాస్త్రమువలన తెలియుచున్నది. జ్ఞానియైనను తన ప్రారబ్ధానుసార కర్మానుభవముల చేయుచునే బ్రహ్మజ్ఞానమును పొందవలయునుగాని వేరుమార్గములేదు. జీవునకు తన ప్రారబ్ధాంతమునగాని చరమవృత్తి సాక్షాత్కారము సామాన్యముగ కలుగదు. కావున జ్ఞాని తన పరమార్థస్వరూప జ్ఞాననిరూఢితోడనే ప్రారబ్ధము ననుభవించుచుండును. ముముక్షువునకు ఇట్లు తన సత్యస్వరూపజ్ఞాననిరూఢితోచేయు భోగానుభవములు బంధహేతువు కాజాలవు. అయిననూ తన జగన్మిథ్యాత్వ జ్ఞాననిరూఢియును, తన సత్యస్వరూప జ్ఞాననిరూఢియును ముముక్షువునకు సతతాభ్యాసాదులచే కలుగుచు స్వానుభవతుల్యముగ నుండును. అప్పుడే జిజ్ఞాసువునకు తన మననాద్యభ్యాసములు ఫలించి స్వానుభవమునకు అతి సన్నిహితముగ నుండుచు స్వానుభవతుల్యమగుచు జ్ఞానాభ్యాసకునకు బ్రహ్మసుఖము నివ్వగలుగును. లేనిచో కాజాలవు. కావున ముముక్షువులకు మననాద్యభ్యాసములు నిరంతర మావశ్యకము. కాని కొందరు మననాద్యభ్యాసాదులను పాటింపక వారియొక్క కేవల శాస్త్రపాండిత్యములమీదనే ఆధారపడి తాము బ్రహ్మణ్యుల మనుకొనుచు బ్రహ్మస్వరూపమును కరతలామలకములాగున బోధించుచు పరిపూర్ణసుఖము వారికి కలిగినదని భ్రమించుచు, బ్రహ్మాత్మనాసంస్థితిని నభినయించుచుందురు. ఇట్టిది వారు భ్రమించి పరులనుభ్రమింపజేయుటకే పనికివచ్చునుగాని, దీనివల్ల వారికి స్వలాభ మెంతమాత్రమునూ కలుగదని శ్రీ శంకరభగవత్పాదులు—

శ్లో॥ అనుభూతింవినా మూఢో వృధాబ్రహ్మణి మోదతే ।
ప్రతిబింబితశాఖాగ్ర ఫలాస్వాదన మోదవత్ ॥

అనగా "కొమ్మ చివరనుండి జలములో ప్రతిబింబించిన ఫలాస్వాదనమందు, సంతోషపడునట్లు బ్రహ్మానుభవములేకయే కొందరు మూఢులు (బ్రహ్మసుఖము నందు) వృధాగా మోదము నొందుచుందురు." అని తెలుపుచున్నారు. కావున యెంత శాస్త్రపఠనము చేసిన మోక్షార్థియైననూ, తన నిరంతర శ్రవణ మన నాద్యభ్యాసపాటవముచేతగాని స్వానుభవసుఖము నొందజాలడు. ముముక్షువు బ్రహ్మవిద్యను స్వానుభవము నొందువరకునూ సతతాభ్యాసము చేయుచుండ వలయునేగాని, మనన నిదిధ్యసనాద్యభ్యాసములు వదలి కేవల గ్రంథపఠన శాస్త్రజ్ఞానముతోడ తనకు బ్రహ్మసుఖము కలిగినదని యనుకొనుటగాని కలుగు ననుకొనుటగాని భ్రమయే యగును. కావున యెట్టివారికైననూ బ్రహ్మ విద్యాప్రాప్తికి సిద్ధాంతమందు ప్రీతి నిశ్చయపూర్వక నిరంతర మననాద్యభ్యా సము లావశ్యకమని వేరుగ జెప్పబనిలేదు.

బ్రహ్మజ్ఞానాభ్యాసకులగు ముముక్షువుల కిది కేవలము మనన గ్రంథ మగుటచే తత్త్వబోధ మార్గము ననుసరించి పునరుక్తి దోషమును పాటింపక, జ్ఞానాభ్యాసకులకు సిద్ధాంత మనన దార్ఢ్యములకుగాను లోగడ వివరించిన కొన్ని ముఖ్యాంశముల నిచట సంగ్రహము చేయుచున్నాడను.

బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు తన ప్రారబ్ధానుసారమున నెట్టి వ్యవహారముల నాచరించుచు తన భోగానుభవముల నొందుచున్ననూ రంగస్థలమున నటుని వలె నాచరించుచూ, తన పరమార్థస్వరూపము స్వప్రకాశ పరిపూర్ణ అఖండ చైతన్యమను జ్ఞానమును విడువకూడదు, మరువకూడదు. జ్ఞానాభ్యాసకుడు సతతము తన పరమార్థస్వరూపమును ఈ క్రింది విధముల వివేచన మననాదులు చేసికొనుచుండిన యెడల స్వస్వరూపమందు స్థితప్రజ్ఞు డగును. ఇంకనూ అఖండ సముద్రజలము చలనవాయు సంబంధముచే తరంగాది రూపముల నొందుచున్నట్లు నిస్తరంగమహాసముద్రమువంటి తన అఖండ పరిపూర్ణ

స్వరూపమే విషయ సంసర్గమువలన అనగా తన అనాదిభ్రాంతివలన విషయముల యందు సత్యత్వ బుద్ధికలిగి వాటియందు సక్తతాభిమానములు చేయు చుండుట చేతనే తనకు చిత్తము (మనస్సు) అనునది సంకల్ప వికల్ప ప్రవాహరూపమున కలుగుచూ తనను సంసారమున బంధించుచున్నదిగాని లేనిచో తన వాస్తవస్వరూపము నిస్తరంగ మహాసముద్రములాగున నిశ్చల అఖండస్వరూపుడనని గ్రహించుచుండవలయును. స్వశరీర సర్వదృశ్య పరిచ్ఛిన్నానుభవములు కల్పితములు, అనిత్యములు, భ్రాంతిమాత్రములేనని తన అనుభవ శాస్త్రీయ వివేచనలచే గుర్తించుచుండవలయును. మరియు లోకము నంతకునూ అందరకునూ భాస్కరు డొక్కడేయైయున్ననూ "ఒకసూర్యుండు సమస్త జీవులకు దా నొక్కొక్కడై తోచుపోలిక" యని భీష్మస్తవమందు తెలుపుచున్నట్లు ప్రతి యొక్కొక్క జీవునకున్నూ ఆ ఒక్క సూర్యుడే తానొక్కొక్కడుగా ఎట్లు కనబడుచున్ననూ ప్రపంచమునకంతటికినీ సూర్యు డొక్కడే యని యెట్లు గ్రహింపబడుచున్నాడో అట్లే సర్వజీవుల హృదయ పుండరీకములయందునూ ఒక్కొక్కడుగా తెలియబడు ప్రత్యగాత్మయే యీ సర్వమునకున్నూ అధిష్ఠానమైన అద్వితీయ అఖండ పరమాత్ముడని తెలిసి కొనుచు, ఆ పరమాత్మయే తాను అనగా 'నేను' అనియూ అదియే తన పరమార్థ స్వరూపమనియూ అఖండ పరిపూర్ణ నిర్వికార చైతన్యమనియూ జ్ఞానాభ్యాస కుడు నిశ్చయముగ గ్రహించి సర్వదా యిట్టి స్వస్వరూపానుసంధానముల నభ్యసించు చుండవలయును. ఇంకనూ యిట్లు తాను స్వాత్మాభిన్నముగ గ్రహించు ప్రత్యగాత్మ స్వరూపమే ప్రణవ స్వరూపమగు ఓంకారమునకు లక్షణార్థమనియూ యీ స్వరూపము తన కాలత్రయ అవస్థాత్రయములకు అతీతమైన తురీయమనియూ, యిదియే తన నిత్యనిరతిశయ అఖండ పరిపూర్ణ జ్యోతి స్వరూపమనియూ నిశ్చయము నొంది ప్రణవానుసంధానమును చేయు చుండవలయును. "సోఽహం" అనునప్పుడు "సః" అను శబ్దలక్షణార్థము గూడ నిదియేయని గ్రహించవలయును. ఇట్లు వృత్తి రూప గ్రహణముతో నాచరించు అనుసంధానాద్యభ్యాసములు శీఘ్ర ఫలకారులగును. వృత్తి వ్యాప్తి రహితముగచేయు అనుసంధానాదులకు ఫలమల్పము. కావున జ్ఞానాభ్యాసకుడు

శ్రుతి, అనుభవయుక్తులతో తన వృత్తిని బ్రహ్మాకారము చేయుచుండవలయును. ఈబ్రహ్మాకార వృత్తినే సర్వదా ముముక్షువు లభ్యసించుచుందురు.

జ్ఞానాభ్యాసకుడు "నేను" అని తలచునప్పుడు తన వాస్తవ స్వరూపము కరచరణాది విశిష్టమైన దేహాదులు కావనియూ యివి తనకు వ్యవహార ఉపకరణములనియూ తన పరమార్థ సత్యస్వరూపము తన హృత్పుండరీకమందు ప్రత్యగాత్మగ తెలియబడుచు స్వశరీర సర్వాధిష్ఠానముగానున్న అఖండ పరమాత్మయేయని సర్వకాల సర్వావస్థలయందును అనుసంధానము చేయుచుండవలయును. ఇంకనూ తన పరమార్థ స్వరూపము నిర్మలమహాకాశమువంటిదనిన్నీ తాను మహాకాశములాగున సర్వవ్యాపకుడనిన్నీ తన స్వరూపము అమూర్తమనిన్నీ తాను అసంగుడనిన్నీ తానిప్పు డనుభవించుచున్న స్వశరీర సర్వదృశ్యానుభవములున్నూ నిర్మలమహాకాశమునందు ఆకాశముతోడ నెట్టి సంబంధములేక ఆకాశమందే కలుగుచున్న మేఘములవలె తాత్కాలిక కల్పితములనిన్నీ యివి యన్నియూ నశ్వరములనిన్నీ తానుమాత్రము అపరిచ్ఛిన్న నిత్య నిరతిశయ అఖండ పరిపూర్ణచైతన్య స్వరూపుడనిన్నీ, తనకు యీ జనన మరణములతో నెట్టి వాస్తవ సంబంధము లేదనిన్నీ యివి యన్నియూ తన కల్పితోపాధి ధర్మములనిన్నీ, తాను నిరుపాధికుడైన నిర్విశేష అఖండ పరిపూర్ణచైతన్య స్వరూపుడననియూ నిశ్చయమునొంది యిట్టి నిశ్చయముతోడనే యీ సంసార సుఖదుఃఖానుభవములన్నియూ తనకు వాస్తవముగ సంబంధించినవి కావను జ్ఞానముతోడ తన సత్యస్వరూపస్వానుభవమును సంపాదించుటకుగాను సర్వదా దేహముతోనే పనిచేయుచున్నను మానసికముగ తన వివేచన మననాద్యభ్యాసముల నాచరించుచుండవలయును. ఇట్టి అభ్యాస పాటవముచే కాలక్రమమున తనకు అసంగ వ్యవహారసిద్ధి కలుగుచుండును. మరియునూ తన కిప్పుడు కలుగుచున్న స్వశరీర జగదనుభవములన్నియూ, తన నిద్రచే తనయందే భూమండలాది స్వప్నదృశ్యములు కలుగుచున్నట్లు తన పరమార్థ అద్వితీయఅఖండ పరిపూర్ణస్వరూపమందే తన అనాది అజ్ఞాన

మను నిద్రచే తనయందే సర్వదృశ్యమునూ మందాంధకారములో రజ్జువు యందు కలుగు సర్పభ్రాంతిలాగున కలుగుచున్నదియేగాని యీ దృశ్య మందు నిత్యత్వ వాస్తవికత్వములు యెంతమాత్రము లేవని తన శాస్త్రజ్ఞాన వివేచన మననాద్యభ్యాసములచే సర్వదా గ్రహించుచు తన ప్రారబ్ధానుసారాను భవములను నిర్లిప్తతతోడ ననుభవించుచు, యీ స్వశరీర జగద్దృశ్యమందు యెంతమాత్రమును సత్యత్వ బుద్ధిని తన స్వప్నములోగూడ కలుగనివ్వగూడదు. ముముక్షువున కిట్లు చేయుట తన నిరంతరాభ్యాసాదుల వలనగాని సాధ్యము కాదు. జ్ఞానాభ్యాసకుడు తన కిప్పుడు కలుగుచున్న సుఖదుఃఖానుభవములు రెండునూ కావటి కుండల వంటివనిన్నీ అనగా సర్వదా మారుచుండుననియూ యీ సుఖదుఃఖములు వారివారి సంస్కార వాసనాబలములచే మనోకల్పితములై కలుగుచున్నవిగాని యీ సుఖదుఃఖ విభాగములకు వాస్తవికత యేమిన్నీ సర్వదా యుండుటలేదని తన శాస్త్రీయానుభవ వివేచనలచే నిశ్చయము నొందవలయును.

బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు స్వశరీర మిధ్యాత్వభావనా నిశ్చయముల నిట్లు సంపాదించుకొనుచు తన పరమార్థ స్వరూపమును సచ్చిదానంద స్వరూపముగ గుర్తించి తాను సత్యజ్ఞానానంత స్వరూపుడననియూ తాను అద్వితీయ అఖండ పరిపూర్ణ చైతన్య స్వరూపుడననియూ, పరమార్థస్వరూపమున జగదధిష్ఠానముగ నున్నది తన సత్యస్వరూప మొక్కటియేగాని తదితర మేమియునూ వాస్తవ ముగ లేదనియూ, యీ స్వశరీర సర్వదృశ్యమంతయూ తన అనాదిభ్రమ కల్పితమనియూ తెలిసికొని నిశ్చయమునొంది, సర్వదా స్వస్వరూపాను సంధానాదుల నభ్యసించుచుండవలయును. ఇట్టి జ్ఞానపూర్వక నిరంతరాను సంధానాదులే తన పరమముక్తికి, సర్వోత్కృష్ట సాక్షాన్మోక్ష మార్గమని జిజ్ఞాసువులు రూఢిగ గ్రహించి దీనియందు ప్రీతినిశ్చయముల నొందవలయును. అప్పుడు యిదియే పరోక్ష జ్ఞానమై కాలక్రమమున తన అపరోక్షసాక్షాత్కారము నిచ్చును. సందేహము లేదు.

జ్ఞానాభ్యాసకులగు ముముక్షువులకు యీ ప్రపంచాధిష్ఠాన జ్ఞానమావశ్యకము. సత్యమగు సర్వాధిష్ఠానమును బాగుగ తెలిసికొనినగాని అధ్యస్థమగు యీ స్వశరీర సర్వదృశ్యము మిధ్యామాత్రమని తెలియబడదు. కావున అభ్యాసకుడు తన పరమార్థ వాస్తవ స్వరూపమగు అధిష్ఠానమును బాగుగ తెలిసికొనుట యావశ్యకమగు చున్నది. ఏలనన అభ్యాసకునకు తన సత్యాధిష్ఠాన రూపమును తెలిసికొనిన యెడల తన అనాది అవిద్యాభ్రాంతి నివర్తించునని—

శ్లో॥ అధిష్ఠానే పరిజ్ఞాతే సచ్చిదానంద లక్షణే ।
మిథ్యైవ సకలంవిశ్వం రజ్జుసర్ప భ్రమాయధా ॥

అని శాస్త్రవచనము తెలుపుచున్నది. శాస్త్రము "అహం" నేను సర్వాధిష్ఠాన సత్యస్వరూపుడననియు, యీ స్వశరీర సర్వదృశ్యము, నిద్రచే స్వప్నము కలుగుచున్నట్లు నాఅనాది అజ్ఞానమువలన నాయందే అధ్యస్తమై అవాస్తవముగ దీర్ఘస్వప్నములాగున యీ స్వశరీర సర్వదృశ్య మంతయు కలుగుచున్నదే గాని యిది యంతయు మిథ్యా మాత్రమని తెలుపుచున్నది. ఇంతవరకునూ చేసిన శ్రవణమననాద్యనుభవ విచారమువలనగూడ అట్లే తోచుచున్నది. కాని స్పష్టపడుటలేదు. ఇందులకుగాను దీనిని గురించి భగవంతుడగు గీతాచార్యుల వచనములను కొంత విచారించుదము. శ్రీకృష్ణభగవానులు— "వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః" అన్ని వేదములచేతను తెలియదగినవాడను నేనే—"అహం" అని తెలుపుచున్నారు. అనగా జిజ్ఞాసువు వేదాంత వాక్య శ్రవణాదులచేత తన పరమార్థవాస్తవ స్వరూపమగు ఆ పరమాత్మ నేనే "అహం"అని తెలిసికొనవలసి యున్నది. ఇట్టి జ్ఞానము "ఉపదేక్ష్యన్తితే జ్ఞానం, జ్ఞానినస్తత్త్వదర్శినః" తత్త్వదర్శినః అనిన తత్త్వసాక్షాత్కారము అనగా బ్రహ్మాపరోక్ష జ్ఞానముగల మహనీయులవలన బోధింపబడునని చెప్పుచున్నారుగాని యిట్టి జ్ఞానమును తత్త్వబోధకులగు వారిచే తెలుపబడగలదని చెప్పియుండలేదు. ఈ సాంప్రదాయమునుబట్టి యీ జ్ఞానము బోధించుటకు

ఆత్మసాక్షాత్కారము నొందిన మహనీయులగు వారికే యీ జ్ఞానోపదేశాధికారము కలదుగాని తదితరులకు లేదనిగూడ స్పష్టపడుచున్నది. మరియును, శాస్త్రము వాస్తవమున నేను "అహం" పరమాత్మ స్వరూపమని తెలుపుచున్నది. పరమాత్మ స్వరూపుడగు శ్రీకృష్ణభగవానులు "అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే" నేనే యీ దృశ్యమునంతటికిని కారణము, నావలననే సర్వము ప్రవర్తించుచున్నది యని జెప్పి "మయి సర్వ మిదం ప్రోతం సూత్రేమణిగణాయివ" అనగా యీ జగత్తంతయు సూత్రమునందు మణులు కూర్పబడినయట్లు నాయందేయున్నదని తెలుపుచు, యింకను త్రిగుణాత్మకమగు దృశ్య పదార్థములు సమస్తమును నావలననే పుట్టుచున్నవని—

శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే ॥

అనగా త్రిగుణాత్మకమగునట్టియు దైవసంబంధినియునగు నామాయ నతిక్రమింప వీలులేదు సుమా యని తెలుపుచు, అయినను నన్నే అనగా నావాస్తవ స్వరూపమగు "అహం"ను ఎవరాశ్రయింతురో వారుమాత్రము ఇట్టి మాయను సులభముగ దాటగలరని తెలుపుచున్నారు. ఈ శ్లోకార్థమును బ్రహ్మజ్ఞానాభ్యాసకులు నిట్లు గ్రహించుట సమంజసము. పరమార్థ వాస్తవమున బ్రహ్మస్వరూపుడగు జీవునియందే స్వశరీర సర్వదృశ్యము అధ్యస్తమై కలుగుచున్నందున యిది దైవసంబంధము గలది. యిది యంతయు జీవుని అనాది అజ్ఞానమను మాయచే కలుగుచున్నది గావున, దీనిని దాటుట కష్టము. కాని యేజీవుడు సర్వాధిష్ఠానమును, తన వాస్తవ స్వరూపమునగు పరమాత్మను నేనే "అహం"అని తెలిసికొనగలడో అట్టివాడు యీ మాయను దాటుట సులభము, అని తెలిసికొనవలయును. మరియును నిచట జ్ఞానాభ్యాసకులు "మామేవ యేప్రపద్యన్తే" అను వచనార్థమును, ముఖ్యముగ నిట్లు గ్రహించవలయును. ఎట్లనిన "నాయొక్క అనగా జీవునియొక్క పరమార్థ వాస్తవ స్వరూపమగు పరమాత్మను యేజీవుడు తెలిసికొనునో అనగా పొందునో" యనునది. ఏలనన యీ అభ్యాసకుడు స్వాత్మాభిన్న పరమాత్మాభ్యాసకుడు గనుక

యిట్టి అర్థమునే గ్రహించి, వాస్తవమగు తన అధిష్ఠాన సత్యస్వరూపమును తెలిసికొనవలయును. పరమార్థవాస్తవమున జీవుడగు తానే, స్వశరీర సర్వ దృశ్యమునకున్నూ అధిష్ఠానము సత్యస్వరూపుడు. స్వశరీర సర్వదృశ్యమును తన వాస్తవ స్వరూపమునందే అధ్యస్తమై అవాస్తవముగనుండి, జీవభ్రాంతి వ్యవహారానుభవములను కలిగించుచున్నది. ఎట్లన రజ్జు సర్పదృష్టాంతమున భ్రాంతి సర్పమేకదా జీవునకు భయకంపాదులను కలిగించుచు పలాయితుని గూడ జేయుచున్నది. ఇంకనూ అవాస్తవమగు సర్పము రజ్జువునే నాధారముగ జేసికొని కనబడుచున్ననూ, సర్పమునకు రజ్జువు వాస్తవమగు ఆధారము కాదు. ఈ ఆధారభావము వాస్తవమగు రజ్జువుయందున అవాస్తవమగు సర్పభ్రాంతిచే కలుగుచున్నదిగాన యిది వాస్తవము కాజాలదు. కావున రజ్జువుయందు సర్పము వాస్తవముగలేదు కాని అవాస్తవముగ యుండి కనబడుచు, భయకంపాద్యనుభవములను జీవునకు కలుగజేయుచున్నది. అధిష్ఠానము, వ్యవహారసత్యమునగు రజ్జువయందే సర్పము కనబడుచున్నది గాని, రజ్జువను విడచి కనబడదు. కావుననే జీవునియొక్క పరమార్థ వాస్తవ స్వరూపమే సర్వదృశ్యాధిష్ఠానమగు చున్నది. కాని మరియొకటి కాజాలదు. ఈ విషయమును స్పష్టము చేయుటకే సర్వాధిష్ఠానమైన పరమాత్మయగు శ్రీకృష్ణ భగవానులు యీ దృశ్యమంతయు పరమాత్మయగు తనయందు వాస్తవముగ లేదని స్పష్టము చేయుటకుగాను—

శ్లో॥ మయాతత మిదంసర్వం జగదవ్యక్తమూర్తినా ।
మత్‌స్థాని సర్వభూతాని నచాహం తేష్వవస్థితః ॥

అనగా ఇంద్రియగోచరముగాని నాఅవ్యక్తస్వరూపమునందే ఈ జగత్తంతయు నిండియున్నది. అనగా నాయందే అధ్యస్తమై భాసించుచున్నది కావున యీ సర్వ దృశ్యము నాయందున్నదిగాని, నేనుమాత్రము భూతాత్మకమగు ఈదృశ్యముతో నెట్టి వాస్తవ సంబంధమును కలిగిన అంటి యుండలేదని పరమాత్మయే తెలుపుచున్నారు. కావున పరమార్థ వాస్తవమున ఈ అభ్యాసకుడు పరమాత్మ స్వరూపుడే గనుక అధ్యస్తముగనున్న యీ స్వశరీర సర్వదృశ్యమంతయు

తనతో నెట్టి వాస్తవ సంబంధమునులేక, తనయందే ఆ మహాకాశమునందు వాయువు నిండియున్నట్లును, ఆకసమున మేఘముల లాగున యున్నదను నిశ్చయమును ముముక్షువు నొందవలయును. ఈ దృశ్యాధిష్ఠానాధ్యస్తములను గురించి లోగడ వివరముగా నిరూపింపబడి నందున తిరిగి నిచట వివరణ చేయుట లేదు. కాన దానినంతయు బాగుగ గ్రహించి, జగన్మిథ్యాత్వ నిశ్చయ దారుఢ్యమును పొందవలయును. ఇట్టి నిశ్చయముతోడ జ్ఞానాభ్యాసకుడు, సర్వదా తన సత్యస్వరూపమును మరువక తన ప్రారబ్ధ సుఖదుఃఖానుభవ భోగము లెట్టివియైనను అట్టి భోగానుభవములు అభ్యాసకునకు తన భావి సంసార ప్రతిబంధమును కలుగజేయ జాలవు. ఏలనన దృశ్యమిథ్యాత్వజ్ఞాన బలముచే తన కర్మానుభవముల నన్నిటిని కృత్రిమ సువర్ణాభరణములయందు వలె నిర్లిప్తతో వాటి భోగాదులయందు అత్యంతసక్తుడుగాక ప్రారబ్ధాను సరణమున సుఖదుఃఖానుభవములు అసక్తుడై చేయుచుండును. అప్పుడు అభ్యాసకుడు తన పరమార్ధ వాస్తవ స్వరూపమును స్వస్థచిత్తుడై నిట్లు అనుసంధానము చేయుటకు సమర్ధుడగును. ఎట్లన నా వాస్తవ స్వరూపము, సాక్షి, ప్రత్యగాత్మ పరమాత్మయే ననియు; నాస్వరూపము, సర్వోపాధి వినిర్ముక్త, సజాతీయవిజాతీయ స్వగత భేదరహిత, స్వప్రకాశ, జగదుత్పత్తి స్థితిలయ వివర్తకారణ, నిత్యనిరతిశయ నిర్వికార అసంగ సర్వాధిష్ఠాన అఖండ పరిపూర్ణ చైతన్యమనియు; నేను నిరవయవుడను, నిష్క్రియుడననియు; నాకు కర్తృత్వభోక్తృత్వములు వాస్తవముగ సంబంధించినవి కావనియు గ్రహించ గలుగును. ఇట్టి మననాద్యభ్యాసము నిరంతరము చేయుచుండుటయే బ్రహ్మా భ్యాసము, బ్రహ్మచింతనము, స్వస్వరూపాను సంధానము, అని చెప్పబడుచు యిది ముముక్షువులకు అమృతసాధన మగుచున్నది.

జ్ఞానాభ్యాసకులకుగూడ వారు యెంత శాస్త్రశ్రవణ మననాభ్యాసములు చేయుచున్నను నేనుకర్తను, నేను భోక్తను, వీరు నావారు, యిదియంతయూ నాది యను కర్తృత్వ, భోక్తృత్వ, సస్వామిత్వాది అధ్యాసము కలుగుచునే యుండును. ఈ కర్తృత్వాది అధ్యాసములు బలీయములై జీవుని తేలికగా

విడువవు. ఏలనన ప్రతి జీవుడును తన ప్రారబ్ధ పుణ్యాపాపఫలములను "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మశుభాశుభమ్ నాభుక్తం క్షీయతేకర్మ కల్పకోటిశతైరపి" అను వచనములనుబట్టి, సాధారణముగ ప్రారబ్ధానుభవ మును పొందక తప్పదు. ఎంత జ్ఞానాభ్యాసకునికైనను యీ కర్తృత్వాదులు వ్యవహారమున్నంతకాలము వెంబడించుచునే యుండును. ముముక్షు వ్యవహార స్థితిగతులకుగూడ వీటి యావశ్యకత కొంతవరకైనను కనబడుచున్నది. ఐనను యీ కర్తృత్వభోక్తృత్వాదులు తన వ్యవహారానుభవములకు మాత్రము కల్పితములుగ నున్నవనియూ, యీ కర్తృత్వ భోక్తృత్వాదులు సస్వామిత్వములు తనకు వాస్తవములుగావని, ముముక్షువులు నిశ్చయముగ తెలిసికొని వారి ప్రారబ్ధానుసార సుఖదుఃఖభోగముల ననుభవములను తటస్థముగ చేయుచుండవలయును. అట్లుగానిచో యీ అనుభవములయందు కలుగునట్టి సక్తతాభిమానములు, రాగద్వేషాదులు, పుణ్యాపాపఫలములను తనకు కలుగజేయుచు భావి ప్రతిబంధమును కలిగించుచు సంసారచక్రమున ద్రిప్పుచుండును. దీనిని గురించి అచటచట కొంతవరకు విచారించియుంటిమి. ఐనను జ్ఞానాభ్యాసకుల దారుఢ్యముకొరకు, యీ విషయమును స్పష్టము చేయుచున్న రెండు శ్లోకములను "ఉపదేశసాహస్రి" నుంచి, యుదహరించు చున్నాడను.

శ్లో॥ దేహాత్మబుద్ధ్యపేక్షత్వాదాత్మనః కర్తృతామృషా ।
నైవకించిత్కరోమీతి సత్యా బుద్ధిః ప్రమాణజా ॥

శ్లో॥ కర్తృత్వం కారకాపేక్ష మకర్తృత్వంస్వభావతః ।
కర్తాభోక్తేతి విజ్ఞానం మృషైవేతి సునిశ్చితమ్ ॥

అనగా భ్రాంతి మాత్రమగు కర్తృత్వ భోక్తృత్వాదులు ఆత్మకు దేహాత్మబుద్ధి నపేక్షించుటచే కలుగుచున్నవి. ఇది అవాస్తవము, నేను ఏమియూ చేయుటలేదు అనునదియే సత్యత్వబుద్ధి, వేద ప్రమాణమగువాస్త వము. కర్తృత్వమనునది కర్తను పరికరములను, చేయవలెనను ఇచ్ఛయును,

అపేక్షించుచున్నది—కాని, ఆత్మ నిర్గుణస్వభావమై కర్తృత్వభోక్తృత్వరహితుడైనవాడుగ నున్నాడు. కావున యీ కర్తృత్వభోక్తృత్వములు కేవల భ్రాంతిమాత్రములేనని గట్టిగ నమ్మవలయును—అని శ్రీ శంకరభగవత్పాదులు తెలుపుచున్నారు. కనుక జ్ఞానాభ్యాసకులు వారివారి ప్రారబ్ధకర్మ ఫలభోగములందు కలుగు కర్తృత్వ భోక్తృత్వములు కేవల వ్యవహారసాధన సాంకేతికములనియూ అవాస్తవములనియూ నిశ్చయము నొంది వారు లోకానుభవములను పొందుచుండుటయావశ్యకము. ప్రపంచము సర్వమును మహాకాశమునందున్నది. ఈ మహాకాశాది సర్వ దృశ్యమును జీవుని చిత్తాకాశమందున్నది. ఈ మహాకాశ చిత్తాకాశములు రెండింటికినీ అధిష్ఠానముగాయున్నదే చిదాకాశమని అభ్యాసకులు గ్రహించవలెను. ఈ మహాకాశ చిత్తాకాశ చిదాకాశములందు అధ్యస్తమాత్రములగు మహాకాశ చిత్తాకాశములను జ్ఞానపూర్వకముగ త్యజించినయెడల మిగులునది చిదాకాశమే. ఇదియే బ్రహ్మస్వరూపమని, స్వస్వరూపమని జ్ఞానాభ్యాసకుడు గ్రహించవలయును. ఈ క్రింది విషయ వివేచనలన్నియూ మనకు గ్రంథమందచటచట వచ్చినను ప్రమాణమును నిరూఢి చేయుటకుగాను నీ క్రింది పంచదశీ శ్లోకముల గ్రహించి వ్రాయుచున్నాడను. దేహధారియైయున్న యీ బ్రహ్మాభ్యాసకుని స్థితి లాభములను గురించి శ్రీ విద్యారణ్యస్వామి యిట్లు తెలుపుచున్నారు.

శ్లో॥ భుంజానో విషయానందం బ్రహ్మానందంచ తత్త్వవిత్ ।
ద్విభాషాభిజ్ఞవద్విద్యా దుభౌ లౌకిక వైదికౌ ॥

అనగా రెండు భాషలు తెలిసిన మానవుడు ఎట్లు ఒక్కొక్క కాలమందు ఒక్కొక్క భాషను మాటలాడుచు తన వ్యవహారముల జేయుచుండునో అట్లే బ్రహ్మ జ్ఞానాభ్యాసకుడగు బ్రహ్మవిదుడు ఒక కాలమందు విషయానందమును మరియొక కాలమందు బ్రహ్మానందమునూ రెంటినీ భిన్న భిన్న కాలములందనుభవించుచుండును. ఇట్టి అనుభవమునందు జ్ఞానికి యెట్లుండుననిన :

శ్లో॥ దుఃఖప్రాప్తౌ న చోద్వేగో యథాపూర్వం యతోద్విదృక్ ।
గంగామగ్నార్ధకాయస్య పుంసశ్శీతోష్ణధీర్యథా ॥

అనగా (పైన నిరూపించినట్లు) రెండు దృష్టులు యుండుట వలన మధ్యాహ్న గ్రీష్మమందు గంగలో సగము మునిగినవానికి పైభాగమునందు వేడియున్ననూ నది క్రింది భాగమునందుండు జలశీతముచే నెట్లు తక్కువగా నుండునో అట్లే దుఃఖానుభవములందుగూడ తన బ్రహ్మానుభవజ్ఞానమునంజేసి సంసారదశయందువలె అధిక పరితాపము గలుగదు—అనగా నొందడని అర్థము. ఇంకనూ యిట్లు తెలుపుచున్నారు.

శ్లో॥ జ్ఞానినోఽజ్ఞానినశ్చాత్ర సమే ప్రారబ్ధకర్మణి ।
నక్లేశో జ్ఞానినో ధైర్యాన్మూఢః క్లిశ్యత్యధైర్యతః ॥

అనగా జ్ఞానాజ్ఞానులకు ప్రారబ్ధకర్మ ననుభవించుట సమానమే. ఐనను, తన బ్రహ్మజ్ఞాన ధైర్యమువలన అజ్ఞానివలె జ్ఞాని దుఃఖపడడు. కాని అజ్ఞానియన్ననో అతి దుఃఖ సుఖ పామరత్వములచే రాగద్వేషాది పూరితుడగుచు దుఃఖము నొందుచుండును. జ్ఞానికినీ అజ్ఞానికినీ భేద మిదియేనని విద్వాంసులు గ్రహించవలయును.

మరియును జ్ఞానియగువాడు జగత్తంతయూ అచింత్య రచనారూపమగు నింద్రజాలమువలె మిధ్యయగునను నిశ్చయము కలిగియున్ననూ దానివలన ప్రారబ్ధఫలమగు సుఖదుఃఖానుభవములు నొందుటకుగాని, ఈ సుఖదుఃఖాను భవములచేత జగన్మిధ్యాత్వ జ్ఞానము నొందుటకు గాని ఈ సుఖదుఃఖాను భవములచేత జగన్మిధ్యాత్వ జ్ఞానము నొందుటకుగాని నేమియూ హానిగాని విరోధముగాని లేదని :

శ్లో॥ ఇంద్రజాల మిదం ద్వైతమచింత్యరచనాత్వతః ।
ఇత్య విస్మరతోహానిః కావా ప్రారబ్ధభోగతః ॥

అని పంచదశికారులు తెలుపుచున్నారు. ఏలనన ప్రారబ్ధ కర్మఫలము, జగన్మిధ్యాత్వ జ్ఞానము భిన్నవిషయములు. కావున ప్రారబ్ధ కర్మఫలములైన

సుఖదుఃఖ అనుభవములచేత జగత్తు మిథ్యయగునని తలంచుటకేమియూ బాధలేదు. ఈ ప్రపంచమంతయూ మిథ్య యని అనుసంధానముచేయుటచే ప్రారబ్ధానుసారమున తన కర్మఫలభోగముల ననుభవించుటకేమియును బాధ లేదు అని అర్థము. జీవునకు స్వశరీరముగూడ దృశ్యకోటిలోనిదే గనుక యీ దృశ్యమిథ్యాత్వజ్ఞానముచే ముముక్షువునకు కాలక్రమమున తన ధ్యానాద్యభ్యాస బలముచే దేహాభిమానము తొలగును, బ్రహ్మ సాక్షాత్కారము కలుగును. ఈ జన్మమునందే అమృతరూపుడై ముక్తినొందును. ఇట్టి ప్రత్యక్షలాభము కనుబడుచుండ స్వస్వరూపానుసంధానము నెవడు చేయక ధ్యానాదులచేయు చుండడో అట్టివాడు :

శ్లో॥ అనాత్మ బుద్ధి శైథిల్యం ధ్యానాద్వృద్ధి దినేదినే ।
పశ్యన్నపి నచేద్ధ్యాయేత్కోఽపరోఽస్మాత్పశుర్వద ॥

అనగా దేహేంద్రియాదులు నేనే యనెడి భ్రమ ధ్యానాభ్యాసాదుల వలన కాలక్రమమున అనగా దినములు గడచినకొలది నశించు లాభము ప్రత్యక్షముగ కనుబడుచున్ననూ ఆత్మానుసంధాన ధ్యానముల చేయనివాడే నరపశువని తెలిసికొనుము అని స్పష్టముగా విద్యారణ్యస్వామి తెలుపు చున్నారు.

ఈ గ్రంథ మందంతటనూ చెప్పిన విషయములే చెప్పబడుచున్నవే యను సంశయనివృత్తికి యీ గ్రంథము నిట్లు రచించుటయందు ముముక్షువులగు వారికి నీ గ్రంథముయొక్క అధికప్రయోజనమును పాఠకులిట్లు గ్రహించుట సమంజసము. ఎట్లన జీవునకు యీ సంసారము అనాదిగా వచ్చుచున్నది. ఇది దుఃఖభూయిష్టముగాని కేవల సుఖముగాదు. అనగా జీవునకు సంసారము వలన కలుగుచున్న పుత్ర మిత్ర కళత్ర ధన ధాన్య క్షేత్రాది విషయ సుఖములన్నియూ ఆభాసములు, తాత్కాలికములు మాత్రమగుచు పర్యవసాన మున జీవునకు దుఃఖమునే యిచ్చుచున్నవి. ఎంత మూఢుడైనను యీ సంసారము దుఃఖమిశ్రితము కాదనియూ, దీనివలన తనకు సర్వదా కేవల

సుఖమే కలుగుచున్నదనియూ, తన లోకానుభవములను బట్టియే చెప్పజాలదు. జీవునకు యీ సంసార దుఃఖము తన అవిద్యవలన అనాదిగా కలుగుచు, జీర్ణించిన వ్యాధిలాగున నున్నది. శ్రీ వశిష్ఠభగవానులు యీ సంసారము జీవునకు దీర్ఘవ్యాధి యనియే తెలుపుచున్నారు. వ్యాధి యెంతకాలమునుంచి యున్నను వివేకియగు మానవుడు తాను సర్వదా వ్యాధిగ్రస్తుడుగ నుండుటకు యిష్టపడడుగదా! మానవునకు వికారత అనగా వ్యాధి, దుఃఖము, ఆగంతుకము అనిత్యము. అవికారత అనగా ఆరోగ్యము, సుఖము, సత్యస్వరూపస్థితి—నిత్యము. ఆరోగ్యము లేనివాడేగదా అనగా వికారమునుపొందినవాడేగదా అనారోగ్య వంతుడని చెప్పబడుచున్నాడు. నిజమాలోచించిన జీవుడు తన సత్యస్వరూపమగు ఆరోగ్యస్థితిస్వరూపసుఖమును తన అజ్ఞానముచే పొందజాలక భ్రమించి దుఃఖము నొందుచున్నాడుగాని తనను తాను బాగుగ తెలిసికొనిన యెడల యీ దుఃఖము దరికిగూడ జేరక లేనిదే యగును. కావున వివేకులందరికినీ ప్రధానముగ ముముక్షువులకు తమ పరమార్థ వాస్తవమైన స్వరూప సుఖమును పొందుటకు తమయందున్న యీ సంసార దీర్ఘరోగమును అనగా అనాది అజ్ఞానమును దీర్ఘచికిత్స వలననే తగ్గించుకొనవలయునుగాని వేరు మార్గములేదు. ఈ చికిత్స యెటువంటిదనిన — చాలా కాలమునుంచి పురాణ జ్వరములుగాని యితర కఠినవ్యాధుల చికిత్సకు రోగి ఘనవైద్యుని దగ్గరకు వెళ్ళినప్పుడు ఆ వైద్యుడు ఒకమంచి రసాయన ఔషధము నాలోచించి యిచ్చి దానినే మూడు మాసములో, ఆరు మాసములో విడువక ప్రతిరోజుననూ సేవించమని చెప్పును. అవసరమైన యెడల, ఆ రసాయనమునే మరికొంత కాలము అనుపానభేదములతో తీసికొనమని చెప్పును. ఈ కాలపు యింగ్లీషు ఘనవైద్యులుగూడ బాగుగ నాలోచించి ఏదోనొక యింజక్షను మందును అనగా సూదితో లోపలికి నెక్కించు మందును నిశ్చయించి దానినే నాలుగు దినముల కొకసారిగాని, వారమున కొకసారిగాని నెలలదరబడియునూ, వ్యాధి స్వభావమునుబట్టి సంవత్సరముల దరబడియునూ యిచ్చుచు దీర్ఘకాల చికిత్సను చేయుచుందురు. కాని ఘనవైద్యులు మందును సాధారణముగ మార్చరు. ఈ విషయము లందరికినీ యనుభవమే. ఇట్లే అవిద్యచే జీవునికి అనాదిగానున్న

యీ దీర్ఘసంసార రోగమును నివర్తింపజేయవలెననిన దీనికి ఒక్క బ్రహ్మ జ్ఞానమను రసాయనమే ఉపయోగించునుగాని అన్యములు ఉపయోగపడవు. ఈ చికిత్సాక్రమము జీవుల నుద్ధరించుటకుగాను వేదమాతవలననూ, దానిని విస్తరింపజేసి పూర్వాచార్యులవలననూ అనేక విధముల అనగా మార్గభేదములచే తెలుపబడియున్నది. ముముక్షువులు తమ అజ్ఞానమును శాశ్వతముగ నివర్తింపజేసికొని వారి వాస్తవ స్వరూపమగు నిత్యనిరతిశయ సుఖము నొందుటకు ఈ బ్రహ్మజ్ఞానమను రసాయన ఔషధమును సద్గురువు నాశ్రయించి గ్రహించి ఆ యొక్కదానినే వివిధ మార్గభేదములచే, దీర్ఘరోగి ఒకే ఔషధమును అనుపాన భేదములతో దీర్ఘకాలము సేవించవలసిన యటుల మానవుడు అనగా ముముక్షువు యీ ఆత్మాభిన్న అద్వితీయ అఖండ పరిపూర్ణ చైతన్య రసాయనమును వాక్యప్రమాణముతోడను, సయుక్త్యనుభవముల తోడను, వివిధముగ విసువుజెందక దీర్ఘకాలము అనగా ఫలపర్యంతము సేవించుచుండుట అనగా జ్ఞానపూర్వకముగ మనన నిదిధ్యాసముల నభ్యసించుచుండుట మిక్కిలి యావశ్యకము. వేరుమార్గములేదు. కాని స్వభావముచే జీవుని వృత్తి సర్వదా విషయభేదమును కోరుచుండునుగాని విషయయేకత అనగా నిర్విషయమును సులభముగ గ్రహింపజాలదు. ఈ బ్రహ్మజ్ఞాన రసాయనము నిర్విషయము. కాని దీనిని వృత్తి ద్వారానే గ్రహించవలయునుగాని వేరుమార్గములేదు. మానవులకు వారి వృత్తి సతతము దేనిని వినుచుండునో, చింతించుచుండునో దాని మీదికిపోవు స్వభావము కలది. దీనిని గ్రహించియే యీకాలమున ఔషధాది వస్తుపరికరము లమ్మువారు ప్రతిరోజుననూ ప్రతి పత్రికయందుననూ వివిధ రీతులుగ వారి వస్తు ప్రకటనములు అనగా అడ్వర్టైజుమెంట్లను అనేక విధముల జేయుమానవులకు వృత్త్యాకర్షణముగ నుండునట్లుచేసి విక్రయించుచుందురు. ఇట్లే ముముక్షువునకు గూడ తన వృత్తిని యీ బ్రహ్మాకారముగ చేయుట యావశ్యకము గనుక దీనిని బహువిధముల బోధించుట యావశ్యకము. కాని యీ బ్రహ్మ వృత్తి ఆంతరమగుటచేతను, యిప్పుడు జీవుడు అజ్ఞానావృతుడుగ నుండుట

వలననూ, జీవునకు తన సత్యస్వరూప జ్ఞానజ్యోతితో అనేక విధముల యీ వృత్తిని బ్రహ్మస్వరూపమందు స్థిరపరచుట యావశ్యకము. అప్పుడుగాని ముముక్షువునకు తన అభ్యాసాదులు నిర్విఘ్నముగ జరుగవు. అందుకుగాను యీ మనన రూపమున వివిధ ప్రక్రియలతో ఏకతత్త్వమగు బ్రహ్మజ్ఞానమును ముముక్షువులకు అమృతరసాయనముగ నుండుటకుగాను, యీ గ్రంథ రచన నిట్లు గావించి తెలుపబడెనని గ్రహించి శ్రద్ధోత్సాహములతో దీనిని పలుమారు పఠించుట ముముక్షువుల మోక్షప్రాప్తికి సాధనమగును ఇందుండు విషయ అనుభవనిరూపణలను బాగుగ మనోగోచరము గావించుకొని యీ గ్రంథమును పఠించి బాగుగ నభ్యసించువారలకు కాలక్రమమున ఆత్మజ్ఞాన లాభము కలుగుననుటకు సందియములేదు. సమస్తలోకములను గురించి తెలుపు విద్యలు అనిత్యములగుచు యివి యన్నియూ యెట్టివియైనను అపర విద్యలు అనియే తెలియబడుచున్నవి. ఈ విద్యావిషములన్నియు ఇంద్రియ గోచరములగును గనుక మానవులకు గ్రహించుట సులభసాధ్యము. ఒకసారి గోచరము కాని యెడల నాలుగుసారులైనను చెప్పిన తెలిసికొన సాధ్యము. కాని జీవునకు నిత్యనిరతిశయ సుఖమునిచ్చు యీ నిర్గుణమగు బ్రహ్మవిద్య ఇంద్రియ గోచరముకానిదై కేవల సంస్కృత మనోగోచరమే యగుచున్నది. కావున యీ విద్యను అనేకమారులు అనేకవిధముల జీవునకు మనోగోచర మగునటుల పునఃపునః తెలుపుట యావశ్యకము. ఇంకనూ మానవ స్వభావ మునుబట్టి యెల్లప్పుడునూ ఏవస్తువును గురించి వినుచు స్మరించుచుండునో ఆ వస్తువునందు మనసు లగ్నమగు స్వభావముకలదు. ప్రపంచవస్తువు లన్నియూ చాలాభాగము యింద్రియ గోచరములు గనుక వానిలో తేలికగా మనసు లగ్నమగును కాని యీ బ్రహ్మపదార్థము ఇన్ద్రియాగోచరము గనుక గోచరమగువరకునూ అదే విషయమును అనేక మార్గములస్పష్టము చేయు ఆవశ్యకత దీనికి కలదు.

శ్రుతులన్నియు ఆత్మ అద్వితీయ అఖండ స్వరూపుడు, నిర్వికారుడు, అని తెలుపుచున్ననూ జన సామాన్యులందరికినీ యీ ఆత్మ సద్వితీయము

గానే కనబడుచున్నది. ఐనను యిది వాస్తవముగాదు. ఎట్లన యీ అద్వితీయ అఖండ నిత్య నిరతిశయ సుఖస్వరూపమగు బ్రహ్మయందే సర్వజీవులును, చిజ్జడమిశ్రిత మగు సమస్త ప్రపంచమునూ జపాకుసుమముల సాన్నిధ్యమున నున్న స్ఫటికమందు ప్రకాశించు లౌహిత్యములాగున నున్నవేగాని వాస్తవమున ఆత్మస్వరూపుడగు బ్రహ్మకు వీటితో నెట్టి సంబంధము లేదు. యివి యేవియును ఆత్మభిన్నముగ లేవు. అయినను జపాకుసుమములు, జపాకుసుమ లౌహిత్యము స్ఫటికముతో నెట్టి సంబంధము పొందక స్ఫటికమునందే గనబడుచున్నట్లు యీ స్వశరీర దృశ్యమంతయూ బ్రహ్మయందే గనబడుచున్నది. అయిననూ యీ జపాకుసుమములు జపాకుసుమలౌహిత్యము ఆ స్ఫటికమున కెంతమాత్రము సంబంధించి యుండవు గదా? ఇట్లే ఆ బ్రహ్మ అసజ్గుడని "అసఙ్గోహ్యయం పురుషః" అని శ్రుతి స్పష్టము చేయుచున్నది. ఎంత విచారించిననూ స్ఫటికమందు గనబడు లౌహిత్య పుష్పాకారములు గనుబడుటయనునదితప్ప వానికి ఎట్టి వాస్తవికతయునూలేదు గదా? అట్లే యీస్వశరీర సర్వ ప్రపంచము బ్రహ్మాధిష్ఠానమందధ్యస్తమై గనబడుచున్నదేగాని వాస్తవముగాదని జ్ఞానాభ్యాసకుడు నిశ్చయభావము నొంది, తన వాస్తవస్వరూపమైన బ్రహ్మజ్ఞానమును సంపాదించిన యెడల జీవునికి అదియే నిత్య నిరతిశయ సుఖస్వరూపమైన పరమ ముక్తియగు మోక్షము అగుచున్నది.

ఇట్లెంత తెలిసికొనిననూ జీవుని తన జీవిత సంపదలు సక్తతను గలిగించి బంధించుచునే యుండును. కావున బ్రహ్మజ్ఞానాభ్యాసకునకు తన పరమార్థ సత్యస్వరూపమును బాగుగ గ్రహించుటకునూ, అనుసంధానాభ్యాస దార్ఢ్యమునకున్నూ, జీవిత విమర్శ యావశ్యకమగుచున్నది. జీవిత మనగా జీవుడు తన ఉపాధియే తానను భ్రాంతిజ్ఞానముతోడ యీ ప్రపంచమున ప్రాణధారియై యుండుట జీవిత సంపదలనగా యిట్టి తన జీవితమునకు గలుగుచున్న భోగసాధనములు. అట్టివి ఏవి యనిన స్వశరీర భార్యాపుత్ర మిత్ర విత్తక్షేత్రాదులు. ఎంత విద్వాంసుని నైననూ తన జీవితము, జీవితమునందు

గలుగుచున్న సంపదలు మోహము, ఆశాపాశములను గలిగించుచూ సంసారమున బంధించుచున్నవి. ఇట్టి సంసార బంధమువల్ల జీవుడు యీ చర్వితచర్వణమైన జన్మపరంపరా దుఃఖసాగరమును దాటలేకున్నాడు. జీవుడు తన పరమార్ధ సత్యస్వరూపమైన నిత్యనిరతిశయ సుఖమును బొందలేకున్నాడు. కావున వివేకులందరకునూ యీ జీవిత, జీవిత సంపదలనుగూర్చి వాటి యధార్థమును తెలిసికొనుట యావశ్యకము ప్రతిజీవునకున్నూ యీ జీవిత, జీవిత సంపదలనెట్టివో శ్రీ మప్పయ్య దీక్షితులవారి యీ క్రింది వచనములు తెలుపుచున్నవి :

"ఆయుర్నశ్యతి పశ్యతాం ప్రతిదినం యాతిక్షయం యౌవనం ।
ప్రత్యాయాంతి గతాః పునర్నదివసాః కాలో జగద్భక్షకః
లక్ష్మీస్తోయ తరంగభంగ చపలా విద్యుచ్చలం జీవితం ॥"

అనగా మనము చూచుచుండగనే ఆయుర్దాయము ప్రతి క్షణమునసూ క్షీణించు చున్నది. యౌవనముగూడ రోజురోజునకున్నూ క్షీణించి తగ్గిపోవుచున్నది. గడచిన రోజులు మరల వచ్చుటలేదు కాలము ప్రపంచమునంతటినీ భక్షించుచున్నది. సంపదలన్నియూ సముద్ర జలతరంగములవలె చంచల మైనవి. జీవితము మెరుపువలె క్షణికమైనది—అనిన్నీ,

"కిం యానేన ధనేన వాజికరిభిః ప్రాప్తేన రాజ్యేన కిం ।
కింవా పుత్రకళత్రమిత్ర పశుభిర్దేహేన గేహేన కిం
జ్ఞాత్వై తత్క్షణ భంగురం సపదిహి త్యాజ్యం మనోదూరతః ॥"

అనగా జీవుడు తాను పొందిన శరీరమునుగాని, గృహక్షేత్రాదులనుగాని, భార్యా పుత్రమిత్రకళత్రాదులనుగాని, గజాశ్వవాహనములనుగాని, అంతతః రాజ్యాది ఐశ్వర్యములనుగాని, సుఖసాధనములని తలంచక వీటియొక్క అల్పకాలస్థితిని, నశ్వరత్వమును బాగుగ గ్రహించి వాటినుండి మనస్సును దూరముగా నుంచ వలెను. (అనగా వాటియందు వ్యామోహితుడై సక్తతాభిమానముల నొంద గూడదు) అని పై వచనములు తెలుపుచున్నవి.

ఇట్లు తన జీవిత, జీవిత సంపదలన్నిటియొక్క అనిత్యత్వ నశ్వరత్వ ములను బాగుగ తెలిసికొని తన పరమార్థ సత్యస్వరూపమగు బ్రహ్మాను సంధానమును ఆత్మసాక్షాత్కార పర్యంతము నభ్యసించు చుండవలయును. ఏలనన ఏ జీవుడైననూ ఒక్క ఆత్మజ్ఞానమువలనగాని పరమముక్తియైన మోక్షము నొందజాలడు. ఆత్మ యనగా బ్రహ్మము. "బ్రహ్మవిదాప్నోతిపరం" అనగా (ఆత్మ జ్ఞానము కలిగిన) బ్రహ్మవేత్త మోక్షమును పొందుచున్నాడు. అని శ్రుతి తెలుపుచున్నది ఇంకనూ ఆత్మజ్ఞానము వలనగాని జీవుడు తన పరమార్థ స్వరూపమైన నిత్యనిరతిశయ సుఖప్రాప్తి నొందజాలడని శ్రీరామ చంద్రమూర్తికి వసిష్ఠభగవానులు యోగవాసిష్ఠమందు తెలిపియున్నారు. ఇట్టి ఆత్మానుసంధానజ్ఞాన మెట్లుండవలెననిన శ్రీ శంకరభగవత్పాదులు ఆత్మ పంచకమునం దిట్లు తెలుపుచున్నారు.

---

# ఆత్మ పంచకము

1. శ్లో॥ నాహం దేహో నేంద్రియాణ్యం తరంగం ।
నాహంకారః ప్రాణవర్గో నచాహమ్ ।
దారా పత్యక్షేత్రవిత్తాదిమార ।
స్సాక్షీనిత్యః ప్రత్యగాత్మా శివోహమ్ ॥

నేను దేహముగాని, ఇంద్రియములుగాని, అహంకారముగాని, ప్రాణాది సముదాయముగాని కాను. భార్యాపుత్రక్షేత్రధనాదులతో సంబంధములేని ప్రకాశ స్వరూపుడున్నూ, నిత్యుడున్నూ మంగళ కరుడున్నూ అయిన ప్రత్యగాత్మను నేనే.

2 శ్లో॥ రజ్జ్వజ్ఞానాద్భాతి రజ్జుర్యథాహి ।
స్స్వాత్మాజ్ఞానాదాత్మనో జీవభావః ।
ఆప్తోక్త్యాహి భ్రాంతినాశే సరజ్జు ।
ర్జీవో నాహం దేశికోక్త్యా శివోహమ్ ॥

రజ్జువుయొక్క అజ్ఞానముచేత రజ్జువు సర్పముగా భాసించునట్లు స్వాత్మాజ్ఞానముచేత ఆత్మకు జీవభావము కలిగినది. ఆప్తునిమాటచే భ్రాంతిపోగా సర్పముపోవునట్లు, నేను జీవుడనుకాను అను గురూపదేశముచే జీవత్వముపోగా నేను మంగళకరుడైన శివస్వరూపుడను.

3. శ్లో॥ ఆభాతీదం విశ్వమాత్మన్య సత్యం ।
సత్యజ్ఞానానంద రూపేవిమోహాత్ ।
నిద్రామోహాత్స్వప్నవత్తన్నసత్యం ।
శుద్ధః పూర్ణో నిత్య ఏకశ్శివోహమ్ ॥

సత్యజ్ఞానానంద రూపుడైన ఆత్మయందు అజ్ఞానముచే అసత్యమైన యీ ప్రపంచమంతయూ భాసించుచున్నది. నిద్రచేత భాసించిన స్వప్నము

లాగున అది సత్యముగాదు పరిపూర్ణుడు, నిత్యుడు, శుద్ధుడు, అద్వితీయుడు అయిన శివుడనే నేను. శివుడనగా మంగళ కరుడైన అఖండ పరమాత్మ.

4 శ్లో॥ మత్తోనాన్యత్కించిదత్రాస్తి విశ్వం ।
సత్యం బాహ్యం వస్తుమాయోపక్లప్తమ్ ।
ఆదర్శాంతర్భాసమానస్య తుల్యం ।
మయ్యద్వైతేభాతి తస్మాచ్ఛివోఽహమ్ ॥

నాకంటే వేరు అయినటువంటి సత్యమైన ప్రపంచము ఏదియులేదు. నాకంటె వేరుగా గనబడుచున్న సర్వ ప్రపంచము మాయచే అనగా అజ్ఞానముచే కల్పించబడినది. అది అద్వితీయుడనైన నాయందు అద్దము లోపల భాసించునట్టి ప్రతిబింబములాగున భాసించుచున్నది. కనుక నేను మంగళకరుడైన పరమాత్ముడను.

5. శ్లో॥ నాహం జాతో నప్రవృద్ధోననష్టో ।
దేహస్యోక్తాః ప్రాకృతాస్సర్వ ధర్మాః ।
కర్తృత్వాదిశ్చిన్మయస్యాస్తి నాహం ।
కారస్యైవహ్యాత్మనో మే శివోఽహమ్ ॥

నేను పుట్టిన వాడనుగాని, పెరిగినవాడనుగాని, నశించినవాడనుగాని కాను. ప్రాకృతమైన (కల్పితమైన) యీ ధర్మములన్నియూ దేహమునకే చెప్పబడినవి. కర్తృత్వాదులు, చిన్మయుడైన నాకు లేవు. అవి అహంకార పరిచ్ఛిన్నోపాధి ధర్మములే. నేను మంగళకరుడైన పరమాత్మస్వరూపుడను.

6. శ్లో॥ నాహం జాతో జన్మమృత్యూ కుతోమే ।
నాహం ప్రాణః క్షుత్పిపాసే కుతోమే ।
నాహం చిత్తం శోకమోహౌకుతోమే ।
నాహం కర్తా బంధమోక్షౌ కుతోమే ॥

నేను పుట్టినవాడను గానప్పుడు నాకు జన్మ మృత్యువులు ఎక్కడివి? నేను ప్రాణముగాను గనుక నాకు ఆకలిదప్పిక లేల ఉండును? నేను చిత్తముగాను గావున నాకు శోకమోహములు యుండుటకు వీలులేదు. నేను కర్తను కాదు గావున నాకు బంధము, మోక్షము ఇవి ఏవియు నుండనే యుండవు.

ఇట్లు శ్రీశంకరభగవత్పాదులు ఆత్మపంచకము వలన తెలుపుచున్నారు. కావున పై విధమున ఆత్మస్వరూపమును బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు నిరంతరము అనుసంధానము నాచరించుచుండుట యావశ్యకము.

ఇట్లు బ్రహ్మానుసంధానాదుల నభ్యసించుటకు జ్ఞానాభ్యాసకుడు పై వచనముల వల్లనూ, ఇంతవరకు చేయబడిన శ్రుత్యనుసరణ అనుభవనిరూపణల వల్లనూ తన జీవిత, జీవిత సంపదలన్నియూ అనగా స్వశరీర కళత్ర పుత్ర విత్తాదులన్నియూ తనకు అజ్ఞాన కారణమువలన కల్పితములుగ కలిగినవే గాని వాస్తవములు కావను నిశ్చయములను పొందిన తన బ్రహ్మాభ్యాసాదులను శాంతచిత్తుడై యాచరింపగలుగుచుండును. లేనిచో తన జీవిత, జీవిత సంపదభిమాన సక్తతలు, రాగద్వేషాదిరూపముల బాధించుచూ తన అభ్యాస కాలమందుగూడ చిత్తవిక్షేపమును గలిగించుచుండును. కావున జ్ఞానాభ్యాసకుడు తన శాస్త్రీయ విచారవివేచనప్రయత్నములతో స్వశరీర సర్వదృశ్య, సక్తతాభిమానములను క్షీణింప జేసుకొనుటకు సర్వదా ప్రయత్నించుచుండుట యావశ్యకము. ఇట్టి సతత ప్రయత్నముచే జ్ఞానాభ్యాసకుడు తనకు గలుగుచున్న విషయ భోగములన్నియూ తన అజ్ఞానకారణముగ తాత్కాలికానుభవములు గలుగుచున్నవేగాని యివి తనకెంత మాత్రము నిత్యములు, సత్యములు గావనిన్నీ, వీటి సంబంధములు తనకు ఎంతమాత్రము వాస్తవములు గావనిన్నీ దృఢముగ నమ్మవలయును. అప్పుడు తన సంసార కారణమైన అజ్ఞానమును బ్రహ్మజ్ఞానాభ్యాసబలముచే క్షీణింపచేసుకొన గలుగును. అప్పుడు తన పరమార్థవాస్తవస్వరూపము క్రమక్రమముగ

గోచరించుచుండును. జ్ఞానాభ్యాసకునకు తన మోక్షప్రాప్తికి యిదియే పరమ సాధనము.

మానవులు వారి శాశ్వత పరిపూర్ణ సుఖప్రాప్తికిగాను, యెన్నటికైనను ఒకప్పుడు బ్రహ్మవిద్య నభ్యసించుట యావశ్యకము. బ్రహ్మవిద్య యనగా జీవుడు అవిద్యచే మరచిన తన పరమార్థ వాస్తవ స్వరూపమును తిరిగి పొందుట. మానవులకు నాలుగు పురుషార్థములలో పరమోత్కృష్ట పురుషార్థ మిదియే. ఇదియే జీవునకు తన నిత్యనిరతిశయ సుఖస్వరూపమగు మోక్షము. ఇది ఎన్నటికినీ నాశములేని పరిపూర్ణ సుఖస్వరూపము. ఇదియే జీవునకు వాస్తవమగు విశ్రాంతి. ఈ విశ్రాంతి నిర్వికారఅఖండపరిపూర్ణ సుఖము. ఇది ఏకము, అఖండము, నిర్విషయము కాని అజ్ఞానమున్నంత కాలము జీవుని విషయచింతనము విడువదు. కావున జిజ్ఞాసువు దీనిని తన శాస్త్రీయ వివేక ప్రయత్నముచే తగ్గించుకొనిన యెడలగాని, వ్యవహారము లోనైనను విశ్రాంతి కలుగదు. ఈ విశ్రాంతియైనను ఉన్నయెడలగాని, జీవుడు బ్రహ్మాభ్యాసమును చేయజాలడు. కనుక యిట్టి విశ్రాంతిని మానవుడు స్వప్రయత్నముచే సంపాదించవలసి యున్నది. ఇది దానంతట నదియే ఏదోయొక జీవితావస్థ యందు కలుగునని తలంచుట అవివేకము కావున వాస్తవవివేకియగు జీవుడు ప్రారబ్ధానుసారమున తన సుఖదుఃఖానుభవములను నేవయసు నందెట్లు పొందుచున్నను అవి యన్నియు తనకు తాత్కాలికములును, కేవల తన ప్రారబ్ధ కల్పితములును అనియు, తన సత్యస్వరూప మొక్కటియే నిత్యము పరిపూర్ణ సుఖస్వరూపము ననియు అనునట్టి నిశ్చయమును, సదాచార సద్గురు శాస్త్రబోధలవలన సంపాదించ వలయును. ఇట్టి నిశ్చయమును సంపాదించి తాను తనకు తన ప్రారబ్ధానుసరణమున కలుగునట్టి ఎంతటి సుఖదుఃఖభోగానుభవములలోనున్ననూ, తాను ఏపని చేయుచున్ననూ జ్ఞానపూర్వకముగ విషయ చింతను తగ్గించి స్వప్రయత్నముతోడ సర్వదా తన పరమార్థ వాస్తవ స్వరూపమునే చింతించునట్టి అభ్యాసముచేయుట యావశ్యకము. జీవునకు తన పరమార్థ వాస్తవ స్వరూపమే బ్రహ్మ. తన వాస్తవ స్వరూపము బ్రహ్మకంటె

వేరుకాదను స్వానుభవమును సంపాదించుటయే బ్రహ్మవిద్య. దీనిని గురించి సర్వదా చింతించుచుండుటయే బ్రహ్మచింతనము ఇది మానసికము, సర్వాంతరము, నిర్విషయము కావున అభ్యాసకుడు బాహ్యవిషయచింతనను ఆంతరవిషయ చింతననుగూడ సాధ్యమైనంత వరకు తగ్గించుకొని, ఆంతరమున తన మనసును బ్రహ్మాకారము జేయుచుండవలయును ముముక్షువగువాడు తన అవస్థా వయఃపరిస్థితులను పాటింపక స్వప్రయత్నముతోడ జ్ఞానాభ్యాసము నారంభింప వలయునేగాని అట్లు చేయనిచో యీ విద్యాభ్యాసమునకు అవకాశమే తన జీవితమందున లేకపోవునని నెరుగవలయును. ఏలనన జీవుని తన ఏ అవస్థలోనను అనగా బాల్య యౌవన వార్ధక్యములయందుగూడ, విషయ చింతన వెంబడించుచునే యుండునుగాని విశ్రాంతిని అనగా నిర్విషయ స్థితిని తన అజ్ఞానము కలుగనివ్వదు. ఈ విషయమునే శ్రీ శంకరభగవత్పాదులు "బాలస్తావత్క్రీడాసక్తః, తరుణస్తావ త్తరుణీసక్తః, వృద్ధస్తావచ్చింతాసక్తః, పరేబ్రహ్మణి కోపి నసక్తః" అనగా మానవుడు తన మూడవస్థలయందునను గూడ విషయాసక్తుడుగానే యుండునుగాని బ్రహ్మయందు సక్తుదెవడగును? అనగా అట్లగుట దుర్లభము అని తెలుపుచున్నారు. కావున జిజ్ఞాసువులగువారు యీ విద్యను ఎప్పుడో విశ్రాంతికాలము వచ్చినప్పుడు అభ్యసించ వచ్చునని తలచక వారు యెట్టి అవస్థావయఃపరిస్థితులలోనున్ననూ యీ జ్ఞానాభ్యాసము నారంభించి యాచరించుచుండుట వారికి పరమ శ్రేయోదాయకమని గ్రహించి కాలవిలంబముచేయక బ్రహ్మానుసంధానాదుల చేయుచుండుట యావశ్యకము.

జ్ఞానాభ్యాసకునకు తన అభ్యాసమును ప్రతి నిత్యమునను సతతముగ ఫలపర్యంతమువరకును చేయుచుండుట యావశ్యకము. ఏలనన తనకు యీ జీవభ్రాంతి అనాదినుండి వచ్చుచున్నది శాస్త్రము పఠించి ఒకసారి తను తెలిసికొన్ననూ తాను అద్వితీయ అఖండ పరమాత్మడను, అను జ్ఞానము నిలువదు కావున చిరకాల నిరంతరాభ్యాసము యావశ్యకమగు చున్నది. ఈ జ్ఞానాభ్యాసకుడు తన యభ్యాసకాలమును సతతము తనకు ఈ కర్తృత్వాదులును, క్రియాదికములును, తన సర్వవ్యవహారములును, ఆగంతుకము, కల్పిత

మాత్రమేనను నిశ్చయదార్ఢ్యమును సంపాదించవలసియున్నది. దీనికిగాను శాస్త్రబోధ ననుసరించి సప్రమాణముగను, సయుక్తికానుభవములతోడను, విచారించు వివేకికి తన పరమార్థ వాస్తవ స్వరూపము నిర్వికార అఖండ పరిపూర్ణ జ్ఞానస్వరూపమనియే స్పష్టమగును. ఇట్టి యెడ తన వాస్తవ స్వరూపము అఖండము గనుక పరిచ్ఛిన్నానుభవములును, తాను నిర్వికారుడు గనుక సుఖదుఃఖాది వికారములును, తాను జ్ఞానస్వరూపుడు గనుక తనకు యజ్ఞానమును వాస్తవముగ యుండుటకు సంభవముగాదు అయినను యివి యెట్లు వచ్చుచున్నవనిన, పరమార్థ వాస్తవమున జీవుడు తాను కేవల అఖండ చిత్స్వరూపుడు గనుక, తన చిత్ప్రకాశమునే యాధారముగ జేసికొనినట్టి కల్పిత జీవుడొక్కడు తనయందే యుండి యీ కల్పిత జీవునియొక్క యనాది యవిద్యా కామ కర్మ ఫల భోక్తృత్వ కర్తృత్వాదులకుగాను అనాదిగ ప్రవేశించి యున్నాడు. ఈయనయే చిదాభాసుడు. సర్వవ్యవహారములు యీ చిదాభాసుడైన వ్యవహారివేగాని, పరమార్థ వాస్తవమున నిర్వికార అఖండ పరిపూర్ణ జ్ఞానస్వరూపుడగు తనకు యీ అంతఃకరణ స్థూలదేహధర్మములతో నెట్టి వాస్తవ సంబంధమునులేదు అయినను అనాది జీవాజ్ఞానముచే తనవలె నున్న యీ చిదాభాసుడు చేయునట్టి సర్వవ్యవహారములను పొందుచున్నట్టి సర్వ సుఖదుఃఖానుభవములను తనయందు అనగా తానే యీ వ్యవహారములు చేయుచూ సుఖదుఃఖానుభవములు పొందుచున్నవానివలె భ్రాంతినొందుచున్నాడు. కాని యిది వాస్తవముగాదు. ఎట్లన కాష్ఠాదులను ఛేదించునది కుఠారమైననూ, నేను యిన్ని కట్టెల ఛేదించితినని వాస్తవమున కుఠారము చేయుక్రియను తనయందాపాదించు కొనుచున్నట్లునూ, రైలులో ప్రయాణముచేయు ప్రయాణీకుడు స్వస్థతగా రైలుపెట్టెలో కూర్చుని యున్ననూ, నేను యిన్నిమైళ్ళు ప్రయాణము చేసితినని, వాస్తవమున తన పాదచలనాదులు లేకపోయిననూ రైలుబండి చలనమును తన యందెట్లారోపించు కొనుచున్నాడో యట్లే యీ శుద్ధ జీవుడు భ్రాంతి నొందుచున్నాడుగాని వాస్తవమున సుఖదుఃఖ కర్తృత్వాద్యనుభవములు తనకు సంబంధించినవిగావు. ఈ సంబంధము జీవభ్రాంతియగు యజ్ఞానమే. ఇట్టి అజ్ఞానముతోడ జీవుడు

యీ సంసార దుఃఖమును పొందుచున్నాడు. శుద్ధ జీవుడన్ననూ, సాక్షి యన్ననూ, ప్రత్యగాత్మయన్ననూ, జ్ఞానమన్ననూ, బ్రహ్మయన్ననూ, చైతన్యమన్ననూ యివి యన్నియూ పర్యాయ పదములని లోగడనే తెలిపి యుంటిమి. పరమార్థ జీవుడు సాక్షిస్వరూపుడు. ఇట్టి సాక్షిని గురించి శ్రుతి "సాక్షీ కేవలో నిర్గుణశ్చ" అనగా ఈ సాక్షి యెట్టి సంబంధములేని నిర్గుణుడు అని తెలుపుచున్నది. కావున జీవుడగు తనకు పరమార్థ వాస్తవమున గుణములుగాని, సంబంధములుగాని లేవు కనుక సుఖ దుఃఖ రూపానుభవ వ్యవహారమంతయూ తనకు వాస్తవమున లేదు. కావున యీ వ్యవహార మంతయూ తనకు ప్రారబ్ధకల్పితము, అనిత్యము అని జ్ఞానాభ్యాసకుడు నిశ్చయమునొంది తన వాస్తవ స్వరూపమును యీ చిదాభాస స్వరూపముల నుంచి జ్ఞానపూర్వకముగ విడదీసి తెలిసికొనుచుండ వలయును. ఇట్లు అను క్షణముననూ చేయు అభ్యాసపాటవాదులనుబట్టి కాలక్రమమున జీవుడు తన పరమార్థ వాస్తవ స్వరూపమును గ్రహించి అనుభవము నొందగలుగు చుండును. అట్టితరి యీ జ్ఞానాభ్యాసకుడు తన స్వస్వరూప మనన నిధి ధ్యసనాది కాలములయందు తన అఖండ పరిపూర్ణ జ్ఞానస్వరూపమునూ, తన స్థితిదేహధర్మాది వ్యవహారములన్నియూ తనకు కల్పితోపాధియైన అంతః కరణ ధర్మములనియూయను విభాగజ్ఞానముతో తన యనుభవములను, పొందుచుండును.

వాస్తవ మాలోచించిన యెడల యీ ప్రపంచమున జీవునకు తన పరమార్థ వాస్తవమగు ఆత్మపదార్థముగాని తదితర మేదియును వాస్తవము, నిత్యము యగుటకు వీలులేదు. స్వశరీర దృశ్యమంతయూ జీవునకు తనయందే కల్పితమైన దగుచూ కేవల వ్యవహార సాధనముగ నుండుచూ, పర్యవసాన మున అనిత్యమై దుఃఖకరమే యగుచున్నది. కావున జీవుడు తన నిత్య నిరతిశయ సుఖప్రాప్తి కొరకు తెలిసికొనదగినది, వినవలసినది, మననము చేయవలసినది, ధ్యానించవలసినది, యీ ఆత్మ యొక్కటియే యని శ్రుతి "ఆత్మావారేద్రష్టవ్య శ్శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" అని తెలుపు

చున్నది. పరమార్థ సత్యమగునది ఒక్క ఆత్మ పదార్థము తప్ప తదితర స్వశరీర సర్వదృశ్యమంతయూ అనిత్యము, అవాస్తవము అగుచూ పర్యవసానమున జీవుడగు తనను సంసార దుఃఖ నిమగ్నుని చర్వితచర్వణముగ గావించు చున్నదనుమాట నిశ్చయముగ తెలిసికొనవలయును. ఇట్టి నిశ్చయమును సంపాదించుటకు జ్ఞానాభ్యాసకులు స్వశరీర జగన్మిథ్యాత్వ జ్ఞాన నిశ్చయమును, స్వస్వరూప జ్ఞానదార్ఢ్యమునూ, పై శ్రుతి వాక్యముల ననుసరించి వారివారి నిత్యాభ్యాసములవల్ల నొందవలయునేగాని మరి వేరుదారిలేదు. కావున జ్ఞానాభ్యాసకునకు ఇట్టి యాచరణయే పరమ కర్తవ్యమగుచున్నది.

జ్ఞానాభ్యాసకుడు అహం, ఇదములు రెండును కల్పితమాత్రములు, వాస్తవములు కావని తెలిసికొనినను సాధారణముగ ప్రారబ్ధము విడువదు. ఈ ప్రారబ్ధమనునది ధనుస్సున కెక్కుపెట్టి విడచిన అంబువంటిది. దాని నాపుటకు సాధారణ ప్రజ్ఞ చాలదు కావున జ్ఞానాభ్యాసకుడుగూడ ప్రారబ్ధసుఖ దుఃఖఫలానుభవముల ననుభవించుచునే యుండవలయును. ఇట్లు తన ప్రారబ్ధఫలముల ననుభవించుచునే తన జ్ఞానాభ్యాసమును చేయుచుండవలయునుగాని మరియొక దారిలేదు. కావున జ్ఞానాభ్యాసకుడు తన ప్రారబ్ధానుసారమున నెట్టి సుఖదుఃఖముల ననుభవించుచున్నను అవి యన్నియు తనకు వాస్తవములు కావను జ్ఞానముతో ననుభవించుచుండవలయును. ఇట్లనుభవించుచు తన పరమార్థ సత్యస్వరూపమును మరువకూడదు వాస్తవమున స్వశరీర సర్వదృశ్యమే కల్పితమని గ్రహించినవాడు ఈ జ్ఞానాభ్యాసిగనుక యీ తన శరీరమునుబట్టి వచ్చుచున్న దృశ్యానుభవములెట్లు సత్యమగును? సత్యముకావు. ఐనను ఎంత జ్ఞానాభ్యాసినైనను అంతఃకరణ తాదాత్మ్యము వలన కలుగుచున్న సుఖదుఃఖానుభవములు దేహధర్మములైన క్షుత్పిపాసాదులు ప్రారబ్ధాంతము వరకును విడచిపెట్టవు జ్ఞానాభ్యాసకుని సుఖదుఃఖమంతయు, ఇట్టి అనుభవములన్నియు తనకు వాస్తవమున సంబంధించినవి కావనియు, తన పరమార్థస్వరూపము కర్తృత్వాదిరహితమనియు, ఐనను తప్పని సరిగా తనకు అనుభవములు కలుగుచున్నవను దృఢనిశ్చయముతో తన ప్రారబ్ధానుసారి

కర్మఫలానుభవముల నొందుచుండుటయే జ్ఞానాభ్యాసకునికి జీవితమందు కలుగు సుఖము. ముముక్షువిట్టి రూఢిజ్ఞానముతో తన జీవయాత్రను నడుపుచు తన సత్యస్వరూపప్రాప్తికి నిరంతరము తన పరమార్థ వాస్తవస్వరూపమును ఇట్లనుసంధించుచుండవలయును.

నే నీ దేహ స్వరూపముతోనున్న పరిచ్ఛిన్నుడను కాను. నా శాస్త్రీయ వివేచనముచేత ఇందు "నేను" అను పదార్థమేదియును నాకు వాస్తవముగ కనబడుటలేదు. ఈ నా స్థూలదేహమా? యీ జన్మాంతముతోడనే నశించుచున్నది. నా సూక్ష్మోపాధియైన అంతఃకరణమా? ఏజన్మకాజన్మలో కర్తృత్వాద్యభిమానముల జేయుచు జన్మాంతమందు వాటి నన్నిటిని నిర్దాక్షిణ్యముగ వదలివేయుచు ఏయుపాధితోనున్నపు డా యుపాధి ధర్మములతో సక్తతాభిమానములను చేయుచు అంతులేని ఉచ్చ-నీచ జన్మల నొందుచున్నది. ఈ యన్తఃకరణాభిమానములకొక వ్యవస్థగాని, అంతుగాని కనబడుటలేదు. కావున వానిలో నేను దేనిని నమ్ముకొనుటకును వీలులేదు. ఈ "నేను"అనుకొనుటగూడ కల్పితముగ కనబడుచున్నది. కాని యీ "నేను-అహం" అను ప్రత్యయమునకు శాస్త్రము తెలుపుచున్న అర్థమువల్లను, నా అనుభవ వివేచన వల్లనుగూడ వాస్తవమగు అహం పదార్థము నశించుటకు వీలుకానిదిగాను, నిత్యమైనదిగాను తెలియుచున్నది. శాస్త్రము నేను పరిపూర్ణస్వరూపుడననియు, నాకన్న భిన్నములేదనియు తెలుపుచున్నది. అట్టిదియే నా పరమార్థ సత్యస్వరూపము కావున అదియే నేను. ఈ పరిచ్ఛిన్నోపాధులు నేను కాను. వీనితో నాకెట్టి వాస్తవ సంబంధములేదు ఈ నేనను వాస్తవపదార్థము అఖండ పరిపూర్ణజ్ఞానస్వరూపము. జ్ఞాతృజేయములు నేను కాను. నా వ్యవహారము లన్నిటినీ ఈ కల్పితోపాధితో చేయుచున్నను ఈ పరమార్థ స్వరూపము——

శ్లో॥ జ్ఞానానంద ఘనం నిత్యం నిర్మలాకాశవత్సదా ।
అఖండ పరిపూర్ణోఽహం పరమాత్మాహమచ్యుతః ॥

శ్లో॥ జ్ఞానమాత్రస్వరూపోఽహం జ్ఞాతృజ్ఞేయ వివర్జితః ।
అఖండపరిపూర్ణోఽహం పరమాత్మాహ మచ్యుతః॥ అనిన్నీ, ఇంకనూ-

క॥ ఇందుగల నందులేనని సందేహమువలదు నేనుసర్వోపగతిన్ ।
ఎందెందు వెదకిచూచిన నందందేగలను నాదుమోహము వీడన్ ॥

అని సతతము తన సత్యస్వరూపాను సంధానమును జ్ఞానాభ్యాసకుడు ఆచరించు చుండవలయును.

జ్ఞానాభ్యాసకుడు స్వశరీరదృశ్యముల నన్నిటిని అవాస్తవములు, అనిత్యములను నిశ్చయమునొంది తన పరమార్థ సత్యస్వరూపమును అద్వితీయ అఖండ పరిపూర్ణ చైతన్యముగ తెలిసికొని అట్టి స్వానుభవము నొందుటకుగాను తాను — అనగా నేను "సర్వోపప్లవరహితః ప్రజ్ఞానఘనః ప్రత్యగర్థో బ్రహ్మైవాహమస్మి" అనగా—నేను సర్వోపాధివినిర్ముక్తమై, సర్వాధిష్ఠానమై సర్వుల అంతరమందున్న ప్రత్యగాత్మగ తెలియబడుచున్నట్టి అఖండ చైతన్య బ్రహ్మస్వరూపుడనని నిత్యానుసంధానము చేయుచుంటవలయును. బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు ఎంత ప్రయత్నముతోడనైనను సర్వదా అఖండాకారవృత్తి నభ్యసించుచుండవలయును. ఇట్టి వృత్తిప్రతి జీవునకున్ను, తనవృత్తి, అజ్ఞానమందు లయమగుచు సుషుప్తి స్థితియందు కలుగుచుండుననియు, బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు ఇట్టి అఖండాకారవృత్తిని తన జాగ్రత్ స్థితియందు తనవృత్తి జ్ఞానమందు లయింపజేసి అఖండాకారవృత్తిని పొందవలయుననియు లోగడ వివరించియుంటిమి. కానియిట్టి అఖండాకారవృత్తియన నెట్లుండుననియు, దానినెట్లభ్యసించుట యనియు సంశయము కలుగవచ్చును. ఇట్టి సంశయ నివృత్తికై ఈక్రింది వివరణ ముపకరించును.

జ్ఞానాభ్యాసకుడు తన శాస్త్రీయవివేకబలముతో ఘటసదృశమగు తన పరిచ్ఛిన్నదేహాద్యుపాధిని కల్పితమైన యీ సర్వదృశ్యమును త్యజించిన యెడల మిగులునది సర్వోపాధి వినిర్ముక్తమైన అఖండ నిర్మలమహాకాశమే యగునుగాని తదితరమేదియు నుండుటకు వీలులేదు. ఇట్టి సంవిద్రూపమగు అఖండ నిర్మల మహాకాశగ్రహణమే యఖండాకారవృత్తి యనబడును. వ్యవహారమందు ఘటాకాశ మహాకాశములని వ్యవహరింపబడుచున్నను

వాస్తవమున మహాకాశభిన్నముగ మరియొక ఆకాశముండుట యెట్లసంభవమో, అట్లే తన సత్యస్వరూప చైతన్యమే నిర్వికార అఖండ పరిపూర్ణముగ నున్నదని యనుసంధించుచుండవలయును. అనుసంధాన రూపమున స్వాత్మాభిన్నముగ అభ్యసించు ఇట్టి అద్వితీయ అఖండ పరిపూర్ణ చైతన్య గ్రహణమే జాగ్రత్ స్థితియందభ్యసింపబడు అఖండాకారవృత్తి యనబడును. ఇదిగాకను నామరూపములు గలిగిన సైంధవకణమును సముద్ర జలమునందుంచినంత మాత్రముననే దాని నామరూపములు సముద్రజలమందు లయమై నామరూపములు నశించి సముద్ర జలమునకు లోపలయనిగాని వెలుపలయనిగాని వివక్షలేక సైంధవకణమను, నామరూపములు నశించి యీ సైంధవకణమంతయు సముద్ర జలస్వరూపముగ నెట్లగుచున్నదో, యట్లే జ్ఞానాభ్యాసకుడు తన పరిచ్ఛిన్న నామరూపదేహోపాధిని అఖండ చిదానంద సాగరమున నుంచిన (అనగా తాను అఖండ చిదానందస్వరూపమేనని దృఢ భావనను చేయగా) తనవ్యవహారస్వరూపమైన నామరూపములు చిత్సాగరమందు లయమగుచు, తాను సత్యజ్ఞానానంత లక్షణములతో అఖండ చిదానందసాగర స్వరూపుడే యగును గాని, తద్భిన్నముగనేమియు నుండదు అపుడు తత్స్వరూపుడే యగును. ఇట్టి స్థితియే అఖండాకారవృత్తి యనబడును. ఇట్టి సమాధి స్థితినే శ్రుతి—

"యత్రనాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి సభూమా"

అనగా—ఏచట మరియొకదానిని చూచుట యనునదిగాని, మరియొకదానిని వినుట యనునదిగాని, మరియొకదానిని తెలిసికొనుట యనునదిగాని యుండదో, అదియే బ్రహ్మ అని చెప్పుచు, "యో వై భూమాతత్సుఖమ్" అభూమపదార్థమే స్వరూపసుఖమనిగూడ తెలుపుచున్నది. జ్ఞానాభ్యాసకుడు సమాధ్యనుభవము తనకప్రయత్నముగ కలుగువరకును ప్రయత్నముచే నభ్యసించుచుండవలయును. కొంతకాలమున కట్టి స్థితి సహజముగనే కలుగుచుండును. సమాధి యనగా — జ్ఞానాభ్యాసి యగువాడు తనవృత్తిని బ్రహ్మాకారముగ అనగా — నిత్యనిర్వికార అద్వితీయ స్వప్రకాశ అఖండ పరిపూర్ణ చైతన్య

స్వరూపము నొందించుచుండుటయే ఇట్టి నిరంతరాఖండాకారవృత్త్యభ్యాసమే బ్రహ్మసాక్షాత్కారమునకు పరమ సాధనమని ముముక్షువులు గ్రహించవలయును.

కావున వేదమాత యిట్లు నిరూపించుచున్నది :—

I "అసద్వా ఇదమగ్ర ఆసీత్"

అనగా సృష్టికి పూర్వము ఈ నామరూపవిశేషాత్మకమగు ప్రపంచము అవ్యాకృతముగ బ్రహ్మయే అయియుండెను అని చెప్పుచు, ఉపనిషద్వాక్య బోధవలన జీవునకీ క్రింది విధమున విశదము చేయుచున్నది. ఆ బ్రహ్మస్వరూపమును—

II "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ"

అను స్వరూపలక్షణములచే తెలుపుచు, ఇంకను ఆ బ్రహ్మ—

III "యస్మాత్పరం నాపరమస్తి కించి
ద్యస్మాన్నాణీయో నజ్యాయోఽస్తి కశ్చిత్ ।
వృక్ష ఇవ స్తబ్ధో దివితిష్ఠత్యేకస్తే
నేదం పూర్ణం పురుషేణ సర్వమ్ ॥"

అనగా దేనికంటె కొంచెమైనను పెద్దదిలేదో, దేనికంటె చిన్నవస్తువులేదో, యేదియైతే యెప్పుడును పుట్టినదికాదో, యేదిచెట్టువలె స్థిరమై స్వప్రకాశము కలదో, అట్టి పురుషునిచేత నీ జగత్తంతయు పరిపూర్ణముగా నున్నది. అని తెలుపుచు—

IV "స య ఏషోఽన్తర్హృదయఆకాశః తస్మిన్నయం
పురుషోమనోమయః అమృతో హిరణ్మయః ॥"

"పూర్ణత్వాత్పురుషః" అనగా పూర్ణుడై యుండుటవల పురుషుడు, అట్టి పురుషుడు మనోమయుడై సర్వజీవుల హృదయములందును ఆయన చిదాకాశ

రూపుడుగనున్నాడనియు, ఆయన ప్రకాశరూపుడనియు, అమృతుడనియు తెలుపుచున్నది.

V "స ఆత్మా" అనునదే మహావాక్యమనియు చెప్పి,

VI "ఏక మేవాద్వితీయం బ్రహ్మ"

VII "నేహనానాస్తి కించన"

అని ఉన్నది ఒక్క బ్రహ్మమేగాని ఇతరము వాస్తవముగా లేదనియు,

VIII "జీవో బ్రహ్మైవ నాపరః"

జీవుడా బ్రహ్మకన్న భిన్నుడు కాడనియు,

IX "అహం బ్రహ్మాస్మి" నేను ఆ బ్రహ్మను.

X "తత్త్వమసి" నీవు ఆ బ్రహ్మవు.

అను మహావాక్యములతో జీవబ్రహ్మైక్యమును మహావాక్యములు బోధించు చున్నది. కావున బ్రహ్మజ్ఞానాభ్యాసులు నిరంతరము ఆ నిత్యనిష్కళ అద్వితీయ అఖండ బ్రహ్మస్వరూపము నేనే "అహమేవ" అని యనుసంధానాదుల నభ్యసించు చుండవలయునుగాని వేరుమార్గములేదు

బ్రహ్మజ్ఞానాభ్యాసకు డిచట నొక రహస్యమును గ్రహింపవలయును. ఏదియనగా—తాను అనుసంధానము చేయు నిష్కళబ్రహ్మ—అద్వితీయ అఖండ పదార్థము. ఇది స్వానుభవరూప అద్వితీయ పదార్థముగాని, తెలిసికొనునది—తెలియబడునది యని ద్వితీయముకాదు తానే అద్వితీయ అఖండ పదార్థమైనప్పుడు తెలిసికొనబడునది యుండదు. కాని యీ అభ్యాసము పరమార్థ వాస్తవమున బ్రహ్మస్వరూపుడేయైయున్నను, తాను ప్రస్తుతము వ్యవహార స్థితియందు బద్ధుడైనవానివలె నుండి సాధకుడై ప్రయత్నించు వాడు గావున తనకు చరమవృత్తి సాక్షాత్కారమైన పర మనోవృత్తి

లభించువరకును వ్యవహారకోటిలోనివాడే. అయినను ఇప్పుడు శాస్త్రజ్ఞానాను భవములచే తన అద్వితీయ అఖండత్వమును నిర్విశేషముగ గ్రహించువాడు గనుక సమాధ్యనుసంధానకాలములలో బ్రహ్మసుఖానుభవమును అనుభవింప గలుగుచుండును ఇట్లనుభవింపబడు బ్రహ్మ అద్వితీయ అఖండ పదార్థముగ నుండవలెను. కావున తీవ్రబ్రహ్మాభ్యాసకునకు గూడ ఆ బ్రహ్మ బాగుగ తనకు తెలిసినదని చెప్పుటకును, ఏమీ తెలియలేదని చెప్పుటకును గూడ వీలు కాని స్థితిగానుండును. ఏలనన బాగుగ ఆ బ్రహ్మ తెలిసినదని చెప్పిన సద్వితీయానుసంధాన మగును. ఏమీ తెలియలేదని చెప్పినయెడల బ్రహ్మాను సంధాన ప్రయోజనము కలుగుటకే వీలులేకపోవును. కావున నిట్టిస్థితినే శ్రుతి గురుశిష్య సంవాదరూపమున నిట్లు నిరూపించు చున్నది. గురువు శిష్యుని ఆ బ్రహ్మ నీకు బాగుగ తెలిసినదా యని యడుగగా, అందులకు శిష్యుడు—

"నాహమన్యే సువేదేతి నో నవేదేతి వేదచ"

అనగా తెలిసికొనదగు పదార్థము (అనగా—ఆ బ్రహ్మ) నాకు బాగుగ తెలియనూలేదు: తెలియకపోనూలేదు అని చెప్పగా గురువు, శిష్యుడు బ్రహ్మ పదార్థమును సరిగా గ్రహించెనను యుద్దేశ్యముతోడ—

"యది మన్యసే సువేదేతి దభ్రమేవాపి నూనం"

"నీవు బ్రహ్మను బాగుగా తెలిసికొంటిననిన యెడల అట్టిపదార్థము అల్పమైనదే యగును" అని తెలిపెను. ఇట్టి దురవగాహమైన ఆ బ్రహ్మ పదార్థమును గ్రహించి స్వానుభవమునొందుటకు ముముక్షువునకు శ్రుతివాక్యమే ఆధారముగాని, మరియొకటి కాజాలదు. వివేకులు సూక్ష్మబుద్ధితోడ విచారించిన యీ ప్రపంచమంతయూ వారివారి అనుభవములకు భూతవస్తు రుద్రభూమియేగాని మరేమియునూ కాదు. అనగా యీ జగత్తంతయును యెల్లప్పుడునూ గతించిన జీవులయొక్క శ్మశానముగనే యున్నదికాని మరియొకటి కాజాలదు కావున వాస్తవముగ యీ ప్రపంచము యెపుడునూ జీవునకు శ్మశానమువంటిదే యగుచున్నది. ఏలనన యీ భూత

భవిష్యద్వర్తమానకాలములు యుగ సంవత్సర మాస తిథులు—యివి యన్నియూ జీవుని వ్యవహారమునకుగాను శాస్త్రముచే కల్పింపబడిన సాంకేతిక నామ విభాగములు ఇందువలననే మనలను సంకల్పమందు "వ్యావహారిక చాంద్రమానేన" అని చెప్పబడుచున్నది పరమార్థమున దేశ కాలములు బ్రహ్మస్వరూపములు. కాని యిట్టి నిత్య నిర్వికార అద్వితీయ అఖండ పరిపూర్ణ బ్రహ్మమందే జీవ వ్యవహారమునకుగానున్నూ, తద్ద్వారా జీవుని ఉద్ధరణమునకు గానున్నూ, శాస్త్రమువలన యీ దేశ కాల దేవతాది వస్తువులు కల్పింపబడినవి. శాస్త్రమువలన కల్పింపబడినను, యివి యన్నియూ కల్పితములే గదా! శాస్త్రము యిట్టి కల్పితములతోననే యొక నియతి ననుసరించి జీవునకు తన తరణోపాయమును బోధించుచున్నది. జీవులయొక్క పునరావృత్తినిబట్టియూ వారి వారి ప్రారబ్ధముననుసరించి కలుగుచున్న అనుభవములనుబట్టియూ, భూతకాలమే వర్తమానముగను, వర్తమానమే భూత భవిష్యత్కాలములుగను మారుచుండును. ఒకానొక జీవియొక్క వర్తమానకాలమే మరియొక జీవునకు భవిష్యద్భూతకాలము లగుచుండును. కావున యిట్టి కల్పితవిభాగ కాల స్వరూపముతోనున్న యీ ప్రపంచమంతయూ వెనుకముందులును కల్పిత కాలవ్యవహారములతోడ సర్వజీవులకునూ శ్మశానమేగదా యగుచున్నది: పరమార్థవాస్తవమున జగత్తను నిట్టి శ్మశానమందే, జీవునకు కలుగుచున్న కర్తృత్వభోక్తృత్వములు, సుఖదుఃఖానుభవములు మొదలగు నవన్నియూ నెట్లు తనకు స్థిరములు వాస్తవములు కాగలవు: కావు కావున జీవునకు ఈ ప్రపంచమున కలుగుచున్న వ్యవహారానుభవములన్నియూ పరమార్థమున అవాస్తవములేగదా యగుచున్నవి. అయినను పైన తెలిపినయటుల జీవుల తరణోపాయమున శాస్త్రము—తల్లి తన బాలుని క్షేమము నాలోచించి, పసిబాలునకు కథలు చెప్పుచు అన్నము తినిపించునట్లు, వివిధ ప్రక్రియలను కల్పించి జీవులకు పరమార్థ వాస్తవస్వరూపమున తన నిత్యనిరతిశయ సుఖస్వరూపమగు మోక్ష విద్యను వివిధోపాయములతో బోధించుచున్నది నిజమాలోచించిన — బాలుడు తిను అన్నమునకునూ, తల్లిచే చెప్పబడు కథలకునూ యెట్టి సంబంధమునూ లేదు. ఐనను కథను చెప్పినగాని పసిబాలు

డన్నము తినడు. అన్నమును బాగుగ తినినగాని బాలుడు వృద్ధినిగాంచడు. కావున ఇదియొక యుపాయముగ గ్రహించి తల్లి కథలు చెప్పి పసిబాలునిచే అన్నము బాగుగ తినిపించి, వానిని వృద్ధినొందించి సమర్థునిగ జేయును. ఇట్లే జీవులకు యీ శాస్త్రము—ప్రపంచము యని ముముక్షువులు బాగుగ గ్రహించి, వారి బ్రహ్మాభ్యాసాదులను చేయుచుండవలయునుగాని ఈ ప్రపంచమును సత్యమని ఎన్నడును తలంచకూడదు. ఈ స్వశరీర సర్వప్రపంచము అవాస్తవ మని బాగుగ గ్రహించి అట్టి నిశ్చయముతోడనే ముముక్షువు తన వ్యవహార ములను నిర్వర్తించుచు తన సత్యస్వరూపమును మరువక తన మనన నిదిధ్యాసనముల నభ్యసించుచుండుట యావశ్యకము. బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు సారాంశముగ గ్రహింపవలసిన దేమనిన శ్రుతి ప్రతిపాదితమగు అద్వితీయ సర్వాధిష్ఠాన అఖండ బ్రహ్మ స్వరూపమును "అహం—నేనే" యని తెలిసికొని స్వానుభవమునొందుట. దీనినే మహావాక్యము బ్రహ్మజ్ఞానానుసంధానములకు "అహం బ్రహ్మాస్మి" అని చెప్పుచు శిష్యబోధకు "తత్త్వమసి" అని గూడ తెలుపుచున్నది కావున జిజ్ఞాసువు బ్రహ్మ లక్షణములను బాగుగ గుర్తించిన యెడలగదా, యిట్లు చేయ సాధ్యమగును! లేనిచో బ్రహ్మానుసంధానమునకు వీలుపడదు. ఏలయన "సోయందేవదత్తః" అను వాక్యమందు ఆ దేవదత్తుడే యీ దేవదత్తుడు అను అర్థగ్రహణమునకు మొదట ఆ దేవదత్తుని స్వరూప లక్షణములు బాగుగ తెలిసియున్నగాని ఆ దేవదత్తుడు ఈ దేవదత్తుడని తెలిసికొనుటకు సాధ్యపడదుగదా! అసలు దేవదత్తుని స్వరూపమే తెలియని యెడల లక్షణచే నెంత భాగ త్యాగముచేసినను ఆ దేవదత్తుడే యీ దేవదత్తు డని తెలిసికొనుటకు సాధ్యముకాదుగదా! కావున ఇంతవరకును మనము పరిపరివిధముల నిరూపించిన బ్రహ్మలక్షణముల నన్నిటిని జ్ఞానాభ్యాసకుడు మరువక హృద్గోచరముగ నుంచుకొనవలెను. ఇట్లే తన సత్య స్వరూపమగు ప్రత్యగాత్మ స్వరూపలక్షణములను తన అంతఃకరణోపాధి ధర్మలనుండి జ్ఞానపూర్వకముగ విడదీసి కేవల తన సాక్షి చైతన్య బింబరూప మును మాత్రము గ్రహించి ఆభాసుడగు ప్రతిబింబుని జ్ఞానపూర్వకముగ త్యజించి, అనగా ఈ ఆభాసాంతఃకరణ ధర్మములతోడ తన కెట్టి వాస్తవ

సంబంధములేదని నిశ్చయముగ గ్రహించి అప్పుడు తన పరమార్థ సత్య స్వరూపమగు తాను, అనగా నేను, "అహం" ఆ సర్వాధిష్ఠానమగు అఖండ పరిపూర్ణ బ్రహ్మయు ఒక్కటియే యను నిశ్చయమునొంది తత్స్వానుభవము నకుగాను స్వస్వరూప ఆత్మయ సాక్షాత్కారపర్యంతము శ్రవణ మనన నిది ధ్యాసనాద్యభ్యాసములను ప్రీతి నిశ్చయములతో జ్ఞానాభ్యాసకుడు ఆచరించు చుండవలయునని శాస్త్రము తెలుపుచున్నది. ఇట్టి అభ్యాస పాటవములచే కాల క్రమమున అట్టి అభ్యాసలాభము ముముక్షువునకు గోచరించుచు, తన ప్రారబ్ధానుసార సుఖదుఃఖ ఫలభోగములను లీలామాత్రముగ ననుభవింప గలుగుచు, తన అనుభవములను పొందుచుండును ఇట్లు నిర్లిప్తతలో నొందు తన ప్రారబ్ధ కర్మ ఫల విషయ భోగములు వేయించిన విత్తనములవలె నిర్వీర్యములై యీ అభ్యాసకునకు సంసార భావి ప్రతిబంధమును కలిగింప జాలనివగును. అందుచే ఈ జ్ఞానాభ్యాసకునకు మిగులునది యేదియనిన, తన ప్రారబ్ధమొక్కటియే. ఎంత జ్ఞానాభ్యాసకునినైనను ఈ ప్రారబ్ధ క్షయాంతము వరకును వ్యవహారము బాధితానువృత్తితో నుండినదగుచు, ఘటమునిష్పన్న మైనను, మరికొంతకాలము తానుగనే కులాలుని చక్రము (అనగా కుమ్మరిసాన) తిరుగుచున్నట్లువర్తించుచు, ప్రారబ్ధాంతమందు విదేహముక్తితో నివర్తించును.

అద్వైత సిద్ధాంతమును సత్సిద్ధాంతముగ గ్రహించుటకు బ్రహ్మ జ్ఞానాభ్యాసకునకు ఒక్క శ్రుతి వాక్య పరమతాత్పర్యమే ప్రమాణముగాని యితర ములు కాజాలవు. యుక్తి అనుభవ నిరూపణములు తీసికొనబడునపుడు శ్రుతి పరమతాత్పర్యము నిరూఢిచేయుటకు సహకరించువానినే తీసికొనవలయునుగాని విపరీతయుక్త్యనుభవములనుబట్టి, సిద్ధాంతమును మార్చగూడదు. మారుటకును వీలులేదు. ఏలయన శ్రుతివాక్యము పరమప్రమాణము. శ్రుతియన్నను వేద మన్నను, శాస్త్రమన్నను ఇవియన్నియు పర్యాయపదములుగ గ్రహింప వలయును. ముముక్షుజిజ్ఞాసువు దేనినెట్లు తెలిసికొనవలయును? దేనినెట్లు చేయవలయును? అను సంశయమునకు మోక్షశాస్త్రమగు గీతల యందు, "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ" అని శ్రీకృష్ణభగవానులే

తెలుపుచున్నారు. ఇంకను ఈ శ్రుతిప్రమాణమునుగురించి రారాజగు శ్రీరామచంద్రమూర్తికి తత్త్వోపదేశము చేయునప్పుడు యోగవాసిష్ఠమందు "శ్రుతి వాక్యమను స్మృత్యనస్వతః ప్రకటీకృతమ్" అనగా "ఇదియంతయు నేను శ్రుతి వాక్యము ననుసరించి నీకు తెలుపుచున్నాడనుగాని, నా స్వంతమాటలుగా" వని భగవద్రూపు డగు వసిష్ఠమహాముని తెలుపుచున్నారు. ఇంకను శ్రుతి ప్రామాణ్యమును గురించి—

శ్లో॥ పాషాణప్లవనం చాపి సిద్ధ్యేత్కాల విపర్యయే ।
నక్వచిచ్ఛ్రుతి వాక్యానాం ప్రామాణ్యంతు విహన్యతే ॥

అనగా కాలవైపరీత్యముచేత ఒకానొక సమయమున రాళ్ళు జలమునందు తేలినను తేలవచ్చునుగాని శ్రుతివాక్య మెప్పటికిని అప్రమాణమగుటకు వీలు లేదని శ్రీశంకరభగవత్పాదులు తెలుపుచున్నారు. కావున బ్రహ్మజ్ఞానాభ్యాసకునకు శ్రుతివాక్య పరమతాత్పర్యమును బాగుగ గ్రహించి స్వానుభవమునకుగాను నిరంతరానుసంధానాభ్యాసాదుల నాచరించుట యావశ్యకము. శ్రుతి వాక్య మహిమ యిట్టి మహత్తరమైనది. జీవునకు తాను అనాది అజ్ఞానముచే మరచిన తన పరమార్థ సత్యస్వరూపమును తెలుపునట్టిది, తన నిత్య నిరతిశయ సుఖమునొసగునట్టి శాస్త్రమిది యొక్కటియే. తక్కిన విద్యలు జీవునకు తాత్కాలిక పరిమిత సుఖము నీయగలిగినవే గాని, నిత్యనిరతిశయ సుఖము నీయజాలవు. శ్రుతివాక్య పరమ తాత్పర్యబోధ జీవ బ్రహ్మైక్యానుసంధానమే. అనగా జీవపరమాత్మలు ఒక్కటియేగాని భిన్నములుగావని తెలుపుటయే శ్రుతి పరమతాత్పర్యము ఎప్పుడు ఎవరైనను ఈ బ్రహ్మమునందును, విద్వాంసుడైన తనయందును కొంచెమైనను భేదమును తలంచుచుండునో యట్టి సాధకుడు భయమును పొందువాడగుచున్నాడు. అని— "యదాహ్యేవైష ఏతస్మిన్నుదరమన్తరం కురుతే, అథతస్యభయంభవతి" అని శ్రుతివాక్యము తెలుపుచున్నది. కావున బ్రహ్మజ్ఞానాభ్యాసకునకు తన పరమార్థ స్వరూపమగు ప్రత్యగాత్మయు స్వశరీర సర్వాధిష్ఠానమగు పరమాత్మయు నొక్కటియే యని తెలిసికొని స్వానుభవమునకు నిరంతరానుసంధానాదులు

చేయుచుండుట ఆవశ్యకము ఈ ఆత్మజ్ఞానమును జీవుడు తన శాస్త్రీయ వివేకముచే నొకసారి పొందినయెడల తాను నిత్యనిరతిశయ సుఖస్వరూపు డగుచు దుఃఖమనునది తిరిగి యెన్నటికిని పొందడు—పొందుటకు వీలులేదు. కావున బ్రహ్మజ్ఞానాభ్యాసకులకు అనుసంధాన గ్రహణ సౌలభ్యమునాలోచించి అచటచటి శ్రుతి స్మృతి వాక్యముల గ్రహించి యనుసంధాన శ్లోకరూపంబుల రచించినాడను. కాన జిజ్ఞాసువులు ఈ శ్లోకార్థములను బాగుగ హృద్గోచరము చేసికొని బ్రహ్మానుసంధానాద్యభ్యాసాదుల నాచరించుచు తల్లాభమునుబడయు దురుగాక ! జ్ఞానాభ్యాసకుడు తన పరమార్థ సత్యస్వరూపమును—

శ్లో॥ జ్ఞానమాత్ర స్వరూపోహం జ్ఞాతృజ్ఞేయవివర్జితః ।
అఖండ పరిపూర్ణోహం పరమాత్మాహమచ్యుతః ॥

శ్లో॥ చిదాకాశ స్వరూపోహం జ్ఞానమాత్ర స్వరూపతః ।
అఖండ పరిపూర్ణోహం నామరూప వివర్జితః ॥

శ్లో॥ అఖండ పరిపూర్ణోహం కర్తృత్వాది వివర్జితః ।
నిత్య స్సర్వగతస్థాణు రచలోహం సనాతనః ॥

శ్లో॥ చిదాకాశ స్వరూపోహం ప్రత్యగాత్మాహమవ్యయః ।
అద్వితీయం పరంబ్రహ్మ సర్వదా దహరే స్థితః ॥

అని సర్వదా యిట్లు మనోగోచరము గావించుకొని అనుసంధానాదుల నభ్యసించుచుండుట యావశ్యకము. బాగుగ శాస్త్రబుద్ధితోడ విమర్శించినయెడల జీవునకు దృశ్యమునందు కలుగుచున్న యీ నేను, నాది, అను ప్రతీతులకు వాస్తవకర్త యెవరునూ కనబడరు. ఐనను జీవుని ప్రారబ్ధ కర్మఫల భోగము నకుగాను కల్పితమైన యీ రెండు ప్రతీతులతోడనే సమస్త లోకానుభవము లును జరుగుచున్నవి. ఈ రెండునూ లేనిచో జీవునకు లోకానుభవమనునదే యుండదు. కావున ప్రపంచమున నేను, నాది, యను అహంకార మమకా రానుభవములు జ్ఞాని, అజ్ఞానులిరువురకునూ యుండును. కాని స్వశరీర

జగన్మిథ్యాత్వమును, తన పరమార్థ సత్య స్వరూపమును బాగుగ గ్రహించి ప్రీతి నిశ్చయములనొందిన బ్రహ్మజ్ఞానాభ్యాసకునకు, యీ నేను, నాది, అని తనను తన ప్రారబ్ధ బలానుసారమున తోచుచు, సుఖదుఃఖానుభవములనొందు నపుడెల్ల యీ నేను, నాది యను తన అనుభవములను చిత్రముగ దలచు చుండును. ఏలనన యీ రెండునూ తన ప్రారబ్ధకర్మ ఫలానుభవముకుగాను, కల్పితములై పరమార్థ వాస్తవమున నెంతమాత్రము లేనట్టివైనను యీ నేను, నాది, యను ప్రత్యయములతోడనేగదా నాయొక్క శరీరధారణా వ్యవహార ములతో నా ప్రారబ్ధఫలమును క్షయింపజేసుకొనవలయునుగాని వేరు మార్గము లేదుగదా—కల్పితములైనను వీని బల మెట్టిది? యని లోన తలచుచుండును. వాస్తవమున నివి నాకు శత్రుసమానములైనను వీనిని దుష్టులగు తప్పనిసరి బంధువులలాగున, నేను అనుభవింపవలయునేగాని, వీరు వాస్తవమున నా క్షేమముగోరు బంధువులుగారు. అయినను అత్యంతసన్నిహిత బంధువులని తలంచుచు తన వ్యవహారానుభవములన్నిటికి, వీటిని సాధనములుగగైకొని నిర్లిప్తుడై యథోచితముగ ప్రారబ్ధానుసరణమున తనజీవానుభవములను జేయుచు, పరమార్థమున తన స్వస్వరూపధ్యానాదుల ప్రీతితోడ నభ్యసించుచుండును.

జిజ్ఞాసువులనిత్యానుసంధానమునకుసులభసాధ్యమగునట్లు వేదాంతతత్త్వ సారమును సంగ్రహముగ శ్లోకరూపంబున నీ క్రింద నిరూపించుచున్నాడను.

## తత్త్వ స్తోత్రమ్

1. శ్లో॥ ఆత్మా సర్వగతశ్శాన్తో నిరవద్యో నిరాకృతిః ।
పుణ్యపాపాది రహితో మహాకాశ ఇవస్థితః ॥

2. ,, భ్రాన్తిమాత్ర మిదం విద్వన్ సర్వమాత్మని కల్పితమ్ ।
అధిష్ఠానే పరిజ్ఞాతే స్వప్నవత్ పరిలీయతే ॥

3. ,, చిదాకాశ స్వరూపోహం సంవిన్మాత్రైక రూపవాన్ ।
నిత్యస్సర్వగతః స్థాణు రచలో (హం) యం సనాతనః ॥

4. ,, పరంజ్యోతి రహం రూపం తిష్ఠామ్యచలవత్సదా ।
నకర్తాహం న భోక్తాహం చిదాకాశ స్వరూపవాన్ ॥

5 ,, చిదాత్మనిపరిజ్ఞాతే సర్వం శూన్యం భవేదిదమ్ ॥
దీర్ఘస్స్వప్న మిదం విశ్వం రజ్జ్వాం సర్పఇవోదితమ్ ॥

6. ,, చిదేవాహం చిదేవత్వం చిదేవ భువనత్రయమ్ ।
చిదేవ పఞ్చభూతాని చితోఽన్యన్నహి కించన ॥

7. ,, కర్తా భోక్తేతి విజ్ఞానం విద్ధి సర్వం భ్రమోదితమ్ ।
విషయ వ్యసనం త్యక్త్వా తిష్ఠేదాత్మనికేవలే ॥

8. ,, చిదాకాశ స్వరూపోఽహం సచ్చిదానన్ద లక్షణః ।
నిర్గుణశ్చ నిరాకారో నిష్క్రియ స్సఙ్గవర్జితః ॥

9. ,, అధిష్ఠానేపరిజ్ఞాతే సచ్చిదానంద లక్షణే ।
అహంకర్తాహ్యహం భోక్తా ఇతి భ్రాంతిర్నివర్తతే ॥

10. ,, విద్దిత్వాం ప్రత్యగాత్మానం పరమాత్మ స్వరూపిణమ్ ।
సర్వాత్మాహ్యహమేవాస్మి మదన్యన్నాస్తికించన ॥

11. ,, త్యక్త్వా బాహ్యమిదం దేహం తత్త్వమస్యాది చిన్తనాత్ ।
విద్ధిత్వాం ప్రత్యగాత్మానం పరమాత్మాన మవ్యయమ్ ॥

12. ,, తత్త్వసారమిదం స్తోత్రం సర్వకల్యాణ భాజనమ్ ।
వేదవత్సర్వదా ధ్యేయం ముముక్షుజ్ఞానసాధనమ్ ॥

13. ,, తత్త్వసార మిదం పుణ్యం మోహద్రామకృతం శుభం ।
యఃపఠేత్సతతం భక్త్యా స సుఖీ తత్త్వవిద్భవేత్ ॥

ఈ విధంబున జీవుడు తానుగ తెలిసికొనునట్టి పరమాత్మయే బ్రహ్మ యనియు, అఖండ స్వరూపసుఖమనియూ ఆనంద స్వరూపుడనియు తెలియ

బడుచున్నాడు. ఈ ఆనంద స్వరూపుడను "అహం" నేనే అని తెలిసికొనిన విద్వాంసుడు, సర్వభయ విముక్తుడగుననియూ అనగా దేనివల్లనుండి భయము నొందడని "ఆనందం బ్రహ్మణో విద్వాన్, నబిభేతికుతశ్చనేతి" అను శ్రుతి వాక్యము తెలుపుచున్నది. కావున ముముక్షువు సంసార దుఃఖభయమునుండి శాశ్వతముగ విముక్తుడగుటకు ఆత్మను దెలుపునట్టి యీ తత్త్వజ్ఞానము, ఆత్మానుసంధానములు ఆవశ్యకమగుచున్నవి.

## ఆ త్మా ష్ట క మ్

1. శ్లో॥ ఏకతత్త్వఘనాభ్యాసాత్ దృశ్యేఽదృశ్యపదం గతే ।
చిత్తం హ్యచిత్తతాం ప్రాప్య బ్రహ్మాకారేణ భాసతే ॥

2. ,, అహం సర్వమిదం విశ్వం స్వప్రకాశేన భాసతే ।
ఏకలిఙ్గ మహారూపః పరమాత్మాహమచ్యుతః ॥

3. ,, అఖణ్డానన్ద బోధోఽహ మసఙ్గోహ్యవికారవాన్ ।
సత్యజ్ఞానానన్త రూపః పరమాత్మాహమచ్యుతః ॥

4. ,, పూర్ణస్యపూర్ణమాదాయ అఖణ్డ పరిపూర్ణవాన్ ।
చిద్ఘనానన్ద రూపోఽహం పరమాత్మాహమచ్యుతః ॥

5. ,, చిదాకాశ స్వరూపోఽహం దృశ్యదర్శనవర్జితః ।
అహం సర్వమిదం విశ్వం పరమాత్మాహమచ్యుతః ॥

6. ,, కార్యకారణరూపస్సన్ సర్వాధిష్ఠాన మద్భుతః ।
శాన్తదేహ చమత్కారః పరమాత్మాహమచ్యుతః ॥

7. ,, నాహం భోక్తా న కర్తా చ న బాధ్యో న చ బాధకః ।
అద్వితీయం పరంజ్యోతిః పరమాత్మాహమచ్యుతః ॥

8. ,, ఆత్మాష్టక మిదం పుణ్యం మోహన్నామ కృతం శుభమ్ ।
యః పఠేత్సతతం భక్త్యా విజ్ఞాన ఘనవాన్ భవేత్ ॥

మోక్షార్థియైన జిజ్ఞాసువు సర్వదా యిట్లు ఆత్మానుసంధానము నాచరించు చుండవలయును. జ్ఞానాభ్యాసకునకు ఇదియే స్వప్రయత్నము. ఇట్టి స్వప్రయత్నాభ్యాసాదులే జీవుని నుద్ధరించుటకు సాధనము కాని తక్కినవేవియునూ కాజాలవని శ్రీ వసిష్ఠభగవానులు :—

శ్లో॥ న దైవం న చ కర్మాణి న ధనాని న బాంధవాః ।
శరణం భవ భీతానాం స్వప్రయత్నాదృతే నృణామ్ ॥

అనగా సంసారమునుండి భయపడిన మనుజులకు స్వప్రయత్నమే సంరక్షకమగునుగాని, అది వినాగా దైవముగాని, కర్మలుగాని బంధువులు గాని రక్షకులు గానేరరు అనిన్నీ, అట్టి స్వప్రయత్నమెట్లుండవలె ననిన—

శ్లో॥ అయమేవాహమిత్యస్మిన్ సంకోచే విలయంగతే ।
సమస్తభువన వ్యాపీ విస్తార ఉపజాయతే ॥

అనగా ఈ దేహమే నేను అనునట్టి అల్పస్వభావము నశింపగా సమస్త భువనములు వ్యాపించునట్టి విస్తారమగు మహాసత్తా పరిపూర్ణ స్వరూపము తనకు కలుగుననియూ యింకనూ పరిమితంబగునట్టి యీ దేహమే నేను, అనునట్టి రాత్రి అనగా అజ్ఞానము క్షయమునొందగా స్వాత్మాభిన్నమును, స్వగతంబును, విస్తారంబును అగునట్టి ఆత్మతత్త్వజ్ఞానము కలుగుననియూ తెలుపుచున్నారు. మరియునూ ఈ ఆత్మధ్యాన మెట్లుండవలె ననిన

శ్లో॥ నాహం క్షేయమితిధ్యాయం స్తిష్ఠత్వమచలః సదా ।
అనంతాకాశ సంకాశ హృదయో హృదయేశ్వరే ॥

శ్లో॥ ఆత్మనో జగతశ్చాంతః ద్రష్టృదృశ్య దశాంతరే ।
దర్శనాఖ్యే స్వమాత్మానం సర్వదా భావయన్ భవ ॥

అనగా నే నీ శరీరమునుకాను అని ధ్యానించుచు అనంతంబగు నాకాశంబులాగున నిర్మలంబగు హృదయంబు కలవాడవై హృదయేశ్వరుండగు పరమాత్మయందు నిశ్చలంబుగ నుండుము—ఇంకనూ చూచునట్టివాడగు నాత్మకునూ చూడబడునట్టి జగమునకున్నూ నడుమ చూపు అనగా తెలివియను ఏ జ్ఞానపదార్థముగలదో, అట్టి జ్ఞానరూపుడగు పరిపూర్ణాత్మను నేనే యని యెల్లప్పుడును భావించుచుండుము అని శ్రీరామచంద్రమూర్తికి వసిష్ఠభగవాను లుపదేశించుచున్నారు—ఇంకనూ యిట్లు తెలుపుచున్నారు.

శ్లో॥ యావదన్యన్నసంత్యక్తం తావత్సామాన్యమే వహి ।
వస్తునా సాద్యతే సాధో స్వాత్మలాభేతుకాకథా ॥

శ్లో॥ ఆత్మావలోకనార్థంతు తస్మాత్సర్వం పరిత్యజేత్ ।
సర్వం హ్యేతత్పరిత్యజ్య యావచ్ఛిష్టం పరం పదమ్ ॥

అనగా శ్రీరామచంద్రమూర్తితో ఓ సాధువా! రజత సువర్ణాది సామాన్యవస్తువులే (వ్యవహారమునందు) యితర వస్తువును (అనగా ధనాదులను) విడుచువరకు అనగా యిచ్చువరకునూ, లభించుటలేదు—ఆత్మలాభ విషయమై యేమి చెప్పవలయును? కావున ఆత్మదర్శనమునకై సర్వమును (జ్ఞానపూర్వకముగ) విడువవలయును. స్వశరీర సర్వదృశ్యమును విడువగానే దృగ్రూపము అనగా ఏ జ్ఞానము మిగులునో అదియే పరమాత్మయని యెరుంగుము—అని దృఢపరచి చెప్పుచున్నారు.

## చిదాకాశస్తోత్రము

1\. శ్లో॥ జ్ఞానానన్దఘనం నిత్యం నిర్మలాకాశ సన్నిభం ।
ఆధారం సర్వభూతానాం చిదాకాశముపాస్మహే ॥

2\. ,, చిదాకాశస్వరూపోహం సచ్చిదానన్దలక్షణః ।
అఖణ్డపరిపూర్ణోహం పరమాత్మాహమచ్యుతః ॥

3\. ,, చిదాకాశస్వరూపోహం నిష్క్రియోనిరహంకృతిః ।
నిత్యస్సర్వగతః స్థాణు రచలోహం సనాతనః ॥

4\. ,, అఖణ్డపరిపూర్ణోహం నిర్మలస్ఫటికప్రభః ।
అఖణ్డపరిపూర్ణోహం పరమాత్మాహ మచ్యుతః ॥

5\. ,, చిదాకాశస్వరూపోహం సర్వసఙ్గవివర్జితః ।
నిరస్తవిషయాకారః పరిపూర్ణ మివామ్బరం ॥

6\. ,, చిదాకాశస్వరూపోహం జ్ఞాతృజ్ఞేయవివర్జితః ।
జ్ఞానమాత్రస్వరూపోహం పరమాత్మాహమచ్యుతః ॥

7\. ,, చిదాకాశస్వరూపోహం నిర్గుణోసుణవానివ ।
అకర్తాహమభో క్తాహం సర్వసఙ్గవివర్జితః ॥

8\. ,, చిదాకాశస్వరూపోహం నామరూపవివర్జితః ।
భ్రాన్తిమాత్రమిదం విశ్వం కల్పితం చిత్తవిభ్రమాత్ ॥

9\. ,, చిదాకాశస్వరూపోహం సర్వసంకల్పవర్జితః ।
నిరస్తవిషయాకారః పరిపూర్ణసుఖాత్మకః ॥

10\. ,, చిదాకాశస్వరూపోహ మాశాపాశవివర్జితః ।
అకర్తాహమభో క్తాహం నిర్గుణస్సఙ్గవర్జితః ॥

11\. ,, చిదాకాశస్వరూపోహం ప్రత్యగాత్మాహమవ్యయః ।
అద్వితీయం పరంబ్రహ్మ పరమాత్మాహమచ్యుతః ॥

12\. ,, చిదాకాశస్వరూపోహం నిత్యోముక్తశ్చబుద్ధిమాన్ ।
అఖణ్డపరిపూర్ణోహం సచ్చిదానన్దలక్షణః ॥

13\. ,, జ్ఞానమాత్రస్వరూపోహం సచ్చిదానన్దలక్షణః ।
అఖణ్డపరిపూర్ణోహం జ్ఞాతృజ్ఞేయవివర్జితః ॥

14. ,, చిదాకాశస్వరూపోఽహం నిర్మలాకాశవత్సదా ।
అఖణ్డపరిపూర్ణోఽహం సర్వదా దహరేస్థితః ॥

15. ,, చిదాకాశస్వరూపోఽహం నిర్మలాకాశవత్సదా ।
సర్వవ్యాపీ సర్వధారీ సర్వదా దహరేస్థితః ॥

16. ,, చిదాకాశస్వరూపోఽహ మఖణ్డస్సఙ్గవర్జితః ।
ప్రత్యగాత్మాస్వయంజ్యోతిః సర్వదా దహరేస్థితః ॥

17. ,, చిదాకాశమిదం స్తోత్రం మోహన్రామసుధీకృతమ్ ।
యః పఠేత్సతతం భక్త్యా ససుఖీముక్తిమాన్ భవేత్ ॥

ఈ చిదాకాశరూపమైన, విశుద్ధ జ్ఞానము నెట్లు అనుసంధానము చేయవలెననిన :—

శ్లో॥ పశ్యన్, శృణ్వన్, స్పృశన్ జిఘ్రన్నశ్నన్గచ్ఛన్స్వపన్ శ్వసన్ ।
ప్రలపన్, విసృజన్, గృహ్ణన్, శుద్ధసంవిన్మయోభవేత్ ॥

అనగా, చూచుచును, వినుచును, స్పృశించుచును, ఆఘ్రాణించుచును, భుజించుచును, నడుచుచును, నిద్రించుచును, నిట్టూర్పువిడుచుచును మాటలాడుచును, నడుచుచును, గ్రహించుచును, ఎల్లప్పుడునూ సర్వమునకు సాక్షియగు, విశుద్ధ జ్ఞాన స్వరూపుండనని (అనగా చిదాకాశస్వరూపుడనని) భావించుచుండవలయును. అని వసిష్ఠమునీంద్రులు శ్రీరామచంద్రమూర్తికి యుపదేశించుచున్నారు కావున నిది జ్ఞానాభ్యాసకులకు పరమోత్కృష్ట సాధనమని గ్రహించవలయును.

బ్రహ్మజ్ఞానాభ్యాసకులు, జ్ఞానస్వరూపమును బ్రహ్మవిద్యా సంప్రదాయమును తెలిసికొనుట యావశ్యకము. అందులకుగాను దీనిని గురించి తెలిపినట్టి, శ్రీ విద్యారణ్యవచనముల కొన్ని నిచట నుదహరించు చున్నాడను. అందు బ్రహ్మస్వరూపమును వారిట్లు నిర్వచనము జేయుచున్నారు.

శ్లో॥ జగద్భ్రమస్య సర్వస్యయదధిష్ఠానమీరితం ।
త్రయ్యంతేషు తదత్ర స్యాద్బ్రహ్మశబ్దవివక్షితమ్ ॥

అనగా జగత్తనియెడి సమస్తభ్రమకును, ఉపనిషత్తులయందు యేది అధిష్ఠానమనిజెప్పబడుచున్నదో అట్టి అఖండ పరిపూర్ణ చైతన్యమే బ్రహ్మశబ్దముచేత, చెప్పబడుచున్నదని తెలుపుచున్నారు.

మరియును బ్రహ్మాభ్యాసకుడు తన ప్రారబ్ధానుసారమున నొందవలసిన సుఖదుఃఖ భోగానుభవములను, తన భ్రాంతి నివర్తకోపాయముగ, నిట్టి జ్ఞానముతో ననుభవింపవలయునని,

శ్లో॥ యదభావినతద్భావి భావిచేన్నతదన్యథా ।
ఇతి చింతా విషఘ్నోఽయం బోధో భ్రమనివర్తకః ॥

అనగా తన ప్రారబ్ధమునసనుసరించి యేది జరుగదో (అనగా వచ్చుటకు వీలు లేదో) యది కానేరదు అనగా రాదు. ఏది జరుగవలసియున్నదో, అది కాకమానదు. (అనగా ఆపుటకు వీలుకాదు) ఇట్టి నిశ్చయము, మానవునకు గలిగెడి సంసార దుఃఖములనెడి విషమును బోగొట్టును అని తెలుపుచున్నారు. కావున జ్ఞానాభ్యాసి, ప్రారబ్ధానుసారమున తాననుభవించవలసిన, సుఖ, దుఃఖ భోగములెట్టివైనను, యిట్టి నిశ్చయముతోడ నుండి, తన వ్యవహారములను, నిర్వర్తించుచుండవలయును. అప్పుడు తన మనో నిశ్చయజ్ఞానమువలన, తాను అనుభవించవలసిన భోగములందు తనకు సుఖ దుఃఖములు క్షీణించుచుండును

ఇంకనూ యిట్టి విద్వాంసుడు సంసార దుఃఖము నొందడని---

శ్లో॥ మాయామయత్వం భోగస్య బుద్ధ్వాఽఽస్థాముపసంహరన్ ।
భుంజానోపిన సంకల్పంకురుతే వ్యసనం కుతః ॥

అనగా విద్వాంసుడు తన ప్రారబ్ధకర్మయొక్క ఫలభోగములయందు, ఆసక్తి నొందక, తన కర్మఫలముల ననుభవించుచు, సంకల్పములను చేయకుండును, గావున అట్టి మహనీయులకు సంసారదుఃఖముండనేరదని, శ్రీ విద్యారణ్యులు తెలుపుచున్నారు. కాని ప్రారబ్ధఫలము ననుభవించుట జ్ఞానులకునూ తప్పదు ఏలనన "నాభుక్తం క్షీయతేకర్మకల్పకోటి శతైరపి" అనిన్నీ "ప్రారబ్ధం భోగతోనశ్యేత్" అనగా కర్మఫలము కోటిజన్మలకైనను, అనుభవమువలన గాని క్షీణించదనియూ, ప్రారబ్ధము, కర్మఫలానుభవమువల్లగాని నశించ దనియూ పై వచనములు స్పష్టముగా తెలుపుచున్నవి కావున లోగడ తెలిపినటుల, తీవ్రముముక్షువులగు జ్ఞానాభ్యాసకులుగూడ, వారి ప్రారబ్ధమును, నీ ప్రపంచమున ననుభవించుట మూలముననే, కర్మఫలక్షయము నొందవల యునుగాని వేరుమార్గము సామాన్యముగలేదు. కావున జ్ఞానులగువారుగూడ, వారి, వారి ప్రారబ్ధములననుసరించి, కర్మ క్షయమునకుగాను యీ ప్రపంచ మున వివిధ వ్యవహార పరిస్థితులలో నుండుదు కాని యిట్టి మహనీయులు, వారి, వారి ప్రారబ్ధానుసరణమున యెట్టి సుఖదుఃఖఫలభోగానుభవముల జేయుచు నెట్టి వ్యవహార పరిస్థితులలోనున్ననూ, అట్టివన్నిటినీ, వారి ప్రారబ్ధ క్షయమునకుగాను నిర్లిప్తతతో నాచరించుచుందురు. వీరి భోగానుభవములు భిన్న, భిన్నములుగానున్నను, వీరి జ్ఞానముమాత్రమందరికినీ యొక్కటిగనే యుండును. వారి పరిస్థితులనుబట్టి. వారి జ్ఞానమందు యెట్టి మార్పునూ కలుగదు— కలుగుటకు వీలులేదు — ఏలనన బ్రహ్మజ్ఞానమనునది, సర్వదా అద్వితీయము, ఏకస్వరూపముకాని మారుటకు వీలులేదు. జ్ఞానాభ్యాసకులకు యీ బ్రహ్మవిద్యా సంప్రదాయమునుగూడ తెలిసికొనుట యావశ్యకము. అందులకుగాను దీనినిగురించి శ్రీ మా గురువర్యులు నాకు జెప్పిన శ్లోకమును నిచట నుదహరించుచున్నాడను—

శ్లో॥ కృష్ణోభోగీ, శుకస్త్యాగీన్నృపౌ జనకరాఘవౌ ।
వసిష్ఠఃకర్మకర్తాచ, పర్ణ్కుటీ పిశితాశనీ ॥
వేశ్యారతో వామదేవః సప్తైతే జ్ఞానినస్సమాః ।

అనగా వీరందరునూ నిట్టి, అత్యంత వివిధ పరిస్థితులలోనున్ననూ, వీరందరి జ్ఞానముమాత్రము సమానము అనగా ఏకరూపమని, పై శ్లోకము తెలియ జేయుచున్నది.

సర్వోపాధివినిర్ముక్త అఖండ పరిపూర్ణ జ్ఞానస్వరూపమే, వాస్తవమున (బ్రహ్మ) దేవుడని జ్ఞానాభ్యాసకుల మనోదార్ఢ్య నిశ్చయములకుగాను మహేశ్వరుడు శ్రీ వసిష్ఠభగవానుల కుపదేశించిన వచనముల, నిచట నుదహరించు చున్నాడను :—

మహేశ్వర ఉవాచ :—

శ్లో॥ శృణుబ్రహ్మవిదాంశ్రేష్ఠ దేవార్చన మనుత్తమం ।
స దేవః పుండరీకాక్షో న చ దేవస్త్రిలోచనః ॥

శ్లో॥ నదేవోదేహ రూపోవా నదేవశ్చిత్త రూపకః ।
అకృత్రిమమనాద్యంతం, దేవనం దేవ ఉచ్యతే ॥

శ్లో॥ ఆకారాది పరిచ్ఛిన్నే మితేవస్తుని తత్కృతః ।
అకృత్రిమ మనాద్యంతం, దేవనంచిచ్ఛివం విదుః ॥

శ్లో॥ దేవఃకః స్యాదితిత్వేతత్ప్రథమం తావదుచ్యతే ।
తదేవ దేవశబ్దేన లభ్యతే తత్ప్రపూజయేత్ ॥

అనగా - బ్రహ్మవిదులలో శ్రేష్ఠుండవగునో మునీంద్రా ; దేవార్చన విధిని చెప్పుచున్నాడ వినుము. దేవుండనగా వాస్తవమున కమల పత్రాక్షుండుగాని, త్రినేత్రుండుగాని, దేహరూపుండుగాని, చిత్తరూపుండుగాని కానేరడు. ఇంక నేమనిన ; నుపాధిరహితంబును, ఆదిమధ్యాంతవర్జితంబును, పరిపూర్ణంబును నగు దేవనము అనగా జ్ఞానము, మాత్రమే దేవుడని చెప్పబడును. ఉపాధు లచే ఆకారాదుల పరిచ్ఛిన్నంబైనట్టి, పరిమితంబులగు వస్తువులందు దేవత్వ

మెటులనుండును? కావుననే, నిరుపాధికంబును, ఆద్యంతవర్జితంబగు జ్ఞానమె శివుడని వచింతురు. దేవుడన నెవ్వండు? అను ప్రశ్నకు మొదలు నిరూపణంబు జెప్పంబడియెను. అట్టి, పరిపూర్ణ జ్ఞానస్వరూపుండగు (బ్రహ్మ) దేవునినే, పూజింపవలయును, అని చెప్పగా (అపుడు) అట్టియెడ శాస్త్రము సగుణాకారమూర్తి పూజల నెందులకు విధించుచున్నదను సంశయమునకు:—

శ్లో॥ అజ్ఞాత శివతత్త్వానామాకారాద్యర్చనం కృతం ।
యోజనాధ్వస్యశక్తస్య క్రోశాధ్వాపరికథ్యతే ॥

అనగా యోజన దూరమునిన భయపడువానికి, క్రోశడు దూరమని కల్పించి చెప్పబడునటుల, నిట్టినిరాకారంబగు శివతత్త్వము నెరుంగనివారలకు సాకారము సందర్శనము విధింపబడియెనని చెప్పుచు వాస్తవమునన్నది, ఒక్క—

శ్లో॥ చిద్వ్యోమ్నైవకిలాఽస్తీహపారావార వివర్జితం ।
సర్వత్రాసంభవచ్చేత్యం కల్పాంతేషుచ శిష్యతే ॥

అనగా వాస్తవమున ఆద్యంతవర్జితంబును, పరిపూర్ణంబును, దృశ్యసంస్పర్శరహితంబును కల్పాంతములయందు శేషించునదియైనగు (బ్రహ్మ) చిదాకాశంబేకలదు అని — యింకనూ—

శ్లో॥ పూజాక్రమేషు సర్వేషు, దేహేగేహ పవిత్రకం ।
త్యాజ్యం దేహావబోధాత్మ, గ్రాహ్యం యత్నాత్పవిత్రకమ్ ॥

అనగా యీ దేహము శాస్త్రోక్త సంస్కారములచేతను, స్నానాచమనాదులచేతను, పవిత్రమైనదైననూ, యీ దేహమను గేహమును ఆత్మానుసంధానాదులయందు (పూజలయందును) ప్రయత్నముచే దీనినివిడచి దీనికి పవిత్రమగు సాక్షీచిత్ప్రకాశ రూపమును, యత్నముచే గ్రహింపవలయునని మహేశ్వరుడు తెలిపెను—

జ్ఞానాభ్యాసకుడు తనకు కలిగిన శాస్త్రబోధవలనను గురుబోధవలనను ఇంతవరకును మనము చేసిన విషయవివేచనములనుబట్టియు ముముక్షువునకు సత్యస్వరూపాను సంధానమైన యీచిదాకాశస్తోత్ర శబ్దార్థములను బాగుగ మనసునకు గోచరింపజేసికొని తన పరమార్థ రూపము స్వప్రకాశ అద్వితీయ, అఖండ, అసంగ చిదాకాశ రూపమగు పరిపూర్ణ జ్ఞానమే, యను నిశ్చయముతోనుండి, స్వానుభవమునకుగాను నిరంతర ప్రీతితో అనుసంధానాదుల చేయుచుండుట తన ముక్తికి సాక్షాత్ సాధనమని గ్రహింపవలయును. అనుసంధాన మనగా, ఒక విషయమునే ప్రీతి నిశ్చయ ములతో తిరిగి తిరిగి తన ఫలపర్యంతము అనుకొనుచుండుటయే. ఇట్లను సంధానము చేయుటకు — ముముక్షువు ఎంత ప్రయత్నించుచున్నను ఈ దృశ్యానుభవములందు తనకు కలుగుచున్న పరిమితాకార గురుత్వ కాఠిన్య ములు తన అనుసంధానమునకు ఆటంకము కలిగించుచుండును అందుకు గాను ఈ పరిమితాకార గురుత్వకాఠిన్యముల, అవాస్తవికత నిట్లు గ్రహింప వలయును. పరమార్థముగ జీవుడు మహాకాశమువలె సర్వవ్యాపకుడై అసంగుడై యున్నను తన స్వరూపమిప్పుడు ఘటాకాశ జలాకాశములవలె నుపాధిస్థితమై యున్నది. ఆ ఒక్కటైన మహాకాశమునే ఘటాకాశ మనియు, జలాకాశమనియు, ఆయా ఉపాధులనుబట్టి, వ్యవహరించు చున్నాము. ఐనను ఉపాధియున్న కాలములోను ఉపాధి నశించిన కాలమందుననుగూడ మహాకాశము ఒక్కటి కాని మహాకాశమునకు ఎప్పుడును పరిచ్ఛిన్నత యనునది వాస్తవముగ కలుగుటలేదు. కాని ఈ అఖండ మహాకాశమునే యుపాధులతో వ్యవహరించునప్పుడు మాత్రము ఆయా యుపాధినామములతో ఘటాకాశమని జలాకాశమని వ్యవహరించుచున్నాము. కావున ఇట్లు పరిమితాకారముగ వ్యవహరింపబడు మహాకాశమునకు ఎప్పుడును మార్పు కలుగుటలేదు. ఇట్లే జీవునికిగూడ ఈ అఖండ అద్వితీయ పరమాత్మనే, జీవాత్మయని వ్యవహరించుచున్నను వివేకియైనవాడు తన ఆత్మ యెల్లప్పుడును మహాకాశమువలె అఖండము

సర్వవ్యాపకమని గ్రహింపవలెను. ఇంకను సుఖత్వ కారిత్వములనుగురించి యిట్టివి తనకు ఉప్పురాళ్ళవంటివని తలంపవలయును. ఎట్లన, ఈ ఉప్పురాళ్లు ఎంత గట్టిగను పెట్టి ఆకారములలో నున్నను ఉప్పురాళ్ళన్నియు సముద్ర జలముకంటె వాస్తవముగ వేరు కావుగదా! ఆ సముద్రజలమునే మానవులు ఘనీభవింపజేసి వారి వ్యవహార ప్రయోజనములకు వాడుచున్నారేకాని మరే మియు కాదు. ఇట్లే జీవుడు తన వాస్తవ స్వరూపము మహాసముద్రజలము వంటిదని తెలిసికొని, యిప్పుడు తనకు కావలసిన తన వ్యవహార ప్రయోజ నమునకు అనుభవింపబడుచున్న యీ రాళ్లతుల్యమగు స్థూలశరీరము తాను గానని తెలిసికొని, తన సూక్ష్మశరీరమగు అంతఃకరణము లవణకణమువంటి దనియు వ్యవహార కల్పితమనియు గ్రహించి ముముక్షువు తన వాస్తవ స్వరూప గ్రహణమునకు ఈ లవణ శకలతుల్యమగు తన అంతఃకరణో పాధిని స్వప్రయత్నముతో చిదానంద మహాసముద్రమున ముంచినయెడల (అనగా తాను వాస్తవముగ అట్టివాడని అనుసంధానాదులను చేయగలిగిన యెడల) తనకిప్పుడు పరిమితాకార సుఖత్వకారిత్వములలో అనుభవముల నిచ్చుచున్న యీ అంతఃకరణమను లవణశకలము చిదానంద మహాసాగరమే యగును. ఇదియే మోక్షము, పరమ పురుషార్థము. ఈ విద్య వివేకియగు ప్రతి మానవునకును తన నిత్యనిరతిశయ సుఖప్రాప్తికి ఆవశ్యకము. సర్వ ప్రయత్నసాధ్యము అగుచున్నది.

కాని, లోకములందు, ఈ విద్యాలాభము, జీవునకు తన భోగముల నన్నిటినీ, అనుభవించిన పిమ్మట వార్ధక్యమందు అందరకును సాధారణముగ దానంతట నదియే వైరాగ్యమువలన కలుగుననియూ, ఇంకను ఈ మోక్షోపాయ విద్య యువకులు, గృహస్థులు అభ్యసింపవలసినది కాదనియూ, సాధారణ జనాభిప్రాయమున్నట్లు తెలియుచున్నది. ఇది సరియైనదికాదు. వివేకియైన ప్రతి మానవునకు తనకు నిత్యనిరతిశయ సుఖమునిచ్చు నీ విద్యను వారి వారి వయోవిశయమందు శక్తి సామర్థ్యములున్నప్పుడే వారి వారి వ్యవహార పదార్థాది లాభములు సంపాదించుచున్నట్లు, వారి వారి పరమార్థ

లాభమునుగూడ సంపాదించుటయే వివేకము. ఇది బ్రహ్మవిద్య. ఈ విద్య ఏజీవుడైనను తన శాస్త్రీయ జ్ఞాన శక్తి సామర్థ్య మనోబలములతో, సంపాదింపవగినదేకాని, దానంతట నది కలుగునది కాదు. వార్ధక్యమందు శక్తి సామర్థ్య మనోబలములు తగ్గుననుమాట వివేకులందరకును తెలిసిన విషయమే కావున వానియంతట నవియే అప్రయత్నముగ జీవునకు వార్ధక్యమందు కలుగునవి. వృద్ధియగునవి, చింతా దౌర్బల్యము భయములు తప్ప మరేమియు నుండవు. దీనినే "వార్ధకే వర్ధతే చిన్తా", "వృద్ధస్సన్ కింకరిష్యతి" అని శాస్త్ర వచనములు జీవునకు బోధించుచున్నవి. కావున, నీ యుత్కృష్ట విద్యను మానవుడు తన వయోబలము యున్నప్పుడే సాధింపవలసినది.

జ్ఞానాభ్యాసకులకు ఈ బ్రహ్మానుసంధాన మనునది సంగీత విద్య వంటిది. ఏలయన ఈ గాంధర్వవిద్యయంతయు ప్రధానముగ సప్తస్వరముల మీదనే ఆధారపడియున్నట్లు, ముముక్షువునకు ఈ బ్రహ్మవిద్య యంతయూ తన అనుసంధానాభ్యాసాదులతో ముఖ్యముగ బ్రహ్మలక్షణముల గ్రహణముమీదనే ఆధారపడియున్నది. గాయకశిఖామణులు వారి వారి నైపుణ్యము చొప్పున ఎంతకాలమైనను, ఆలాపన, పల్లవి, స్వరకల్పనల తోడనేగదా! వివిధ గానములచేసి సభ్యులను రంజింపజేయుచు, వారి చిత్తస్థాయిని కలిగించుచుందురు ఇట్లే బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు బ్రహ్మలక్షణములనే ప్రకారాంతరములుగ అనగా వివిధముగా అనుసంధానాభ్యాసములను చేయుచు తన వృత్తికి బ్రహ్మపదార్థమందు స్థైర్యమును కలిగించుకొనుచుండవలయును. సంగీత విద్వాంసుడు ఎంతస్వరకల్పనచేసినను సప్తస్వరములతోడనే చేయుచు పల్లవి అనగా (ఎందరో మహానుభావులు) అనునట్టి యేదో యొకవాక్యమునే తీసికొని గంటలకొలది. ఆ విషయమునందు సభ్యులకు చిత్తస్థాయి కలుగుటకుగాను ఎన్నోవిధముల గానముచేయుచుండుట అందరకునూ తెలిసిన విషయమే. ఇట్లే బ్రహ్మజ్ఞానాభ్యాసకులు వారివారి చిత్తమును బ్రహ్మాకారము పొందించుటకు ఆ బ్రహ్మలక్షణములనే వివిధముగ సతతము అనుసంధా

నాదుల చేయుచుండవలయును. ఇట్లు చేయుటయందు ఒక్కొక్క సమయమున నొక్క లక్షణమును, ప్రధానముగ పల్లవి వాక్యమువలె గ్రహించి సర్వమును దానియందే అన్వయించునట్లు బ్రహ్మానుసంధానములను శ్లోక రూపంబున రచించినాడను. కావున బ్రహ్మాభ్యాసకులు ఆ శ్లోకములలోని లక్షణ శబ్దములు, యిందులోనున్నవే, మరియొక శ్లోకమందున్నవే, యిదియంతయూ చెప్పినదే చెప్పుటవలె నున్నదియను సంశయమును జెందక, విమర్శపూర్వకముగ బాగుగ అర్థమును గ్రహించినయెడల ప్రతి ఒక్క శ్లోకమును అఖండ పదార్థ బ్రహ్మనిరూపణమును వివిధముగ అన్వయించుచు, అందువలన అభ్యాసకులకు చిత్తస్థైర్యము కలిగించుచు ఆత్మబోధను వృద్ధిజేయుచు, స్వాత్మాభిన్నముగ అనుసంధానమును తెలుపుచుండును.

అఖండత్వమనగా త్రివిధ పరిచ్ఛేదరహితత్వము. ఈ లక్షణము ఒక్క బ్రహ్మపదార్థమునకుతప్ప ఇతరములకు వర్తింపదు. ఆత్మయన్నను అఖండ పరిపూర్ణ పదార్థమన్నను జ్ఞానస్వరూపు డన్నను, పరిపూర్ణ చైతన్య స్వరూపుడన్నను జ్ఞానమన్నను చిదాకాశమన్నను సర్వ దృశ్యాధిష్ఠానమన్నను సత్యస్వరూపమన్నను ప్రత్యగాత్మయన్నను పరమాత్మయన్నను ఇవియన్నియు బ్రహ్మకే వర్తించునని గ్రహింపవలయును. దృశ్య శబ్దములతో స్వాత్మాభిన్నముగ బ్రహ్మానుసంధానమును చేయుచుండవలయును. శాస్త్రముగూడ నా బ్రహ్మను ఇట్లే యుపదేశించుచున్నది. దీనినే "ఆవృత్తిరసకృదుపదేశాత్" అను సూత్రము తెలుపుచున్నది. అనగా బ్రహ్మసాక్షాత్కారమునకు "పునః పునః" ఆ వృత్తియుండవలెనని యీ వచనము తెలుపుచున్నది. "పునః పునః" ఆవృత్తియనగా ఆ బ్రహ్మను గురించియే తిరిగి తిరిగి అనుకొనుచుండుట. ఇట్లు గావించుటకుగాను అఖండపరిపూర్ణ లక్షణములను తీసికొని నీ గ్రంథమున శ్లోకాష్టకమును వ్రాసినాడను—

1\. శ్లో॥ అఖణ్డపరిపూర్ణోహం సర్వోపాధి వివర్జితః ।
జ్ఞానమాత్రస్వరూపోహం సచ్చిదానన్ద లక్షణః ॥

2. ,, అఖణ్డ పరిపూర్ణోహం సర్వదృశ్య వివర్జితః ।
అధిష్ఠాన స్వరూపోహం సచ్చిదానన్ద లక్షణః ॥

3. ,, అఖణ్డ పరిపూర్ణోహం నామరూప వివర్జితః ।
నామరూపమిదం సర్వం కల్పితం చిత్తవిభ్రమాత్ ॥

4. ,, అఖణ్డ పరిపూర్ణోహం జ్ఞాతృజ్ఞేయ వివర్జితః ।
జ్ఞానమాత్ర స్వరూపోహం పరమాత్మాహ మచ్యుతః ॥

5. ,, అఖణ్డ పరిపూర్ణోహం సచ్చిదానన్ద లక్షణః ।
అహంసర్వమిదం విశ్వం పరమాత్మాహ మచ్యుతః ॥

6. ,, అఖణ్డ పరిపూర్ణోహం నిర్మలాకాశవత్సదా ।
నిత్యస్సర్వగతఃస్థాణు రచలోహం సనాతనః ॥

7. ,, అఖణ్డ పరిపూర్ణోహం జ్ఞానమాత్రస్వరూపతః ।
అకర్తాహమభోక్తాహం నిష్క్రియస్సఙ్గ వర్జితః ॥

8. ,, అఖణ్డ పరిపూర్ణోహం ప్రత్యగాత్మ స్వరూపతః ।
పరమాత్మా పరంజ్యోతిః సర్వదా దహరేస్థితః ॥

9. ,, పుణ్యాష్టకమిదం స్తోత్రం మోహన్రామ బుధోదితమ్ ।
యః పఠేత్ సతతం భక్త్యా ససుఖీజ్ఞానవాన్ భవేత్ ॥

జ్ఞానాభ్యాసకుడు సర్వదా యేదో యొక విధమున తన అఖండ పరిపూర్ణత్వమును స్వాత్మాభిన్నముగ అనుసంధానాదులు చేయుచు తాను, పరమార్థతః సర్వ వ్యాపకుడనని తన పరమార్థ స్వరూపమును నిట్లు గుర్తించుచుండవలయును "ఇందుగల నందులేనని, సందేహాముపలదు నేను, సర్వోపగతిన్, ఎందెందు వెదకిచూచిన; నందందే కలను నాదు మోహాము

తీఅస్" అని తన్ను తాను ఉపాధి వినిర్ముక్తముగ అఖండపరిపూర్ణ చైతన్య భావనను చేయుచుండవలయును.

పరమార్థ వాస్తవముగ నీ బ్రహ్మాభ్యాసకుడు ఆత్మ స్వరూపుడేగదా! ఇట్టివాడు తన సత్యస్వరూపమును సర్వదా భావించుచుండుటచే, అనగా అనుసంధానాదులను చేయుచుండుటవలన, జీవునకు వ్యవహారము నశించునని తెలుపుచు, అట్టి భావన యెట్లుండవలెననిన—

శ్లో॥ నాహం దుఃఖీ నమే దేహో బన్ధః కస్యాత్మనిస్థితః ।
ఇతిభావాను రూపేణ వ్యవహారేణ ముచ్యతే ॥

అనగా "నేను దుఃఖినికాను, నాకు దేహములేదు. (ఆత్మ స్వరూపుడనైన) నాకు బంధము ఎక్కడిది? ఇటువంటి భావన ననుసరించి (అనగా నిట్టి భావన చేత) జీవుడు వ్యవహారమునుండి విడువబడగలడు. అనగా సంసారవిముక్తు డగునని శ్రీ వసిష్ఠ భగవానులు తెలుపుచున్నారు. కావున జిజ్ఞాసువులు పైన నిరూపించిన శ్లోకార్థములను బాగుగ గ్రహించిన అవియన్నియు స్వాత్మాభిన్న ఆత్మలక్షణములే కావున, అనుసంధానపరులకు మహత్తరలాభము కలుగు ననుటకు సందియము లేదు. కాన, నిట్టి పరమార్థ స్వరూపమందు. శాస్త్రప్రమాణముతో ప్రీతి నిశ్చయములు సంపాదించిన ముముక్షువులకు ఆత్మానుసంధానముకంటె సుఖదాయకమగునది యేదియు నుండదు. ఈ ఆత్మ పదార్థము అద్వితీయ అఖండ పరిపూర్ణ చైతన్య స్వరూపము. ఈ పరిపూర్ణ, తను పొందుటయే జిజ్ఞాసునగు ముముక్షువునకు పరమావధి. కాని యిట్లు తెలిసికొని అనుభవమునుపొందుట యెట్లు అనుశంకకు పైన చేసిన విచార వివేచన నిరూపణలన్నియు బ్రహ్మజ్ఞానాభ్యాసకునకు బాగుగ సహకరించును. "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్" అను శ్రుతివాక్యము, ఈ సృష్టికి పూర్వము మొట్టమొదట సత్పదార్థమొక్కటియే యున్నదని తెలుపుచు"—

శ్రుతి॥ పూర్ణమదఃపూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే ।
పూర్ణస్యపూర్ణ మాదాయ పూర్ణమేవావశిష్యతే ॥

అను శ్రుతిపూర్ణమే బ్రహ్మమనియు, పూర్ణము నశించునది కాదనియు, పూర్ణమగు బ్రహ్మను గ్రహించిన పూర్ణపదార్థమే నిర్విశేషముగ నుండు ననియు తెలుపుచున్నది. కావున సృష్టికిపూర్వము, సృష్టికాలమునను సృష్ట్యనంతరమందునుండునది పూర్ణవస్తువగు బ్రహ్మమే అని తెలియుచున్నది. శ్రుతివాక్య మసత్యమగుటకు వీలుకాదు దీనిని పరమ ప్రమాణముగ గ్రహించుట విధియై యున్నది. ఈ శ్రుతి ప్రామాణ్య మెంత యుత్కృష్టమైనదియు శ్రీ వసిష్ఠ భగవానులు రాజాధిరాజై అవతార పురుషుడైన శ్రీరామచంద్రునకు తత్త్వబోధచేయునపు డాతనితో—

శ్లో॥ కారుణ్యాత్ భవతామేతదహం వచ్మి సమాయయా ।
శ్రుతివాక్యమనుస్మృత్య న స్వతః ప్రకటీకృతమ్ ॥

అనగా నీయందుండు కారుణ్యముచే నేను కల్పించి చెప్పుటలేదు. ఈ చెప్పినదంతయు శ్రుతివాక్యము ననుసరించియే చెప్పితినని భగవత్స్వరూపుడగు శ్రీవసిష్ఠ మహాముని గూడ తన మాటకన్న శ్రుతివాక్యమునకధిక ప్రామాణ్యము నిచ్చి శ్రీరామచంద్రమూర్తికి విశ్వాసమునకుగాను బోధించియున్నారు. ఇదిగాక శ్రుతి ప్రామాణ్యమునుగురించి—

శ్లో॥ పాషాణ ప్లవనంచాపి సిధ్యేత్కాల విపర్యయే ।
నత్వచిచ్ఛ్రుతివాక్యానామ ప్రామాణ్యంతు విద్యతే ॥

అనగా కాల విపర్యయముచేత నొకవేళ రాళ్ళు జలమునందు తేలినను తేలవచ్చునుగాని శ్రుతివాక్యమెప్పటికిని అప్రమాణమగుటకు వీలు కాజాలదని శ్రీ శంకరభగవత్పాదులు తెలుపుచున్నారు. కావున "తత్త్వమసి" "అహం బ్రహ్మాస్మి" అను మహావాక్య బోధ అసత్యమగుటకు వీలులేదు. కావున బ్రహ్మజ్ఞానాభ్యాసకులు ఇట్టి శ్రుతిప్రామాణ్యమును నిశ్చయముగ గ్రహించి తత్స్వరూప స్వానుభవమును పొందుటకు అధ్యస్తమైన సర్వదృశ్యమును జ్ఞానపూర్వకముగ త్యజించి సర్వాధిష్ఠానమైన తన అఖండ అద్వితీయ పరి

పూర్ణ ప్రత్యగాత్మ స్వరూప చైతన్యమే తాను అనగా నేను అని అనుసంధా నాదభ్యాసములను చేయుచుండవలయును ఈ సత్యస్వరూప "అహం" నేను సర్వకాలములయందును సర్వ దేశములయందును సర్వవస్తువులయందును అపరిచ్ఛిన్నుడనై పరిపూర్ణ స్వరూపముతో సర్వాధిష్ఠానముగ నున్నవాడను. నాకన్న నితరమేమియును వాస్తవముగ లేదు అహం. నేనే వాస్తవమున సత్యజ్ఞానానంద స్వరూపుడను. బ్రహ్మస్వరూపుడను. ఇతరమంతయు మిథ్యా రూపముగాని వాస్తవము కాదని తాను నిశ్చయముగ గ్రహించి తన సత్య స్వరూపమును సర్వదా అనుసంధానము చేసికొనుచుండవలయును. ముముక్షు వైనవాడు తన ప్రారబ్ధానుసరణమున సేవనిచేయుచున్నను తన పరమార్థ సత్య స్వరూపమును జ్ఞప్తియందుంచుకొని తన జీవిత సుఖదుఃఖ ప్రారబ్ధ కర్మాను భవము లెట్టివి యైనను ఈ తన స్థూల సూక్ష్మ శరీర ధర్మములతో తన కెట్టి వాస్తవ సంబంధము లేదనియు, అయినను ఎంతటివారికిని ప్రారబ్ధ కర్మ ఫలానుభవములు తప్పవుగనుకను ప్రారబ్ధము బలీయమై తానీశరీరధారియై యున్నంతకాలము తనను సామాన్యముగ యీ అజ్ఞానమనునది విడువదు గనుకను, తన తరణోపాయమునకు ఈ శరీరమే సాధనముగనుకను అట్టి ప్రారబ్ధమును తన సత్యజ్ఞానముతోడ తాను నిమిత్తమాత్రముగ సక్తతాభిమాన రహితుడై సమచిత్తుడై తనభోగముల ననుభవించుచుండవలయును ఇట్లుండు టకు జగన్మిథ్యాత్వ నిరూఢి జ్ఞానముతోడ తన సర్వాధిష్ఠాన జ్ఞాన సతతాభ్యాస ములు సహకరించును జ్ఞానాభ్యాసకుడు శ్రవణమనన నిదిధ్యాసనముల నభ్య సించుచున్నను తన వ్యవహార కాలములందుగూడ తన పరమార్థ వాస్తవస్థితి స్వరూపములను మఱువక కేవల విధి ప్రేరితుడై యథాప్రాప్తముగ నిత్యా నిత్య వివేకముతో విషయభోగములందు అత్యంత సక్తతాభిమానబుద్ధిని విడిచి యథాప్రాప్త భోగముల ననుభవించుచు జీవయాత్రను గడుపుచుండు టయే తన కర్తవ్యమని గ్రహింపవలయును. అభ్యాసకునకు ఇట్టి జ్ఞానాభ్యా సములే ముక్తిమార్గమునిచ్చి కాలక్రమమున సంసార విముక్తుని గావించును. పాఠకులకీ బ్రహ్మస్వరూప లక్షణములు చెప్పినవే, మరల ప్రతి స్థలమున

చెప్పుచున్నారే యను సంశయము కలుగవచ్చును ఇది సరికాదు. ఏలయన, జ్ఞానాభ్యాసకునకు ఈ బ్రహ్మ స్వరూప లక్షణముల గ్రహణము దేహబలము నకు అన్నమును భుజించుట వంటిది. ప్రతిదినము అన్నము భుజించిన గాని, దేహబలము సమానముగ నెట్లుండదో అట్లే నిత్యమును ఈ అభ్యాసమును చేయుచుండవలయును. మానవులు ప్రతిదినము తినునది అన్నమేయైనను దానియందు అరుచి విసుగు కలుగకుండుటకుగాను వివిధ వ్యంజనములతో అన్నము నెట్లు భుజించుచున్నారో అట్లే బ్రహ్మ జ్ఞానా భ్యాసకునకు ధ్యేయపదార్థము స్వాత్మ, పదార్థమె కావున దానిని వివిధ వివేచనా విధానములతో సేవించినయెడల విసుగుచెందక యుత్సాహ పాటవములతో తన అభ్యాసములచేయ సమర్థుడగును. అప్పుడు అభ్యాసకునకు బ్రహ్మజ్ఞాన బలము క్రమముగ వృద్ధియగుచుండును. కావున మనము ప్రతిదినము తిను నన్న మొక్కటియైనను ఆహారమందు ప్రీతికలుగుటకు దానిని వివిధ శాకవ్యం జనోపహారములతో నెట్లు తినుచున్నామో అట్లే యీ ఒక్కటియగు బ్రహ్మ లక్షణము అభ్యాసకునకు దీనియందు ప్రీతి నిశ్చయములను పెంపొం దించుటకుగాను వివిధ అనుభవ నిరూపణలతో తెలుపబడెనేగాని, మరి వేరు గాదని జ్ఞానాభ్యాసకులు గ్రహించి, వారి ప్రీతి నిశ్చయములను అద్వైత సిద్ధాంత, స్వరూపములందు వృద్ధిగావించుకొనుచుందురుగాక. జ్ఞానాభ్యాసకు లకు మరియొక శంక కలుగవచ్చును. ఏదియనిన, ప్రారబ్ధానుసారమున జ్ఞాని, అజ్ఞానులిరువురును విధిగా యీ ప్రపంచ సుఖ దుఃఖ భోగానుభవము లను, నొందవలసియుండగా, అనగా యిరువురకునూ ప్రారబ్ధానుభవములు తప్పనియెడల, యీ జగన్మిథ్యాత్వ జ్ఞానముతో నేమి ప్రయోజనము ? అని తోచవచ్చును. దీనినిగురించి లోగడనే కొంతవరకు నిరూపించియుంటిమి. కాని జ్ఞానాభ్యాసకులు, వారి పరమముక్తిని గాంచుటకు యీ జగన్మిథ్యాత్వ జ్ఞాన నిరూఢియే, ప్రధాన సాధనముగనుక దీనినిగురించి, మరియొకింత విచారించుట యావశ్యకము. అగ్నిని నెవరుస్పృశించినను, కాలుట సహజము, సమానమేగదా ! యని సాధారణముగ తోచవచ్చును. కాని అది సరికాదు.

ఎలనన పరమార్థ వాస్తవమున "అహం" నేను అను నీ జీవుడు శుద్ధ, నిత్య, బుద్ధ, ముక్తస్వరూపుడు, యీ స్వశరీర, జగత్సర్వమంతయూ, మాయా మాత్రమై అనిత్య, పరిచ్ఛిన్న, జడ దుఃఖత్వములతోగూడినదగుచు, జీవుని సంసారమున బంధించుచున్నది. జీవునకు యీ దృశ్యానుభవమంతయూ, ప్రమాదపడిన సార్వభౌముని ఇంద్రజాలిక చోరుడు బంధించుటవంటిది. ఏలనన అప్రమత్తతతోనున్న రాజుయొక్క ద్రవ్యమునంతయునూ, చోరుడెట్లు అపహరించ యత్నించుచుండునో అట్లే యీ నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త స్వరూపుడగు జీవునినే, మాయా కల్పితుడగు యీ దృశ్యమను చోరుడు తాను సత్యవంతుడుగ, తనయందే భ్రాంతినికలిగించి జీవుని మోహింపజేయుచు, దృశ్యమందు సంసార, ప్రవృత్తునిగ జేయుచు, జననమరణ ప్రవాహమున బంధించి, సుడిసెటిగుంటనుందు పడిన తృణములాగున, భ్రమణము చేయించుచుండును. లోకములో చోరులు వివిధములుగ నుందురనుమాట యంతరకునూ తెలిసినదియే అందులో యీదృశ్యస్వరూప చోరుడు, నమ్మించి మోసముచేయు దొంగవంటివాడు ఎల్లప్పుడునూ యీ స్వశరీర సర్వ దృశ్యమును, సత్యమైనదానివలె కనబడుచు, నమ్మించి, జీవుని యీ దృశ్యమను కారాగారమందు బంధించును. ఈ మిథ్యా చోరుడు జీవుని విడిచియుండడు. ఈ పరమార్థ సత్యజీవుడే, చోరుడగు మిథ్యాపురుషుని, వాని క్రియా, దృశ్యములను, నమ్మినవానివలె నగుపడుచు, తన జగదనుభవములనన్నిటినీ సత్యమను భ్రమతో ననుభవించుచుండును. ఇది యంతయూ భ్రమయే యగుచు మాయా కల్పితముగ జరుగుచున్నది. ఇందు యీ మిథ్యా పురుషుడగు దృశ్య స్వరూపచోరుడు, భ్రమనొందిన వాస్తవజీవుడు, ఎంతకాలము ఏ తరగతి పెట్టెలో ప్రయాణము చేయుచుండునో, అంతకాలము యీ మిథ్యా పురుషుడగు చోరుడుగూడ, ఆ క్లాసు టిక్కెట్టును, (అనగా ప్రారబ్ధమను అధికారము) యుండునటుల సంపాదించి, వాస్తవ జీవుని తోడనేయుండి, యీదృశ్యనాటకమునందు, జీవుని బద్ధునిగా జేయుచుండును. ఇట్లుండ, ఎప్పుడైననూ, తనతో నున్నవాడు, చోరుడు, అని తెలిసికొనిననూ,

వాడి టిక్కెట్టునుబట్టి అనగా ప్రారబ్ధమునుబట్టి అధికార మున్నంతకాలము, వాడు విడచిపోవక, యీ జ్ఞానాభ్యాసకుడైన జీవునితోడనే యుండును. కాని వాడెప్పుడు తెలిసికొనబడిన చోరుడగుటనుక, అంత అపకారము చేయకుండును, కాని వాడి టిక్కెట్టునుబట్టి (అనగా ప్రారబ్ధాధికార మున్నంతకాలము) అనగా ప్రారబ్ధాంతమువరకును యీ పరమార్థి, జీవుని విడువడు. ఈపైన వర్ణించిన దృశ్య స్వరూపమైన మిథ్యాచోరుడు, మనోరూపుడేగాని మరి వేరెవరునూ కాడు— ఈ వ్రాసినదంతయూ, నా కవిత్వముగాక, సిద్ధాంతమను విషయము "మాయామాత్ర మిదం సర్వం" అను వాక్యమున్నూ జనకోపాఖ్యానమునందున్న :—

శ్లో॥ ప్రబుద్ధోస్మి ప్రబుద్ధోస్మి దుష్టశ్చోరో మయాత్మనః ।
మనోనామేహ, హన్మ్యేనం మనసాఽస్మి చిరం హృతః ॥

అను నీ వాశిష్ఠ శ్లోకమునూ దృఢీకరించుచున్నది—

కావున జ్ఞానాభ్యాసకుడు, మాయామాత్రమైన యీ స్వశరీర సర్వ దృశ్యమును, తన మనోరూపమాత్రమేనని తెలిసికొనవలయును. గనుక ముముక్షువు యీ స్వశరీర సర్వ దృశ్యమంతయూ తన మనోరూపముననున్న యీ చోరునిచే కల్పింపబడినదేగాని, తనకిది వాస్తవముకాదని తెలిసికొనవలయును. తనను విడువకయున్న యీ స్వశరీర దృశ్యమంతయూ యీ చోరుని కల్పితమని బాగుగ గ్రహించి, ఆ చోరునితోడనే స్నేహముగావించుచున్నయెడల ఆ చోరుడు, ఈ జీవుని బాధించక, తానున్నంతకాలము మిత్రుడుగానుండి, ప్రారబ్ధానంతరము విడచిపోవును— ఇదియే జ్ఞానాభ్యాసకులకు ఈ దృశ్యము మిథ్యాత్వ నిరూఢిని బాగుగనొంది వారి ప్రారబ్ధానుభవముల చేయుటలో కలుగు గొప్ప లాభము. ఈ అభ్యాసుడగువాడు, తనను విడచిపోయిన క్షణముననే జీవుడు తన పరమార్థ సత్య స్వరూపమును గ్రహించి పరమ ముక్తుడగును. కావుననే బ్రహ్మజ్ఞానాభ్యాసకులకు యీ జగన్మిథ్యాత్వ నిరూఢి పరమ ప్రయోజనమును కలిగించుచు, తానున్నంతకాలముగూడ నిర్భాతి

తముగ మిత్రునివలె నుండును. దీనినే "విజ్ఞాయ సేవితశ్చోరో మైత్రీమేతి నశత్రుతామ్" అనగా దొంగను దొంగ అని బాగుగ తెలిసికొని వానితో స్నేహము చేసినయెడల, వాడు శత్రువుగాక, మిత్రుడుగా నుపయోగించునని, శ్రీ విద్యారణ్యుల వచనము తెలుపుచున్నది జ్ఞానాభ్యాసకులకుగూడ, సాధారణ ముగ వారి, వారి ప్రారబ్ధానుభవములు తప్పవు గనుక, జగన్మిథ్యాత్వజ్ఞాన నిరూఢులైనవారి ప్రారబ్ధములను అల్ప సుఖ దుఃఖభోగములతో నిర్లిప్తతతో అనుభవముల నొందించుచుండును ఇట్టి అనుభవములు, పుణ్యాపాపఫలహీనము లగుచు, సాధకుల బ్రహ్మాభ్యాసాదులకుసాధనమగుచు, కాలక్రమమున ముక్తినిచ్చును కాని అజ్ఞానికిన్నినో, స్వశరీర సర్వదృశ్యము వాస్తవమను, అజ్ఞానముతోడ తన సుఖ దుఃఖ భోగానుభవములను, రాగద్వేషాదిసక్తతాభి మానములతో చేయుచుండును గనుక అట్టివి, పుణ్యాపాప ఫలవంతములగుచు భావి ప్రతిబంధములై జీవుని సంసారచక్రమున చర్విత చర్వణముగ బంధించు చుండునని ముముక్షువులు నిశ్చయముగ గ్రహింపవలయును—

కాని యీ అభ్యాసమునకింతయు ముముక్షువునకు తన మనోరూప మనునున్న వృత్తియే శరణ్యము. కావున ముముక్షువులు తమ వృత్తులను శాస్త్రీయముగ సంస్కరించుకొనుచుండుట యావశ్యకము. అప్పుడు వారికి సంస్కృత మనసు యేర్పడును. దీనితో ముముక్షువులు సర్వదా వారి వృత్తిని సశాస్త్రీయముగ బ్రహ్మాకారముగ చేయుచుండుట యావశ్యకము. ఏలనన దీనివలనగాని ఆత్మజ్ఞానలాభము, ముముక్షువులకు కలుగదు— ఇందుకుగాను జ్ఞానాభ్యాసకులు వారి వృత్తినే ఆశ్రయించి, శాస్త్రీయముగ సంస్కరించుకొన వలయును— దీని యావశ్యకతనుగురించి :—

శ్లో॥ ఆత్మజ్ఞానం వినావిద్వాన్, బ్రహ్మజ్ఞానం ననశ్యతి ।
బ్రహ్మజ్ఞాన వినాశాయ, వృత్తివ్యాప్తి రపేక్ష్యతే ॥

అను యీ శాస్త్రవచనము తెలుపుచున్నది. కించిద్భేదమున్నను, జ్ఞానా భ్యాసకులు, వృత్తియన్నను, మనసన్ననూ, ఒక్కటి యనియే గ్రహించ వచ్చును.

లోకమున వివేకవంతులు, వారి సత్య సువర్ణమందైనను, వన్నె, బరువులలో మార్పుకలిగిన, అది అసలు బంగారుకాదేమోనను భయము నొందుదురు గాని, వారి బంగారము మాయ బంగారమను జ్ఞానమున్నయెడల, దాని వన్నె, మొదలగు మార్పులనుగురించి ఎంతమాత్రము చింతనొందరు గదా ! అట్టి మార్పులన్నియూ దాని సహజ లక్షణములను జ్ఞానముతో నిశ్చింతగా నుండుచు, దానిని అల్పబుద్ధితోనను, అల్ప ప్రీతితోనను, నుపయోగించు కొనుచుందురుగదా ! అట్లే జ్ఞానాభ్యాసకులగువారు, యీ స్వశరీర సర్వ దృశ్యమునుగురించి యింతవరకునూ మననము చేసిన విచార, మనన, సారాంశములనుబట్టి స్వశరీర సర్వదృశ్యమంతయూ మాయ బంగారమువంటిదను, నిశ్చయము నొంది వారి జీవితములందు కాలక్రమమున, తమ ప్రారబ్ధాను సారమున కలుగునట్టి సుఖ దుఃఖానుభవములయందునూ, యింకనూ వారికి కాలక్రమమున కలుగు హెచ్చు తగ్గు స్థితిగతులను బట్టియునూ, సర్వదా చింతాక్రాంతముగాగాని, గర్వోన్నతులుగాగాని, వికారము నొందకుండుటయే, వివేకము, వారికి పరమార్థ సాధనమునూ యగును. ఇట్టి జ్ఞానము, నిర్వికారతయునూ యీ జగత్తంతయూ మాయ బంగారమువంటిదే కాని, సత్య సువర్ణమెప్పటికినీ కాజాలదు అను జగన్మిథ్యాత్వ జ్ఞాన నిరూపిపలనగాని కలుగదు. కావున ముముక్షువు లిట్టి జ్ఞానమును సంపాదించి, వారి యిహ లోక, పరలోక లాభములను ప్రధానముగ పరిగణింపక దృశ్యమందు రాగ ద్వేషసక్తతాభిమాన రహితులై, ప్రారబ్ధానుసరణమున, వారి, వారి సుఖ దుఃఖ భోగానుభవములను, నిమిత్తమాత్రముగ, నిర్వికార చిత్తతతో ననుభవించుచుండుటయే, బ్రహ్మజ్ఞానాభ్యాసకునకు లక్షణము. అప్పుడు వారి సమాధ్యభ్యాసాదులను, నిర్విఘ్నముగ నాచరింప గలుగుదురు. కావున బ్రహ్మజ్ఞానాభ్యాసకులగు ముముక్షువులు వారి, వారి, వృత్తిని బ్రహ్మాకారము గావించుచు, దృశ్యమును, ఆ, జ్ఞానముతోడ నిరసించుచు, యిట్టి నిశ్చయమును సర్వదా వృద్ధినొందించుచుండవలయును. ఎట్లన :—

శ్లో॥ చిదేవ పంచభూతాని, చిదేవ భువనత్రయం ।
చిదేవాహం చిదేవాస్మ్యత్, చిద్భిన్నం నహికించన ॥

అని అనుసంధానము చేయుచుండవలయును. ఎట్లనగా సర్వము పరిపూర్ణ అఖండ జ్ఞానస్వరూపమేగాని తదితర మేమియును, వాస్తవముగలేదను దృఢ నమ్మకమును వృద్ధిచేసికొనుచుండవలయును. ఇట్టి జ్ఞానదార్ఢ్యము లేనియడల ముముక్షువులకు వైరాగ్యాదులు స్థిరము కాజాలవు. ఎంతటివారికైనను వైరాగ్యములేని అభ్యాసాదులు ప్రయోజనకరములు కాజాలవు అందుకుగాను :—

శ్లో॥ సర్వదృశ్య మిదం విశ్వం, ప్రవిలాపధియాసుధీః ।
భావయేదేక మాత్మానం, తత్రైవ్యత్యవధారయేత్ ॥

అనగా ఈ స్వశరీరసర్వదృశ్యమును, సంస్కారి మనసుతోడ, జ్ఞానపూర్వకముగ త్యజించి (అనగా నీ దృశ్యమంతయూ వాస్తవముగ లేదను నిశ్చయముతోడ) ఒక్క నీ ఆత్మస్వరూపమునే పరిపూర్ణముగను, అఖండముగను, స్వాత్మాభిన్నముగను ధ్యానించుచు, దానినే బ్రహ్మమని తెలిసికొనవలయునని శ్రీ శంకర భగవత్పాదులు బోధించుచున్నారు. కావున జ్ఞానాభ్యాసకులు తమ వృత్తిని యల్లప్పుడును బ్రహ్మాకారముగ నుంచుటకు సర్వదా నభ్యసించుచుండవలయును. ఇంకనూ జ్ఞానాభ్యాసకులు తమ వృత్తిని సదాసమాధ్యభ్యాసమందుండునటుల యత్నించుచుండవలయును. కాని యిది సదా నభ్యసించుటకు సాధ్యమాయనియు, యీ సమాధిస్థితియనగా శ్వాసనిరోధమును గావించి ఆసనములమీద కూర్చుండుటయేయను సామాన్య జనాభిప్రాయము గలదు. ఇది హఠయోగ సాంప్రదాయమునుబట్టి వాస్తవమైనను, రాజయోగ సాంప్రదాయమునుబట్టి (అనగా జ్ఞానాభ్యాస మార్గమునుబట్టి) యీ సమాధి శబ్దమున కిదియే అర్థము కాదని బ్రహ్మవిద్యా సాంప్రదాయకులగు పూర్వాచార్యులవలన నిట్లు తెలుపబడుచున్నది. ఈ సమాధ్యభ్యాస ప్రయత్న మెట్లుండ వలెననిన—

శ్లో॥ నిర్వికారతయా వృత్త్యా బ్రహ్మాకారతయా పునః।
వృత్తి విస్మరణం సమ్యక్ సమాధిర్జ్ఞాన సంజ్ఞకః ॥

అనిన, నిర్వికారవృత్తి, అనగా విషయానుసంధానములేని అంతఃకరణవృత్తి చేత దృశ్య, ద్వైతానువృత్తిని బాగుగ త్యజించి, అఖండ పరిపూర్ణ జ్ఞానమునే తానుగ ధ్యానించుట సమాధియని చెప్పబడునని శ్రీ శంకర భగవత్పాదులునూ, ఇంకను :—

శ్లో॥ నిశ్చింతా విగితాభీష్టా, హేయోపాదేయవర్జితాః।
ప్రోక్తా సమాధిశబ్దేన, పరిపూర్ణా మనోగతిః ॥

అనగా విషయచింతారహితంబును, వాంఛా విముక్తంబును, యిష్టానిష్ట వర్జితంబును అగు మనసుతోడ అఖండపరిపూర్ణ గ్రహణంబును చేయుచుండుటయే సమాధిశబ్దమున కర్ధమనియూ, ఇంకనూ :—

శ్లో॥ తత్త్వావబోధో భగవన్, సర్వాశాతృణ పావకః।
ప్రోక్తస్సమాధిశబ్దేన, న చ తూష్ణీ మవస్థితిః ॥

అనగా తత్త్వజ్ఞానమే సమాధి శబ్దమున కర్ధముగాని, బద్ధ పద్మాసనస్థితుడై యూరక కూర్చుండుటమాత్రము సమాధిస్థితి కాదనియూగూడ శ్రీ వసిష్ఠ భగవానులు విశదముగ తెలుపుచున్నారు. కావున బ్రహ్మజ్ఞానాభ్యాసకులు యీ సమాధిస్థితి ప్రయత్నముతోడ సర్వదా అభ్యసింపదగినదని గ్రహింతురు గాక.

ఈ జ్ఞానాభ్యాసకుడు తన పరమముక్తిని గాంచుటకు స్వాత్మాభిన్న పరమాత్మయొక్క అద్వితీయ అఖండ పరిపూర్ణ నిర్వికారత్వములను నిస్సంశయముగను దృఢముగను గ్రహించుట యావశ్యకము, కావున మరియొకింత నే ప్రధాన విషయమునుగురించి విచారించుదము. ఈ దృశ్యమునందు గను బడుచున్న స్వశరీర, పరిచ్ఛిన్న భిన్న భిన్న చిత్ర విచిత్ర జీవ జడ నానా

ర్మములన్నియూ, ఆయా ఉపాధులకు సంబంధించినవేగాని, ఆయా ఉపాధుల యందుండు చైతన్యమున కెంతమాత్రము సంబంధించినవి కావని స్పష్ట ముగా గ్రహించవలసియున్నది — ఎట్లన ఉపాధియందుండు వస్తువు అనగా ఉపహితము ఎప్పుడునూ ఉపాధితో నేకముగ నుండుటకు వీలులేదు— అట్లు రెండునూ ఒక్కటియే యైయుండునెడల ఆ పదార్థము ఉపాధియగుటకు వీలు లేదు. అప్పుడది ఆ పదార్థమే యగును కావున ఉపాధియందుండు పదార్థము అనగా ఉపహితము ఎప్పుడునూ ఉపాధికి భిన్నముగానే యుండవలయును. ఇది నియమము కాని కొన్ని కొన్ని వ్యవహారములలో చూచువారికి ఉపాధి, ఉపాధియందుండు ద్రవ్యము (అనగా ఉపహితము) ల యొక్క వాస్తవికతలు తెలియబడక, వ్యవహారమునందు రెండునూ ఒక్కటిగనే వ్యవహరింపబడుచుండును కావున యీ జ్ఞానము వ్యవహారమాత్రమేకాని పరమార్థమున వాస్తవమగుటకు వీలుకాదు. లోగడనే శ్రుతి, యుక్తి అనుభవపూర్వకముగ యీ ఉపాధులన్నియు కల్పిత మాత్రములని తెలిసికొనియుంటిమి కాని సర్వాధిష్ఠానమగు ఆత్మ, అద్వితీయ నిత్య నిర్వికార అఖండ పరిపూర్ణ చైతన్య స్వరూపుడుగ నున్నప్పుడు, ఈ ఉపాధులన్నియూగూడ నట్లే ఏల తెలియబడుటలేదు అను సంశయము తోచవచ్చును కాని యిది మన అనుభవమునుబట్టి విమర్శించుట మాత్రముననే సరికాదని తెలియగలదు. ఆత్మ ఎల్లప్పుడునూ అద్వితీయ అఖండ పరిపూర్ణ నిర్వికార స్వరూపుడుగానే యుండును ఈ కనబడునట్టి పరిచ్ఛిన్న భిన్న భిన్న చిత్ర విచిత్ర వికార ధర్మములన్నియూ, నానా జీవ జడోపాధులవేగాని, ఆత్మధర్మము లెంతమాత్రమునుగావు ఎట్లన దీనికి నిదర్శనము ప్రస్తుతకాలమందు మనము వాడుచున్న విద్యుచ్ఛక్తి దీపములే. ఒక్కటియైన ఈ విద్యుచ్ఛక్తి వలననేకదా వివిధోపాధులగు బల్బులనుబట్టి, ఒక క్యాండిల్ వెల్తురు మొదలు అనగా 1 సి పి నుంచి (10000 సి. పి) పదివేల వస్తులకు అధికమగు ప్రకాశమునుగూడ వివిధ ప్రదేశము

లందు ప్రకాశము అనగా కాంతి తారతమ్యములను, అనుభవింప గలుగుచున్నాము ఈ తారతమ్యమంతయు ఉపాధులగు బల్బులను బట్టి కలుగుచున్నదియేగాని, విద్యుచ్ఛక్తి సర్వదా యేకరూపముగా నుండు ననుమాట విద్యావంతుల కందరకునూ తెలిసిన విషయమే గదా. వాటి వాటి ప్రకాశ తారతమ్యము, భిన్న భిన్న రంగులు, ఈ ధర్మములన్నియూ ఆయా బల్బులనుబట్టి కలుగుచున్నవేగాని విద్యుచ్ఛక్తి ధర్మమునుబట్టి కావు. ఇట్లే నిర్వికార పరిపూర్ణ చైతన్య స్వరూపుడగు పరమాత్మ ఏకరూపమున సర్వ సాక్షియైయున్నను, యీ ప్రపంచ జీవ జడోపాధుల తారతమ్యములను బట్టి యీ దృశ్య చిత్ర విచిత్ర సుఖదుఃఖ తారతమ్యములు కలుగుచున్నవని ముముక్షువులు గ్రహించవలయును. ఇంకనూ ఒక్కడై ఏకరూపుడగు సూర్యుడు తాను యెట్టి వికారములను జెంచకుండగనే, తాను ప్రకాశించుచున్న ఉపాధులయందు ఆయా ఉపాధి వికారములు గలవాడుగ నెట్లు ప్రతిబింబరూప మున గ్రహింపబడుచున్నాడో అనగా జలమునందు కదలుచున్నవానివలెను, వివిధ దర్పణములయందు ఆయా దర్పణములయొక్క వర్ణ ఛాయాచలనము లను, మాలిన్య స్వచ్ఛతలను పొందినవానివలె నగుపడుచు యింకనూ వజ్ర మణులయందు ప్రకాశించునప్పుడు సమానప్రకాశముతో నెట్లు ప్రతిబింబించుచు తెలిసికొనబడుచున్నాడో అట్లే యీ పరమాత్మ సమస్త ఉపాధులయందు నను చూడబడుచున్నాడనియు, ఆయా ఉపాధుల మాలిన్య, స్వచ్ఛత, అతి స్వచ్ఛతలనుబట్టియు, వాటి శక్తి సామర్థ్యములనుబట్టి అట్లు తెలిసికొన బడుచున్నాడేగాని వాస్తవమున ఆ పరమాత్మకు ఎట్టి వికారములును లేవనిన్ని, సర్వదా ఆయన స్వాత్మాభిన్న నిర్వికార అఖండ పరిపూర్ణ స్వరూపుడని, జ్ఞానాభ్యాసకులు స్పష్టముగా గ్రహించవచ్చును. ఇంకను ఈ నామరూపాత్మక మగు సర్వోపాధులును అనగా సర్వ ప్రపంచమును "విశ్వం బ్రహ్మణి కల్పితం" అనగా ఈ విశ్వమంతయు బ్రహ్మయందే కల్పితమాత్రముగ నున్నదని శ్రీ శంకర భగవత్పాదుల వచనము తెలుపుచున్నది. వట్లన

నిద్రించువానికి స్వప్న ప్రపంచమంతయు తనయందే కలుగుచు తనయందే లయమగుచున్నట్లునూ, వాయు ప్రసారముచే అలలు సముద్రజలమందుననే కలుగుచు ఆ జలమందే లయమగుచున్నట్లునూ యీ స్వశరీర సర్వ ప్రపంచమంతయు జీవుని అనాది అజ్ఞానముచే, తనయందే కలుగుచు జాగ్రద్దశకు రాగనే స్వాప్నికుని స్వప్నము తనయందే లయించినట్లు ఈ స్వశరీర సర్వ దృశ్యమును జీవునకు జ్ఞానము కలుగగనే తనయందే లయించి, తానుమాత్రము నిర్విశేషమై బ్రహ్మరూపుడుగ శేషించును. కావున జిజ్ఞాసువులు స్వాత్మాభిన్న పరమాత్మ, నిర్వికార అఖండ పరిపూర్ణత్వములను సర్వదా ఇట్లు నిశ్చయించుకొనుచుండవలయును

మోక్షార్థులైన జిజ్ఞాసువులగు ముముక్షువులకు మోక్ష స్వరూపమును బాగుగ గ్రహించి దాని దార్ఢ్యమును సంపాదించుట యావశ్యకము. కావున మోక్ష స్వరూపమును బాగుగ తెలుపుచున్నట్టి శ్రీ వసిష్ఠ భగవానుల వచనముల నిచట నుదహరించుచున్నాడను.

1. శ్లో॥ నిర్దగ్ధవాసనాబీజస్సత్తా సామాన్య రూపవాన్ ।
సదేహో వా విదేహో వా నభూయో దుఃఖ భాగ్భవేత్ ॥

దహింపబడిన వాసనయు, వాసనాబీజంబగు నజ్ఞానంబును, గలవాడు సత్తాసామాన్య నిష్ఠుండుగావున సత్తా సామాన్య రూపుడగు పురుషుడు దేహసహితుండుగాని, దేహరహితుండుగాని మరల దుఃఖమును పొందనేరడు.

2. శ్లో॥ చిచ్ఛక్తిర్వాసనాబీజరూపిణీ సర్వదేహినాం ।
అస్యాస్త్వపస్పందనం యత్తద విద్యేత్యుచ్యతే బుధైః ॥

ఓ రామచంద్రా! బ్రహ్మ యొక్క చైతన్యరూపమగు శక్తియే సమస్త ప్రాణులయొక్క వాసనారూపంబును, తన్మూల

మగు నజ్ఞానరూపంబు నగుచున్నది. ఈ చిచ్ఛక్తి నెఱుంగకుండు టయే, అవిద్యయని చెప్పబడుచున్నది

3. శ్లో॥ ఏతావదేవావిద్యాత్వం నేదంబ్రహ్మేతి నిశ్చయః।
ఏష ఏవక్షయోఽస్యాయద్బ్రహ్మేద మితి నిశ్చయః॥

ఈ జగము బ్రహ్మముకాదను నిశ్చయము ఏదికలదో ఇదియే అవిద్య యని చెప్పబడుచున్నది. ఈ జగము బ్రహ్మయే యను నిశ్చయ మేదికలదో ఇదియే ఈ యవిద్య యొక్క నాశమగు చున్నది.

4. శ్లో॥ నిశ్చయో యో హరాదీనాం హృది తిష్ఠతి నిర్మలః।
ఋషీణాం నారదాదీనాం స తే భవతు రాఘవ॥

ఓ రామచంద్రా! రుద్రాది దేవతలయొక్కయు నారదాది మహర్షులయొక్కయు హృదయమునందు నిర్మలంబగు నే నిశ్చయము కలదో; ఆ నిశ్చయమే నీ హృదయమునందు నుండుగాక. (వారలవలె నీవును జీవన్ముక్తమార్గము నవలంబించుమనుట) అనవిని శ్రీరామచంద్రుండిట్లనియె—

5. శ్లో॥ యేనైతే భగవన్ధీరా నిశ్చయేన మహాధియః।
విశోకాస్సంస్థితాస్తన్మే బ్రహ్మన్ ప్రబ్రూహి తత్వతః॥

ఓ మునీంద్రా! ఈ రుద్రాదులగు ధీరులు ఏ నిశ్చయముచేత దుఃఖ రహితులై యుండిరో ఆ నిశ్చయమును నాకు యథార్థముగా జెప్పుము. అని యడుగగా వసిష్ఠ మునీంద్రుం డిట్లనియె——

6. శ్లో॥ యదిదంకించిదిహాభోగి జగజ్జాలం ప్రదృశ్యతే।
తత్సర్వమతులం బ్రహ్మ బృహదేతద్వ్యవస్థితమ్॥

విస్తారంబగునే ఈ జగజ్జాలము కనబడుచున్నదో అది యంతయు నిర్మలంబగు బ్రహ్మమేయని వారలయొక్క నిశ్చయము.

7. శ్లో॥ బ్రహ్మచిద్బ్రహ్మ భువనం బ్రహ్మ భూతపరంపరా।
బ్రహ్మాఽహం బ్రహ్మమచ్ఛత్రుః బ్రహ్మ మన్మిత్ర బాంధవాః॥

చిత్తుబ్రహ్మము, లోకముబ్రహ్మము, భూతజాలము బ్రహ్మము, నేను బ్రహ్మము, నా శత్రువు బ్రహ్మము, నా మిత్రులు, బంధువులును బ్రహ్మమే యగుదురు—

8. శ్లో॥ అజ్ఞస్యదుఃఖౌఘమయం, జ్ఞస్యానందమయంజగత్।
అంధం భువనమంధస్య ప్రకాశం తు సుచక్షుషః॥

ఈ జగము గ్రుడ్డిదానికి నంధకారావృతంబును, కనులుగలవానికి ప్రకాశయుక్తంబు నగునట్లు అజ్ఞానికి దుఃఖప్రదంబును, జ్ఞానికి ఆనందప్రదంబును నగుచున్నది.

9. శ్లో॥ సర్వమేవహి బ్రహ్మేతిభావితే బ్రహ్మవై పుమాన్।
పీతేఽమృతేఽమృతమయః కోనామనభవేత్కిల॥

సర్వమూ బ్రహ్మమేయని భావింపగా పురుషుడు బ్రహ్మమే యగుచున్నాడు. అమృతమును పానముచేయగా నెవ్వడు అమృతమయుండు కాకుండును?

10. శ్లో॥ ఆదానమాత్ర మమలం సర్వభూతావబోధకం।
సర్వత్రావస్థితం శాంతం చిద్బ్రహ్మేత్యనుభూయతే॥

విషయాసంస్పృష్ట జ్ఞానంబును, సర్వభూతప్రకాశకంబును, సర్వవ్యాపకంబును, శాంతంబునగు చిత్తు బ్రహ్మమని యనుభవింపబడుచున్నది.

బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు, గ్రహించవలసిన లోకవృష్టి, వ్యవహారాచరణమునుగురించి వసిష్ఠ భగవానులు శ్రీరామచంద్రమూర్తికి చేసిన బోధను

సంగ్రహించి, ముముక్షు జనోపయోగమునకుగాను, నిచట నుదహరించు చున్నాడను

శ్లో॥ సృష్టిరేవమియం రామ సర్గేఽస్మిన్ స్థితిమాగతా।
విరించి రూపాన్మనసః పుష్పలక్ష్మీర్మధోరివ॥

శ్రీరామచంద్రా! వసంత ఋతువునుండి పుష్పసంపద గలిగినట్లు, బ్రహ్మస్వరూపంబగు మనస్సునుండి యీ సృష్టి కలిగినదాయెను

శ్లో॥ స్వసంకల్ప కృతాస్సర్వే దేవాసురనరామరాః।
స్వసంకల్పోపశమనే శామ్యంత్యస్నేహదీపవత్॥

సురాసురమనుష్యాదులందరును, తమ సంకల్పముచేతనే గలిగినవారు గావున తమ సంకల్పము ఉపశమించినయెడల చమురులేని దీపంబులట్లు అణగి పోవుచున్నారు.

శ్లో॥ ఆకాశసదృశం సర్వం కల్పనామాత్ర జృంభితమ్,
జగత్పశ్య మహాబుద్ధే సుదీర్ఘ స్వప్నముత్థితమ్॥

శ్రీరామచంద్రా! సమస్తమగు జగంబును ఆకాశముతో సమానమై శూన్యమైనదానిగను, కల్పనామాత్రంబుచే గలిగినదానిగను, దీర్ఘ స్వప్నముం బోలుదానిగను జూడుము.

శ్లో॥ న జాయతే న మ్రియతే ఇతి కించిత్కదాచన।
పరమార్థేన సుమతే మిథ్యా సర్వం తు విద్యతే॥

శ్రీరామచంద్రా! ఈ జగంబున నేదియు బుట్టుటగాని జచ్చుటగాని లేదు వాస్తవంబున నిదియంతయు నసత్యంబేయగును.

శ్లో॥ కోశమాశా భుజంగానాం సంసారాడంబరంత్యజ।
అసదేతవేదితిజ్ఞాత్వా, మా, ఽత్రభావం నివేశయ॥

ఆశయను సర్పంబులకు నివాసంబగు సంసారాడంబరమును విడువుము. ఈ సంసారము అసత్యంబని యెరిగి దీనియందు తాత్పర్యము నుంచకుము.

శ్లో॥ గంధర్వనగరస్యార్థే భూషితే దూషితేఽథవా ।
అవిద్యాంశసుతాద్యైర్వాకః క్రమస్సుఖ దుఃఖయోః ॥

గంధర్వ నగరముయొక్క యర్థమును భూషించిననూ లేక దూషించిననూ, సుఖముగాని దుఃఖముగాని కలుగనట్లు, అవిద్యాంశంబులగు సుతాదులను భూషించినను, దూషించినను, సుఖంబుగాని దుఃఖంబుగాని కలుగదు. (అనగా కలుగకూడదు అని అర్థము.)

శ్లో॥ ధనదారేషు వృద్ధేషు దుఃఖయుక్తం నచేష్టతః ।
వృద్ధాయాం మోహమాయాయాం కస్సమాయాసవానిహ ॥

ధనదారాదులు అభివృద్ధినొందగా దుఃఖమే కలుగునుగాని సుఖంబు కలుగదు. మోహమను మాయ పెంపునొందగా నెవ్వరికి శాంతి కలుగును? (అనగా యెవ్వనికినీ కలుగదని భావము)

శ్లో॥ యైరేవజాయతేరాగో మూర్ఖస్యాధికతాం గతైః ।
తైరేవ భోగైః ప్రాజ్ఞస్య విరాగ ఉపజాయతే ॥

మూఢునకు ఏభోగంబులు అభివృద్ధి నొందినకొలది రాగము కలుగుచుండునో, జ్ఞానవంతునకు ఆ భోగంబు లభివృద్ధి నొందినకొలది వైరాగ్యంబు కలుగుచున్నది—(అనగా జ్ఞానవంతులు వీనియందు సత్యత్వబుద్ధి నొందరు అని భావము.)

శ్లో॥ అతో రాఘవ తత్త్వజ్ఞో వ్యవహారేషు సంస్థితః ।
నష్టం నష్టముపేక్షస్వ ప్రాప్తం ప్రాప్తముపాహర ॥

కావున శ్రీరామచంద్రా ! తత్త్వజ్ఞానము గలవాడవై, వ్యవహారముల యందు ప్రవర్తించుచుండినను, నష్టమైనదానిని ఉపేక్షించి ప్రాప్తమైనదానిని గ్రహించుచుండుము.

శ్లో॥ అనాగతానాం భోగానామవాంఛనమకృత్రిమం ।
ఆగతానాంచ సంభోగ ఇతి పండితలక్షణమ్ ॥

శ్రీరామచంద్రా ! ప్రాప్తములాని భోగములంగోరక, ప్రాప్తించిన వానిని ననుభవించుట పండిత లక్షణంబగును.

శ్లో॥ యస్యస్యాదిదమిత్యాస్థా నివృత్తా సర్వవృత్తిషు ।
క్రోడీకరోతి సర్వజ్ఞం నావిద్యా తమవాస్తవీ ॥

ఇది నాకు ఉండవలయునను సమస్తవస్తు విషయముగు కోరిక ఎవనికి (జ్ఞానపూర్వకముగ) పోవుచున్నదో అట్టి మహానీయుని, (కల్పితము) అవాస్తవమును నగు అవిద్య ఆవరింపదు.

శ్లో॥ యస్యనేష్టానిష్టానివా జ్ఞస్య కర్మణి తిష్ఠతః ।
నతస్య లిప్యతే ప్రజ్ఞా పద్మపత్ర మివాంబుభిః ॥

ఏ మహానీయుడు ఇష్టానిష్టంబులు లేక యవశ్య కర్తవ్యంబగు కర్మంబులనుమాత్రము చేయుచుండునో, వానియొక్క మనస్సు తామరాకుజలంబు నంటకయుండునట్లు హర్ష విషాదంబుల నంటదు.

శ్లో॥ ఉచ్చైః పదాయపరయా ప్రజ్ఞయా వాసనాగణాత్ ।
పుష్పాద్గంధమివోద్ధారం చేతో రామ పృథక్కురు ॥

శ్రీరామా ! కైవల్యము ప్రాప్తించుటకై ప్రజ్ఞాతిశయముచేత పుష్పమునుండి, పరిమళమును వేరుచేయుచున్నట్లు, లోకవాసననుండి మనస్సును వేరుచేయుము.

శ్లో॥ సంసారాంబునిధావస్మిన్ వాసనాంబుపరిప్లుతే।
యే ప్రజ్ఞానావమారూఢాస్తే తీర్ణా దుఃఖితాః పరే॥

వాసనాజాలంబను జలంబుచే నిండియున్న యీ సంసారంబను సముద్రంబునందు, ప్రజ్ఞయను నోడను నెక్కినవారలే ఆవలి దరిజేరువారలుగాని తక్కినవారు దరింజేరజాలరు.

శ్లో॥ న త్యజంతి న వాంఛంతి వ్యవహారం జగద్భవం।
సర్వమేవానువర్తంతే పారావార విదోజనాః।

తత్త్వజ్ఞాన సంపన్నులగు జనులు జగత్సంబంధమగు వ్యవహారములను విడువకయు గోరకయు సర్వంబును యథాప్రాప్తంబుగ ననువర్తించుచుందురు (అనగా అభ్యాసకులు లోక వ్యవహారమునందు ఇట్టి వృత్తిని అవలంబించవలయునని భావము)

పర్యవసానముగ నిట్లు తెలుపుచున్నారు.

శ్లో॥ శుద్ధం సదసతోర్మధ్యం పదం బుద్ధ్వావలంబ్యచ।
సబాహ్యాభ్యంతరం దృశ్యం మాగృహాణ విముంచ మా॥

నిర్మలమైనట్టియూ దృగ్ దృశ్యములకు మధ్యస్థమగునట్టి, తత్త్వమును (అనగా నిర్వికార అఖండ పరిపూర్ణ జ్ఞానమును మాత్రము) నీ బుద్ధిచే గ్రహించి, బాహ్యాభ్యంతరములయందు దృశ్యమును గ్రహింపకయు, విడువకయు నుపేక్షింపుము— అని తెలుపుచున్నారు కావున ముముక్షువులగువారు దీనిని నిత్యాభ్యాసముగా, వారి దినచర్య, వ్యవహారాచరణమునందు నిట్టి దృష్టి, నిశ్చయములను సంపాదించుట యావశ్యకము

"మన ఏవమనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అను వచనము మానవునకు బంధమోక్షములు రెంటికినీ మనస్సే కారణమని తెలుపుచున్నది. కావున మోక్షార్థియైన జ్ఞానాభ్యాసకునకు యీ మనస్సునుగురించి

బాగుగ తెలిసికొనుట యావశ్యకము దీనినిగురించి లోగడ విచారించి యుంటిమి. కాని సిద్ధాంత దార్ఢ్యమునకుగాను దీనినిగురించి శ్రీ వసిష్ఠ భగవానులేమి తెలుపుచున్నదియూగూడ యిచట యుదహరించుచున్నాడను—

శ్లో॥ యైషాహి చంచలా స్పందశక్తి శ్చిత్తత్వ సంస్థితా।
తాంవిద్ధిమానసీం శక్తిం జగదాడంబరాత్మికామ్ ॥

బ్రహ్మచైతన్యమునందు చంచల స్వభావమైన యే చలనశక్తిగలదో, అదియే జగద్భ్రాంతిని కలిగించునట్టి మనశ్శక్తియని యెరుంగుము.

శ్లో॥ యత్తు చంచలతా యైషాత్వవిద్యా రామ సోచ్యతే ।
తదేవచతపశ్శాస్త్రం సిద్ధాంతో మోక్ష ఉచ్యతే ॥

రామచంద్రా ! చంచలత్వములేని మనస్సే బ్రహ్మయనియు, తపస్సనియు, మోక్షమనియు, శాస్త్రములయందు సిద్ధాంతముగా చెప్పబడుచున్నది.

శ్లో॥ తస్య చంచలతాయైషాత్వవిద్యా రామ సోచ్యతే।
వాసనాపరనామ్నీం తాంవి చారేణ వినాశయ॥

రామచంద్రా ! ఆ మనస్సుయొక్క చాంచల్యమే అవిద్యయనియు చెప్పబడును. దానికే వాసనయనియూ పేరు. అట్టి అవిద్యను (అజ్ఞానమును) ఆత్మ విచారముచేత పోగొట్టుకొనుము, అని తెలుపుచు— ఈ మనస్సే జడరూపమగు యీ జగత్తును బహుకాలమునుంచి దృఢముగ భావించుటచే అచేతనత్వమును పొందుచు ప్రకాశించుచున్నది కాని ఈ మనస్సే, సాక్షి చైతన్యము నేనేయని భావించునట్టి దృఢాభ్యాసమువలన ప్రకాశించుచున్న చిద్రూపముచే చిన్మాత్ర రూపత్వమును పొందుననీ, ఇంకనూ:—

శ్లో॥ పౌరుషేణ ప్రయత్నేన తస్మిన్నేవ పదే మనః ।
యోజ్యతే తత్పదం ప్రాప్య భవత్యభ్యాసతో హి యత్ ॥

ఇట్లు మనస్సు, పురుష ప్రయత్నముచే యే వస్తువునందు ప్రవేశపెట్ట బడుచున్నదో, అభ్యాసమువలన అవిధముగా వస్తురూపమును, పొందుచున్నది.

శ్లో॥ అతః పౌరుషమాశ్రిత్య చిత్తమాక్రమ్య చేతసా ।
విశోకం పదమాలంబ్య నిరాతంకః స్థిరోభవ ॥

కావున పురుషప్రయత్నమువలన మనస్సుచేతనే మనస్సును గ్రహించి దుఃఖరహితమగు బ్రహ్మ వస్తువునందు జేర్చి నిర్విఘ్నముగా స్థైర్యమును బొందినవాడవగుము.

శ్లో॥ మనసైవ సమర్థం హి మనసో దృఢనిగ్రహే ।
అరాజా కిం సమర్థస్స్యాద్రాజ్ఞో రాఘవ నిగ్రహే ॥

శ్రీరామచంద్రా! రాజును జయించుటకు రాజే సమర్థుడగునట్లు, మనస్సును జయించుటకు మనస్సే సమర్థతగలది యగుచున్నది (అనగా యితరములు కానేరవని భావము)

శ్లో॥ మనసైవ మనశ్ఛిత్వా పాశం పరమబంధనం ।
భవాదుత్తారయాత్మానం నాసావన్యేన తార్యతే ॥

దృఢముగ బంధించునట్టి మనస్సను పాశమును, మనస్సుచేతనే తెగనరికి సంసారమునుండి ఆత్మను తరింపజేసికొనుము. ఈ యాత్మ యింకొక యుపాయముచే తరింపదు అనగా పొంద శక్యముకాదు.

శ్లో॥ భవభావనయా ముక్తో యుక్తః పరమయా ధియా ।
ధారయాత్మానమవ్యగ్రో గ్రస్తం చిత్తం తతః పరమ్ ॥

అవహితమగు చిత్తము కలవాడవై మనస్సునందు బ్రహ్మమును భావింపుము. ఇట్లు భావించు మనస్సును విడచి మనస్సుకంటె పరమగు పరమాత్మను భావనచేయుము.

శ్లో॥ ధ్యానతో హృదయాకాశే విచిచిచ్చక్రధారయా ।
మనో మారయ నిశ్శంకం ఉతో బధ్నంతి నాధయః ॥

హృదయాకాశమునందు జ్ఞాన స్వరూప ధ్యానము, అను చక్రాయుధ ముచే నిస్సంశయముగ మనస్సును జంపితివేని అపుడు (సంసారరూపంబగు) మనోవ్యాధులు నిన్ను బాధింపవు ఇంకనూ :—

శ్లో॥ యదిరమ్యమరమ్యత్వే త్వయా సంవిదితం విదా ।
ఛిన్నాన్యేవ తదంగాని చిత్తస్యేతి మతిర్మమ ॥

ఎపుడు నీవు రమ్యమగు వస్తువును రమ్యముకానిదానిగా తలంతువో అపుడు మనస్సుయొక్క అవయవములు తెగిపోయినవని, నా అభిప్రాయమని శ్రీ వసిష్ఠ భగవానులు తెలుపుచున్నారు——

శ్లో॥ అయంసోఽహమిదం తన్మే ఏతావన్మాత్రకం మనః ।
తదభావనమాత్రేణ దాత్రేణేవ విలూయతే ॥

నేను యిట్టివాడను, అట్టివాడను, ఇది నాది అని భావించు మనస్సు. నేను, నాది, యని భావింపకుండి నంతమాత్రమున కొడవలిచేత త్రెంపబడినట్లు త్రెంపబడుచున్నది——

ఇంకనూ పర్యవసానముగ నిట్లు తెలుపుచున్నారు—

శ్లో॥ సంకల్పమాత్ర విభవేన మనోరిణాల్పం
నిర్జీయసే వివిధవస్తు నిదర్శనేన ।
సంతోషమాత్ర విభవేన మనోవిజిత్య
నిత్యోదితేన సుఖమేహి నిరీప్సితేన ॥

సంకల్పముమాత్రము సామర్థ్యముగాగల మనస్సను శత్రువు అనేక వస్తువు లను గనబరచుచు నిన్ను జయించుచున్నది. (అనగా సంసారదుఃఖ నిమ

గ్నని జేయుచున్నది) కావున సంతోషమను సామర్ధ్యముగల, నిస్సంకల్ప త్వముచేత మనస్సునుజయించి పరమ సుఖము నొందుము

మరియును యీ మనస్సునుగురించి జిజ్ఞాసువులకు నిట్లు తెలుపు చున్నారు —

"కలనోన్ముఖతాం యాత స్తద్రూపం మనసో విదుః" అనగా సంక ల్పాభిముఖంబగునట్టి యే భావము కలదో అది మనస్సుయొక్క రూపము అగును.

శ్లో॥ యతఃకుతశ్చి దుత్పన్నం చిత్తం యత్కించిదేవహి।
నిత్యమాత్మని మోక్షాయ యోజయేన్ముక్తి యుక్తిషు॥

మనస్సు దేనివలన బుట్టినది? అది యేరూపముగలది? అని విచా రించినందువలన ప్రయోజనములేదు. కావున మనస్సును సంసార బంధ విముక్తికొరకు (మోక్షోపాయములందును) మోక్షస్వరూపమగు పరమాత్మ యందును ప్రవేశపెట్టవలయును. (అనగా యీ స్వాత్మాభిన్న పరమాత్మ జ్ఞానముచే అవిద్య అస్తమించి మోక్షము కలుగునుగాని, కేవలము మనస్స్వ రూపమును విచారించుటవలన ఆత్యంతికముగ సంసారదుఃఖమునశించి ముక్తి కలుగదు అని భావము.)

ముముక్షువు తన మనస్సును సర్వదా దృశ్య నానాత్వమునుంచిమరల్చి, స్వస్వరూపమగు ఏకత్వమును గ్రహించుచుండుట యావశ్యకము. మన మింతవరకును, శాస్త్రీయముగ చేసిన తత్త్వ విచారమునుబట్టి, జీవునకు నానాత్వము భ్రాంతియు, కేవల వ్యవహార ప్రయోజన కల్పితమనియూ, నిర్వి కార పరిపూర్ణ అఖండ చైతన్యమే జీవుని పరమార్థ వాస్తవ స్వరూప మనియూ ముముక్షువు యిట్టి తన పరమార్థ వాస్తవ స్వరూపమును తెలిసి కొని స్వానుభవము నొందుటయే, మోక్షమనియూగదా నిశ్చయమగుచున్నది. ముముక్షువునకు యిట్లు తాను గ్రహించిన జ్ఞానమును స్వానుభవము నొందు

టకు బ్రహ్మజ్ఞానాభ్యాసమావశ్యక మగుచున్నది. ఈ జ్ఞానాభ్యాసకులు వారి అభ్యాసమును, దేశముతోగాని, కాలముతోగాని యితర నిమిత్త, పరిస్థితులతోగాని సంబంధములేక జీవునకు ఆత్మవిద్యయగు స్వస్వరూపధ్యానానుసంధానములను సర్వదా చేయుచుండవచ్చును. దీనికి బాహ్య స్థితి, పరికరములతో పనిలేదు. కాని అభ్యాసకుడు శాస్త్రీయమగు తననిత్యానిత్యవివేకముతోడను, శ్రవణమననాదులతోడను మనమునను సంస్కరించుకొని, స్వాధీనమందుంచుకొనినయెడల, తన సత్య స్వరూపమగు బ్రహ్మచింతనయందు ప్రీతికలుగుచుండును. బ్రహ్మ వస్తువుయందట్టి ప్రీతి, నిశ్చయములతోడనుండుటచే, జ్ఞానాభ్యాసకుడు తన ప్రారబ్ధానుసారమున, దేహాదులతో నెట్టి సుఖదుఃఖానుభవములను పొందుచున్ననూ, తన పరిపూర్ణ స్వరూపమును మరువక దానినే స్మరించుచు ధ్యానించగలుగుచుండును. ఇది అభ్యాస సాధ్యము. ఇట్టి అభ్యాసమునకు సాధనము, ముముక్షువగువాడు తన మనసే నని గ్రహించవలయును. బ్రహ్మాభ్యాసకుని పని. అంతయూ తనలోనున్న తన మనసుతోడనే యున్నది గాని, దీనికి బాహ్య పరికరాపేక్ష, నిమిత్త మాత్రమై ప్రధానము కానేరదు. ఇచట అభ్యాసకుడు తెలిసికొనవలసిన రహస్య మొకటి గలదు. అది ఏది యనిన మానవుడు ఏ వస్తువుయందు తాను అన్నిటికంటె అధిక ప్రీతిని పొందునో, సదా ఆ విషయ స్వరూపములే, అప్రయత్నముగ తన మనసునకు గోచరించుచుండును— దీనినే "పరవ్యసనినీ నారీ" అను శ్లోకము వలన, శ్రీవిద్యారణ్య స్వామివారు నిరూపించియున్నారు జ్ఞానాభ్యాసకునకు తన సత్యస్వరూపమందు ప్రీతి, నిశ్చయములు సంపాదించు వరకే క్లేశకరముగనుండును గాని, స్వ. విషయమందు (అనగా నిర్విషయ నందు) తన ప్రయత్న పూర్వకముగ ప్రీతి, నిశ్చయములను, అద్వైత, సిద్ధాంతమందు కలిగించుకొనినయెడల, తదుపరి అభ్యాసాదులు బహు సులభ సాధ్యముగ నుండును. ఎట్లన బ్రాహ్మణునకు స్వాధ్యాయము బాగుగ నోటికి వల్లించువరకే కష్టముగాని, వల్లించిన తదుపరి, తాను తలచినప్పుడెల్ల అవలీలగ నెన్ని పన్నములనైననూ, నెట్లధ్యయనము చేయగలుగుచుండునో

అట్లే యీ జ్ఞానాభ్యాసకుడు తన లక్ష్యమగు స్వస్వరూప బ్రహ్మలక్షణములను బాగుగ గ్రహించి దానిని స్వానుభవము నొందుటకు ప్రీతిని సంపాదించిన, నిత్యాభ్యాస సౌలభ్యము కలుగును — ఏలనన తనకు పరమ ప్రీతికర మగు యీ స్వరూపము స్వాత్మాభిన్నము గనుక అట్టి ఆత్మ స్వరూప ధ్యానాదులను తాను తలచినప్పుడెల్ల చేయుట, సుసాధ్యముగను సుఖకరము గను యుండును. ఈ ఆత్మధ్యానానుసంధానాదులను ముముక్షువు సర్వకాల సర్వావస్థలయందును చేసికొనవచ్చునని శ్రీ శంకర భగవత్పాదులు ఉపదేశ సాహస్రియందిట్లు :—

శ్లో॥ అకాలత్వాదదేశత్వా దదిక్త్వాదనిమిత్తతః ।
ఆత్మనో నైవకాలాదే రపేక్షా ధ్యాయతః సదా ॥

శ్లో॥ యస్మిన్ దేవాశ్చ వేదాశ్చ పవిత్రం కృత్స్నమేకతామ్ ।
వ్రజేత్తన్మానసం తీర్థం యస్మిన్ స్నాత్వాఽమృతో భవేత్ ॥

అనగా జీవునకు తన సత్యస్వరూపమగు ఆత్మకు దేశముతోగాని, కాలముతో గాని, దిక్కుతోగాని, ఒక నిమిత్తముతోగాని పనిలేదు. దేనియందు దేవతలు, వేదములు ఏకత్వమును పొందుచున్నవో, దేనియందు స్నానము చేసిన మానవుడు అమృతుడగుచున్నాడో, అట్టి పవిత్రము, శ్రేష్ఠమునైన మానసతీర్థమును పొందవలెను అని తెలుపుచున్నారు. కావున జ్ఞానాభ్యాసకు లందరును, వారి మనసును యిట్టి పుణ్యతీర్థముగా గావించుటకు సర్వదా ప్రయత్నించుచుండుట యావశ్యకము. మనస్సనునది ప్రతి జీవునకున్నూ, వారి, వారి, యందే యున్నదిగాన, దీని కొరకు బాహ్య పరికరప్రయత్నమా వశ్యకముకాదని చెప్పవచ్చును. గనుక ముముక్షువులు, వారి, వారి, మనసు తోడనే అద్వైత జ్ఞాన తీర్థమును సంపాదించి అందు స్నానము అనగా తన ఆత్మానుసంధానమును స్వాత్మాభిన్నమగు, నిత్య, సర్వకాల, అఖండ, పరి పూర్ణ చైతన్య ప్రవాహమును, సేవించుచుండవలెను. ఇది యే అమృ తత్వము నిచ్చు తీర్థ స్నానముగాని తక్కినవి గౌణ సాధనములగునని

సాక్షాత్కారమనగా, జీవుడు తన పరమార్థ వాస్తవ స్వరూపానుభవమునొందుట. జీవునకిది ప్రాప్య ప్రాప్తముగాని, క్రొత్తగ బైటనుండి తీసికొనిరావలసిన పదార్థము కాదు. ఒక్కడైన యీ ఆత్మయే సర్వజీవుల హృదయమందు తెలిసికొనబడునదై యున్నది సర్వజీవులకును వారి వారి ఈ ఆత్మనుబట్టియేసర్వ భూతములకంటెను పరమ ప్రీతి వారియందే కలుగుచున్నది. ఎవరికైనను, వారికన్న నెక్కువగా ప్రేమించు పదార్థము లేదు ఈ ఆత్మ సుఖస్వరూపము. కావుననే ప్రతిజీవియు కోరునది సుఖమేగనుక అట్టి పరమ సుఖము వారి యందే కలుగుచున్నను, జీవుడు అనాది అజ్ఞానవశుడై ఈ సుఖము బాహ్య వస్తునిష్ఠమని భ్రమచెంది సుగంధమగు కస్తూరి తన నాభి యందున్న లేడియే ఈ సువాసనకు అటు నిటు పరుగిడుచున్నట్లు, తనయందున్న సుఖ స్వరూపమును గుర్తింపలేక ఈ సుఖమునకు విషయ వాంఛలను చేయుచుండును కాని యీ విషయ సుఖములన్నియు ఆభాస మాత్రములు అనిత్యములే యగుచు జీవునకు తన స్వరూప సుఖమునకు బదులుగ దుఃఖ పర్యవసానము నిచ్చుచున్నవి ఈ దుఃఖమువలన తిరిగి సుఖమునకు జీవుడు ప్రయత్నించుచుండును ఈ విషయ సుఖములే నిత్యమైనయెడల జీవునికి తిరిగి దుఃఖము కలుగగూడదు. కాని, సుఖానంతరము జీవునకు దుఃఖమే కలుగుచున్నది ఇట్లు చర్విత చర్వణముగా తనకు కలుగుచున్న సంసార దుఃఖమును శాశ్వతముగ, అనగా తిరిగి తనకు దుఃఖము ఎన్నటికిని కలుగకుండునట్లు చేసికొనుటకు, జీవునకు తన పరమార్థ స్వరూప జ్ఞానానుభవమువలనగాని సాధ్యముకాదు. ఇందుకుగాను ఇంతవరకు మనముచేసిన వివేచన విమర్శలవలన జ్ఞానాభ్యాసకుడు తన సత్య స్వరూపమును అఖండాకార వృత్తిచే గ్రహింపవలసియున్నది గాని మరి వేరువిధములేదు. ప్రతి జీవియు సుషుప్తియందు అఖండాకార వృత్తివంటి స్థితిని పొందునుగాని అట్టి అఖండానుభవము వృత్తి రహితముగను, తమోగుణ ప్రధానముగను తన అజ్ఞానముచే కలుగుచున్నది. దీనినిగురించి లోగడ బాగుగ విమర్శించి యుంటిమి. కావున జ్ఞానాభ్యాసకుడు దానినంతయు జ్ఞప్తియందుంచుకొని,

తన అఖండ స్వరూపమును జ్ఞానసహితముగ తన వృత్తితోడ గ్రహించి అను సంధానాదుల జేయుచుండుట మోక్ష ప్రాప్తికి ఆవశ్యకము. ఈ అఖండా కార వృత్తి యెటులుండవలెననిన, తన సత్యస్వరూపమైన బ్రహ్మస్వరూప లక్షణములగు సత్యజ్ఞానానంత లక్షణములతో స్వాత్మాభిన్న అఖండాకారమును తన వృత్తితోడ అనుసంధానాద్యభ్యాసములను చేయుచుండవలయును.

పర్యవసానముగ బ్రహ్మజ్ఞానాభ్యాసపరుడు పరమ సిద్ధాంతముగా గ్రహించి, తన పరమ ప్రాప్తినొందుటకు, తన పరమార్థ స్వరూపమును ఆత్మ సాక్షాత్కారపర్యంతము నిట్లు ధ్యానానుసంధానములను సర్వదా చేయు చుండవలయును ఎట్లన— ఏ అద్వితీయ అఖండ పదార్థము యీ స్వశరీర సర్వదృశ్య జగత్తునకు, దాని ఉత్పత్తి, స్థితి, లయములకు వివర్త అభిన్న నిమిత్తోపాదాన కారణమగుచు సర్వాధిష్ఠానముగ నున్నదో, ఏది స్వప్రకా శమో, ఏది సర్వాధిష్ఠానమై సర్వజీవులయొక్క పరమార్థ స్వరూపమై ప్రత్య గాత్మ స్వరూపమున వారి వారి హృదయపుండరీకములందు చిదాకాశ స్వరూ పముగ తెలియబడుచున్నదో, ఏ ప్రకాశముచేత యీ సర్వము భాసింపబడుచు, సూర్యచంద్రాదులుగూడ ప్రకాశింపజేయబడుచున్నారో, ఎచట సూర్యచంద్రో దయాస్తమయము లుండవో, ఏది నిర్మల మహాకాశములాగున సర్వ వ్యాప కమై అసంగముగ నున్నదో, ఏది నిత్య, నిర్వికార, అసంగ, పరిపూర్ణ పదార్థమో, దేనికన్న మరియొక పెద్ద వస్తువుగాని లేక చిన్నవస్తువుగానిలేదో, ఏది సజాతీయ, విజాతీయ, స్వగతభేద రహితమై, జీవునకు కాలత్రయ, అవస్థాత్రయాబాధితమై, పరిచ్ఛేదరహితముగ నున్నదో, ఏది జన్మ, జరా మరణ వర్జితమో, ఏది స్థాణువువలె అచలమై సర్వగతముగ నున్నదో, దేని కంటె పూర్వపు వస్తువు లేదో, ఏది పరిపూర్ణ నిర్విశేషమో, ఏది నిర్మల మహాకాశములాగున స్వశరీర, సర్వదృశ్య బాహ్యాంతరములందు సర్వ వ్యాపకమై అసంగముగనున్నదో, అట్టి నిత్యనిర్వికార, అద్వితీయ, అఖండ పరి పూర్ణ చైతన్యమే నా స్వరూపము అనగా నేను, "అహం" అని, సర్వదా, మనన, ధ్యానానుసంధానాదుల చేయుచుండవలయును. ఇది యెట్లన, లోగడ

తెలిపిన సూత్రింపు ఉదాహరణములనుగాను, లోక వ్యవహారమునందు, ఘటాకాశ, మహాకాశములను సాంకేతికములున్ననూ వాస్తవమున మహాకాశ మొక్కటియే. సర్వ బాహ్యాంతర వ్యాపకమై, అసంగముగ నెట్లున్నదో అట్లునూ, సముద్ర జలములోనుంచిన లవణ శకలము సముద్రములోనే కలసి అనగా లయమై బాహ్యాంతరములను వ్యత్యాసములేక, అఖండ సముద్ర జల రూపమునే యెట్లు పొందుచున్నదో, అట్లే తన స్వరూపము అద్వితీయ, నిత్య, నిర్వికార అఖండ పరిపూర్ణ చైతన్య స్వరూపమే గాని మరియొకటి కాదని గ్రహించి (అనగా స్వశరీర సర్వ దృశ్యమును జ్ఞాన పూర్వకముగ త్యజించి అనగా అఖండ చైతన్యమునందు లయింపజేసి) తన సత్య స్వరూపము సత్య జ్ఞానానంత స్వరూపమగు అఖండపరిపూర్ణ చైతన్యమని, ఏకత్వముగ అఖండాకార వృత్తితో ధ్యానించుచుండుటయే ముముక్షువు తన పరమ ప్రాప్తికి సాక్షాత్సాధనమని, పరమ సారాంశముగ, ప్రీతి నిశ్చయములతో గ్రహించి బ్రహ్మాభ్యాసము చేయుచుండవలయును.

ఈ గ్రంథమున శాస్త్రము తెలిపిన అద్వైత సిద్ధాంతమును దృఢముగ పునః, పునః, నింతగ వ్రాయుటచే ముముక్షువులగు పాఠకులు, యీ "వైరాగ్యము" "అద్వైతము" అను శబ్దముల అర్థ గ్రహణమందు, పొరబడుదురేమోనను సంశయముతోడ, శాస్త్రము చెప్పునట్టి విషయమునే నిజమై వివరించుచున్నాను ముముక్షువులకు "వైరాగ్యము" "అద్వైతము" అను రెండు స్థితులును, సత్యజ్ఞానపూర్వకమగు మానసిక పరిస్థితులేగాని, కేవల క్రియారూపములు గావు. ఇందు వైరాగ్యమన నెట్టిదో జనక గురువగు శ్రీ యాజ్ఞవల్క్య మహర్షి తన శిష్యులగు కొందరు సన్యాసులకు, చక్రవర్తియగు జనకులవారితోపాటుగ, తత్త్వ విద్యను బోధించు కాలమున, తన శిష్యులైన సన్యాసాశ్రమము స్వీకరించినవారికన్న, జనక మహారాజు వైరాగ్యము గొప్పదై, పరిపూర్ణమునని, యొక నిదర్శనముచే ఋజువుజేసి నిరూపించియుండిరి. ఇది శాస్త్రప్రసిద్ధమే గావున గ్రంథ బాహుళ్యమగునను భీతితోడ, దాని నిచట నుదాహరించుటలేదు. అప్పుడే జనక చక్రవర్తి

"మిథిలాయాం ప్రదగ్ధాయాం నమే కించిత్, ప్రదహ్యతి" అనగా మిథిలా నగరము దగ్ధమైన నాకేమియని వారు పాతముగ కూర్చున్న పీఠమునుంచి కదలకయే, యీ గంభీర వచనమును చెప్పినట్లు తెలియుచున్నది. ఇచట సన్యాసులా, దేహముతోడ, సమస్త విషయములను వదలినట్టి యుత్యాశ్రమ వాసులు జనకులవారన్ననో వారి దేహముతోడ సమస్త భోగముల ననుభవించుచు, రాజ్యాధికారముతోనున్న ప్రవృత్తి గనుక జనకులవారిది పరిపూర్ణ వైరాగ్యమనిన్నీ, సన్యాసుల మనుకొను తక్కిన యుతీశ్వరుల వైరాగ్యము అల్పమనిన్నీ, వారి సంపదలవలననే రుజూవుచేయబడినదిగదా! కావున ఈ జ్ఞానాభ్యాసకులు, కాయికముగ కేవల వస్తు, విషయ త్యాగమువలననే, పరిపూర్ణ వైరాగ్య సిద్ధి యగునని పొరబడకూడదు. వైరాగ్య మనునది ప్రధానముగ మానసిక స్థితిరూపమై, బాహ్యవస్తు త్యాగ దేహ పరిస్థితులు దానికిసాధనమై అప్రధానముగ నుండవలయునని అభ్యాసకులు గ్రహించవలయును. వైరాగ్యమున్న, వారి, వారి ప్రారబ్ధానుసారముగ నొందవలసిన సుఖ దుఃఖభోగములను, దేహముతోడ ననుభవించవలసి యున్ననూ, స్వశరీర సర్వదృశ్యము, పరమార్థ వాస్తవము కాదను దృఢ నిశ్చయముతో వారి, వారి ప్రారబ్ధానుసార భోగములను అవి సుఖ, దుఃఖ రూపమున నెట్టివైనను, వాటియందు కర్తృత్వాభిమాన రహితులై, నిర్లిప్తతతో తమ ప్రారబ్ధమును క్షయింపజేసుకొను చుండుటయేగాని, కేవల బాహ్యక్రియా రూపముగ మాత్రమే భోగములను విడచుట కాదని అభ్యాసకులు నిశ్చయముగ గ్రహించవలెను. సారాంశమున సూత్రప్రాయముగ, వైరాగ్యమనిన నెట్లుండవలెననిన, లేనిదానిని కోరకుండగనూ, తనకు సంప్రాప్తమైన సుఖ దుఃఖ భోగము లెట్టివియైనను సంతోషముగ ననుభవించుచు వాటిని విడువకుండుట. కాని యిది కేవలము జ్ఞానులగువారికి సాధ్యముగాని, శబ్దార్థముచే సామాన్యముగ కనబడునంత సులభము కాదు.

శాస్త్రము, ముముక్షువులకు, జగన్మిథ్యాత్వమునున్నూ జీవుని పరమార్థ సత్య స్వరూపమును గురించియున్నూ అన్నివిధముల అద్వైతమును బోధిం

చుచున్ననూ బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు అభ్యసించవలసిన అద్వైతస్థితి, తనకు మానసికము, జ్ఞానరూపమే గాని క్రియారూపము గాదని విశదముగా తెలిసికొనవలయును క్రియారూపము, అద్వైతముగా నుండుటకు వీలులేదు. జీవునకు క్రియాద్వైతము శాస్త్రనింద్యము. ఏలనన అద్వైతము నిష్క్రియమైనది క్రియ యెల్లప్పుడునూ కర్త నపేక్షించుచుండును. కావున క్రియవల్ల సిద్ధించునది ద్వైతము గాని అద్వైతము, అనగా అద్వితీయము కాజాలదు. కనుక జ్ఞానాభ్యాసకుడు యీ అద్వైతపదార్థస్థితిని తనవృత్తితోడనే గ్రహించుచు సిద్ధిని బడయవలయును. అందుకుగాను యిది కేవలము, ముముక్షువు మానసిక పరిస్థితినిబట్టియె కలుగవలయును. అయినను అభ్యాసకాలమందు ముముక్షువులకు, స్వస్వరూపమననాది క్రియలు ఆవశ్యకములు. ఇవి గూడ స్వరూపమున క్రియలే యగుచున్నను, యీ క్రియలు కేవల మానసికములగుటచే లౌకిక క్రియలవంటివిగాక మానసికములే యగును. అభ్యాసకులకు యిట్టి క్రియా, బాహ్య పరిస్థితులను సాధనములుగ గ్రహించుట యావశ్యకమైనను అద్వైతస్వరూపము కేవల క్రియారూపమున నుండుటకు వీలులేదు. ఈ అద్వైత జ్ఞాన సిద్ధి యనునది వస్తుతంత్రముగాని కర్తృతంత్రము గాదు. కావుననే అద్వైతమనునది నిష్క్రియము, నిత్యము, నిర్వికారము, నగు అఖండ పరిపూర్ణ చైతన్యము. ఇదియే బ్రహ్మ వస్తువు దీనిని యున్నది, వాస్తవమున నున్నదానివలెనే తెలిసికొన వలయును, గాని కర్తృతంత్రముగ మార్చుటకు వీలుకాదు, యెన్నటికిని మారదు జీవుడు తనకుపరమార్థవాస్తవమగు నిట్టి బ్రహ్మ వస్తువును తన మనసుచేతనే పొందవలయును గాని వేరుదారిలేదు. ఈ మనసనునది ఉపాధినాశ్రయించుకొని యుండును. నిరుపాధికముగ పని జేయజాలదు. కావున జ్ఞానాభ్యాసకుడు తన మనసువలన తన పరమలాభమగు మోక్షప్రాప్తికి, తన శరీరోపాధిని రక్షించుకొనుట యావశ్యకము ఏలనన దేహము రథమువంటిది. మనసు లేక బుద్ధి యనునది సారథి వంటిది. ఈ మనసుయొక్క సాహాయ్యముతోడనే ముముక్షువు తన గమ్యస్థానమగు బ్రహ్మపదము నొందవలయును. ఇట్లుండ రథమనునది

లేనిదే సారథ్యమేయుండుటకు వీలు కాదుగదా ! రథసారథ్యములు లేనియెడల ముముక్షువు తన గమ్యస్థానమగు బ్రహ్మస్వరూపము నొందుటకు వీలుండదు గదా ! కావున "శరీర మాద్యంఖలు ధర్మసాధనం" అనగా శరీరము యున్నయెడలగాని ముముక్షువునకు ధర్మమును పొందుటకు వీలుకాదుగదా ! అని వచనము తెలుపుచున్నది. జీవునకు వ్యవహార అనగా అర్థ, పరమార్థములలో దేనిని సంపాదించుటకైనను, యీ దేహము ఆవశ్యకము. అయినను కేవల వ్యవహారి తన దేహముతో అర్థార్జన మెట్లు చేయుచుండునో, అట్లే బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు తన దేహమునే సాధనముగ తీసికొని, తన పరమార్థమును సంపాదించవలసియున్నది. దేహము లేనిచో, ముముక్షువునకు, తన మోక్ష ప్రయత్న సాధనమే యుండదు తనకు సాధనమే లేకుండినయడల సిద్ధిని బడయుటెట్లు ? కావున జ్ఞానాభ్యాసకులు ఈ విషయమును బాగుగ గుర్తించి, వారి మనసును శాస్త్రీయముగ సంస్కరించుకొనుటకు, వారి, వారి సాధనలకు అనుకూలముగను, సత్త్వప్రధానముగను, శక్తిసామర్థ్యములతో యుండునటుల వారి దేహాదులను రక్షించుకొనుట యావశ్యకము కావున గీతలలో తెలుపబడినయటుల "యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మను" అను వచనముననుసరించుచు, బాహ్యాంతర శుచిర్భూతులై, సాధు సంగమ సచ్ఛాస్త్రాభిలాషలతోడ వారి ప్రారబ్ధకాలమును గడుపుచు, తమ వ్యవహారానుభవములను, ప్రారబ్ధ క్షయమును, నిర్లిప్తతతోడ గావించుచు శరీర రక్షణ గావించుకొను చుండవలయునేగాని, యెంతటి బ్రహ్మజ్ఞానాభ్యాసకులైనను వారి, ఆరోగ్యస్థితి, దేహధారణానుకూలతలను, ఉల్లంఘించకూడదని శాస్త్రమే తెలుపుచున్నది.

వైరాగ్యము, జీవునకు స్వస్వరూప జ్ఞానమగు అద్వైతసిద్ధికి ముఖ్య సాధనము. ఈ వైరాగ్య మనునది ముఖ్యముగ, స్వశరీర జగన్మిథ్యాత్వ జ్ఞాన నిరూఢివలననే గలుగును. బ్రహ్మజ్ఞానాభ్యాసికి ఈ జగన్మిథ్యాత్వజ్ఞాన నిశ్చయమనునది యెట్లుండవలెననిన ; తాను చాలాకాలముగ నివసించుచున్న తన పారంపర్య గృహమును అమ్మివేసిననూ ఆ గృహముండునట్టి, ఆ వీధి

లోనే కాపురముండువానికి యెట్లాగున నుండవలయును? అట్లే యీ పురుషుడా వీధిలోనే కాపురముండువాడే, ఒకానొకప్పుడు తన స్వత్వము గలిగిన గృహమును, తన తాకట్టునుండు సమయమున ఇతరులు చూచుచున్ననూ, దానియందు తనకు స్వతంత్రాభిమానము లేకుండక ఉన్ననూ, పూర్వ స్మరణమాత్రముగనే యెట్లుండునో, అట్టి బుద్ధిగోచరే, తన శరీరప్రపంచదృశ్యమునూ చూచుచు అనుభవించుచుండవలయును. పిమ్మట. జ్ఞాని. ఈ స్థూలశరీర ప్రపంచ దృశ్యమును అవాస్తవమని తెలిసికొని, తన సంబంధమును త్రెంచుకొన్నను, తాను, తన యీ దేహప్రారబ్ధభోగాంతము వరకును. తన గృహమును అమ్మిన వీధిలోనే యుండవలసివచ్చినట్లు తాను ప్రపంచమున నుండవలయును గాన, చూచుట, స్మరణ, అను యావదనుభవములైనను నుండును ఐనను అట్టివి తనకు నిర్బాధకము లగును. ఎట్లన తన గృహమును కొనినవాడు దానిని పడగొట్టుచున్ననూ, వృద్ధి చేయుచున్ననూ, తాను చూచుచునే యుండును గాని అంతకుమించి ఆక్షేపణతో తాను దుఃఖపడడు. హర్ష క్లేశముల నొందడుగదా! ఇట్లే తీవ్ర ముముక్షువగు జ్ఞానార్థియొక్క స్థితి, యీ జగమున నుండును

ఇంతవరకునూ మనము చేసిన శాస్త్రయుక్తివివేచన, నిరూపణలతోడ, బ్రహ్మాభ్యాసకుడు, తనకు ప్రధానముగ, నేను, నాది యను ప్రతీతినిచ్చుచున్న తన దేహాదులు వాస్తవములు కావని. యింకనూ వివరముగ దృఢపడనొందవలయును.

పంచభూతాత్మకమై కార్యరూపమగు ఈ పాణిపాదాది దేహము నేను. కాను. ఇట్లే నాలోపలి పనిముట్టు అగు నా అంతఃకరణము నేను గాను. నా పనిముట్టు నేనెట్లగుదును? కాను. కనుక, జడమగు నా అంతఃకరణ పరిణామములైన మనోబుద్ధి చిత్త అహంకారములలో నేదియును, నేను, అగుటకు వీలులేదు. నేను కాను. కేవల వాయు వికారమై స్పందరూపమునయున్న ప్రాణముగూడ నేను, అగుటకు వీలు లేదు, ఏలనన, నిదియు పంచభూతములలోనిదే. ఇంకనూ నాకీ యింద్రియ విషయ సంయోగముల

వలన గలుగుచున్న వృత్తిజ్ఞానముగూడ నేను, అగుటకు వీలులేదు. ఈ వృత్తిజ్ఞానమే విజ్ఞానకోశ మని చెప్పబడుచున్నది. నేను విజ్ఞానమయుడను కాదు. ఇది విషయేంద్రియజన్య జ్ఞానము. స్వరూపజ్ఞానము కాదు, గనుక నిది నేను అగుటకు వీలులేదు. ఇంకనూ నాకు సుషుప్తియందు, అజ్ఞానముచే కలుగుచున్న ఆనందాభాసముగూడ నేను కాదు. ఏలనన యిది సుషుప్తియందు నా అజ్ఞానములో సమస్త దృశ్యమును తాత్కాలికలయమై కలుగుచున్న ఆనందమేగాని యిది వాస్తవానందము గాదు. ఏలనన జీవుని అజ్ఞానముతో కలసి యీ ఆనందము స్ఫురించుచున్నదిగాని కేవలానంద స్వరూపముండదు. కావున నేను, గాను, శ్రుతి కేవల స్వరూపానందమే నా సత్య స్వరూపమని "ఆనందో బ్రహ్మ" అని తెలుపుచున్నది. కావున వాస్తవముగ నేను సచ్చిదానంద స్వరూపుడనేగాని వేరుగ నుండుటకు వీలులేదను, నిశ్చయమునొంది, ముముక్షువు తన పరమార్థ స్వరూపమగు సత్యజ్ఞానానంత లక్షణములగు బ్రహ్మ స్వరూపమే తాను అనగా నేను అని ధ్యానాదులు చేయుచుండుటయే తన మోక్షప్రాప్తి సాధనమని యెరుగవలయును.

ప్రతి జీవునకున్నూ తనశరీరము మూడు భాగములు గలదిగనుండును. ఏవి యనిన — 1 స్థూల శరీరము, 2 సూక్ష్మ శరీరము, 3 ఆత్మ అనునవి. ఇందు ఆత్మ పదార్థ మొక్కటియే పరమార్థ సత్యమనియు, తక్కిన రెండును జీవునియొక్క ప్రారబ్ధఫలానుభవములకుగాను కల్పితములైన ఉపాధులనియు లోగడనే విమర్శించి తెలిసికొనియుంటిమి. జీవుని నిత్య నిరతిశయ సుఖస్వరూపము ఆత్మ. దీనిని తెలిసికొని స్వానుభవము నొందుటయే మోక్షమని శాస్త్రము తెలుపుచున్నది. కావున ఈ యాత్మజ్ఞానమును సంపాదించుట ముముక్షు కర్తవ్యము. దీనిని సాధించుటకు తన స్థూల సూక్ష్మ దేహములే సాధనములు. ఇందు స్థూలదేహము సామాన్య సాధనము. మనోరూపమున నుండు సూక్ష్మదేహము ప్రధాన సాధనముగ నుండును. ఈ సూక్ష్మదేహమే మనస్సు. ప్రతివానికిని యీ మనస్సే వారి వారి బంధ మోక్షములకు కారణమని—

"మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః"

అను వచనము తెలుపుచున్నది. ఏలనన– యీ మనస్సుకు సర్వదా సంకల్పములను చేయుచుండుట స్వభావము. ఈ సంకల్పమువలననే జీవులకు సంసార దుఃఖము కలుగుచు, ఈ సంకల్పములు ఎంతెంత క్షీణించుచుండిన అంతంత సుఖము కలుగుచుండును ఇంకనూ జీవునకు ఈ మనస్సంకల్పనాశమే మోక్షమనికూడ చెప్పబడుచున్నది కావున జీవుడు ఈ మనస్సుతో చేయునట్టి పనులే, అనగా–అనుసంధానములే ప్రధానములుగాని, దేహముతో చేయునవి ప్రధానములు కావు. కావుననే– మనస్సు చేసిన పనియే పనియగునుగాని, శరీరముమాత్రము చేసినపని పని కాదనియు, మనస్సు విడిచిన వస్తువే విడిచినదగునుగాని శరీరముమాత్రము విడిచినది విడిచినది కాదనియు ఎఱుంగుమని శ్రీరామచంద్రమూర్తికి–

"యత్కృతం మనసానామ తత్కృతం విద్ధిరాఘవ।
యత్త్యక్తం మనసా తావత్తత్యక్తం విద్ధిరాఘవ"

అని వసిష్ఠ భగవానులు తెలుపుచున్నారు. కాని యీసూక్ష్మోపాధియగు మనస్సు దాని స్వభావముచే సర్వదా సంకల్ప జాలమును కల్పించుచు జీవుని సంసార నిమగ్నుని జేయుచుండును. దీనినే శ్రీ వసిష్ఠభగవానులు చిత్తవ్యాధియని తెలుపుచు, దాని నివర్తకోపాయమును ఈ క్రింది విధమున దెలుపుచున్నారు—

"సంయమాన్మనసః శాంతి మేతి సంసార విభ్రమః।
మందరే స్పందతాంయాతే యథాక్షీర మహార్ణవః॥"

మందర పర్వతము చలింపకుండనుండగా, పాలసముద్రము యొక్క సంక్షోభము అణగినట్లు, మనస్సు నిరోధము వలన చలింపకుండనుండగా సంసార భ్రాంతి అణంగును.

"మనసో వృత్తయో యాయా భోగసంకల్ప విభ్రమాః ।
సంసార విషవృక్షాణాం తా ఏవాఽఙ్కురపఙ్క్తయః" ॥

శ్రీరామచంద్రా! విషయముల ననుభవించు సంకల్పములతో గూడినమనో వృత్తులే సంసార వనమందున్న విషవృక్షములకు మొలకలని తలంపుము.

"అస్య చిత్తమహావ్యాధే శ్చికిత్సాయాం పరౌషధమ్ ।
స్వాయత్తం శృణు వక్ష్యామి సుసాధ్యం స్వాదు నిశ్చితమ్" ॥

చిత్తము యొక్క యీ వ్యాధికి చికిత్సవిషయమై అనుపానముతో పనిలేనిదియు, సులభసాధ్య మైనదియు, మధురమైనదియు, నిశ్చయముగా వ్యాధిని అడంచు నదియునగు పరమౌషధమును చెప్పుచున్నాను. వినుము.

"త్యజన్నభిమతంవస్తు యస్తిష్ఠతి నిరామయః ।
జితమేవ మనస్తేన బాహ్యంప్రసరముజ్ఝతా" ॥

ఎవడు ఇష్టమగు వస్తువును విడిచియు మనసును బాహ్యవిషయముల మీదికి పోనీయక మనసున వ్యసనము నొందకుండునో, వాడు మనసును జయించిన వాడేయగును.

"శాస్త్ర సంగమ తీక్ష్ణేన చింతాతప్త మతాపినా।
ఛిన్ధి త్వమాయసేనాయో మనసైవమునే మనః" ॥

(కోరికనువిడుచుట మనస్సును జయించుట కుపాయమగునేని, కోరికను విడుచు నుపాయమేదని శంకించి చెప్పుచున్నాడు ) సానబెట్టబడినట్టియు కాచబడనట్టియు ఇనుపసాధనముచే, కాచినయినుమును సఱికినట్లు, వేదాన్త శాస్త్రాభ్యాసము చేతను సత్పురుష సాంగత్యముచేతను చురుకైనట్టియు సంతాపము నొందనట్టి మనస్సుచే సంసారచింతచే క్రాగియుండిన మనస్సును ఛేదింపుము. (వేదాన్తశాస్త్రాభ్యాసముచేతను సత్సాంగత్యము చేతను కోరికను విడువనగునని భావము.)

"స్వపౌరుషైక సాధ్యేన స్వేప్సితత్యాగరూపిణా।
మనః ప్రశమ మాత్రేణ వినా నాస్తి శుభా గతిః ॥"

పురుష ప్రయత్నముచేతను సాధ్యమై స్వేచ్ఛయు కోరికను విడచుటమాత్రముచే సిద్ధించునట్టి చిత్తశాంతికంటె వినాగా మంచిమార్గము లేదు.

"తాం మహాపదవీ మేకాం కామప్యధిపదం స్థిరమ్।
చిత్తం చిత్సాక్షికంకృత్వా చిత్తాదపి పరో భవ ॥"

చిత్తమునందు బ్రహ్మమును ధ్యానించి అట్టి బ్రహ్మచింతాగ్రస్తమగు చిత్తమును సాక్షి చైతన్య మాత్రము మిగులునదానినిగా జేసి చిత్తముకంటే పరుడగు సాక్షిరూపుడవు అగుము.

"అవధానతయా యుక్తో యుక్త్యా పరమయా ధియా।
ధారయాత్మాన మవ్యగ్రో గ్రస్తం చిత్తం తతః పరమ్ ॥"

అవహితమగు చిత్తము కలవాడవై మనసునందు బ్రహ్మమును భావింపుము. ఇట్లు భావించుచు మనస్సును విడిచి మనస్సుకంటె పరమగు ఆత్మను ధారణ చేయుము.

"పరం పౌరుషమాశ్రిత్య నీత్వాచిత్త మచిత్తతామ్।
తాం మహాపదవీ మేహి తత్రనాశోన విద్యతే ॥"

యమము నియమము మొదలగు పురుషప్రయత్నములనాశ్రయించిమనస్సును సంకల్పరహితముగా జేసిబ్రహ్మపదమును పొందుము. అట్టిబ్రహ్మపదము నొందినవారలకు నాశములేదు.

"ధ్యానతో హృదయాకాశే చితి చిచ్చక్రధారయా।
మనో మారయ నిశ్శంకం తతో బధ్నంతి నాధయః ॥"

హృదయాకాశమునందు జ్ఞాన స్వరూపుడగు పరమాత్మయొక్క ధ్యానము అను వజ్రాయుధముచే నిస్సంశయముగా మనస్సును ఖండితిచేసి అప్పుడు మనో వ్యాధులు నిన్ను బంధింపవు

"అయంసోఽహ మిదం తన్మే ఏతావన్మాత్రకం మనః ।
తదభావనమాత్రేణ దాత్రేణేవ విలూయతే ॥"

నేను ఇట్టివాడను, అట్టివాడను, ఇదినాది అని భావించు స్వభావము గల మనస్సు, నేను నాదియని భావింపకుండినంతమాత్రముచే కొడవలిచేత త్రెంప బడినట్లు త్రెంపబడుచున్నది.

"సంకల్పమాత్రవిభవేన మనోఽరిణాత్వం,
నిర్జీయసే వివిధ వస్తు నిబద్ధనేన ।
సంతోషమాత్ర విభవేన మనోవిజిత్య
నిత్యోదితేన సుఖమేహి నిరీప్సితేన ॥"

సంకల్పమాత్ర సామర్థ్యముగల మనశ్శత్రువు అనేక వస్తువులను గనబఱచుచు నిన్ను జయించుచున్నది కావున సంతోషమను సామర్థ్యముగల నిస్సంకల్ప త్వముచేత మనస్సును జయించి సుఖమొందుము.

కావున జ్ఞానాభ్యాసకులు వారి మోక్షసిద్ధికి యీ మనః ప్రాధాన్యమును గుర్తించి దేహముతో వారి వ్యవహారముల నాచరించవలసియున్ననూ, అనగా చేయుచున్ననూ వారి మనస్సు అను ప్రధానసాధనముతోడ వారి బ్రహ్మానుసంధా నాద్యభ్యాసముల నాచరించుచు, యీ వ్యవహారము సంతయును, వారి ప్రారబ్ధ ఫలానుసారమున భోగమునకు గాను కల్పితమైన దానినిగ తెలిసికొనవల యును. అనగా నిశ్చయము నొందవలయును ఇట్టి నిశ్చయముతోడనే వారి ప్రారబ్ధానుసారమున, యెంతటి సుఖదుఃఖ భోగముల ననుభవించుచున్ననూ, ఈ వ్యవహారములన్నియూ, వారికి అనగా తనకు వాస్తవముగ సంబంధించినవి కావని ప్రతి క్షణమునను స్మరించుకొనుచు, అయినను ఈ ప్రారబ్ధానుభవము,

జీవులకు సాధారణముగ తప్పదు గనుక, తన ప్రారబ్ధ క్షయమునకుగాను తనయొక్క ఈ సుఖదుఃఖ వ్యవహారానుభవములను చేయుచున్నానను నిశ్చయ బుద్ధితోడ తన సమస్త అనుభవములను పొందుచుండిన యెడల, కాలక్రమమున సంసారబంధము క్షీణించుచుండును. దీనికి తన మనస్సే ముఖ్యసాధనముగాని, మరియొకటికాజాలదని జ్ఞానాభ్యాసకుడు నిస్సంశయముగ నెరుగవలయును ఇంకనూ బ్రహ్మప్రాప్తి తన మనస్సును జయించుటవలనగాని కలుగదు. కాని యిట్లు జయించుటకు తన మనస్సుకన్న వేరు సమర్ధతగల సాధనము లేదని శ్రీ వసిష్ఠ భగవానులు—

శ్లో॥ మనఏవ సమర్థం హి మనసో దృఢ నిగ్రహే ।
అరాజా కిం సమర్థస్స్యా ద్రాజ్ఞో రాఘవ నిగ్రహే ॥

అని శ్రీరామచంద్రమూర్తికి తెలుపుచున్నారు. కావున జ్ఞానాభ్యాసకుడు తన మనస్సును శాస్త్రీయముగ సంస్కరించుకొని, దానివలననే స్వశరీర జగన్మిథ్యాత్వజ్ఞానమును, స్వస్వరూప గ్రహణానుభవములను పొందవలయునేగాని మరి వేరు దారి లేదు.

ఇచట అధికారి పరోక్షజ్ఞానములో తాను పరమాత్మ స్వరూపుడననియూ, ఈ స్వశరీర సర్వదృశ్యమును తనయందే అధ్యస్తముగ భాసించుచున్నదనియూ, పరమార్ధవాస్తవమున నిది యంతయు మిథ్యామాత్రమే ననియూ బాగుగ తెలిసికొనినవాడు కనుక సాధారణముగ తప్పనట్టి తన ప్రారబ్ధానుసార వ్యవహారానుభవములను చేయుచుండినను, నేను, నాది యను వాటి నన్నిటినీ అవాస్తవములు, అనిత్యములు అను జ్ఞానముతోడ—

"మిథిలాయాం ప్రదగ్ధాయాం న మే కించిత్ప్రదహ్యతి"

అనునట్టి జనక వచనమును మనసున నుంచుకొనుచు, దాని వాస్తవార్థము నెల్లప్పుడును స్మరించుకొనుచు భావన చేయుచుండుటచే ప్రారబ్ధానుసారమున తన వ్యవహారములు జరుగుచున్నను వాటి అనుభవమందు సౌలభ్య మేర్ప

డును. ఇంకను నిదియే తన స్వస్వరూపాను సంధానాభ్యాసాదులకుచిత్త స్థైర్య మును విశ్రాంతిని కలిగించుననుట కెంతమాత్రము సందియము లేదు.

కాని యిచట నొక సంశయము కలుగవచ్చును. ఏదియనిన — జనకుల వారు చెప్పినట్లు మనము చేయగలమా యనునది. కాని యిట్లు సంశయించుట కవకాశములేదు. ఏలనన, ఐశ్వర్యమందు జనకులవారి కిట్టి మానసిక పరిస్థితి సిద్ధస్థితియై యున్నది. కాని అభ్యాసకున కిది సాధింపవలసిన స్థితి. ఇట్టి మానసిక స్థితి యెన్నటికైనను అభ్యాసకునికిగూడ కలుగవలసినదే. కావున అభ్యాసకుడుగూడ నిట్టి స్థితిని పొందుటకు అట్టి స్థితియొక్క భావన ఆవశ్యక మగుచున్నది ఈ విద్యయందు ప్రీతిగల అభ్యాసకునకు భావనయేగదా చేయవలసినది. ఈ భావనను అభ్యాస పాటవముచే సాధించవచ్చును. సర్వసిద్ధులు భావనాభ్యాస పాటవముచేతనే పొందబడుచున్నవని "భావనాదార్ఢ్యాత్సిద్ధిః" అను సూత్రము తెలుపుచున్నది. వారి వారి సంసార వ్యవహార పరిస్థితులనుబట్టి చూచిననూ, జనకులవారి సంసారము, సంపదలు, బాధ్యతలు, రాజ్యభారముకన్న, అభ్యాసకుల సంసారభార మెక్కువగా నుండదుగదా! కావలసినదేమియనిన, చిత్తపరిపాకము, స్థైర్యముగాని, వేరొండుగాదు. దీనికి సతతాభ్యాసమే శరణ్యము. ఈ యభ్యాస మేదియనిన, తన శాస్త్రజ్ఞానముతోడ స్వశరీర సర్వ దృశ్యానుభవములయొక్క అవాస్తవి కతను, అనిత్యత్వమును సర్వదా చింతించుచుండుటయే గాని, మరి వేరేమియు గాదు. దీని నంతటిని క్రోడీకరించి శాస్త్రము—

"న వైరాగ్యాత్పరో బన్ధుః న సంసారాత్పరో రిపుః"

అని తెలుపుచున్నది. జగము సత్యమని యిష్ట వ్యామోహములతో ననుభ వించుట సంసారము. అసత్యమని తెలిసికొని అనిష్టాసక్తతలతో అనుభ వించుట వైరాగ్యము.

బ్రహ్మజ్ఞానాభ్యాసపరులకు స్వాత్మాభిన్న బ్రహ్మస్వరూప మననాదుల కత్యంతోపయోగముగ నుండునట్టి ఆత్మానుసంధాన అద్వైత సిద్ధాన్త వచన రత్నములను కొన్నిటిని సంగ్రహించి వ్రాయుచున్నాడను. జిజ్ఞాసువులు యింతవరకు గావించిన, సిద్ధాన్త, యుక్త్యనుభవ, నిరూపణ, ఉదాహరణ లనుబట్టి, సద్గురు సంప్రదాయాను సారముగ, వీని యర్థమును బాగుగ మనోగోచరము గావించుకొనునెడల అద్వైత సిద్ధాన్తము కరతలామలకము వంటిదగుచు, స్వస్వరూపాను సంధాన వాక్యము గలదగుచుండును ననుటకు సందియములేదు. ఈ క్రింది వచనములందు "అహం" శబ్ద మెచట వచ్చినను వ్యాఖ్యానకులు దానిచే వారియొక్క పరమార్థ వాస్తవ స్వరూపమునే గ్రహించవలయును ఇంకను బ్రహ్మ, ఆత్మ, చిత్తు, చైతన్యము, సంవిత్, జ్ఞానము, శివః, అహం, ప్రత్యగాత్మ, పరమాత్మ, సాక్షి, మొద లుగాగల పదముల నన్నిటిని బ్రహ్మస్వరూపముగ జీవుని స్వస్వరూపమనియే తెలిసికొనుచుండవలయును.

### విశ్వస్వరూపాను సంధాన వచనము

"విశ్వందర్పణ దృశ్యమాన నగరీతుల్యం నిజాంతర్గతం ।
పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథా నిద్రయా ॥"

"బీజస్యాంత రివాంకురో జగదిదం ప్రాఙ్నిర్వికల్పం పున
ర్మాయాకల్పిత దేశకాలకలనా వైచిత్ర్య చిత్రీకృతమ్ ।
మాయావీవ విజృంభయత్యపి మహాయోగీవయస్స్వేచ్ఛయా ॥"

### ప్రపంచ భేదకారణాను సంధాన వచనము.

"విశ్వంపశ్యతి కార్యకారణతయా స్వస్వామి సంబంధతః ।
శిష్యాచార్యతయా తథైవ పితృ పుత్రాద్యాత్మనా భేదతః ।
స్వప్నే జాగ్రతి వాయ ఏష పురుషో మాయా పరిభ్రామితః ॥

## జ్ఞానస్వరూప వచనము

"నానాచ్ఛిద్రఘటోదర స్థిత మహాదీపప్రభా భాస్వరం ।
జ్ఞానం యస్యతు చక్షురాదికరణ ద్వారా బహిస్స్పందతే ।
జానామీతి తమేవ భాంత మనుభాత్యేత త్సమస్తం జగత్ ॥

## చిదాత్మానుసంధాన వచనములు

శ్లో॥ జ్ఞానానందఘనం నిత్యం నిర్మలం స్ఫటికప్రభం ।
ఆధారం సర్వభూతానాం చిదాకాశముపాస్మహే ॥

శ్లో॥ చిదేవ పంచభూతాని చిదేవ భువనత్రయం ।
చిదేవాహం చిదేవాస్మత్ చిద్భిన్నం న హి విద్యతే ॥

శ్లో॥ చిదేవాస్తీహ చిన్మాత్రం సర్వం చిన్మయమేవ చ ।
చిదేవాహం చిదేవాస్మత్ చిద్భిన్నం న హి కించన ॥

శ్లో॥ చిదాకాశ స్వరూపోఽహం జ్ఞాతృజ్ఞేయ వివర్జితః ।
అఖండ పరిపూర్ణోఽహం సచ్చిదానంద లక్షణః ॥

## ఆత్మానుసంధాన వచనములు

శ్లో॥ నభూమిర్న తోయం న తేజో న వాయు
ర్నఖం నేంద్రియం వా న తేషాం సమూహః ।
అనైకాంతికత్వాత్సుషుప్త్యైకసిద్ధ
స్తదేకోఽవశిష్టశ్శివః కేవలోఽహమ్ ॥

శ్లో॥ ఆత్మన్యేవాఖిలం దృశ్యం ప్రవిలాప్యధియా సుధీః ।
భావయేదేకమాత్మానం నిర్మలాకాశవత్సదా ॥

శ్లో॥ హృదాకాశోదితో హ్యాత్మ బోధ భాను స్తమోఽపహృత్ ।
సర్వ వ్యాపీ సర్వధారీ భాతి భాసయతేఽఖిలమ్ ॥

శ్లో॥ నాహం దేహో నేంద్రియాణ్యంతరంగం
నాహంకారః ప్రాణవర్గో నచాహమ్ ।
దారా పత్య క్షేత్ర విత్తాది దూరః
సాక్షీ నిత్యః ప్రత్యగాత్మా శివోఽహమ్ ॥

శ్లో॥ నాహం జాతో న ప్రవృద్ధో న నష్టో
దేహస్యోక్తాః ప్రాకృతా స్సర్వధర్మాః ।
కర్తృత్వాదిశ్చిన్మయ స్యాస్తి నాహం
కార స్యైవ హ్యాత్మనో మే శివోఽహమ్॥

శ్లో॥ మత్తో నాన్యత్కించిదత్రాస్తి విశ్వం
సత్యం బాహ్యం వస్తుమాయోప క్లుప్తమ్।
ఆదర్శాంతర్భాసమానస్య తుల్యం
మయ్యద్వైతే భాతి తస్మాచ్ఛివోఽహమ్ ॥

## జ్ఞానాను సంధాన వచనములు

శ్లో॥ జ్ఞానాకార మిదంసర్వం జ్ఞానానందోహమద్వయః ।
జ్ఞాన ప్రకాశరూపోఽహం జ్ఞానానందైక విగ్రహః ॥

శ్లో॥ యథాజ్ఞానం వినా లోకే కించి దేవ న సిద్ధ్యతి ।
తథాజ్ఞానం వినా లోకే క్వచిన్ముక్తి ర్న సిధ్యతి ॥

శ్లో॥ జ్ఞానమాత్ర స్వరూపోఽహం జ్ఞాతృజ్ఞేయవివర్జితః ।
అఖండ పరిపూర్ణోఽహం సచ్చిదానంద లక్షణః ॥

ఇందు రెండవ శ్లోకములోని మొదటి జ్ఞాన శబ్దమునకు వ్యవహార జ్ఞానమనియూ, రెండవ పాదములోని జ్ఞానశబ్దమునకు బ్రహ్మజ్ఞానమనియూ అర్థమును తెలిసికొనవలయును.

## అద్వితీయాత్మానుసంధాన వచనములు

శ్లో॥ జీవ ఏవ సదా బ్రహ్మ సచ్చిదానందమస్మ్యహం ।
సర్వం బ్రహ్మమయం ప్రోక్తం సర్వం బ్రహ్మమయం జగత్ ॥

శ్లో॥ స్వయం బ్రహ్మ న సందేహః స్వస్మాదన్య న్నకించన ।
సర్వమాత్మైవ శుద్ధాత్మా సర్వం చిన్మాత్ర మద్వయమ్ ॥

శ్లో॥ చైతన్యమాత్రమోంకారం బ్రహ్మైవ భవతి స్వయం ।
అహమేవ జగత్సర్వ మహమేవ పరంపదమ్ ॥

శ్లో॥ మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితమ్ ।
మయిసర్వం లయం యాతి తద్బ్రహ్మాద్వయమస్మ్యహమ్ ॥

## గీతా వచనములు

పరమాత్మ జగదధిష్ఠానము, జగదధ్యస్తమను వచనము.

శ్లో॥ మయాతతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా ।
మత్స్థాని సర్వభూతాని నచాహంతేష్వవస్థితః ॥

పరమాత్మయే జగత్కారణమను వచనము

"అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే"
"మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరమ్"

## పరమాత్మ స్వరూప వచనములు

శ్రీకృష్ణపరమాత్మయే జీవుడు, దేనిని తెలిసికొనుటవలన మోక్షము గలుగునో, ఏది పరబ్రహ్మమో, అట్టి పరమాత్మస్వరూపమును చెప్పుచున్నారు.

శ్లో॥ సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ॥

శ్లో॥ బహిరంతశ్చ భూతానామచరం చరమేవచ ।
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్ ॥

శ్లో॥ అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్ ।
భూత భర్తృచతద్జ్ఞేయం గ్రసిష్ణుప్రభవిష్ణు చ ॥

శ్లో॥ జ్యోతిషామపి తజ్జ్యోతిస్తమసః పరముచ్యతే ।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృదిసర్వస్యధిష్ఠితమ్ ॥

ఇంకనూ "నిత్యస్సర్వ గతస్థాణురచలోఽయంసనాతనః" అనియూ తెలుపుచూ, జీవునియొక్క మోక్షప్రాప్తికై తన పరమార్థ సత్యస్వరూపమగు పరమాత్మ జ్ఞానమును సర్వదా మననానుసంధానములజేయు యావశ్యకతను గురించి శ్రీకృష్ణ భగవానులే అర్జునునకు, యిట్లు తెలుపుచున్నారు—

శ్లో॥ అంతకాలేచ మామేవ స్మరన్ముక్త్వా కలేబరమ్ ।
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥

శ్లో॥ యంయం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరమ్ ।
తంతమేవైతి కౌంతేయ! సదాతద్భావ భావితః ॥

శ్లో॥ తస్మాత్సర్వేషుకాలేషు మామనుస్మరయుద్ధ్యచ ।
మయ్యర్పిత మనో బుద్ధిర్మామేవైష్యస్యసంశయః ॥

అని ఈ సతతానుసంధానావశ్యకతను ముముక్షువులకు తెలుపుచున్నారు.

జీవునకు ఈ అజ్ఞాన రూపమగు సంసారము కల్పితమాత్రమనియూ, దీర్ఘరోగమువంటిదనియూ, "భ్రాంతిమాత్ర మిదం సర్వం విశ్వం బ్రహ్మణి కల్పితమ్" "దీర్ఘ సంసారరోగస్య విచారోహి మహౌషధమ్" అని వచనములు తెలుపుచున్నవి. కావున జ్ఞానాభ్యాసకుడు తన పరమార్థ వాస్తవ స్వరూపమగు బ్రహ్మస్వరూపమును, తన స్థూలోపాధి యగు దేహముతోడ నెట్టి వ్యవహారము లాచరించుచున్ననూ తన ముఖ్యోపాధియగు అంతఃకర

ణము, అనగా మనసుతోడ సర్వదా స్వస్వరూపమును యిట్లు తెలిసికొని అను సంధించుచుండుట శీఘ్రముగ పరమముక్తిగూడ ఫలదాయకమగుచు జీవన్ముక్తి సుఖమును గూడ నిచ్చుచుండును.

అహం, అనగా నా పరమార్థ వాస్తవ స్వరూపము ; దేశకాల వస్తు పరిచ్ఛిన్న, అవస్థాత్రయ, కాలత్రయాబాధిత, త్రివిధభేదరహిత, జగదుత్పత్తి స్థితిలయ వివర్తకారణ, నిత్యనిరతిశయ నిర్వికార, సర్వాధిష్ఠాన, స్వప్రకాశ, అసంగ, అద్వితీయ, నిరవయవ, నిష్క్రియ, నిర్గుణ, అఖండ పరిపూర్ణ చైతన్యము; ఇదియే సర్వాధిష్ఠానము. ఈ సుఖదుఃఖ, కర్తృత్వ భోక్తృత్వాదులు వాస్తవమున నావికావు. ఇవి యన్నియూ ప్రకృతివికారమైన దేహధర్మములు. నేను వాస్తవమున అవ్యవహారినైన అఖండ పరమాత్మ సుఖస్వరూపుడను. సుఖమే నాస్వరూపము గనుక నాకు కావలసిన దేదియును ఈ లోకత్రయమందునను లేదు. కావున నేను నిత్యతృప్తుడను, ఆనందస్వరూపుడను. నేనే సర్వాధిష్ఠానమగు సచ్చిదానంద స్వరూపుడను. నాకన్నవితరమేమియును వాస్తవముగ లేదు, అని జ్ఞానాభ్యాసకుడు బాగుగ తెలిసికొని, ఇట్టి తన పరమార్థ స్వరూపమందు ప్రీతి నిశ్చయములను సంశయ విపర్యయరహితముగ సంపాదించి దానిని స్వానుభవము నొందుటకు గాను సర్వదా తన స్వస్వరూపమును "అహం బ్రహ్మాస్మి", "బ్రహ్మైవాహం", "సోఽహం", "చిదేవాహం" అను మొదలుగాగల జీవ బ్రహ్మైక్యాను సంధాన వచనములలో నొకదానిని గ్రహించి, ఆత్మ సాక్షాత్కార పర్యంతము స్వస్వరూప ధ్యానాను సంధానములను చేయుచుండుట యావశ్యకమని, నెరుగవలయును ఫలపర్యంతము ఇట్లు చిరకాలాభ్యాసము గావించి, స్వాత్మాభిన్నముగ, ఆబ్రహ్మాను నేనే "అహం" అని తెలిసికొనిన మహనీయులు పరమోత్కృష్టమగు మోక్షపదమును నొందుచున్నారు అని శ్రుతి "బ్రహ్మవిదాప్నోతి పరం" అని ఫలమును, స్పష్టముగా తెలుపుచున్నది.

వేదాంతశాస్త్ర ప్రయోజనమంతయును బ్రహ్మజ్ఞానాభ్యాసకులకే గాని బ్రహ్మసిద్ధులకు గాదు. ఏలనన బ్రహ్మసిద్ధులు అనగా సిద్ధపురుషులు, వారి

పరమ ప్రయోజనమును నొందిన, తత్స్వరూపులేగనుక, వారు ఇంక సాధించ వలసినదిగాని, పొందవలసినదిగాని, నేమియును యుండదు. కావున అట్టి మహనీయులకు శాస్త్రముతోడ యావశ్యకత యుండదు. తత్స్వరూపము నొందిన బ్రహ్మసిద్ధుల లక్షణములే జ్ఞానాభ్యాసకులకు సాధనములు. తత్స్వ రూపులనగా, సప్తమభూమికా క్రాంతులై చరమవృత్తి సాక్షాత్కారమునొందిన మహనీయులు. అట్టి వారిస్థితి దురవగాహముగా నుండును. కావున పాఠకులు ఈ వ్రాసినదంతయును, బ్రహ్మాభ్యాసకుల ప్రయోజనమునకే, ఉద్దేశింప బడినది గాని తదితరులకు గాదని నెరుగవలయును.

జ్ఞానాభ్యాసకులు బోధ అనగా జ్ఞానము, ఉపాసనలకుగల భేదమును గ్రహించుట యావశ్యకము. విద్యారణ్యులు దీనిని గురించి యిట్లు తెలుపు చున్నారు — "వస్తుతంత్రోభవేద్బోధః కర్తృతంత్రముపాసనమ్" బోధ వస్తుయాథార్థ్యమును గనబరచును, ఉపాసనయనగా, తాననుకొన్న విధమున భావించుట, ఎట్టులనగా సాలగ్రామమునందు విష్ణుబుద్ధి చేయుట అనగా భావించుట. సాలగ్రామమును జూచి ఇది శిలయనితెలిసికొనుట బోధయగును. ఆత్మ విచారానుసంధానముల వలన బోధకలుగును. బోధయనగా జ్ఞానము, ఇది వస్తుతంత్రముగాని కర్తృతంత్రముగాదు. అనగావస్తుయాథార్థ్యమును ఉన్నది ఉన్నటుల గ్రహించవలయునేగాని కర్తమార్చుటకు వీలుకానిది. ఉపాసనమాత్రము కర్తృ అధీనము అనగా ఏ వస్తువునైనను కర్త తానను కొనినయట్లు భావించుట, ఫలసిద్ధికొరకు దానినే భావించుచుండుట ఉపాసన యనబడును కావున బ్రహ్మోపాసకుడు తన ఆత్మ సాక్షాత్కార ఫలపర్యంతము పైన తెలిపిన నిర్గుణోపాసనను సర్వదా చేయు చుండుట యావశ్యకమని గ్రహించవలయునుగాని ఉపాసనను జ్ఞానమనిభ్రమ జెందకూడదు.

ఈ అభ్యాసకుడు యెంత శాస్త్రశ్రవణ పఠనములు గావించినను బ్రహ్మ జ్ఞానవార్థ్యమునకు తన ప్రారబ్ధానుసార, సంసారానుభవములు అడ్డు వచ్చుచుండును. ఇట్టి అడ్డును నిర్మూలించుటకును, అభ్యాసకుడు

బ్రహ్మాత్మనా సంస్థితుఁడగుటకున్నూ, సాధనమును యీ క్రింది వచనములుగూడ బోధించుచున్నవి.

శ్లో॥ "దృశ్యం హ్యాదృశ్యతాం నీత్వా బ్రహ్మాకారేణ చింతయేత్ ।"
"ఏకతత్త్వ ఘనాభ్యాసా చ్చిత్తంగచ్ఛత్యచిత్తతామ్ ॥"

దీని ప్రయోజనమును, దీని నెంతవరకు అభ్యసించవలసి నదియున్నూ ఈ క్రింది వచనములు తెలుపుచున్నవి.

శ్లో॥ యదా యాత్యున్మనీభావం తదా తత్పరమం పదం ।
నిరస్త విషయాసఙ్గం సంనిరుద్ధం మనోహృది ॥

శ్లో॥ తావదేవ నిరోద్ధవ్యం యావద్వృత్తిర్గతా క్షయం ।
ఏతద్జ్ఞానంచ మోక్షం చ శేషో హిగ్రంథవిస్తరః ॥

పైన నుదహరించిన మొదటి శ్లోకమందు చెప్పబడిన "బ్రహ్మాకారేణ చింతయేత్" అనుదానికి యింతవరకును, ప్రకారాంతరములుగను విపులముగను శ్రుతివచనములతోఁడ బ్రహ్మలక్షణములను, అభ్యాసకుల స్వస్వరూపాను సంధానాదులకు నిరూపించి యుంటిమి. కాని అభ్యాసకులకు "దృశ్యంహ్యాదృశ్యతాంనీత్వా" అనునది యెట్లని తోచవచ్చును కావున జ్ఞానాభ్యాసకుడు దీనికిగాను యింతవరకును, మనముగావించిన దృశ్య మిథ్యాత్వ నిరూపణలను బాగుగ జ్ఞప్తియందుంచుకొనవలయును ఇందు జీవానుభవ నిరూపణలలో ముఖ్యమగునవి ప్రతివారి అనుభవముననుండునట్టి స్వప్నానుభవములున్నూ, మరియు ఈ కాలమున సర్వమానవానుభవములోనున్న శబ్దచలన చిత్ర ప్రదర్శనములు అనగా సినిమాలున్నూ. ఈ ప్రదర్శనములన్నిటిని, ఇవియన్నియూ అవాస్తవములను జ్ఞానముతోఁడనే చూచుచున్ననూ, వీనివల్ల సుఖ, దుఃఖానుభవముల నెట్లు స్వల్పముగా నైనను తాత్కాలికముగ పొందుచున్నారో అట్లే ఈ స్వశరీర సర్వజగత్తుయని శాస్త్రోక్తగురుబోధ స్వవిచారములవలన గ్రహించవచ్చును. ఇచట దృశ్యమును అదృశ్యముగా గ్రహించుట యనగా

స్వశరీర సర్వదృశ్యమును, సినిమా దృశ్యమువంటి అవాస్తవమను, నిశ్చయము నొందుట. ఇట్టి నిశ్చయము కలిగిననాడు తనకు సుఖదుఃఖాది జగద్దృశ్యానుభవములు ఎట్టివి కలుగుచున్నను, వానివల్ల కలుగు సుఖదుఃఖానుభవములను అల్పముగ పొందగలుగు చుండును అప్పుడు అభ్యాసకునకు బ్రహ్మాత్మనాసంస్థితియందు దార్ఢ్యము నేర్పడుచుండును ఈ దృష్టాంతము విపులముగ లోగడనే తెలుపబడినది కావున, నద్దానిని, యింకనూ యింత వరకు తెలుపబడిన దృశ్య మిథ్యాత్వ నిరూపణలను బాగుగ జ్ఞప్తియందుంచుకొని, జ్ఞానాభ్యాసకుడు తన ప్రారబ్ధానుసారమున తనకు కలుగునట్టి సంసార వ్యవహారానుభవములన్నియును మిథ్యా మాత్రములను నిశ్చయము నొందుచుండ వలయును. ఇంకనూ, ఈ సంసార వ్యవహారానుభవములన్నియు, తనకెట్టి వాస్తవ సంబంధము లేక పోయినను తనయందే గలుగుచు నశించుచుండునుగాని ఇవి తనకు నిత్యము కాజాలవను విషయమును నిశ్చయముగ గ్రహించవలెను. ఎట్లనిన, వ్యవహారనిత్యమగు ఆకాశమునందున, ఆకాశముతోడ నెట్టి సంబంధము లేకయే కలుగునట్టి అల్ప, అధిక, అత్యధికములగు మేఘసముదాయముల వంటివని తెలిసికొనవలయును ఏలనన, యెటువంటివియైనను, ఈ మేఘములన్నియూ ముందువెనుకగ నశించునవియేగాని, ఆకాశమునందు నిత్యముగా నుండు మేఘ మొక్కటి గూడ కనుబడదు. ఇట్లే పరమార్థమున నిత్యుడగు జీవునియందు అనగా తనయందే ఈ దృశ్యానుభవములను మేఘములు ఆయా జీవుల సుఖదుఃఖాది ప్రారబ్ధఫలములనుబట్టి అల్పాధిక్య ఫలభోగముల జనింపజేయుచు, నశించుచుండును. ఈ దృశ్యానుభవములలో వెదకి చూచినను జీవునకు నిత్యముగా నుండునది యేదియును కనబడదు. ఏలనన జీవునకు ఈ శరీరాదులే తన ప్రారబ్ధకర్మ ఫలానుభవములకుగాను యేర్పడిన కల్పితోపాధులైనప్పుడు, ఈ శరీరోపాధినిబట్టి తనకు కలుగుచున్న ఈ దశ్యానుభవములెట్లు వాస్తవములు, నిత్యములు కాగలవు. అట్లగుటకు వీలులేదు, అసంభవము. అవాస్తవమైనది యెన్నటికైనను నశించవలసినదే గదా ! కావున ఈ రహస్యమును జ్ఞానాభ్యాసకుడు, దృఢనిశ్చయముతోడ బాగుగ గ్రహించి, ఈ స్వశరీర సర్వదృశ్యమును, తనకు స్థిరముకాదనియు,

మాయాకల్పితమనియు బాగుగా తెలిసికొని తన భోగానుభవములెట్టివి యైనను వానియందు సత్త్వాభిమానములను జ్ఞానపూర్వకముగ విడచుటయే "దృశ్యాపహ్నవదృశ్య ప్రాణాంతికాత్" యను మాటకు అర్థమని గ్రహింపవలయును. ఇట్లు జ్ఞానపూర్వకముగ స్వశరీర సర్వదృశ్యమును త్యజించగా శేషించు నను ప్రత్యగాత్మ స్వరూపమును స్వాత్మాభిన్న పరమాత్మగ ధ్యానము చేయుచుండవలయును. ఇచట నొక సంశయము కలుగవచ్చును. ఏదియనిన, స్వశరీర సర్వదృశ్యమును, అనిత్యము అని త్యజించినచో శేషించునది యేమి యుండును అని అభ్యాసకునకు తోచవచ్చును. ఇచట నొకవిషయమును బుద్ధి కుశలతతో విచారించి తెలిసికొనవలయును. ఏదియన నేను ఈ దృశ్యమందేదియును కాను అని తెలుసుకొనుటకు స్వశరీర సర్వదృశ్యాభావమును గ్రహించుటకు ఒకడు యుండవలయునుగదా! అట్లు లేనిచో గ్రహణము కలుగదు కాని నేను దృశ్యపదార్థమేదియును కాను అను గ్రహణము కలుగుచున్నది. ఇట్లు సర్వదృశ్యాభావమును గ్రహించువాడే సాక్షి, నిశ్శేషముగ శేషించునట్టి ప్రత్యగాత్మ ఈయనయే పరమాత్మ ఆ పరమాత్మయే నేను అని, అభ్యాసకుడు తెలిసికొనవలసి యున్నది. ఇట్లు తెలిసికొన్నను బ్రహ్మాపరోక్షానుభవము నొందుటకు, అభ్యాసకుడు పైన తెల్పినట్టి, బ్రహ్మలక్షణములను స్వాత్మాభిన్నముగ సదా ధ్యానానుసంధానముల జేయుచుండుట యావశ్యకము ఇది యెంతవరకనిన, అనుసంధానము జేయు తన చిత్తము బ్రహ్మాకారము నొంది, అందు లయించువరకును చేయుచుండవలయును. ఇదియే మోక్షము, అని పై వచనములు జ్ఞానాభ్యాసకునకు సాధన విధానమును తెలుపుచున్నవి.

ఇతర వచనములు :—

శ్లో॥ మమపుత్రా మమధనమయం సోఽహ మిదంమమ।
ఇతీయమింద్రజాలేన వాసనై వాధివల్గతి॥

శ్లో॥ నాహం దుఃఖీ న మే దేహః బంధః కః స్వాత్మని స్థితః ।
ఇతి భావానురూపేణ వ్యవహారేణ ముచ్యతే॥

శ్లో॥ అధిష్ఠానే పరిజ్ఞాతే సచ్చిదానందలక్షణే।
అహంకర్తా హ్యహంభోక్తా ఇతిభ్రాంతిర్వినశ్యతి॥

జ్ఞానాభ్యాసకునకు ధ్యానసమాధ్యభ్యాసముల వలన కలుగు ప్రయోజనమును గురించి విద్యారణ్యస్వామి యిట్లు తెలుపుచున్నారు—

శ్లో॥ యథానిరింధనోవహ్ని స్స్వయోనావుపశామ్యతి ।
తథా వృత్తిక్షయా చ్చిత్తం స్వయోనావుపశామ్యతి ॥

అనగా కష్టెలన్నియు కాలిపోగనే అగ్నిలయించునట్లు, ధ్యానసమాధ్యభ్యాసకులచే సకల వృత్తులును, అంతఃకరణముగూడ తనకు కారణమగు సత్త్వమునందులయించును స్వస్వరూపమునందభిలాషగలిగినట్టి అభ్యాసకుని మనస్సు తన కారణమగు సత్స్వరూపమందు లయించుటంజేసి, నిర్విషయమైనదగును. కావుననే విషయములు, వానినిబట్టి కలుగు సుఖదుఃఖములు అభ్యాసకునకు మిథ్యాభూతముగ దోచును. అప్పుడు చిత్తప్రసాదము కలుగును. దానివలన—

శ్లో॥ చిత్తస్యహి ప్రసాదేన హంతి కర్మ శుభాశుభమ్ ।
ప్రసన్నాత్మాత్మని స్థిత్వా సుఖ మక్షయ్య మశ్నుతే ॥

ఈ బ్రహ్మవిద్య, విద్యలలోకెల్ల అతిసులభము సుఖకరమైనదియును, మరియు ఈ బ్రహ్మ విద్యయే విద్యలలోకెల్ల అతి దుఃఖ, క్లేశ, కష్టసాధ్యమనియూగూడ చెప్పనగును ఏలనన మొదటి పక్షమును తీసుకొనినయడల పరమార్థవాస్తవమున జీవుడు బ్రహ్మస్వరూపుడేగనుక, ఈ విద్యయనగా జీవుడు తనను తాను పరమార్థ వాస్తవమున తెలిసికొనుటయే. ఎవరును తనను తాను అన్నిటికంటె ఎక్కువ ప్రేమించనివాడు యుండడుగదా! ఇట్టి పరమప్రేమాస్పదమైన తన స్వరూపమును, తాను వాస్తవముగ తెలిసికొనుటకన్న సుఖకరమైనదిగాని, సులభమైనదిగాని నేమియుండును? ఉండదు. జీవునకు తన పరమార్థ వాస్తవ స్వరూపము తన మెడలో మరచిన హారమువలె తన

యందే యున్నది ఈ బ్రహ్మవిద్య యనగా జీవుడు తనను తాను యథార్థముగా తెలిసికొనుట కావున నింతకన్న సుఖకరమగు సులభమైన విద్య యింకొకటి యుండుట అసంభవము ఇంకను జీవునకు తనయందు తన వాస్తవ స్వరూపము నిత్యము. అనగా నొక కాలమున నుండి యొక కాలమున లేకుండునది కాదు. కాని జీవుడు తన అనాది అవిద్యచే తన సత్య స్వరూపమును మరచి యుండుటచే, ఇప్పుడు తన పరిపూర్ణ సుఖస్వరూపమును తెలిసికొనుటయే మోక్షమని చెప్పబడుచున్నది. జీవున కీమోక్షమనునది, నిత్యప్రాప్తమై అపరోక్షముగ నున్నది. దీనినే జీవుడు తెలిసికొనవలయును. ఇది చిత్తశుద్ధివలన సాధ్యము ఈ చిత్తశుద్ధిగల మహనీయులకు అద్వైత సిద్ధాంతము కరతలామలకమువలె నుండును ఇట్టివారికి శ్రీశంకర భగవత్పాదుల భజగోవింద శ్లోకములు చాలును. కాని సామాన్యులకిది అంత సులభసాధ్యము కాదు. ఏలనన ఈ బ్రహ్మజ్ఞానమనునది, సర్వాధిష్ఠాన అద్వితీయ అఖండ పరిపూర్ణ చైతన్య స్వరూపము జీవుడు తన అనాది అవిద్యా భ్రాంతిచే జీవత్వమునొంది ప్రపంచాంతఃపాతిగానున్నాడు ఈ ప్రపంచ వాసన జీవునకనాదియై యిప్పుడు అవిద్యచే భ్రాంతుడుగా నున్నాడు. అందుచే తన సత్య స్వరూపమంతయూ ద్వైతనానాత్వ పరిచ్ఛిన్న జడస్వరూపములతో, తాదాత్మ్యము కలిగి భ్రాంతినిబిడమైయున్నది. ఇట్టి భ్రాంతిని, విడగొట్టినగాని, జీవునకు తన పరమార్థ స్వరూపము గోచరించదు. జీవునకు నేను, నాది, యను ఈ స్వశరీర, జగద్భ్రాంతి తేలికగా ఒకమారు బోధించిన విడువదు. అభ్యాసకునికి తన వ్యవహారస్థితి అద్వైత జ్ఞానపూరితముగ నున్నది. తాను సాధించ వలసినది ఈ అద్వితీయ పరిపూర్ణ స్వరూపజ్ఞానము అనుభవమందు ఈ రెంటికినీ ప్రత్యక్షవ్యతిరేకము ఇట్టి స్థితిని అభ్యాసకుడు దాటి తన శాస్త్రీయ అభ్యాసబలముతో ఈ బ్రహ్మవిద్యను సాధించ వలసియున్నది అభ్యాసకులకు సాధనావస్థ బహుక్లేశముకావుననే ఈ పరమోత్కృష్టమైన బ్రహ్మవిద్యను, బహువిధ విమర్శ నిరూపణలతో యిన్నివిధముల బోధించుట యావశ్యకమగుచున్నది.

జన సామాన్యులకును, కొందఱు పండితులకునూ గూడ ఈ అద్వైత విద్యాభ్యాసమును గురించి కొన్ని సంశయములు కలుగుచున్నవి. వాస్తవముగ కొందఱు సన్న్యస్తులైరి. వారి నేటివఱకు చెప్పినట్టి, అద్వైత జ్ఞానాభ్యాసపరులైనను ఆత్మసాక్షాత్కారము దేహాధ్యాసములను, రాగద్వేషాది మనోధర్మములను, ఆకలిదప్పి బాధలను, కనకకాంతా మోహాదులను, తద్ద్వారా కలుగుచుండెడు, ఇంకను గూడను సంసారానుభవములు విడుచుట లేదే! ఈ సన్యాసులున్నూ ఇహపారలౌకికమైన పండితులకును, నిత్య నిర్వికార అద్వితీయ ఆనంద పరబ్రహ్మ జ్ఞానాభ్యాసులగు వేదాంతులకును, సమముగనే కనబడుచున్నవి. ఈ అద్వైత విద్యాభ్యాస లాభమేమి? ప్రతిరోజును పెద్దనాదము మొదలు నిరోధించుచుండగా, ఇచ్చట ఆమూల జాంతము "అహం" అను ప్రత్యగాత్మను అనుభవిస్తున్నను, జరామరణరహితుడను, అక్షయుడను, నిర్గుణుడను, నిర్విషయ అఖండ పరిపూర్ణ చైతన్యస్వరూపుడను అని అనుదినము బాగా భావించుచు, ఈ లోకానుభవములన్నియును, నేను, నాది, యని చేయుచుండు వ్యవహారముచే ఫలమేమి? అనుదినమును నోటితో చెప్పుట మాత్రమే అద్వైతముగా కనబడుచున్నది గాని పని చేయునది అనుభవించునప్పుడు, ద్వైతముగా కనబడుచున్నదే! దీని వలన ప్రయోజనమేమి? అను సంశయము కాని యిది సరికాదు సెలవున అభ్యాసులకు శాస్త్రము ప్రమాణము. ఈ మాటనే భగవంతుడు "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే" అని గీతల పదు నారవ అధ్యాయములో తెలుపుచున్నారు శాస్త్రమనగా వేదము వేదవాక్యము ఆప్తవచనము ఆప్తవచనమనగా నిష్కామముగ కరుణతో మిత్రుని క్షేమ లాభములను కోరుచు, తెలుపునట్టి యుపదేశము వేదము నూరుతల్లుల సమానము. కావున తల్లి తన పసిబాలుని క్షేమముకోరునట్లు, జీవునకు తన పరమముక్తిని గాంచుటకు వేదమాత చెప్పుచున్న ఉపదేశమార్గ మిదియే గావున, దీనిని గురించి సంశయము నొందుట అవివేకము, అనర్థమునుగూడ నగును కావున ముముక్షువులకు వేదప్రమాణమును గ్రహించుట విధి, యావశ్యకము. ఇదిగాకనూ ఈ విద్యాలాభమును పొందిన ఋష్యాది

మహనీయులనేకులు, అన్నికాలములందునను, వారి నిత్యనిరతిశయ సుఖాను భవమును చాటుచున్నారు. ఇది ప్రత్యక్షసాక్ష్యముగనుక దీనిని కాదనుటకు వీలులేదు. కావున అభ్యాసకులు ఈ విద్యను గురించియుండు లోక ప్రవాదముల వల్లను, ఒకానొక సమయమున వారి అభ్యాసక్లేశముల వల్లనూగూడ, నిరుత్సాహముజెంది సంశయచిత్తులు కాకూడదు. అభ్యాసకులు వారి సాధనాభ్యాసములను నిర్విఘ్నముగ, నిరంతరాయముగ జేయుచున్నయెడల, ఫలము శాస్త్రప్రమాణమునుబట్టి, ఆయా జీవుని ప్రారబ్ధాంతమున దానంతటదియే కలుగు ననుట నిస్సంశయము. ఈ బ్రహ్మవిద్యను ఎప్పుడు ఎవరు సాధించినను యిదియే మార్గము నవలంబించవలసియుండుట నిస్సంశయము. కావున అభ్యాసకులు ఈ క్రింది విషయమును బాగుగ గ్రహించవలయును. అది ఏది యనిన అద్వైత సిద్ధాంతము ఈ స్వశరీర సర్వప్రపంచమును లేవని చెప్పుట లేదు. ఉన్నదనియే చెప్పుచున్నది. కాని ఈ ఉన్నదంతయు, వాస్తవముగ లేదని జీవునకు తెలుపుచున్నది. ఐనను, జీవుడు ఈ తన దేహాదులను, ప్రపంచమును, తన అనాది అవిద్యచే ఇవియన్నియు తనకు నిత్యము, వాస్తవములు అని నమ్మి భ్రాంతుడగుచున్నాడు. ఈ భ్రాంతివలన స్వశరీర సర్వప్రపంచమందునను మాయావిత్వముతో సక్తాభిమానముల నొందుచు సంసార దుఃఖమునకు లోనగుచున్నాడు. అందువలన అంతులేని సంసార జన్మ పరంపరదుఃఖమును చర్వితచర్వణముగ నొందుచున్నాడు. కావుననే దయామయురాలగు శ్రుతిమాత జీవుని ఈ దుఃఖమునుండి శాశ్వతముగ విముక్తుని గావించుటకుగాను ఈ స్వదేహాదిసర్వజగత్తును మాయామాత్రము అనగా మాయ బంగారువంటిదికాని సత్య సువర్ణమువంటిది కాదనియు, యిది అంతయు మిథ్యామాత్రమనియు జీవునకు బోధించుచున్నది. మిథ్యయనగా కనబడుచున్న ఈ ప్రపంచమును లేదని చెప్పుటకాదు. కాని ఈ కనబడుచున్న ప్రపంచము సత్యము కాదని తెలుపుట. కనబడుచున్నంతమాత్రమున అది సత్యము కావలయునను నియమము లేదు. ఎట్లన, మానవుడు ఎండలో మెరియుచున్న గాజుముక్కను చూచి వజ్రమనియు, మెరియుచున్న మాయ బంగారమునుచూచి సత్య సువర్ణమనియు, మరుమరీచికలనుచూచి జల

మనియు, శుక్తినిజూచి రజతమనియు, తాడునుజూచి పామనియు, మొద్దును జూచి మనిషియనియు, భ్రమించి, చూచునట్లు యీప్రపంచము కనబడుచున్నది గాని వాస్తవముగ లేదని శాస్త్రము తెలుపుచున్నది. పై అన్ని దృష్టాంతములయందునను జరుగుచున్నది యేమనిన, ఒక వస్తువునుచూచి, అది వాస్తవముగ కానట్టి మరియొక వస్తువని భ్రాంతిచే తలచుటయే గదా! పై దృష్టాంతములందున్న యే వస్తువులైనను, వాటి స్వరూపమందు, భ్రాంతుడనుకొనునట్లు సత్యమగుటలేదు. ఏలనన చూచువాని భ్రాంతి జ్ఞానమే దీనికి కారణము. వస్తువుయొక్క అవాస్తవ జ్ఞానముచే ఆ వస్తువయొక్క యథార్థ స్వరూప స్వభావములు, కప్పబడుచున్నవి. అనగా జీవుని భ్రమనుబట్టి ఆ వస్తువే తాత్కాలికముగ మరియొక వస్తువుగ తలచబడుచున్నదే గాని అచట వస్తువుయందు భ్రాంతికి పూర్వముగాని, పరముగాని, ఎట్టిమార్పును గలుగుటలేదు గదా! ఇట్లే జీవుడు తన పరమార్థ వాస్తవ స్వరూపమును, నిత్య నిరతిశయ సుఖమునగు నిర్వికార అఖండ పరిపూర్ణ చైతన్య స్వరూపమునే, తన అనాది భ్రాంతిచే యీ స్వశరీర సర్వప్రపంచముగ, చూచుచున్నాడుగాని, యిది అంతయు పరమార్థ వాస్తవముకాదు అని శాస్త్రము తెలుపుచున్నది. అయినను జీవునకు జీవత్వము, యీ వ్యవహారము అనగా శరీరధారణ తన ప్రారబ్ధఫలమునుబట్టి వచ్చుచు, తన పరమార్థ స్వరూపమును తెలిసిగొనువరకునూ జీవుని వెంబడించుచునే యుండును. జీవునకు శరీరమున్నంత కాలము శరీర ధర్మములు విడువవు. కావున వివేకియగు జీవుడు యీ తన వ్యవహారదశలోనే అనగా తన వ్యవహార సాధనములతోడనే, తన పరమార్థ స్వరూపమును, గురుశాస్త్రబోధవలన బాగుగ గ్రహించి స్వానుభవము నొందవలసియున్నది. కావున తన పరమార్థప్రాప్తికి జ్ఞానాభ్యాసికి తన వ్యవహార స్థితిని విడుచుట ఆవశ్యకము కాజాలదు. మరియేమనిన, తనకిట్టి వ్యవహారమును కలుగజేయుచున్న వాసనలను నిర్మూలించి, స్వదేహాది జగత్తుయొక్క వాస్తవ స్వరూపము యీ కనబడుచున్నది గాదనియూ, తాననుభవించుచున్న యంతటి సుఖదుఃఖభోగములును తనకు కలుగుచున్న సర్వవ్యవహారములును, మిథ్యామాత్రములనియూ నిస్సంశయముగ తెలిసికొనవలసియున్నది. కాని యిట్టి

నిశ్చయమును పొందిన, మహనీయులుగూడ వారి వారి, ప్రారబ్ధమునుబట్టి వారి వ్యవహారానుభవముల నొందవలసియున్నది. అయినను యిట్టి మహనీయుల అనుభవములకున్నూ, కేవల పామరులయొక్క అనుభవ ములకున్నూ, ఉప్పుకునూ కర్పూరమునకునూ యుండునంతటి భేదము యుండును. చూచుటకు రెండునూ తెల్లగనే కనబడుచున్నను, వాటి రుచి, ప్రయోజనములందు యెట్లు అత్యంత భేదముండునో అట్లే జ్ఞాని, అజ్ఞానుల యొక్క వ్యవహారానుభవములందు తారతమ్యముండును. దీనినే వేమన యోగీంద్రుడు "ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండు జూడజూడ రుచుల జాడవేరు పురుషులందు పుణ్యపురుషులు వేరయా" అని తెలుపుచున్నారు. అనగా చూచుటకు పురుషులందరును యొక్కటిగా నున్నను అందు పుణ్య పురుషులు అనగా తత్త్వజ్ఞాను లత్యంతభిన్నులనుమాటను తెలుపుచున్నారు. దీని సారాంశమేమనిన జ్ఞాన్యజ్ఞానులుభయులకునూ వారి, వారి ప్రారబ్ధము లనుబట్టి జీవితమందు సుఖదుఃఖభోగానుభవ వ్యవహారములు సమముగ కలుగుచున్నను, వీరి జీవిత, జీవితానంతర లాభమందున ఉభయులకునూ అత్యంతఫల తారతమ్యముండును.జీవితానంతరములందు జ్ఞాని, నిత్యనిరతిశయ సుఖలాభమును, అజ్ఞాని జన్మపరంపర, సంసార దుఃఖమును నొందును. కాని జీవితకాల వ్యవహారదశలయందు యీ సుఖదుఃఖ తారతమ్యము, ఉభయులయందు అంత బాగుగ తెలియబడదు. ఏలనన వ్యవహార స్థితి యందు, ఉభయులకునూ, ప్రారబ్ధఫలము ద్వైతస్థితిని కల్పించుచుండును. కాని జ్ఞానియగువాడు తన అభ్యాస పటిమనుబట్టి కొంతవరకైనను నిర్లిప్తత తోడ యీ వ్యవహారములన్నియు తనకు కల్పితములు, తాత్కాలికములు, అవాస్తవములను జ్ఞానముతోడ జేయుచు, ననుభవించుచు, జీవన్ముక్తి సుఖము నొందుచుండును. అజ్ఞానియో యివి యన్నియు తనకు నిత్యము, వాస్తవములు అను భ్రాంతి జ్ఞానముతోడ రాగద్వేషాది పూరితుడగుచు, ననుభవించుచు, సంసారదుఃఖము నొందుచుండును. కావున జ్ఞానికి మోక్షము అజ్ఞానికి బంధము ప్రాప్తించును.ఇదియే జ్ఞాన్యజ్ఞానులకు గల తారతమ్యము.

ఇంకను జగన్మిథ్యాత్వజ్ఞానదార్ఢ్యమునొంది, స్వస్వరూపానుభవమును సంపాదించిన మహనీయులయొక్క కర్మానుభవములు వాటి ఫలములు పొరటిపోయిన ధాన్యము అంకురశక్తి నశించినదైనను, భుజించుటకు యెట్లు పనికివచ్చునో అట్లే యీ కర్మఫలములు తనకు భావిప్రతిబంధము నివ్వనట్టి, అంకురశక్తినశించినవగుచు, కేవల వ్యవహార సాధనములగుచు, తాత్కాలిక స్వల్ప సుఖదుఃఖభోగములను మాత్ర మిచ్చుచుండును. ఇది యీ జ్ఞానాభ్యాసకులకు వారి జీవితదశయందు కలుగునట్టి గొప్పలాభము. అయినను యింతటి జ్ఞానాభ్యాసకులకునైనను ప్రారబ్ధశేషమున్నంతకాలము వ్యవహారము నశించదు. కాని అభ్యాసబలముచే కాలక్రమమున క్షీణించుచుండును. కావున జ్ఞానాభ్యాసకులకు యీ లోకమునందుగూడ ప్రత్యక్షలాభము కలదు. దీనినే శాస్త్రము తరతమ భావములతో జీవన్ముక్తియని తెలుపుచున్నది.

అద్వైత సిద్ధాంత సారాంశమేమనిన, "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" "మాయామాత్ర మిదం ద్వైతం అద్వైతం పరమార్థతః" అని శాస్త్రము తెలుపుచున్నది. అనగా యీ దృశ్యనానాత్వ మంతయు మాయామాత్రము. పరమార్థమున నున్నది అద్వితీయ, అఖండ సద్వస్తు యొక్కటియే. అదియే బ్రహ్మ. ఈ కనబడుచున్న నానాత్వము, బ్రహ్మకన్న వేరేమియు యించుక యైనను లేదు. అను నీ పరమార్థవాస్తవమును, వేదమాత జీవునియందు పరమ కారుణ్యముతోడ బోధించుచున్నది. దీనిని విశ్వాసముతోడ గ్రహించిన జీవుడు, తన అనాది అవిద్య నశించినవాడై శాశ్వత సుఖస్వరూపుడగును. లేనివాడు అంతులేని జన్మ పరంపరతో సంసారసాగరమున భ్రమణము జేయుచుండును. అనగా ఆప్తవాక్యమగు శ్రుతివాక్యమును విశ్వసించినవాడు సుఖమును, శ్రుతి వాక్యము నుల్లంఘించినవాడు దుఃఖమును పొందుచుండును. లోకానుభవమునుబట్టి చూచినను నిట్లే కనబడుచున్నది. ఎట్లనిన యిద్దరు మిత్రులు సువర్ణపాత్ర, ఆభరణములను కొనవలచి అంగడి వీధికి వెళ్ళిరి. కాని అక్కడ నున్న వీరి స్నేహితు డొక్కడు "యిచట మంచి బంగారు పాత్ర, ఆభరణము లమ్మే వా డొక్కడును లేడు. ఇచట యుండునవన్నియు మాయ

బంగారు సామానులేగాని అసలు బంగారు వస్తువలుండవు, దొరకవు. కాని యీ కొట్లవారు మిమ్ములను నమ్మించి, మోసముచేసి వానినే మంచి బంగారు నగలని, విశ్వాసము కల్పించి అమ్మెదురు. మీరు జాగ్రతగా పరిక్షించి చూచి, మోస పోకుండగ మీ వస్తువులనుకొనండి. జాగ్రత" అని సలహా చెప్పెను. అప్పుడు అందు మొదటివాడు స్నేహితుని మాట పాటించక, కొట్లవారి మాటలను నమ్మి, అవి యన్నియు సత్య సువర్ణపాత్ర, ఆభరణములని నమ్మి, మోసపోయి, ఆ మాయ బంగారు వాటిని భ్రాంతితో మంచిబంగారువని కొని యింటికి జనెను. ఇంక రెండవవాడు స్నేహితుడు చెప్పిన మాటయందు విశ్వాసముంచి సామానులను బాగుగ పరిశోధించి అవి అసలు బంగారు వస్తువలు కావని తెలిసి అయినను అంతకంటె అక్కడ దొరకవు గనుక, వాటికి తగిన ధరనుమాత్రమిచ్చి వాటి పసిమిచ్ఛాయలు యున్నంతకాలమే యుండునని, నిశ్చయించుకొని, తనకు కావలసినవి తీసుకొని వెళ్లెను. ఇద్దరును మాయ బంగారు పాత్ర, ఆభరణములను తీసికొని అనుభవించు చుండిరి. కాని కొంతకాలమునకు అవియన్నియు మాయబంగారువే గనుక వాటి మెరుపుపోయి, పసిమిలనముగూడ పోనారంభించెను. అప్పుడు మొదటి వాడు, అది అంతయు మంచి బంగారము, తనకు శాశ్వతమని నమ్మినవాడు కావున దుఃఖాక్రాంతుడాయెను కాని రెండవ వాడికి ఆ బంగారు వస్తువులయందు సత్యత్వ బుద్ధిలేనివాడే గనుక, ఎంతకాలమున్న అంతియె లాభమని తృప్తి సంతోషములతో వాటి అనుభవము నొందుచుండెను. వీరియువురు వాడుకొను చున్నటిని మాయ బంగారు వస్తువులను, వానివలన ఒకడు దుఃఖమును, మరియొకడు తృప్తి సంతోషములను నెట్లు పొందుచున్నారో అట్లే యీ జ్ఞాని జ్ఞానుల ప్రపంచానుభవము లుండును.

ఈ గ్రంథమందు తెలుపబడునట్టి జీవుని బంధమోక్ష స్వరూపములును, మోక్షోపాయములును నగు నిరూపణాంశములన్నియూ, ముముక్షు వ్యవహార మందు, బ్రహ్మాభ్యాసకునకు శాస్త్రసంప్రదాయానుసారముగ, మోక్షసాధనము లుగ తెలుబడినవే గాని, ఇతరములుగావు బ్రహ్మాభ్యాసకునకు తన సాధనము

లన్నియూ వ్యవహారములోనివే. కేవలపరమార్థస్థితియందు సాధనములను నవియే నుండుటకు వీలులేదు. అపరమార్థ జీవుడునూ, వేద శాస్త్రములునూ గూడవ్యవహార కోటిలోనివేగాని పరమార్థ స్వరూపములుగావు. ఈ వ్యవహార జీవునికి మోక్షము, స్వస్వరూపమును, అనగా తన పరమార్థస్వరూపమును తెలిసికొనుటకు, వేద శాస్త్రములే సాధనము కాని మరి యొకటికాజాలదు. బ్రహ్మసాక్షాత్కారము గలిగి స్వానుభవమును నొంది ముక్తులగు మహనీయు లకు వీనితో పనియుండదు కేవలను శాస్త్రము బోధింపగలిగినది బద్ధునికే గాని, ముక్తునకు గాదు ఈ వేద శాస్త్ర విధి నిషేధ ప్రయోజనము లన్నియూ సంసార బంధమునందున్న వారికేగాని, పరమముక్తులగువారికిగావు విధి నిషేధములు ముక్తునిబంధింపజాలవు. వాస్తవమాలోచించిన, జీవునకీ బంధ మోక్షములు రెండునూ, మాయచే ఆత్మకు (అనగా తనకు) కల్పింపబడినవేగాని పరమార్థవాస్తవమునజీవునకు బంధమోక్షములనియడివేలేవు కాని వ్యవహార జీవుడు, అనాది అవిద్యావృతుడైయున్నవాడుగావున, వేదశాస్త్రములు యీ జీవునియందు కారుణ్యముతోనే, మోక్షోపాయములను వివిధముగజీవునకు, తన వ్యవహారదశయందు బోధించుచున్నవి గాని కేవలపరమార్థదశలో అనగా పరమవృత్తిసాక్షాత్కారముచే అద్వైతసిద్ధినొంది, సప్తమభూమికాక్రాంతులై దేహభానములేని పరమజ్ఞానులగువారినిగురించి బోధించునవిగావు. జీవునకిట్టి పరమార్థస్థితి, కేవలనిర్వికార అద్వితీయ అఖండపరిపూర్ణచైతన్యస్వరూపముగ నుండును. ఇది జీవునకు వ్యవహారస్థితికాదు ఇట్టి స్వరూపమునుగురించి వేదముగూడ ప్రవర్తింపదు. కావున జ్ఞానాభ్యాసకులిపుడు వారిసాధన, సిద్ధస్థితి దశలను గురించి భ్రమప్రమాదములనొందగూడదు. జీవునకు తన చరమవృత్తి సాక్షాత్కారానంతరమందు కలుగు యీ బ్రహ్మ ప్రాప్తి స్థితినే "యత్రవేదా అవేదాభవన్తి" అనగా యచట వేదము గూడ, అవేదమగు చున్నదో అనగా శక్తిలేనిదేయగుచున్నదో యని శ్రుతియే, జీవునకు తన పరమార్థస్థితిని యిట్టిదిగా వర్ణించుచున్నది. కావున జ్ఞానాభ్యాసకులు తమ వ్యవహార, కేవల పరమార్థస్థితులను రెంటిని దెలిసి, భ్రాంతులగుచు వృథా సంశయములను నొందగూడదు జీవుడు బ్రహ్మ సాక్షాత్కారానంతరము తాను

అద్వితీయ అఖండ పరిపూర్ణ బ్రహ్మస్వరూపుడేయగునని "బ్రహ్మ విద్బ్రహ్మైవ భవతి" అని శ్రుతి తెలుపుచున్నది. అట్టిస్థితిలో చూచుటగాని, వినుటగాని, తెలిసికొనుటగాని, నేదియూ నుండదు. తాను ఆత్మస్వరూపుడేయగును. ఆత్మకు బంధమోక్షములు లేవని—

శ్లో॥ న నిరోధో న చోత్పత్తిర్న బద్ధో న చ సాధకః ।
న ముముక్షుర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా ॥

అనగా జనన మరణములు, సుఖదుఃఖములు, శ్రవణ మననాద్యనుష్ఠానములును పరమార్థమునందు లేవు అని పూర్వాచార్యులు తెలుపుచున్నారు. కావున జ్ఞానాభ్యాసకులు దీనిని గ్రహించి, వ్యవహార, పరమార్థస్థితి వ్యవస్థలను బాగుగ తెలిసికొని, భ్రాంతి, సంశయములకు లోనుగాక, ఆత్మసాక్షాత్కార పర్యంతము తమ శ్రవణ మనన, నిదిధ్యాసనాద్యభ్యాసములను నిర్విణ్ణమనస్కులుగాక నాచరించుచుండవలయునని శాస్త్రము తెలుపుచున్నది.

జీవునకు అనాది అవిద్యాదోషమగు చిత్తవిక్షేపాదుల వలన శ్రుతి, యుక్తి, అనుభవములతో నెంతబోధించినను, ముముక్షువునకు, తన పరమార్థ సత్యస్వరూపము బాగుగ వృత్తిగోచరమగుచు,మనసు బ్రహ్మస్వరూపమునందు నిలుచుట కష్టము. కావున జ్ఞానాభ్యాసకులకు అనేక నిరూపణా ప్రక్రియలచే, నీ విద్యను బోధించుట యావశ్యకమగుచున్నది. అట్టి వానిలో అభ్యాసకులు వారి సాధనా సౌలభ్యమునకుగాను, నిట్లు గ్రహించవచ్చును. ఎట్లన సాన్నిధ్య దోషమును బట్టి, నిర్మలస్ఫటికమందు మందారాది కుసుమములయొక్క రూప, ఛాయా, చలనములుగూడ నెట్లు కనబడుచుండునో అట్లే మాయచే కల్పింపబడిన జీవునియొక్క అంతఃకరణోపాధి సంసార సుఖదుఃఖ ధర్మములే, వాస్తవమున బ్రహ్మస్వరూపుడగు తనయందే ప్రతిబింబించుచు, అన్యోన్యాధ్యాసను కల్పించి, తనను వ్యామోహితునిగా జేయుచున్నవేగాని, యిపుడు తా ననుభవించుచున్న స్వశరీర సర్వప్రపంచమును, పరమార్థ వాస్తవముగ లేనిదే యనియూ, ఐనను ప్రారబ్ధమునుసరించి

ఏనటి యీ అవాస్తవ స్వప్నహోరానుభవములన్నియూ జరుగుచున్నవను నిశ్చయము పొందవలయును. వాస్తవమున జీవునకు తన పరమార్థ స్వరూపము పరిపూర్ణమగు సంపూర్ణ మహాస్ఫటికశిలవంటిది. అయినను యిట్టి తన నిర్వికార అఖండ పరిపూర్ణ జ్ఞానస్వరూపమునందే, స్వప్నదృశ్యము గాపించునపుడు. స్వప్నదృశ్యము మాత్రము వాస్తవమునందు, తన స్వప్నపదార్థము లెల్ల అవాస్తవములగుచున్నవో అట్లే ఏనటి యీ స్థూలశరీర సర్వానుభవములు గలుగుచున్నవని జ్ఞానపూర్వకముగ గ్రహించినయెడల పరమార్థమున నిర్మల స్ఫటిక మహాస్ఫటికశిలవంటి తన స్వరూపమే, నిశ్చలమై, నిర్మలమై, పరిపూర్ణముగ నున్నదనుచుండును. అదియే స్వప్రకాశమగు, తన సర్వాధిష్ఠానరూపము. దీనియందే యిప్పటియగు, స్థూలశరీర సర్వదృశ్యమునూ జీవునకు అనుభూతముగ నున్నది. ఇది యెందువలన జీవుని పరమార్థస్వరూపమందు అధ్యస్తముగ నున్నదేగాని వాస్తవముకాదు. ఏలనన అధ్యస్తము యెపుడునూ అధిష్ఠానము నందు కల్పింపబడునదే యగును. సర్వాధిష్ఠానము భగవత్స్వరూపము. ఇదియే జీవుని పరమార్థస్వరూపము. కావుననే పరమార్థమున జీవబ్రహ్మలకు అభేదము. అనగా జీవబ్రహ్మ లొక్కటియే. ఈ విషయమునే అనగా జీవబ్రహ్మైక్యమునే, వేదమాత జీవునకు మహావాక్యముతోడ బోధించుచున్నది. ఈ అధిష్ఠానాధ్యస్తములిట్టివియని తెలుపుటకే భగవంతుడగు కృష్ణపరమాత్మ "అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే" ఈ సర్వదృశ్యమునకు అధిష్ఠానరూపమును నేనే ఆధారమగుటచే, అధ్యస్తస్వరూపమున నన్ను బట్టియే యీ దృశ్యమంతయూ ప్రవర్తనముగ నున్నది అని తెలుపుచున్నారు. అనగా యిచట అహం, బోధిత జీవునియందు ప్రభవః అనిన అధిష్ఠాన స్వరూపుడనియూ సర్వం అనగా అధ్యస్తమైన యీ స్థూలశరీర సర్వదృశ్యమనియూ గ్రహింపవలెను. ఇంకనూ ఆ పరమాత్మయే తన స్వరూపము "నిత్యస్సర్వగత స్థాణు రచలోఽయం సనాతనః" అనిన్ని తెలుపుచున్నారు. అనగా నా యీ స్వరూపము నిత్యమై సర్వపరిపూర్ణమై మహాశిలలాగున చలనములేక సనాతనమైనదియని అర్థము. కావున పరమాత్మ వాక్యప్రమాణమును బట్టియే, పరమార్థస్వరూపమగు జీవునియొక్క (అనగా ముముక్షువు దీనిని కోరువారు

తాను వాస్తవమున అచలుడై నిర్వికార పరిపూర్ణముగ స్వప్రకాశరూపుడుగ నున్నానని భావించుచుండి, తన దృశ్యానుభవములన్నియూ తనయందే దీర్ఘ స్వప్న దృశ్యములలాగున కలుగుచున్నవిగాని, వివేక దృష్టితో చూచినయెడల తానేమియూ చేయక శిలవలెనున్నానని తలచుచుండవలయును. తనకు సుఖ దుఃఖానుభవములు కల్పితాంతఃకరణ ధర్మములగుచు ప్రారబ్ధానుసారమున కలుగుచున్నవను జ్ఞానముతోడ వాటి ననుభవించవలయునేగాని వాటితోడ సక్తతాభిమానముల నొందకూడదు. ఇట్టి ప్రారబ్ధానుభవములు జీవునకు తన ముక్తిమార్గసాధనములగుచు, జీవితకాలమందు గూడ సౌఖ్యము నొన గూర్చును. కావున యీ బ్రహ్మవిద్య (జ్ఞానము) అనునది మానవసామాన్యు లందరకునూ ఆదరణీయమగుచున్నది.

దాదాపు గ్రంథము, పరిసమాప్తికి వచ్చుచున్నది గావున పాఠకులకు నిచట యొకవిషయమును స్పష్టపరచవలసియున్నది. ఈ వ్రాసినదంతయునూ, నా స్వకల్పనారచనగాదు మరి యేమనిన అనేక గ్రంథములందు శాస్త్రము, ముముక్షువులగు జ్ఞానాభ్యాసకులకు వివిధ మార్గములుగ, బోధించుచున్నట్టి అద్వైత సిద్ధాంత సారాంశములను, నొకచోట చేర్చి, శాస్త్రీయమైన, సామననాది సాధనాభ్యాసానుభవములను సంగ్రహించి శ్రుతి, యుక్త్యనుభవ ప్రమాణబద్ధముగ గ్రహించి, స్వల్పపాండిత్యముతోడనైనను యున్న ఆస్తిక పాఠకులకు, సిద్ధాంతము సులభముగ బోధ యగునటుల నిరూపించినాడను. ఇదియంతయునూ బ్రహ్మవిద్యా గురువులవలనను, సాంప్రదాయకులవలననూ తెలపబడుచున్నట్టి శ్రుతి పరమతాత్పర్యబోధ గావున, నిది ముముక్షువులగు బ్రహ్మజ్ఞానాభ్యాసకులకు. జ్ఞానామృతమని వేరుగ జెప్పబనిలేదు

ఇతర విద్యాభ్యాసములవలె యీ బ్రహ్మవిద్యాభ్యాస మనునది కొంత కాల మభ్యసించి విడువదగినదికాదు. అభ్యాసకుల కిది నిత్యాభ్యాసములో నుండవలయును. అప్పుడుగాని కాలక్రమమున నీవిద్య పొందబడదు. ఈ బ్రహ్మ జ్ఞానాభ్యాసకుడు, తాను తన ప్రారబ్ధమునుబట్టి ప్రస్తుతము ఉభయాత్మకు

డననియూ అందు ప్రధానమగునది తన పరమార్థ సత్యస్వరూపమగు పరమాత్మ యనియూ, తనుదు వ్యవహారమాత్ర ప్రయోజనమగునది. ఆత్మ ప్రతిబింబ మైన చిదాభాసుడనియూ, స్పష్టముగ నిర్ధారణము గ్రహించినవాడు కావున తన ప్రారబ్ధఫలానుసార వ్యవహారములకు చిదాభాసుని నుపయోగించుకొనుచు, తాను వేరను జ్ఞానముతోడ తన వ్యవహార కాలమందునను, తన సాక్షీభావ కాలమందునను, తన అనుసంధానాభ్యాస కాలమందునను అనగా యెల్లప్పుడునూ తన పరమార్థ స్వరూపమగు సర్వోపాధి వినిర్ముక్త, నిత్యనిరాకార, అఖండ పరిపూర్ణ చైతన్య స్వరూపమును మరువక తన స్థితి దేహధారణానుకూల వ్యవ హారములను మాత్రము నిర్వర్తించుచు, తాను యీ స్థూలశరీర సర్వవ్యవహారము లకు నిమిత్తమాత్రుడననియు, యివి యన్నియు తనకు అల్పములు, అనిత్య ములు, అవాస్తవములునగుచు, పరమార్థ వాస్తవమున తన కెంతమాత్రము సంబంధించినవి కావనునట్టి నిశ్చయవృత్తితోడనే తన వ్యవహారములనాచరించు చుండుట యావశ్యకము. ఏలనన యిట్టి తన సర్వకాల వృత్తివలనగాని తనకు యీ స్థూలశరీర సర్వవృత్త్యానుభవములయందు సక్తతాభిమానములు తగ్గవు అవి తగ్గుచుండినగాని తన వృత్తిని బ్రహ్మాకారముగ అనగా స్వస్వరూపమునందుంచి, అభ్యాసాదులను జేయుచు, యీ జ్ఞానమువలన జీవన్ముక్తి సుఖమునుగూడ సంపాదించుటకు సాధ్యముకాదు. కావున అభ్యా సకుడు తాను గ్రహించిన బ్రహ్మాకారవృత్తిని మరువకయే తన సమస్త వ్యవహారములను నిర్వర్తించుచుండుట యావశ్యకమని నెరుగవలయును ఈ విషయమునే భగవద్గీతలలో అయిదవ అధ్యాయమందు 8, 9 శ్లోకములు, తత్త్వవేత్త యిట్లు పలుచుచుండునని తెలుపుచున్నవి. తత్త్వవేత్త పొందు నదియూ, చేయునదియేగదా జ్ఞానాభ్యాసకులు సాధించవలసినదిగ నుండును. ఇట్టి అభ్యాసమే శ్రేష్ఠమైనదని శ్రీ వసిష్ఠభగవానులుగూడ నీ క్రింది శ్లోకముల వలన స్పష్టము జేయుచున్నారు.

శ్లో॥ పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నదన్ వ్యవహరన్ స్వపన్ ।
నాపూర్వం విద్యతే సర్వం సత్యమిత్యేవభావయన్ ॥

శ్లో॥ యద్యత్కరోతి తద్విద్ధి చిన్మాత్రమమలం తతమ్ ।
బ్రహ్మప్రవిజృంహితాకారం తస్మాదన్యన్న విద్యతే ॥

అనగా చూచుచును, వినుచును, స్పృశించుచును, ఆఘ్రాణించుచును, మాట లాడుచును, వ్యవహరించుచును సర్వము బ్రహ్మయే యని (అనగా తన పరమార్థ వాస్తవ స్వరూపమని) తలచుచు నెయ్యది చేయుచున్నాడో అది అంతయు అమలంబును, చిన్మాత్రంబును నగు బ్రహ్మంబే యని యెరుంగుము అని చెప్పుచున్నారు. కావున యిట్టి నిత్యాభ్యాసమువలన కాలక్రమమున అభ్యాసకుడు తత్స్వరూపుడే యగునని తాత్పర్యము.

ఎంతటి ప్రజ్ఞావంతుడగు నట్టి జ్ఞానాభ్యాసియైనను యీ స్వశరీర జగత్తులు వాస్తవమను బుద్ధియునూ, వీనియందు వ్యామోహమును సాధారణముగ విడువవు. ఏలనన యిది యంతయు జీవునకు తన అనాది అవిద్యాబలము వలన జన్మపరంపరగా కలుగుచు, లోతునకు దిగిన వేళ్ళు వృక్షమును కదల కుండ చేయుచున్నట్లు, మానవుని తన అజ్ఞానమునుంచి బైటికి వచ్చుటకు సాధారణముగ అసమర్థునిగ చేయుచున్నది. కాని తన విశేషప్రయత్న సామర్థ్యములతో, మానవుడు మహావృక్షములను నిర్మూలింపజేయ గలుగు చున్నట్లు తన అజ్ఞానమునుండి బైటికి రాసమర్థుడగును. ఈ ఉపాయమునే శాస్త్రము బోధించుచున్నది. ఎచటనైనను సామాన్యులంచరకునూ తెలియని యొక నిధి యున్నయెడల దానిని యొకడు తన మిత్రునికి తెలుపుచు దానిని సంపాదించు సాధనములనుగూడ నెట్లు తెలుపునో అట్లే శాస్త్రము మానవునకు యీ నిత్యనిరతిశయ సుఖస్వరూప నిధిని గురించి బోధించుచు దాని సాధనోపాయములనుగూడ తెలుపుచున్నది. నిధియున్నదని తెలిసిన మాత్రమున తగు సాధన ప్రయత్నముచేయనిది, నిధి మానవునకెట్లు లభ్యము కాజాలదో అట్లే జ్ఞానాభ్యాసకునకు శాస్త్రశ్రవణమువలన జ్ఞానము కలిగినను దాని స్వానుభవము నొందుటకు మనన నిదిధ్యాసనాభ్యాసములావశ్యకమగు చున్నవి. కాని వీనిని యాచరించుటకు తన యీ స్వశరీర జగదనుభవములు, నిత్యము సత్యమను భ్రాంతి అడ్డువచ్చుచు చిత్త విక్షేపమును, అస్వస్థతను

కలిగించుచుండును. అందులకుగాను యీ జ్ఞానాభ్యాసకుడు తాను యెంతటి ఐశ్వర్య సంపన్నుడైనను, తాను యెంతటి వ్యవహారాధికారముల తోడనున్ననూ యివియన్నియు, తనకు తన ప్రారబ్ధఫలమునుబట్టి వచ్చిన ఆగంతుక ఫలములేగాని, నిత్యములు కాజాలవను జ్ఞానమును ప్రతిరోజునను, అనుక్షణమునను, తన శాస్త్రజ్ఞాన వివేచనలతోడ వృద్ధిని గావించుకొనుచు అట్టి నిశ్చయమును పొందుట యావశ్యకము ఇట్టి స్వశరీర మిధ్యాత్వజ్ఞాన నిశ్చయ సత్యస్వస్వరూప గ్రహణ సామర్ధ్యము, నిత్యాభ్యాసపటిమవలనగాని కలుగదు. ఈ సామర్ధ్యము జ్ఞానమును కలుగజేయునుగాని, ప్రారబ్ధ భోగానుభవములను నిలుపజాలదు. కావున అభ్యాసకులకు వారి వ్యవహారములు జరుగవను భయము వలదు గనుక ప్రతిరోజునను, ప్రతిక్షణమునను, యీ జ్ఞానాభ్యాసకుడు తన వాస్తవ స్వరూపము; అలౌకికమగు నిత్యనిర్వికార అఖండ పరిపూర్ణ చైతన్య స్వరూపమనియూ, లౌకికములగు స్వశరీర సర్వానుభవములు తనకు తాత్కాలికములు, కల్పితములు, అనిత్యములు, దుఃఖప్రదములేగాని, శాశ్వత సుఖప్రదములు కావనియూ తలచుచుండుట యావశ్యకము.

అభ్యాసకులు యీ విద్యావిషయ సిద్ధాంతములను సంక్షేపముగ నీ క్రింది సంగ్రహమునుబట్టి బాగుగ గ్రహించవచ్చును.

ఈ ప్రపంచమున సర్వజీవులకును, స్వశరీర సర్వదృశ్య దుఃఖము, తమ తమ అనాది అజ్ఞానమువలననే కలుగుచున్నదిగాని మరివేరువిధమున గాదు. జీవునకు అవిద్య అనాదియైనను సాంతము కావున పరమముక్తిని గోరు ముముక్షువులకు, యీ అజ్ఞాన నివృత్తిని బడయుట సాధ్యము. ఈ అజ్ఞాన నివృత్తివలననే జీవుడు తన పరమార్ధవాస్తవ స్వరూపమగునట్టి పరిపూర్ణ నిత్య నిరతిశయ సుఖమును పొందగలుగును. దీనికి సాధనములుగ శాస్త్రము అనేక ఉపాయములను వారి, వారి అధికార భేదములనుబట్టి తెలుపుచు, వీటినన్నింటిని పరంపర సాధనములుగ గ్రహించి, పరమముక్తికి సాక్షాత్సాధనముగ, యొక్క జ్ఞానమునే బోధించుచున్నది. దీనికి శ్రుతిప్రమాణవాక్యములనేకములు లోగడనే తెలుపబడియున్నవి. ఇంకనూ సాక్షాద్భగవంతుడగు

శ్రీకృష్ణుడు గీతలలో జీవులను యీ అనాది సంసార బంధమునుండి విముక్తుల
గావించుటకు అనేక ఉపాయములను బోధించి, ద్రవ్యసాధ్యమగు యజ్ఞము
లన్నింటికన్నను, జ్ఞానయజ్ఞమే మిక్కిలి ఉత్కృష్టమైనదనియు, తక్కిన
వన్నియూ మోక్షద్వారరూపమగు నీ జ్ఞానముతోడనే పరిసమాప్తి నొందుననియూ
"శ్రేయాన్ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప ! సర్వం కర్మాఖిలం
పార్థ జ్ఞానే పరిసమాప్యతే" అని తెలుపుచున్నారు. ఇంకనూ. "సర్వం జ్ఞాన
ప్లవేనైవ వృజినం సన్తరిష్యసి" సర్వసంసారదుఃఖమును, జ్ఞానమను తెప్పచే
దాటుదువు అని తెలుపుచు, మరియును "జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురు
తేర్జున". పుణ్యపాపకర్మలనన్నిటినీ జ్ఞానాగ్ని భస్మముచేయును అని గూడ
తెలుపుచున్నారు. ఈ జ్ఞానము జీవునియొక్క అనాది అజ్ఞానమును నశింప
జేయును. జీవునికి అజ్ఞానమే అవిద్య. జీవునకు యీ అవిద్యాస్తమయమే మోక్ష
మని శ్రుతిమాత తెలుపుచున్నది. జీవునకు యీ సర్వదృశ్య సంసారదుఃఖము
లున్నూ, తనకు యీ స్వశరీర సర్వదృశ్యము నిత్యము వాస్తవమను భ్రమయును,
అనాద్యజ్ఞానమువలన వారి వారి వాసనాసంస్కారములచే కలుగుచున్నవి.
ఈ వాసనలవలన జీవుడు యీ స్వశరీర సర్వ జీవజడోపాధులను, సత్యమని
నమ్మి వ్యామోహితుడగుచున్నాడు విషయములందు సక్తాభిమానములతో
వాటియందు రాగద్వేషాదులనొందుచు, వాటివలన వివిధ సంకల్పములచేయుచు,
యీ సంకల్పములవలన జీవునకు యిష్టానిష్ట సంస్కారములు యేర్పడు
చున్నవి. ఇట్లు కలుగుచున్న సంస్కారములే వాసన లనబడును. ఈ వాసన
లచే విషయములయందు అనుకూల ప్రతికూల జ్ఞానములుదయించుచుండును.
ఇందు అనుకూలజ్ఞానమువలన ఆభాస సుఖమును ప్రతికూల జ్ఞానమువలన
దుఃఖక్లేశములను జీవుడు పొందుచు యీ స్వశరీర సర్వదృశ్య సంసారము
ననుభవించుచుండును. ఈ వాసనలు జీవునికి అనాదిగవచ్చుచు మహా బలీయ
ములై సంసారమున జీవుని బంధించుచుండును. ఎట్లన పరమార్థ వాస్తవమున
లేనట్టి యీ జగద్దృశ్యమునంతయూ, సత్యమైన దానిగ తోపింపజేయుచు
వాటియందు సక్తాభిమానములను కలుగజేయుచున్నది. అవిద్యాకల్పితమైన
యీ వాసనా రూపమగు సంస్కారములే. ఈ అనాది వాసనలే జీవునకు దృశ్య

సంసారమును కల్పించుచున్నవిగాని, వాస్తవముకాదని శ్రీవసిష్ఠభగవానులు యోగవాసిష్ఠమునందు—

శ్లో॥ మమ పుత్రా మమ ధనమయం సోఽహమిదం మమ ।
ఇతీయ మింద్రజాలేన వాసనైవాధివల్గతి ॥

అనగా వీరు నాపుత్రులు, యిది నా వస్తువు. యిది నా ధనము, నేను యిట్టివాడను. అనునట్టి చింతయును ఇంద్రజాలమువంటి వాసనామాత్రముగ ప్రకాశించుచున్నది ఈ వాసనాజాలమంతయు జీవునియొక్క అజ్ఞానముచే కల్పింపబడినదిగాని, మరియొకటిగాదు. జీవునకిట్టి కల్పిత దృశ్య సంసార దుఃఖము జ్ఞానమువలనగాని నశించదనియూ అట్టి జ్ఞానము పరమపవిత్రమైన దనియూ శ్రీకృష్ణభగవానులు గీతలలో "నహిజ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే" అని జీవునకు బ్రహ్మజ్ఞానముతో సాటియగునదియు, అంత పవిత్రమైనదియు, మరియొకటిలేదని తెలుపుచున్నారు. ఇచట జ్ఞానమనగా బ్రహ్మజ్ఞానమేగాని మరియొకటిగాదు బ్రహ్మజ్ఞాన మనగా జీవుడు తానే అనగా "అహం" నేనే బ్రహ్మమనియని తెలిసికొని స్వానుభవము నొందుట. ఇట్టి జ్ఞానము సంపాదించుటకు సదాచార సత్కర్మానుష్ఠానమువలన చిత్తశుద్ధిని సంపాదించుట ఆవశ్యకము. ఈ చిత్తశుద్ధి జీవునకు దీర్ఘకాల సత్కర్మానుష్ఠానములవలనగాని కలుగదు. జ్ఞానాభ్యాసకులకుగూడ సదాచార, నిత్య, నైమిత్తిక, కర్మాచరణము విధివిహితము ఏలనన యిట్టి కర్మాచరణము జీవునకు ఆహారము భుజించుటవంటిది ఉచితాహారమును ప్రతిదినము భుజించుచున్న యెడలగాని దేహస్థితి వృద్ధిచెందుట యనునది జరుగదు. ఇట్లే చిత్తశుద్ధికి సదాచార, నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానములావశ్యకము. వీనిని వదలినయెడల చిత్త పారిశుద్ధ్యము క్షీణించుచు, మననాద్యభ్యాసములను చేయు శక్తిసామర్థ్యము కలుగదు, కలిగిన యొకానొకనికిగూడ క్షీణించును. జీవునకు నిత్యనైమిత్తిక కర్మాచరణలు క్షుత్పిపాసాదులవంటివి. వీటిని విడువగలిగిన జీవునకు యీ కర్మలతో నెంతమాత్రము పనియుండదు. అట్టి జీవునికి బాగుగ పండినట్టి పండును ముచ్చిక విడుచునట్లు కర్మాచరణావశ్యకత

డానంతట నదియే వదలిపోవును. కాని అంతవరకును సదాచార నిత్య నైమిత్తిక కర్మానుష్ఠానములు, విధి, యావశ్యకము, అను విషయమును జ్ఞానాభ్యాసకులుగూడ మరువగూడదు. కాని యీ కర్మలనన్నిటిసీ వారి జ్ఞాన సంపాదన కావశ్యకమగు చిత్తశుద్ధికి సాధనములుగనే గ్రహించి యాచరించు చుండవలయును. అభ్యాసకులు ఆ యా జీవుల పరిపూర్ణ ఆత్మ జ్ఞానమునకు యీ కర్మలను పరంపర సాధనములుగ గ్రహించి యాచరించుచు, ముఖ్య సాధనములుగ శ్రవణ, మనన, నిదిధ్యాసనాభ్యాసములను విసువుజెందక చేయు చుండుట యావశ్యకము. అభ్యాసకులకు కర్మోపాసన, జ్ఞానాభ్యాసములు రెండునూ, పక్షికి రెండురెక్కల వంటివి. కావున ప్రథమమున, సదాచార నిత్యనైమిత్తిక సత్కర్మానుష్ఠానములు, యీశ్వరారాధన, గురుపూజాదికము, భక్తి, ముముక్షువానితోడ సాధనచతుష్టయ సంపత్తిని కొంతవరకైనను సంపాదించి చిత్తమును శుద్ధము గావించి శాస్త్రీయముగ సంస్కరించుకొనుట అభ్యాసకులకు మిక్కిలి యావశ్యకము. ఏలనన యిది లేనిది యేజీవుని కైనను, తన పరమార్థవాస్తవ స్వరూపమగు బ్రహ్మ జ్ఞానమును సంశయ, విపర్యయ, రహితముగ గ్రహించు సామర్థ్యము కలుగదు. స్త్రీ పురుషులలో నెవ్వరైనను యిట్టి సామర్థ్యమును సంపాదించుకొనినవారే యీ విద్యాభ్యాస మునకు అధికారులు. కనుక జ్ఞానాభ్యాసకులకు ప్రప్రథమమున, సాధన చతుష్టయ సంపత్తిని సంపాదించుట యావశ్యకము. అనంతరమే బ్రహ్మ విద్యాభ్యాసమునకు అర్హత కలవారగుదురు. శ్రీ శంకరభగవత్పాదులు యీ విషయమును "అథాఽతో బ్రహ్మజిజ్ఞాసా" అను సూత్రమందు నిర్ణయించి యున్నారు. కావున బ్రహ్మవిద్యాభ్యాసకులకు, సాధనచతుష్టయసంపత్తి ద్వారా చిత్తశుద్ధిని సంపాదించుట ప్రథమ సోపానమగుచున్నది. ఇట్లు చిత్త శుద్ధిని సంపాదించి, సద్గురువు నాశ్రయించి, ఉపనిషచ్ఛాస్త్ర శ్రవణము చేయుట యావశ్యకము. ఇట్లు శ్రవణముచేసిన విషయములను శ్రుతియుక్త్యనుభవ పూర్వకముగ విమర్శించి సంశయ విపర్యయ రహితముగ తెలిసికొనుటయే మననమనబడును. మననాభ్యాసాదులచే నిశ్చయమునొందిన తన స్వస్వరూప మును ధ్యానము చేయుచుండుట నిదిధ్యాసన మనబడును. ఇట్టి అభ్యాసకుడే

బ్రహ్మజ్ఞానాభ్యాసకుడనబడును. బ్రహ్మజ్ఞానాభ్యాసకునకు శరీరధారణమే వ్యవహారము. ఈ వ్యవహారమంతయు అవిద్యాకల్పిత ఇంద్రజాలము వంటి దని అభ్యాసకుడు జ్ఞానపూర్వక నిశ్చయమును నొందవలయును. వివేకము తోడ విమర్శించి చూచినయెడల, ప్రాతిభాసిక వ్యావహారికములకు భేదము స్వల్పము. ఐనను ముముక్షువునకు తన ప్రారబ్ధ భోగక్షయమునకుగాను శరీరధారణ, వ్యవహారము, యావశ్యకమగుచున్నది. ఇట్టి యావశ్యకత యున్నందున జ్ఞానాభ్యాసకుడు తన శరీరమును అవిద్యాకల్పితమని గ్రహించి, కేవల తన వ్యవహార సాధనముగ తన ప్రారబ్ధక్షయమునకు సాధనములుగ తన స్థూలసూక్ష్మోపాధులను, వాడుకొనవలయునేగాని, సూక్ష్మోపాధినైనను గూడ తాను అనగా "అహం" నేను అను భ్రాంతినొందకూడదు. ఈ రెండును, ముముక్షువునకు తన తరణోపాయ సాధనములు మాత్రమే. ఇట్లు శాస్త్ర జ్ఞాన పూర్వకముగ జ్ఞానాభ్యాసకుడు తెలిసికొని, తన పరమార్థ వాస్తవ స్వరూపము నిత్యనిర్వికార అఖండ పరిపూర్ణ జ్ఞానస్వరూపమను నిశ్చయము నొందవలయును.

ఐనను జీవునకు యిట్టి తనయందే, అనాది మాయాప్రభావముచే అఖండ మహాసముద్రమునందు బాహ్యావాయుప్రసార మాలిన్య సంపర్కము లచే, సముద్రజల పైభాగమునందు మాత్రము అలలు, గుంపములు, నురుగు, బుడగలు, కలుగుచు, సముద్రము లోపలిభాగమున జలమంతయు అఖండముగ నిశ్చలమై నిర్మలముగ నెట్లుండునో అట్లే జీవునకు తన అనాది అవిద్యచే కలుగుచున్న వాసనా సంస్కారములవలన తనయందే స్వాత్మాభిన్న ముగ యీ దృశ్యపరిచ్ఛిన్న నానాత్వవికారములన్నియు కలుగుచున్నవిగాని, జీవుడు శాస్త్రీయ స్వప్రయత్నముచే నిత్యానిత్య వివేకముతోడ బాగుగ విచా రించి, తన అజ్ఞానమిట్టిది యని తెలిసికొని, తన జ్ఞానబలముచే దానిని వేరు పరచినయెడల తన వాస్తవస్వరూపమునందు యీ దృశ్య భిన్న భిన్న, నానాత్వములెంతమాత్రమును వాస్తవముగ నుండవు. అప్పుడు అభ్యాస పాటవమునుబట్టి యీ దృశ్య సంసారదుఃఖము క్రమక్రమముగ క్షీణించు

చుండును కాని యీ పై దృష్టాంతము పరిణామములోనిది గనుకను, ఆత్మ పరిణామరహితముగనుకను, యిచట అధ్యాసకులు పొరబడక యీ ఉదాహరణ మును, ఏకదేశమున అనగా రెంటికి సమాన సాదృశ్యమువరకే గ్రహించి, యీ స్థూలశరీరదృశ్యము అనగా జగత్ప్రతీతియూ ఆ ఒక్కటియైన అద్వితీయ, నిర్వికార, అఖండ పరమాత్మయగు బ్రహ్మమునందే, మందాంధకారములో రజ్జువయందు తోచునట్టి సర్పములాగున భాసించుచున్నదని నెరుగవలయును. ఇచట రజ్జువునకునూ, భ్రాంతి సర్పమునకును యెట్టి వాస్తవసంబంధము లేకయేకదా, సర్పాకార, అవయవ, చలనాదులుగూడ రజ్జువయందే కలుగు చున్నవిగాని రజ్జువును విడచి కలుగుటలేదు, విడచి కలుగవు. ఇచట రజ్జువు వ్యవహార వాస్తవమగు అధిష్ఠానము. సర్పాకార, అవయవ, చలనాదులు అధ్యస్తములై అవాస్తవములైనను జీవునకు భయకంపాదులను కలిగించు చున్నవి. రజ్జువును విడచి సర్పభ్రాంతి కలుగదుగదా! వాస్తవమగు రజ్జువను కప్పివుంచినగదా, దానియందు అవాస్తవమగు సర్పము కనబడుచున్నది. ఇట్లే జీవునకు అజ్ఞానము, వాస్తవమగు బ్రహ్మస్వరూపమును తెలియకుండునట్లుజేసి, దానియుందే అవాస్తవమగు యీ స్థూలశరీర ప్రపంచము భాసించునట్లుచేయు చున్నదని గ్రహించవలయును. కావున యీ సర్వప్రపంచమునకును సర్వాధి ష్ఠానము అఖండ పరిపూర్ణ చైతన్యస్వరూపమగు బ్రహ్మయేనని స్పష్టముగ తెలిసికొనవలయును. ఇదిగాక నిద్రించు మానవునియందే నిద్రాదోషము వలన, మహాసముద్ర, ఆకాశ భూమండలాదులు, చిత్రవిచిత్ర దృశ్యానుభవ ములు, సంవత్సరాదికాలానుభవములు ఒకానొకప్పుడు స్వమరణమునుగూడ స్వప్నానుభవములగుచున్నవిగదా! పరిచ్ఛిన్నుడైన తనయందే అల్పకాల మందిట్టి అనుభవములు కలుగుచుండగ, అపరిచ్ఛిన్నుడై, సర్వపరిపూర్ణుడైన బ్రహ్మయందు జీవునకు తన అజ్ఞానముచే. స్వప్నతుల్యములైన యీ జగదను భవములు కలుగుటలో సంశయింపదగినదేమి యున్నది జీవునకు యీ వ్యవహారానుభవములన్నియు అవిద్యాకార్యమని, యెరుగవలయును. ఆ ఒక్కటియగు అఖండ పరమాత్మనే, వ్యవహారమందు, ఆ యా ఉపాధి

భేదములనుబట్టి ఘటాకాశ, మఠాకాశ, జలాకాశ, మేఘాకాశములని వ్యవహ రింపబడుచున్నను యివి యన్నియు వాస్తవమున మహాకాశముకన్న భిన్న ములు కావని యెట్లు తెలిసిగొనుచున్నామో అట్లే ఆ యా ఉపాధి భేదము లనుబట్టి, నామరూపములు కల్పింపబడి, ఆ ఒక్కటియగు పరమాత్మయే, యీ ప్రపంచరూపమున వ్యవహరింపబడుచున్నదని తెలిసిగొనవలయును. ఇంకనూ లోకభాస్కరుడొక్కడేయైయున్నను, ప్రతి జీవునిచేతను ఆ యా ప్రదేశములయందు, పరిచ్ఛిన్న బింబాకారములుగ నెట్లు తెలిసిగొనబడు చున్నాడో అట్లే యీ అద్వితీయ, నిర్వికార అఖండ పరిపూర్ణ స్వరూపుడగు పరమాత్మగూడ, సర్వజీవులచేతను వారి, వారి హృదయ పుండరీకములయందు ప్రత్యగాత్మ స్వరూపమున తెలిసికొనబడుచున్నాడేగాని, వాస్తవమున, సూర్య బింబములన్నియూ ఒక్క సూర్యుడే యని యెట్లు తెలిసిగొనబడుచున్నాడో అట్లే యీ ప్రత్యగాత్మ పరమాత్మలొక్కటియేననియు, ఇదియే తన స్వాత్మాభిన్న పరిపూర్ణ పరమార్థ వాస్తవస్వరూపమని బ్రహ్మాభ్యాసకుడు నిశ్చయము నొందవలయును. అప్పుడు అభ్యాసకుడు యిట్లు తాను పరోక్షముగా తెలిసికొనిన ఆత్మస్వరూపమును, అపరోక్షమును గావించుకొనుటకుగాను అనగా తత్స్వరూప స్వానుభవము నొందుటకుగాను, తన పరమార్థ వాస్తవస్వరూపమును, ఫలపర్యంతము సర్వదా నిట్లు ధ్యానించుచుండవల యును. ఎట్లన, "అహం" నేను, సర్వోపాధివినిర్ముక్త, సజాతీయ విజాతీయ స్వగత భేదరహిత, స్వప్రకాశ, జగదుత్పత్తి స్థితిలయ వివర్త అభిన్న నిమిత్తోపాదానకారణ, నిత్య, నిరతిశయ, నిర్వికార, అసంగ, సర్వాధిష్ఠాన, అఖండ పరిపూర్ణ చైతన్య స్వరూపుడననియు, నేను నిరవయవుడను, నిర్వికారు డను గనుక నిష్క్రియుడననియూ, నిష్క్రియుడను గనుక నాకు వాస్తవ మున కర్తృత్వ భోక్తృత్వాదులు లేవనియు, నేను పరిపూర్ణ సంవిద్రూప మహాస్ఫటిక శిలవంటివాడనయు, అచలుడై చిదాకాశరూపమున నున్నవాడ ననియూ, నిరంతరము మనసు ధ్యానాదులు చేయుచుండుట స్వస్వరూప సాక్షాత్కారమునకావశ్యకము.

బ్రహ్మ ధ్యానాభ్యాసమునను, తన భావనాదార్ఢ్యమునకుగాను శ్రీ వసిష్ఠ భగవానులు రామచంద్రమూర్తికి యుపదేశించిన వచనముల నిటు నుదహరించు చున్నాను.

శ్లో॥ చిత్కాలాద్య నవచ్ఛిన్న మదృష్టో భయకోటికం ।
చిన్మాత్ర సుఖమయం శాంతమేకం బ్రహ్మాస్మి నేతరత్ ॥

శ్లో॥ ఇతిమత్వాఽహమిత్యంత ద్ముక్త్వా యుక్తవపుర్మహాన్ ।
నీరూపః ప్రశాంతాత్మా మౌనీ స్వాత్మసుఖో భవ ॥

ఓయీ శ్రీరామచంద్రా! దేశకాలవస్తు పరిచ్ఛేదరహితంబును, ఆద్యంతరహితంబును, చిన్మాత్రంబునగు బ్రహ్మంబే నేనని నిశ్చయించి, అభిమానములేనందున విడువబడినదియూ, ప్రారబ్ధవశమున విడువబడని దియూ నగు శరీరమునం దుండువాడవును, శాంత చిత్తుండవును, ఆత్మారాముడవు నగుము.

శ్లో॥ చిదాత్మాఽస్మి నిరంశోఽస్మి పారావార వివర్జితః ।
రూపం స్మర నిజం స్వాంతం మాస్మభూత్యా సంమితో భవ ॥

నేను ఆద్యంతరహితుండను, నిరవయవుండనునగు చిదాత్మనే యగుదు నని నిరంతరము నీ రూపమును దలంపుము. నీ నిజరూపమును మరచి పరిచ్ఛిన్నుడవు కాకుము.

శ్లో॥ పుష్టమాత్మాన మాలింగ్య నిర్ఘ్నమంతర్ముఖయా ధియా ।
యః స్థిత స్తం పరాత్మానం భోగో బంధయితుం క్షమః ॥

అంతర్ముఖంబగు చిత్తంబుచే నిరుపాధికంబగు నాత్మను భావించి ఆత్మ నిష్ఠుండై యున్న వానిని నెపుడును భోగము బంధింపజాలదు, అని తెలుపు చున్నారు. కావున అభ్యాసకులు యీ బ్రహ్మానుసంధానాభ్యాసమందు నెపు డునూ సంశయచిత్తులు గాకూడదు. ఈ అభ్యాసమే సాక్షాన్ముక్తి మార్గమని గ్రహింపవలయును.

ఏలనన, చీకటి—వెల్తురు అనగా ప్రకాశమువలనగాని నశించనట్లు ఈ అజ్ఞానము ఒక్క బ్రహ్మజ్ఞానమువలనగాని నశించదు. అంతఃకరణమందు అజ్ఞానము నశించినయెడలగాని అంకురశక్తి నశించదు. జీవునకు ఈ తన అంతఃకరణోపాధియొక్క అంకురశక్తి నశించినగాని తన అవిద్యనశించదు. తన అవిద్య నశించినగాని జీవునకు సంసారము నివర్తించి మోక్షముకలుగదు. దీనినే "అవిద్యాస్తమయో మోక్షః" అని శ్రుతి తెలుపుచున్నది. కావున జ్ఞానాభ్యాసకుడు తన సమ్యక్ జ్ఞానమను వహ్నితోడ యీ తన అంతఃకరణోపాధి యను బీజమును బాగుగ అగ్నితప్తముగావించిన యెడల అనగా సంస్కరించినయెడల, అందుండునట్టి అంకురశక్తి (అనగా భావిఫలప్రదమగునట్టి శక్తి) నశించి నిర్వీర్యముగనుండును. అట్టితరి ప్రారబ్ధానుసారముగ సుఖ దుఃఖ భోగముల ననుభవించుచున్నను అట్టివి యన్నియు నిర్బాధకములగును. ఏ బీజము వేయించిన దాని అంకురశక్తియే నశించు చున్నట్లు, ఏ అంతఃకరణము జ్ఞానాగ్నిచే బాగుగ సంస్కరింపబడుచున్నదో అవటనే అజ్ఞానము నివర్తించును. దీనికంతయు శ్రవణ, మనన, నిదిధ్యసనాభ్యాసమే సాధనమని బ్రహ్మాభ్యాసకులు గ్రహించవలయును.

సర్వవేదాంతసార సంగ్రహముగ, బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు బాగుగ గ్రహించి సాధినొందవలసిన దేమియనిన, తన లోననే తన దేహేంద్రియ మనోఅహంకారాదులతో నెట్టిసంబంధమునులేక, వీని కన్నిటికిని సర్వాంతర ముగ నుండుచు కాలత్రయ, అవస్థాత్రయములందునను సర్వదా, సర్వజన ప్రత్యక్షముగ తనను అహం నేను అనియూ, తనకు బాహ్యమందున్నట్టి సకలదృశ్యమును అది, యిది, నాది, అను జ్ఞానమునిచ్చుచు, సర్వమును ప్రకాశింపజేయుచు, తాను స్వప్రకాశుడుగా సర్వదా తనలోనే అసంగ నిత్య నిర్వికారుడై యున్నట్టి, యేప్రత్యగాత్మ కలడో ఆయనయే పరమాత్మయనియు, ప్రజ్ఞానఘనుడనియు, అదియే తన అనగా జీవునకు పరమార్థ వాస్తవ స్వరూప మనియూ బాగుగ తెలిసికొని, అదియే స్వశరీరసర్వాధిష్ఠాన మనియు, అదియే తానని యు అనగా నేను అనుశబ్దమునకు లక్ష్యార్థమనియూ, వాస్తవముగ తనకు

స్వాత్మాభిన్నముగను, నిత్యమగుసదియును, నిదృశ్యమందును, నేదియును లేదనునట్టి నిశ్చయమునొందిన వాడగుచు, స్వాత్మాభిన్న అద్వితీయ పరమాత్మను స్వానుభవము నొందవలయును. స్వప్రకాశుడుగ తనలోనున్న యీయనయే ప్రత్యగాత్మ ఈ ప్రత్యగాత్మయే పరమాత్మ. బ్రహ్మ అని తెలియబడుచున్నాడు ఈయననే అభ్యాసకుడు అహం, నేను, అని తెలిసిగొని స్వానుభవము నొందవలసియున్నది ఇదియే అభ్యాసకునికి పరమావధి, ముక్తి ఈ అఖండజ్ఞానమును జీవునకు కలుగజేయుటకే మహావాక్యము "అయమాత్మాబ్రహ్మ" అనగా జీవునకు తనలోనున్న యీ నిత్యనిర్వికార స్వప్రకాశుడైన ప్రత్యగాత్మయే బ్రహ్మ అని తెలుపుచున్నది. ఈ అఖండ చైతన్య స్వరూపుడే ప్రజ్ఞానఘనుడు. సర్వత్ర చిద్ఘనముగ పరిపూర్ణమై యున్నట్టి యీ చైతన్యమునే "ప్రజ్ఞానంబ్రహ్మ" అనియు "అహంబ్రహ్మాస్మి" అనగా ఆ బ్రహ్మ నేనే, నేనే బ్రహ్మను, అనిన్నీ మహావాక్యములు జీవునకు బోధించుచున్నవి ముముక్షువునకు బ్రహ్మాత్మైక్య జ్ఞానమే మోక్ష సాధనముగాని మరియొకటి కాజాలదు. కావున ముముక్షువు ఎంత ప్రయత్నముతోడ నైనను తన ముక్తికి యీ జీవబ్రహ్మైక్యజ్ఞానమును సంపాదించ వలయును. ఇచట సంపాదన యనగా జీవుడు తన స్వస్వరూపమును తెలిసికొని స్వానుభవమునొందుటయేగాని క్రొత్తగ సంపాదించవలసిన దేమియు లేదు. వాస్తవమున జీవుడు తాను బ్రహ్మయే. ఐనను అనాది అజ్ఞానముచే భ్రాంతుడై తనలోనున్నట్టి తన పరమార్థస్వరూపమునే వాస్తవముగ గుర్తింపజాలక యున్నాడు కావున యిప్పుడు అభ్యాసకుడు చేయవలసిన ప్రయత్నమేమనిన, తనలోనున్న తన పరమార్థ స్వరూపమును యదార్థముగ తెలిసికొని స్వానుభవమునొందుటే జీవుడు యీ తన పరమార్థ వాస్తవ స్వరూపమును బాగుగ తెలిసికొనుట మాత్రముననే బ్రహ్మత్వము సిద్ధించును ఈ విషయమునే శ్రుతి "బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి" "బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి" అను వచనములచే తెలుపుచున్నది.

మానవునకు యీ బ్రహ్మవిద్యాలాభమును దృఢపరచుటకుగాను, లోగడ ననేక విధముల శ్రుతి, యుక్తి, అనుభవములతో దీనిని విమర్శించి

యుంటిమి. అందు జ్ఞానాజ్ఞాను లిరువురును, వారి, వారి ప్రారబ్ధభోగానుభవము లను, విధిగా పొందుచున్నను, వారి, వారి, జ్ఞానభేదమునుబట్టి సుఖదుఃఖములు మారుచుండుననియు అనగా క్షీణించునని లోగడ సప్రమాణముగ తెలుప బడెను ప్రారబ్ధమున్నంత కాలము జ్ఞానియగువాడుకూడ అజ్ఞానివలెనే శరీర ధారియైయున్నను, తీవ్ర ముముక్షువగు జ్ఞానాభ్యాసకుడు, యీ ప్రపంచమున యువరాజు వంటివాడని గ్రహించవలయును. ఎట్లన వీడు అసాధారణ మానవుడు. ఏలనన—యువరాజు రాజగుట యెప్పటికైనను నిశ్చయమేగదా! సాధారణ మానవుడు రాజగుటకు సామాన్యముగ అవకాశము లేదుగదా! సామాన్య మానవుడు నేను యెప్పటికైనను రాజునగుదుననుకొనుటకు కూడ సంభవములేదు. కాని యువరాజు యిప్పుడు రాజు కాకపోయినను, యిప్పుడు గూడ కొన్ని రాజలాంఛనములతోనుండి తదుపరి తాను రాజును అగుదునను నిశ్చయ జ్ఞానముతోనుండి కాలము వచ్చినప్పుడు అనగా అచిరకాలములోనే, తాను రాజగును. కాని బాల్యమందు యిట్టి యువరాజుగూడ యితర పిల్లలతో పాటున పాఠశాలలందు విద్యాభ్యాసము చేయుచు, యితర పిల్లలవలెనే యుండును. అయినను యువరాజగు బాలుని జ్ఞానము, తాను రాజగుదు ననియూ, యితర బాలురయొక్క-జ్ఞానము తాము వారి, వారికి తగిన జీవనోపాధికి గాను, వ్యవసాయ, వ్యాపార, ఉద్యోగములు చేయవలయుననియూనుండును. ఈ యువరాజగు బాలునకును, తక్కిన బాలురకును వారి జ్ఞానమునందునను లాభమందునను యిట్టి భేదముండును ఇట్టి స్థితినే—

శ్లో॥ యౌవరాజ్యేస్థితో రాజపుత్రస్సామ్రాజ్యవాంఛయా ।
రాజానుకారీ భవతి తథాసాక్ష్యనుకార్యయమ్ ॥

అనగా యువరాజు రాజ్యమును గోరుచు, ప్రతిరోజును రాజునుబోలి వర్తించు నట్లు, జీవుడు అనగా (చిదాభాసుడు) మోక్షకాంక్షచే కూటస్థైక చింతనముగల వాడై యుండును అనియూ—

శ్లో॥ యోబ్రహ్మవేద బ్రహ్మైవ భవత్యేష ఇతి శ్రుతిం ।
శ్రుత్వా తదేక చిత్తస్సన్ బ్రహ్మవేత్తి న చేతరత్ ॥

అనగా ఆపరబ్రహ్మము నేనే, యని, యెవడెరుగునో వాడే పరబ్రహ్మ యగును, లేదా బ్రహ్మ విదునికులమందు పుట్టును సంసారదుఃఖము దాటును. పాప విముక్తుడగును. హృదయ గ్రంధి విడి అమృతరూపుడగుచున్నాడు, అని "సయోహవై-తత్పరమం, బ్రహ్మవేద బ్రహ్మైవభవతి, నాస్యాబ్రహ్మవిత్కులే భవతి, తరతిశోకం, తరతి, పాప్మానం, గుహాగ్రంథిభ్యో విముక్తోఽమృతో భవతి" అను శ్రుతివాక్యముయొక్క అర్థమునే పై శ్లోకముచే శ్రీ విద్యారణ్యులు తెలుపుచున్నారు కావున జ్ఞానాభ్యాసకుడు శ్రుతిని నమ్మి తాను బ్రహ్మమును తెలిసికొనవలయునునుగాని ఇట్టిది సాధ్యమాయని శంకించగూడదు. ఏలనన, జీవునియొక్క పుణ్యకర్మఫల పరిపాకముచే శాస్త్రమునందు విశ్వాసము గలిగి ఫలపూర్ణపలమగు, నిత్యనిరతిశయ సుఖస్వరూపమైన ఆత్మలాభమును యిచ్ఛయించువాడై మోక్షము నపేక్షించుచు తీవ్ర ముముక్షువగు జ్ఞానాభ్యాసకునకు సర్వదా యిట్టి బ్రహ్మాభ్యాసమును చేయుచు తన ప్రారబ్ధానుసారమున యథాప్రాప్తముగ సుఖదుఃఖానుభవముల జేయుచుండుట సాధ్యము. ఇట్టి మహనీయులు అన్నికాలములందునను యుందురు. కాని అరుదుగ నుందురు. వారి వారి ప్రారబ్ధమునుబట్టి కొందరు మహనీయులు తెలియబడుదురు, మరికొందరు తెలియబడక బ్రహ్మాభ్యాసము జేయుచు, గనులలోనున్న మణులవలె నుందురు.

బ్రహ్మాభ్యాసకునకు లోగడ "ఏకతత్త్వఘనాభ్యాసాత్ చిత్తంగచ్ఛత్య చిత్తతామ్" నిరంతరము యా అద్వితీయ వస్తుతత్త్వాభ్యాసమువలన చిత్తము క్షయించును, అనియు నిట్టి యభ్యాసము ఎంతకాలము చేయవలెననిన,

శ్లో॥ తావదేవ నిరోద్ధవ్యం యావద్వృత్తిః క్షయంగతా ।
ఏతత్ జ్ఞానం చ మోక్షంచ శేషో హి గ్రన్థ విస్తరః ॥

అనియు తెలిపియుంటిమి. ఈ వచనములనుబట్టి ముముక్షువు తన మోక్ష ప్రాప్తికి తత్త్వజ్ఞానబలముతో వృత్తిని క్షయము నొందించుట యావశ్యకమనియు అందులకుగాను వృత్తినాశపర్యంతము బ్రహ్మానుసంధానాద్యభ్యాసములను నిరంతరము ఆచరించుచుండవలె ననియు తెలియుచున్నది.

ఈ వృత్తినాశమే మోక్షమని తెలిసికొనవలయును తక్కినదంతయూ గ్రంథ విస్తరమేగాని మరేమియుకాదని తెలియుచున్నది. ఇట్టి అభ్యాసమును ముముక్షువు తన తత్త్వజ్ఞానబలముతో నాచరించినప్పుడే ఫలదాయకమగును గాని, తత్త్వజ్ఞానమును విడచి వాసనాక్షయమనోనాశముల నభ్యసించిన, అట్టివి అల్పప్రయోజనములగునని జ్ఞానాభ్యాసకులు గ్రహింపవలెను. ముముక్షువునకు తత్త్వజ్ఞానబలము బాగుగనుండి తక్కిన రెండును ప్రారబ్ధమునుబట్టి తక్కువగనున్నను ముక్తి కలుగునని శ్రీ వసిష్ఠ వచనము తెలుపుచున్నది. కావున ముముక్షువు తత్త్వ జ్ఞానమందు ప్రీతి నిశ్చయములను విశ్వాస దార్ఢ్యములను తన నిరంతర మననాద్యభ్యాసములచే సంపాదించుచు, వాసనా క్షయ మనోనాశములను గ్రహించుచుండవలయును.

సారాంశ మేమనిన, బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు స్వప్నమునందుగూడ స్వశరీర సర్వదృశ్యములను వాస్తవమను భ్రాంతి నొందగూడదు ఈ సర్వమును భ్రాంతికల్పితము, వ్యవహారమాత్రము ఇది అంతయు జీవుని అజ్ఞానముచే బ్రహ్మయందు వివర్తముగ భాసించుచున్నదేగాని వాస్తవము కాదను నిశ్చయముతోడ తన వ్యవహారానుభవములనొందుచు, సతతబ్రహ్మాభ్యాసమును చేయుచుండిన యడల

శ్లో॥ దృశ్యం హ్యదృశ్యతాం నీత్వా బ్రహ్మాకారేణ చిన్తయేత్ ।
చిత్తం హ్యచిత్తతాం ప్రాప్య బ్రహ్మాకారేణ భాసతే ॥

అని శాస్త్రవచనము తెలుపుచున్నది. అప్పుడు జ్ఞానాభ్యాసకుడు స్వశరీర సర్వదృశ్యము ఎంతమాత్రము తనకు నిత్యము వాస్తవముకాదను దృఢనిశ్చయమును పొందగలుగును. ఇట్టి నిశ్చయబలముతో ముముక్షువు తన సత్యస్వరూప ప్రాప్తియందు పరమప్రీతిని సంపాదించి తత్స్వరూప స్వానుభవమునకుగాను మననానుసంధానాద్యభ్యాసములను, విసువుచెందక నాచరించుట యావశ్యకము. యావజ్జీవము విచారించినను బ్రహ్మ సాక్షాత్కారము కలుగని యడల జ్ఞానాభ్యాసకుడు నిరాశను జెందకూడదు. ఏలనన, తన ప్రారబ్ధ రూప ప్రతిబంధము తొలగగనే అనగా క్షీణించిన పిదపగాని, శాస్త్రప్రామాణ్య

మునుబట్టి జన్మాంతరమందుగాని తప్పక బ్రహ్మ సాక్షాత్కారము కలిగితీరును. అని పంచదశీకారులు తెలుపుచున్నారు కావున ముముక్షువగు జ్ఞానాభ్యాసకుడు యీ బ్రహ్మాభ్యాసమును యెప్పుడును విడువగూడదు. దీనికి నొక యుదాహరణము నిచ్చుచున్నారు.

శ్లో॥ బహువారమధీతేఽపి యదానాయాతిచేత్పునః ।
దినాంతరేఽనధీత్యైవ పూర్వాధీతం స్మరేత్పుమాన్ ॥

అనగా వేదాధ్యయనము జేయువారు అనగా జదువువారు, అనేక మారులు చదివిననూ గ్రంథము ముఖస్థముకాదేని, ఆ దినమున, స్వస్థతగా వరుండి, మరు దినమున లేవగనే చదివిన దానిని స్మరించినంతనే దానంతనదియే జ్ఞాపకమునకొచ్చి తప్పక ముఖస్థమగును ఇది అందరికునూ అనుభవసిద్ధమే. గావున యీ బ్రహ్మాభ్యాసముగూడ నట్టిదియేనని ముముక్షువులు నిశ్చయము నొంది వారి అభ్యాసాదుల నాచరించుచుండవలయునేగాని తం దేహముతోడ నెన్నటికిని అభ్యాసాదులను విడువగూడదు. ఫలము కలుగుటకు శాస్త్రమునూ, బ్రహ్మవిద్యా సాంప్రదాయశిష్టానుభవమునూ, పరమప్రమాణములగుచున్నవి.

ఇట్లు జ్ఞానాభ్యాసము చేయువారు, మాకు ఎంత అభ్యసించిననూ ఫలము కనుబడుటలేదే. అనుభవమునకు రాకున్న యీ బ్రహ్మవిద్యను అభ్యసించుటవల్లనేమి లాభముండును అని సంశయచిత్తులై నిరుత్సాహము చెందగూడదు అభ్యాసకునికి ఇప్పుడు వెంటనే బ్రహ్మానుభవము కలుగక పోయినను, యీ బ్రహ్మధ్యానాభ్యాసాదుల వలన కాలక్రమమున జ్ఞాన లాభము కలుగుట నిశ్చయమనియూ కావున, అనుభవము లేకపోయినను బ్రహ్మధ్యానాభ్యాసమును విడువగూడదని —

శ్లో॥ అనుభూతే రభావేఽపి బ్రహ్మాస్మీత్యేవ చింత్యతామ్ ।
అప్యసత్ప్రాప్యతే ధ్యానాన్నిత్యాప్తం బ్రహ్మ కిం పునః ॥

అనగా బ్రహ్మానుభవము లేకపోయినను, ముముక్షువు నేనే బ్రహ్మను, అని ధ్యానించుచుండవలయును. ధ్యానము వలన లేనిది నయితము లభించు చున్నప్పుడు తనకు స్వస్వరూపమగు బ్రహ్మము లభించునని వేరుగజెప్పవని లేదు. అనగా లభించియే తీరును, అనిన్నీ యీ బ్రహ్మవిచార, ధ్యానాదులను యెంతకాలము చేయవలెననిన

శ్లో॥ విచార్యాప్యాపరోక్ష్యేణ బ్రహ్మాత్మానం న వేత్తి చేత్ ।
అపరోక్ష్యావసానత్వాద్భూయో భూయో విచారయేత్ ॥

అనగా ఒకమారు విచారించినయెడల బ్రహ్మసాక్షాత్కారము గలుగని యెడల, ముముక్షువు విసుగుజెందక సాక్షాత్కారము గలుగువరకునూ, పలుమారు విచారము చేయుచుండవలయుననియు, ఇంకనూ యీ అభ్యాసకునకు యీ జన్మమునందే బ్రహ్మసాక్షాత్కారము కలుగని యెడల, యీ విచారాద్యభ్యాసము లన్నియూ నిష్ప్రయోజనమే యగునా, అను సంశయమునకు, నిష్ప్రయోజన మగుటకు వీలులేదని శ్రీకృష్ణపరమాత్మ అర్జునున కిట్లు తెలుపుచున్నారు :

శ్లో॥ పార్థ ! నై వేహానాముత్ర వినాశ స్తస్య విద్యతే ।
న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత ! గచ్ఛతి ॥

శ్లో॥ ప్రాప్యపుణ్యకృతాన్ లోకానుషిత్వా శాశ్వతీస్సమాః ।
శుచీనాం శ్రీమతాంగేహే యోగభ్రష్టోఽభి జాయతే ॥

అనగా అర్జునా ! అటువంటి యోగభ్రష్టునకు యీ లోకమందుగాని, పరలోక మందుగాని వినాశములేనే లేదు. ఏమనగా మంచిపని చేసినవాడెవడును దుర్గ తిని పొందడు సుమా ! అటువంటి యోగభ్రష్టుడు పుణ్యముచేసినవారు పోవు లోకములకు బోయి అచట చాలా సంవత్సరములు నివసించి, ఆచారవంతులగు శ్రీమంతుల యిండ్లలోబుట్టును. అని తెలుపుచు మరియును—"తత్ర తం బుద్ధి సంయోగం లభతే పౌర్వదైహికమ్" పైని తెలిపినట్లు ఆచారవంతులగు శ్రీమంతుల యిండ్లలోగాని, యోగికులమందుగాని బుట్టి, పూర్వ దేహము

దుండి సంపాదించుకొన్నట్టి, ఆ బుద్ధియోగమును పొందును అనిన్నీ తెలుపు చున్నారు. కావున బ్రహ్మజ్ఞానాభ్యాసకులు చేయునట్టి ప్రయత్నము ఎన్నటికినీ వృథాయగుటకు వీలులేదు. ఇంకనూ శ్రీవిద్యారణ్యులవారు—

శ్లో॥ విచారయన్నామరణం నైవాత్మానం లభేతచేత్ ।
జన్మాంతరే లభేతైవ ప్రతిబంధక్షయే సతి ॥

అనగా బ్రహ్మవిచార, మనన నిదిధ్యసనాద్యభ్యాసములను, యావజ్జీవము చేసినను బ్రహ్మసాక్షాత్కారము కలుగనియెడల నిరాశనుజెందగూడదు. ఏలనన ప్రారబ్ధ ప్రతిబంధము నివర్తించగనే, జన్మాంతరమందు బ్రహ్మ సాక్షాత్కారము అనగా బ్రహ్మానుభవము శాస్త్రప్రమాణమునుబట్టి తప్పక కలుగును. సంశయములేదు. కాని "అపరోక్షావసానత్వాద్భూయో భూయో విచారయేత్" అనగా ముముక్షువు విసుగుజెందక తన ఆత్మ సాక్షాత్కారము గలుగువరకునూ పలుమారు విచారాది, అభ్యాసములను చేయుచుండవలెను. ఇట్లు జేయుచుండ కాలపరిపాకమునుబట్టి

శ్లో॥ కాలేన పరిపచ్యన్తే కృషిగర్భాదయో యథా ।
తద్వదాత్మావబోధోఽపి శనైః కాలేన పచ్యతే ॥

కాలక్రమమున అనగా పరిపాకకాలమందు, వ్యవసాయకుడు తన సస్యఫల మునూ, నెలలు నిండిన గర్భవతి తన సంతానప్రాప్తిని నొందునటుల, ముముక్షువులు వారి చిరకాలాభ్యాసాదులవలన కాలపరిపాకముచే ఆత్మ సాక్షాత్కారలాభమును అనగా బ్రహ్మ సాక్షాత్కారమును తప్పక పొందుదురని శ్రీ విద్యారణ్యస్వామి తెలుపుచున్నారు. కావున, నిస్సంశయముగ యీ జ్ఞానా భ్యాసకులు, సత్యజ్ఞానానంత లక్షణములతో తమ అఖండ సచ్చిదానంద స్వరూపమును నొందుదురు. ఇదియే ముక్తి, మోక్షము. వీరు బ్రహ్మ సాక్షాత్కార సిద్ధులు. అప్పుడు వీరికి

శ్లో॥ బ్రహ్మైవ పంచభూతాని బ్రహ్మైవ సకలం జగత్ ।
బ్రహ్మైవాహం బ్రహ్మచాన్యత్ బ్రహ్మ భిన్నం నకించన ॥

అని సర్వమునూ, బ్రహ్మస్వరూపముగనే భాసించును. తదితరమేమియును వాస్తవముగ కనుబడదు. ఇట్టి మహాత్ములను గురించియే "యోవేదనిహితం గుహాయాం పరమేవ్యోమన్, సోశ్నుతే సర్వాన్కామాన్త్సహ" అనగా ఎవరైతే తమ హృదయపుండరీకమందు, ఈ ఉత్కృష్టమైన చిదాకాశ స్వరూపమును "అహం" నేనే అని తెలిసిగొని ఆత్మసాక్షాత్కారము నొందుదురో, అట్టివారు సర్వకామములను పొందినవారగుదురు అనగా ఆప్తకాములైన, నిష్కాములగుదురు, అని శ్రుతివాక్యము తెలుపుచున్నది.

అట్టి మహనీయులు వారి తత్త్వజ్ఞానఫలముగ, జగత్సంబంధమగు వ్యవహారములను విడువకయూ కోరకయూ సర్వంబును యథా ప్రాప్తంబుగ ననుసరించుచుందురు.

శ్లో॥ న త్యజంతి న వాంఛంతి వ్యవహారంజగద్భవం ।
సర్వమేవానువర్తంతే పారావారవిదోజనాః ॥

వారి ఆత్మకంటె నితరంబుగా చిత్తముగాని దృశ్యముగాని వాస్తవముగ కనుబడక సర్వము బ్రహ్మముగానే ప్రకాశించుచుండును. కావున వీరికి బంధమోక్షములనునవియే లేవు. ఈ విషయమునే,

శ్లో॥ న బన్ధోఽస్తి న మోక్షోస్తి బ్రహ్మైవాస్తినిరామయమ్ ।
నైక్యమస్తి న చద్విత్వం సంవిత్స్ఫారం విజృమ్భతే ॥

అని శ్రీ వశిష్ఠభగవానులు తెలుపుచున్నారు.

అట్టితరి యీ విద్వాంసుడు సర్వ భయవిముక్తుడగునని "ఆనందం బ్రహ్మణో విద్వాన్, నబిభేతికుతశ్చన" "అథసోఽభయం గతోభవతి" "అభయం ప్రతిష్ఠాంవిన్దతే" "యత్రనాన్యత్పశ్యతి, నాన్యచ్ఛృణోతి, నాన్యద్విజానాతి, సభూమా, ఏతద్వైసుఖమ్", "ఏకత్వమను పశ్యతి" "అమృతత్త్వమేతి" "అమృతోభవతి" "అత్రబ్రహ్మసమశ్నుతే" అని శ్రుతిమాత వచనములు స్పష్టముగా తెలుపుచున్నవి. ఇట్టి విద్యయే, యీ గ్రంథ సారాంశము. కావున

జ్ఞానాభ్యాసకులగు ముముక్షువులు, నాచే రచింపబడిన "జ్ఞానామృతసారము" అను నీ గ్రంథమును ప్రీతిశ్రద్ధోత్సాహములతో పలుమారులు బాగుగ పఠించి అందలి అంశములను మనోగోచరము గావించుకొని, వారివారి, నిరంతర స్వస్వరూపాత్మాను సంధానాభ్యాసపాటవముచే, ఫల పరిపాకకాలమున, బ్రహ్మ జ్ఞానమునొంది అమృతులగుచు జీవునకు ప్రాప్తప్రాప్యమును, స్వస్వరూపంబును నిత్యనిరతిశయ సుఖ స్వరూపంబునగు బ్రహ్మపదంబు నొందుదురు గాక.

శ్లో॥ ఏతత్ జ్ఞానామృతంసారం అధ్యేయం వేదవత్సదా ।
యః పఠేత్సతతం భక్త్యా సముక్త స్సుఖీ భవేత్ ॥

ఇతి గుర్వీశ్వరానుగ్రహ ప్రసాదేన ముముక్షు
శ్రీ కౌతావంశోద్భవ మోహనరామశాస్త్రి
విరచితంబగు "జ్ఞానామృతసారం" బను గ్రంథము
సమాప్తము

ఓం తత్సత్.